శ్రీ మేధాదక్షిణామూర్తయేనమః

# ఉత్తమ జీవయాత్ర

(శ్రీ నాదెళ్ల పురుషోత్తమకవీంద్రుల చరిత్రము)

తత్పుత్రుఁడు

## మేధాదక్షిణామూర్తి

విరచించి


బందరు

శ్రీ కృష్ణాస్వదేశీ ముద్రాక్షరశాలలో

ముద్రించి ప్రకటించినది.

(వేయి ప్రతులు) [illegible]

1954

శ్రీ మేధా దక్షిణామూర్తయే నమః

# నివేదనము

శా. శ్రీరంజిల్లు మహోత్సవ న్నిమ్మటుల వ్రాసె న్నృసమ్మ నీకు న్ద్విచ
త్వారింశత్సమవర్షమందవుట, సంప్రాప్తమ్ము ముద్రాలయ
ద్వారమ్మింగనఁ బారకావళికి నందన్నేఁటికిం గల్గె దై
వారం దద్హృదయైకవర్తికృప నీపైఁ, దన్పు కన్యామణీ!

క. నీ కీడుజోడు కన్యక లే కద, కల రిందు, గర్భ మీవు ధరింపం
గైకొన్న దక్షిణాస్య ప్రకటసద్యశమె నేఁడు వన్నెఁ గనంగాఁ॥

### పాఠకలోకమున కొక మనవి—

గణబద్ధమైనదే కవిత్వ మనుకొన్న నామైనారిటి వెళ్లియు వెళ్లని చిన్ననాఁడే, 1912 సం॥ మే, జూన్ నెలలందు నిర్వచనముగా నిండుఁ జాలభాగ మస్మద్గురువర మహత్త్వస్ఫోరకము కాఁదగునట్లు నిర్వచింపంబడియుండె. ఈ నలువదిరెండేండ్లయందలి వాఙ్మయపరివర్తనముంబట్టి యిది యాధునికసమాదరణీయత నందనానా యనువిచికిత్స యొదవకపోలేదు. కాని, కలాప్రపంచం బెందైన రుచిభేదబహుళంబు కదా యనిపించె. కావున నెప్పటికిఁ గాని "ఉత్పత్స్యతే మమతుకోఽపి సమానధర్మా" యని వేచి యుండ నక్కఱలేదు.

### మఱియు నిండేడి రీతులున్నను,

"గుణదోషౌ బుధో గృహ్ణన్నిందుక్ష్వేళా వివేశ్వర
శ్శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి॥"

యన్నట్లు నాయీకృతిపతియగు భవాదృశ సర్వహృదయాంతర్వర్తి మిమ్మందఱు సద్బుధప్రదర్శిత మార్గానుయాయుల నేల చేయక యుండెడు నన్న విశ్వాసముచేతనే యిపుడైన మీకిట్టిది యందింపనైనది.

శ్రీ గురుపాదార్పణబుద్ధితో నిజవిధినిర్వహణంబుగా నిట్టిల ర్పం జేయనైనచోఁద మీరలెంచి యిందేగుణలేశమున్న నద్దానినే

స్వీకరింప నోర్మిం గంద్రుగాపుత. అట్లగుచో, సంతుష్టియే యా స్త్రిగఁ గడపిన సంతతపరోపకార దీక్షామహాతప స్సంపన్నమైన 'యుత్తమ జీవయాత్రి'యాట నిది యాదర్శప్రాయ మనిపింపక పోదు. ఇందలి తత్త్వసందర్భోచిత సమకాలిక ప్రస్తావాదిక మేదైనను సంగతమే యనిపింపకయు మానదు.

అయిన, నట్టి స్వయంప్రకాశకమా నీ 'యుత్తమ' మణి వెనుక నేడాఁగుత్రైకైనం గావలయునాయని కొందఱెంచకపోరు. కాని యిదిమాత్రి మట్టిదికానేకాదు సుండీ. ఇం కేమందు రేన్ని,

చ. అమవసలేమి, వెన్నెల మహత్త్వ మెఱుంగము, పొట్టిదున్న దీ
ర్ఘము గుఱుతింప వీలవును గావున నీకృతికర్తయల్పతం
దిమిరముప్రక్కనున్న ఘనతేజము ప్రస్ఫుటమైనరీతి, స్వీ
యము గురుగాథయం దిమిడి, యందు మహత్త్వ మెఱుంగ॥
జేయుతఁ

ఉ. ఈపురుషోత్తము ల్మహితు లీధరణిస్థలి సాగు జీవయా
త్రాపథమందుఁ 'బాదుక' గఁ దానవు నీకృతికర్త పొత్తునఁ
దీపితమైనదెద్ది నిజతేజముగా, చెటఁ బుష్పగంధ వాం
ఛాపరు లంద 'వృంతము' పసం గనమున్న నెసంగనీయరే ?

శా. ఏతేజంబు స్వయంప్రకాశమొ, జగద్ధేతుప్రకల్పంబొ, ప్రి
జ్ఞాతంత్రోల్బక, మజ్ఞతాపహా, మగణ్యాం, బద్ధి ప్రేరేపకం
బై, తానీకృతి నిర్వహింప, నదె, మేధాపాదకాంబయ్యె, నం
భూతానంద గురుప్రపూజక, మిదింపుంగొల్పదే ? యెయ్యెడఁ.

బందరు,
శ్రీ విజయ పుష్య బ॥ ౫
భానువాసరము

ఇట్లు
శ్రీ గురుపాదరేణువు,
కృతికర్త.

'ఉత్తమ' ప్రస్తావము.

ప్రస్తుతము 'మధ్యప్రదేశ్' గవర్నరు పదాధిష్ఠితులు
నొకప్పుడు రాష్ట్రపతులునైన
శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య పంతులుగారు
గ్రంథకర్తకు 16-6-53 తేదిని వ్రాసినది:

Dear Shastri Garu,

I do not know whether I have acknowledged the four books that you have so kindly sent me. When I look at the books I am struck with wonder at the profoundity of father's knowledge in Hindi & his capacity to write poetry & books in that language. When I was in Masulipatam, I knew that he was a Hindi scholar, but I did not know that he was able to write such mighty works,

'కృష్ణాపత్రిక'కుఁ జేవఁ దెచ్చిన యధిపతులు
శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి
కలమున ది 3-12-38 న వెలువడిన 'పురుషోత్తముని అస్తమయము'

ఆంధ్రదేశమున కంతను, అందు ముఖ్యముగ మా బందరు పట్టణమునకు— విద్వత్పితామహులలో నొకరై, ఎల్లరియొక్కయు ప్రేమగౌరవముల నందుకొనుచుండిన బ్రహ్మశ్రీ నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రివర్యులస్తంగతులైనవార్త పరికైనను దుఃఖము కల్గింపక మానదు. చతుర్థావస్థయైన వార్ధక్యములో నుండి ప్రథమావస్థయగు బాల్యము చిందులు వేయఁగా, హాస్యభాషణముల నెఱపుచుండెడి ఆ అల్పకాయము ఎల్లరికి దర్శనీయ మగుచుండెడిది. వారు సర్వతోముఖ ప్రజ్ఞాధురీణులు. శాస్త్రజాలము నాపోశనము పట్టవలెననెడిపిపాస వారి ననేకములైన శాస్త్రవీధులందు పర్యటింపజేసినది. ఆవిద్యాతృష్ణకు దీసిపోని గ్రంథరచనోత్సాహము వారిని శతాధిక గ్రంథకర్తలనుగా నొనర్చినది. * వీరు రచించిన గ్రంథములపట్టిక చదివిన జాలును, వీరి ప్రజ్ఞాతిశయ మెంత సర్వతోముఖమో గుర్తించుటకు. అన్నింటిని మించి యెన్నదగినది వీరి సౌజన్యము, సద్వర్తనము. ఆగర్భ శ్రీమంతుని

---

* vi, vii పుటలందు శ్రీ పురుషోత్తమకవీంద్ర విరచితములు 112 గ్రంథముల పట్టికం జూచునది.

మొదలుకొని పుట్టుదరిద్రునివఱకు ఎవరికైనను జ్యోతిషాది శాస్త్ర విషయములలో సలహా కావలసినయెడల, మనుమడు స్వాతంత్ర్యతతో తాతదగ్గరకు బరుగెత్తినట్లు వీరివద్దకు బరుగెత్త వలసినదే. శ్రీ పురుషోత్తమ శాస్త్రిగారు లేని వెలితిని మా బందరు వాస్తవ్యులు చిరకాలమువరకు ప్రత్యక్షముగ ననుభవించుచునే యుండెదరని నిస్సందేహముగ జెప్పగలము.

**'శ్రీ త్రికాయులు (బ్రహ్మశ్రీ) నాదెళ్ల పురుషోత్తమకవిగారి సుగుణములు.'**

క. ఋషివలెజీవించెను, పూ
రుషోత్తముఁ' డితం డనఁగ గరువమ్ముఁగ మఱి యే
'శవభిష' లు నెఱుంగఁడు, పూ
రుషోత్తముఁడు సర్వథా పురుషసత్తముఁడై॥ 1

క. అతిశాంతుం, డతిదాంతుఁడు
కృతకృత్యుఁడు, సుకవి, యెన్నియేని విషయముల్
మతినెఱిఁగిన విద్వాంసుఁడు,
స్తుతియింపం దగినపూరుషుఁడు సుకవులకుఁగ॥ 2

తే. పట్టణ నివాసియే యయ్యు, పల్లెటూరి
అతిథేయుల వయిచేయి యగుచు, కాల
మొక్క రీతిని గడపె సత్యోత్తముముగ
పూరుషోత్తమకవి యెంత ధీరవరుఁడో ! 3

తే. బులుసు శ్రీ అచ్యుతబ్రహ్మ మున్ను శాస్త్రి
లోనయిన బిరుదమ్ములు పూనకయె చ
రించె ననివిందు, మిపుడు చరించెను, పురు
షోత్తముఁడు పురుషోత్తముఁడో యనంగ॥ 4

క. ఒకనికి లోఁగనిశాంతియు
సకలమ్ము నతిక్రమించు చండత, కడు వై
దిక కర్మనిష్ఠయు, పరో
పకృతియు, పురుషోత్తముని స్వభావగుణమ్ముల్. 5

తే. ఆత్మగౌరవమునకు రవంతయేని
లోటు గల్గెడిచో స్వర్గలోకమేని

ఈతఁ డొల్లం డితని కెట్టు లేగునో క్కొ!
యిటుపయిని జీవితంబని యేఁ దపింతు॥ 6

ఆ. బ్రాహ్మణత్వమునకుఁ బరమదారిద్ర్యంబు
దాపరించినట్టి తరుణమందు
మార్గదర్శి యగుచు మనిన శ్రీ పూరుషో
త్తమునిచరిత మిగుల ధన్యతమము॥ 7

తే. ఎన్నియో గ్రంథము లొనర్చి నెంతమంది
కో గురుత్వమ్ము సల్పి నోహో యనంగఁ
గడపె జీవిత, మెపు డెఱుఁగఁడు రవంత
యేని దైన్య మెక్కడఁగల రిట్టికవులు ? 8

క. కవినని యాచింపఁడు, 'కా
దవు'నని వాదింపఁ డతిథు లరిగిన నిచ్చెన్
సవిశేషమ్ముగ నిప్పిం
చె వివేకము గల్గువారిచే నెక్కుడుగన్॥ 9

తే. వేదశాస్త్రమ్ములందలి విధులు భగవ
దాజ్ఞలే యైనచోఁ దప్ప కబ్బితీఱు
పూరుషోత్తమకవి కెదో పుణ్యలోక
మిందులకులేదు సందియ మింతయేని॥ 10

క. బందరు పురమున కీఁక నీ
యందముఁ జందమ్ముఁ గలుగు నట్టి యశముఁ గూ
ర్పందగు సత్కవి పోరకుట
సందేహాస్పద మటంచు జాలి వొడమెడున్॥ 11

తే. ఏల సంశయింపఁగవలె ? నితనికున్న
సుగుణములు గల్గియున్నాఁడు సుతుఁడుకూడ,
వాని కాయురారోగ్యముల్ వఱలఁజేసి
ఈశ్వరుం డెల్లలోపమ్ము నీఁగుఁగాక ! 12

—చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి,
శతావధాని,

(28-1-1939 కృష్ణాపత్త్రికయందుఁ బ్రకటితము)

## శ్రీ పురుషోత్తమ కవీంద్ర విరచితములు

### 1. ఆంధ్రప్రబంధాలు

(1) అద్భుతోత్తర రామాయణము
(2) గురుభక్తి ప్రభావము
(3) కృష్ణానదీ మాహాత్మ్యము
(4) గీతాసహితజనకాష్టావక్రసంవాదము
(5) యాదవాద్రీశోపాఖ్యానము
(6) మాహేంద్రపురాణము
(7) ధార్మికోల్లాసిని
(8) యామినీవినోదము
(9) అలీబాబాకథ
(10) బభ్రువాహన చరిత్ర
(11) రంగదాసీయము
(12) చతుర్ముఖకందపద్యరామాయణము

### 2 ఆంధ్రరూపకాలు

(13) అహల్యాసంక్రందన నాటకము
(14) హరిశ్చంద్ర నాటకము
(15) పారిజాతాపహరణము
(16) సారంగధర నాటకము
(17) ద్రౌపదీ వస్త్రాపహరణము
(18) వైశ్యబ్రాహ్మణ సంవాదము
(19) స్త్రీలమీటింగునాటి హరికథ
(20) సందేహశాస్త్రి సమర్థాచార్యము
(21) శాస్త్రిరావుల సంవాదము
(22) కమలభ్రమరము

### 3 శతకాలు

(23) సీతారామ శతకము
(24) మనోహర సోమేశ్వరశతకము
(25) పూర్వకర్మ శతకము
(26) కందగీతగర్భిత మల్లికార్జునము
(27) హనుమత్కథా శతకము

### 4 స్తోత్రాలు

(28) సోమేశ్వర విద్యామాల
(29) పార్వతీ విద్యామాల
(30) చిత్రవృత్తానేకమణిహారము
(31) చిత్రకందకుంద గుచ్ఛము
(32) చతుర్విధ దేవతాప్రార్థనము
(33) అజ్ఞాన ధ్వంసిని
(34) లక్ష్మీనారాయణ నక్షత్రమాలిక
(35) దుర్గామల్లేశ్వర ఘంటాప్రహారి
(36) నక్షత్రసోపానాంచద్రథబంధము
(37) చిత్రకందపద్య రత్నాకరము

### 5 అభివర్ణనాలు

(38) దుర్జనస్వభావాభివర్ణనము
(39) సౌజన్యవర్ణనము
(40) ధార్మికాభివర్ణనము
(41) సముద్రస్నానాభివర్ణనము
(42) విశ్వేశ్వరోత్సవ వర్ణనము
(43) తిక్కన కవితాభివర్ణనము
(44) రాజపుత్రవిధవాభివర్ణనము
(45) ఎడ్వర్డు విధవాభివర్ణనము
(46) జార్జిప్రభు పట్టాభిషేకము
(47) సోమేశ్వరీయము
(48) పత్రికాసమీప రామదర్శనము
(49) గణపతి ప్రశంస
(50) శ్రీరామపరిణయము

### 6 కీర్తనలు

(51) రామాయణ కీర్తనలు (హిందీ)
(52) టపాహారతి మేలుకొలుపులు
(53) పురుషోత్తమ కృతిశతకము

### 7 నిఘంటువులు

(54) ప్రకృతి రూపప్రకాశిక
(55) వికృతి రూపచంద్రిక
(56) అన్యరూపదీపిక

## 8 శాస్త్రగ్రంథాలు

(57) జాతక దర్పణము
(58) సులభ వైద్యబోధిని
(59) స్త్రీధర్మబోధిని
(60) సనాతనధర్మ ప్రబోధిని
(61) శబ్దస్వరూప నిరూపణము
(62) లక్షణసార సంగ్రహము

## 9 వచన గ్రంథాలు

(63) చిత్రకథావళి
(64) మాహేంద్రకథ
(65) అజ్ఞానధ్వంసకోపన్యాసావళి
(66) ప్రాథమికవిద్య
(67) దేశీయవిద్యాప్రాశస్త్యము
(68) వైదిక విభాగవివరణము
(69) బ్రాహ్మణస్థితి
(70) హితోపదేశిని
(71) ఆత్మచరితము

## 10 హిందీ నాటకాలు

(72) కాళాసురవధము
(73) పంచాక్షరీ మహిమము
(74) సుభద్రాపరిణయము
(75) భస్మాసురవధము
(76) కళావతీపరిణయము
(77) శంబూకవధము
(78) శారదోపాఖ్యానము
(79) లవణాసుర సంహారము
(80) మనోజవాటత్కృనివారణము
(81) గోకర్ణమాహాత్మ్యము
(82) అహల్యాసంక్రందనీయము
(83) బిల్హణీయము
(84) సీమంతినీ చరిత్రము
(85) అపూర్వ దాంపత్యము
(86) పుత్రకామేష్టి
(87) సీతాకల్యాణము
(88) దశరథ నిర్యాణము
(89) రామారణ్యవాసము
(90) సీతాపహరణము
(91) సుగ్రీవ పట్టాభిషేకము
(92) హనుమత్ప్రతాపము
(93) రావణసంహారము
(94) శ్రీయాళరాజ చరిత్రము
(95) రామదాస చరిత్రము
(96) మిత్రసహోపాఖ్యానము
(97) ఇళమహారాజ చరిత్రము
(98) సుకన్యాపరిణయము
(99) శుకరంభా సంవాదము
(100) పీష్వా నారాయణరావుఫార్స్
(101) భద్రాయురభ్యుదయము
(102) కీర్తిమాలినీ ప్రదానము
(103) హరిశ్చంద్రీయము

## 11 స్కూలు పుస్తకాలు

(104) ఆంధ్రజ్యోత్స్న (1 వ భాగము)
(105) ,, (2 వ భాగము)
(106) ప్రైమరీ పరీక్ష లెక్కల పుస్తకము
(107) సౌఖ్యవిషయగుచ్ఛము
(108) భూగోళసంగ్రహము
(109) నీతి మంజరి అర్థాలు
(110) అక్షరాభ్యాసము
(111) ప్రథమపాఠము
(112) లాంగ్మన్సురీడరు అర్థాలు

# ఉత్తమ యోగివృత్తము

అను నీ 'జీవయాత్రా' సంగ్రహమును గని కొందరు ప్రోత్సహించిన రీతి.
బ్రహ్మసూత్రసార, భాగవతసార, గీతాసార విద్యారణ్య చరిత్రాద్యనేక
గ్రంథ కర్తలు, రిటైర్డు సబ్ జడ్జి,

శ్రీ వావిలాల వేంకట శివావధానులుగారు, బందరు

శ్రీ వే. బ్ర. నాదెళ్ల పురుషోత్తమ శాస్త్రులవారికి సన్నిహితులై యిరువదేండ్లు సోదరన్యాయమున మెలగినవాడనౌటచే, వారి అత్యద్భుత మేధా శక్తి, బహుభాషా పాండిత్యము నాటకకళాభిజ్ఞత, సంస్కృతాంధ్రములు, చతుర్విధ కవితానైపుణ్యము, అవధాన సామర్థ్యము, బోధకతా ప్రావీణ్యము, కార్య దీక్ష — యిన్నిటిని మించిన సత్ప్రవర్తనము, స్వధర్మనిర్వహణాసక్తి, అల్పగర్వము, పరోపకార పారీణత, అప్రతిగ్రహదీక్ష, విధివిహిత కర్మాచరణపటుత్వము, సనాతన ధర్మప్రతిష్ఠాపకత, వేదాంతిజిజ్ఞాసుత, మహాతపస్సంపన్నతతోడి బ్రహ్మనిష్ఠ — యివియివి యనవేల? ఆసనోత్తమ గుణవిశిష్టతతోడి సర్వోన్నత జీవితము నడపి కృతకృత్యులైన మహామహులని పూర్తిగా నెఱుంగినవాడను.

ఈ మహానుభావుల పుత్త్రరత్నములో బ్రహ్మశ్రీ మేధా దక్షిణామూర్తి శాస్త్రులవారు, యింగ్లీషున ఎమ్. ఎ. పరీక్షలో దీరసుబురు, సంస్కృతాంధ్రము లందు మహావిద్వాంసులై, ఉభయభాషా కవితాధారాశోభితులై పలు గద్య పద్యకావ్యములను రచియించుట యటుండ, అన్యపండితుల మహాగ్రంథముల నెన్నిటినో మిక్కిలి యోర్పుతో పరిష్కరించి యందు కొన్నిటికి వ్రాసిన యుపోద్ఘాతములే ఆయా గ్రంథాలకు వన్నెదెచ్చునవౌచున్నవి. అందును శ్రీ శంకరవిజయమునకు వ్రాసిన పీఠిక పండితులందరికి మిక్కిలి సంతోషమును గలిగించినది. వీరి రచనములవల్లనే వ్యాకరణశాస్త్రము, అలంకారశాస్త్రము, జ్యోతిశ్శాస్త్రము, ధర్మశాస్త్రము, వేదాంతశాస్త్రమున్నగు వానియం దన్నిటిలోనో వీరికి గల ప్రజ్ఞావిశేష మనల్పమని రూఢము కాగలదు.

ఇట్టి యీ పుత్త్రరత్నము శ్రీగురు పాదభక్తితో వారి యడుగుజాడల లోనే నడచుచు సర్వవిధాల వారికి తుల్యులను కొన్నింటిలో మిన్నలని కూడ నైనది గాక, పరమపవిత్రమైన తమ తండ్రిగారి చరిత్రమును వ్రాసియున్నారు. వీరి కవిత్వధార అనర్గళము, భావములు మిక్కిలి మనోహరములు, భాష మృదు మధురము, 'ఆ ఉత్తమ జీవయాత్ర'లోని కొన్ని పద్యములు మాత్రమే యుదాహరించుచు, ఇప్పుడీ 'ఉత్తమ యోగివృత్తము'ను వెలువరించుట జరిగినది. ఇది మాదృశులకెంతో సంతోషదాయకమైనది. ఆదర్శప్రాయ జీవితమును నడుప గలిగిన ఆ ఉత్తమోత్తముల సంపూర్ణచరిత్రముగల వీరి 'ఉత్తమజీవయాత్ర'

యెంత త్వరలో బ్రకటితమైన, నది యంతటి లోకోపకారకము కాఁగలుగునుగదా యని యాసించుచున్నాను.

తర్క వేదాంతశాస్త్ర మహోపాధ్యాయులు

శ్రీ వేమూరి రామబ్రహ్మశాస్త్రిగారు, ఆగిరిపల్లి.

శా. శ్రీ నాదెళ్ల కులాంబురాశి శశి వాసింబుట్టి, గీర్వాణ వి
ద్యానైపుణ్యము మీరఁ బెద్దలు సెబాసంచు న్నుతింపంగ, నెం
తే నింపారెడు కైత మల్లఁగల వీవే, దక్షిణామూర్తి శా
స్త్రీ! నా దీవనలిత్తుఁ గైకొనుము వర్ధిల్లం జిరంజీవివై. 1

సీ. ఆంధ్రాది బహుళభాషాంగనా ప్రార్థిత కవిలోక నాథుండు గాఁడె యితఁడు
వైదికాచార సంపద్వధూ సంగత కవిచక్రపాణియుఁ గాఁడె యితఁడు
సాధుశీల శివాంబుజాక్షి సమాశ్లిష్ట కవిరాజమౌళియుఁ గాఁడె యితఁడు
మహిత చాతుర్యశోభామహాబలాలింగిత కవిజనేంద్రుండును గాఁడె యతఁడు
మూఁడుమూర్తుల యంశతోఁ బుట్టియున్న విబుధరాజన్యుఁడొప్పు నీ పితరుఁడైన
యట్టి పురుషోత్తము చరిత్ర మవని నిలిపి సార్థకము చేసినావు నీ జననమిపుడు॥

శ్లో॥ అముద్రితానాం గ్రంథానాం ప్రకటీకరణంచ యత్
తత్రాప్రమాదం భవతో రామబ్రహ్మోఽభియాచతే॥

ఉభయభాషా కవితావిశారదులు, రిటైర్డు రిజిష్ట్రారులు,

శ్రీ భువనగిరి కోదండపాణిగారు, గుంటూరు

...సర్వజనములచే సకలవిధములఁ బూజనీయులైన తమ తండ్రిగారి చరిత్రము జనప్రదముగా వ్రాసినందులకుఁ దమకు ననేకధన్యవాదములు. మీరు కృతార్థులైతిరి. మావంటివారలను ధన్యులను గావించితిరి. మఱి యింకెంత అట్లో యయ్యది యాదర్శప్రాయముగను మనోరంజకముగను వెలయఁగలదు,

గుంటూరు హిందూకాలేజి ప్రిన్సిపల్

శ్రీ బుద్ధిరాజు రామచంద్రరావుగారు, యమ్. ఎ.యల్. టి.

'ఉత్తమ యోగివృత్త' మను పొత్తము సాద్యంతముఁ బఠించి యానందించితిని. మీ గ్రంథనామము 'నామైకదేశే నామగ్రహణ' మ్మను నియమముచే, భవజ్జనకులు మా గురువులు నగు శ్రీ పురుషోత్తమ యోగులఁదెల్పుచుఁ దచ్చరిత్రబోధకమై సార్థకమగుచున్నది.

పండితులలోఁ బండితులును, గవులలోఁ గవులును, విమర్శకులలో విమర్శకులును, ప్రతిభాశాలులలోఁ బ్రతిభాశాలులును, యోగులలో యోగిసత్తములు నగు సత్తమోత్తములు మీ పితృపాదుల యీ చరిత్రము విద్వదాదర్శకమై వన్నెఁ గాంచఁగలదని నా యాశయము.

## 'జీవయాత్రా' పత్రికలయామోద వాక్కులు.

### అవధాని శిరోమణి, శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు, గుంటూరు.

గీ॥ దక్షిణామూర్తి శిరమునం దాండవించు
గంగ క్రమముగ నతని వక్త్రమునడిగ్గి
అనఘ పురుషోత్తము కథామృతాత్మయగుచు
తనదు జనకుని పాదపద్మములఁజేరె॥

### 'ఉభయ కవిమిత్ర' 'ప్రతిభారవి' 'కవితా కలానిధి' ప్రముఖ బిరుదాభిరాములు, భారవి మురారి కాళిదాసాది మహాగ్రంథాంధ్రీకర్తలు శ్రీ భువనగిరి విజయరామకవిగారు, గుంటూరు.

శా. త్రాణల్ శ్రేణులనాటెము ల్గలుగు మేధా దక్షిణామూర్తి శా
స్త్రీణం 'బుత్తమజీవయాత్ర' యనుడెంచె, న్నేను 'సింహావలో
కైణీదృఙ్నిధి కగ్గఁబాలిడెడుచో, హెచ్చైనసంబ్రంబుఁ బె
ల్లాణన్, బ్రస్తుతమాఁపి, తత్కృతిసముద్రిం బీఁదితిన్నెమ్మదిన్॥ 1

ఉ. ఎన్నిదినాలనుండియొ నిరీక్షణ నీకయి, వేచియుంటి నో
యమ్మలమిన్న! నీదుపతిఁ యంకమఁ జేర్చకమున్న సోదరుం
డన్నెమ కేనిపున్నెమ? మారసి, యారసికుందుపంప మో
దోన్నత మశ్రమీక్ష నికుచుంటివి నీవును మేల్ హుటాహుటిన్. 2

శా. కొల్లాయ న్నడుమందుఁ గట్టుకొని సిగ్గు స్వాధురూపంబు వ
ర్తిల్లన్ లోఁగడితిన్నె నీవె మెయితోఁ దృప్తాత్మఁ గూర్చుండి, యు
త్ఫుల్లాస్యంబున మత్కృతుల్వినుచు నెంతోప్రీతిఁ జూపించు వా
త్సల్లు న్నీదుపితామహుం బుటల, నమ్మా! చూచిహర్షించితిన్॥ 3

ఉ. నీజనకుండు నిన్నొక 'సినీమయుఁ గల్గినలేడి యో'గ మే
ళ్ళాజునఁ గూర్చె, రంగముల మున్నిటిపాత్రలు వారిభావనల్
తేజాలఁ గంటి మూందటఁ జలింప నదింప, నదింపుమీఱ నా
నాజనయుక్తసంసదము నా న్మది నాకిడె భూరిమోదముల్. 4

శా. కొంచెంబైనను, జాన! లేదుగద సంకోచంబు నీతండ్రి శా
స్త్రించెం దద్గురువంట; కానుడి కసంప్రీతుండతండేని, యా
మాంధి స్సెల్పువినీతుఁడీతఁడని శంసం, దానుఁదత్తుల్యుఁడా
నంచేని న్గ్రహియింపఁడా? తుదకుఁ గాఁపాతులుల్య లాత్మార్భకుల్? 5

చ. గుణవతుఁ బంగ సామమిడుకొంటెలుఁ, దండ్రినిఁ దండ్రి నాఁక రమే
శతపుడు కాఁడో యంచను నవాచ్యులయట్టులఁ గాక, తన్వి! నీ
గుణుఁ దతిభక్తిఁ దద్గురునిగొప్పల నున్నవి యున్నయట్లు, న
ల్వారకును జాటెఁ తే దదియాలోపము, దీనికి సాక్షినీవకా! 6

ఉ. సాదరినల్లై పండితజనంబుల మెచ్చనవొప్పఁజేరి, బి
డ్డా! దరిసింపఁజేయుము మహార్హసువర్ణపదాది నెట్టు ని
న్నొబ్బిదియొనర్చి నీవరునిఁబ్రోవునకిచ్చెనో నిన్నుఁ దండ్రి, వా
రాదట మేలిదీవెనల హర్షమెసంగ నొసంగునట్టుగన్॥ 7

చ. ఒకయెడ సంచయానమున నుండెద, వొంట మదేభకీవి నిం
చుకయనిపింతు, కోయిలలఁ జుల్కనఁజేసె దొకొక్కచో, మఱో
క్కకడనొ వ్యంగ్యభావలనిగారముతోడ నొసాళమంటు చెం
తకు మరియాద దాఁటవుగదా; సుకుమారి! కుమారి! పేరిమిన్॥ 8

మ. ఇవె వేదీవన, లేగిరాఁగదవె, తల్లీ! నీకుఁ దోఁబుట్టువుల్
సవురొప్పందగు తాతతండ్రులవిధాల న్సంస్కృతాంధ్రంబులన్
మివుల న్నిజనకుండుకాంచ వరమిమ్మా యంచునీసాధుభ
క్త వినంగా వచియించి కూర్పఁగదె, మేధాదక్షిణామూర్తికిన్ 9

'యోగానంద రామాయణ' ద్యనేకగ్రంథరచయితలు,

శ్రీ చిల్లరిగె యోగానందకవిగారు, అమలాపురము

సీ. నాయనబలె దక్షిణామూర్త్యుపాస్యుఁడై ప్రతిభాక్షరాన్యుఁడై ప్రబలుసుతుఁడు
తండ్రికీర్తికి వన్నెఁ దాఁదెచ్చు ననఁగ మేధాదక్షిణామూర్తి నాఁ దనరుచు
భూరిశాస్త్రవిశేష పూతచారిత్రచే 'శాస్త్రి' నా లోకప్రశస్తిఁ బడసి
విద్వాంసు లెదమెచ్చ విరచింపఁ దండ్రిపుస్తము లితండవి ప్రథితములొనర్చెఁ॥
దల్లియుం దండ్రి పూరుషోత్తముఁడొకండె యంచు గ్రహియించెఁ బిత తన్నుఁ
బెంచుకతన.
'మూర్తికాంతామణీ!' యని యూర్తినెంచి శతక మొకఁడు తోత్ర రచించె,
జనకు మించె॥

ఉ. హొన్నహొరంగు లోహములనుత్తమమైనదెయైనఁ గొండలం
దున్నదటంచు విన్నతతి నుత్సవమేరికిఁగల్గఁబో దశే
నున్నఖనిప్రదేశమున కోర్వరియై చని త్రివ్వితీసి యం
దున్నపసిండిఁ దెచ్చె నన 'నుత్తమ' రమ్యచరిత్రఁ గూర్చెఁదాఁ॥ 2

మ॥ మహిలో 'నుత్తమజీవయాత్ర' యని నామంబిచ్చి, యీకావ్యమున్
రహిమీఱ న్గ్రథనంబొనర్చిన కృతార్థత్వం బిలంగన్నులో
కహితుం 'డుత్తమనూనుఁ' డయ్యె, నిదియాకంఠాప్తనక్షత్రమై
తుహినాంశు ప్రతికీర్తి చంద్రికకళతోఁ దోఁగ న్బితృప్రాణచ్యుతిన్॥ 8

ఇందలి కవితాశైలి మిక్కిలి ధారాళమై, సాంస్కృతిక పదభూయిష్ఠమై మృదుమధురభావ శుంభద్గంభీరమై, శ్లేషయమకాద్యనేకాలంకారములచే నిండియుండెడి దాటంబట్టి గ్రంథ మందఱకు నెంతో సమాకర్షణీయ మయ్యెడు.

# 'జీవయాత్ర' విషయసూచిక

## “జీవయాత్ర” నందుకొన్న మఱికొందఱు సహృదయుల లేఖలు.

‘ఆంధ్రాస్థానకవి’ పదాధిష్ఠితులు, ‘కళాప్రపూర్ణ’ ‘కవిసార్వభౌమ’ ‘మహామహోపాధ్యాయ’ యిత్యాద్యనేక బిరుదాభిరాములు, ‘శ్రీకృష్ణభారత’ తాద్యనేకోద్గ్రంథ నిర్మాణధురీణులునగు

### శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు. రాజమహేంద్రవరము.

శరీరములోఁ జక్కఁగా లేమిచేతను, గార్యాంతర వ్యగ్రతచేతను ‘జీవచరిత్రము’ నక్కడక్కడఁ జదివితిని. బాగుగా నేయున్నది. తీరిక గలిగినంతట, గ్రంథ మంతయుం జదివి యానందించెదను.

మీ కవిత్వము విషయమై నేనిట ప్రత్యేకముగాఁ జెప్ప నక్కఱలేదు. ‘జగమెఱిఁగిన బ్రాహ్మణునికి జందెమేల?’ యన్నట్లు జగమంతయు మీ కవిత్వము నంగీకరించియే యున్నది. ఆంధ్రదేశ మిచ్చిన కొడుకని మిమ్మనకమానను.

సుప్రసిద్ధ విద్వద్వ్యాసప్రకాగ్రణులు, ‘ఆంధ్ర వ్యాకరణ సంహితాసర్వస్వ’ నిర్మాణదక్షులునగు, ‘కళాప్రపూర్ణ’

### శ్రీ వఝ్ఝల చినసీతారామస్వామి శాస్త్రిగారు, విజయనగరం.

తా మత్యంతాదర పూర్వకముగా నంపిన ‘ఆత్మజీవయాత్ర’ అను మహాపురుషచరిత్రమును జూచి మిక్కిలి యానందించితిని. శ్రీ పురుషోత్తమ కవీంద్రులు సుప్రసిద్ధ యశోవిశాలులు, యోగీశ్వరులు, పరోపకార వారీణులు. అట్టి మహాపురుషుల యుత్తమ సచ్చరిత్రమును బ్రకటించి మీ విద్వత్కవితామతల్లి ధన్యతం గాంచినది. ‘స్వయం తీర్ణః పరాన్ తారయతి’ అనునట్లు గ్రంథము మూలమునఁ దాము తరించుటయే కాక, యస్మదాదుల నెల్లఁ దరింపఁజేయుట శ్లాఘాపాత్రము.

‘సంస్కృత వాఙ్మయచరిత్ర’ ‘సంస్కృతకవి తాంధ్రభాషానుశాస’ ‘నాంధ్రభాషావిమర్శ’ ఇత్యాది కృతికర్తలు, ‘అభినవవాగనుశాసన’

### శ్రీమల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. ధవళేశ్వరము

మీ కృతిచదివితి. మీ యుత్సాహము, మీ పితృభక్తి, మీ భాషాభిమానమును శ్లాఘ్యములు.

మ. అనఘుం డాపురుషోత్తముండు, కవితావ్యాసక్తుఁడై, ధర్మవ
ర్తనుఁడై పేరుగడించె దేశమున, నౌరా! తండ్రి పేర్మి న్దెల్పఁ ద
త్తనయుం’ డన్న నుతిం గడించితివి, మేధాదక్షిణామూర్తి! తీ
ర్చిన యా‘యుత్తమ జీవయాత్ర’ కృతి తీర్చె న్నీపితౄణంబులన్॥

'అభినవతిక్కన' 'మహోపాధ్యాయ' 'సాహిత్యస్థాపకాచా'ర్యాది బిరుదవిరాజితులు, 'వివేకచూడామణి' ప్రభృతిసద్గ్రంథాంధ్రీకర్తలు, సువిమర్శకులు నౌ.

## శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నెల్లూరు

'గయలోఁ బిండము అర్పించి కొందఱు, కృతుల నంకితము సేసి కొందఱు, గృహారామక్షేత్రాదులు నెలకొల్పి, కొందఱు, ఈప్రకారము పితృసపర్య చేయువారు పెక్కురుకలరు. కాని, తండ్రి జీవితము నిట్లు మహాద్భుతమైన పద్యకావ్యముగా నిర్మించి తత్కీర్తి నజరామరముఁ గావించినవా రరుదు, మీ రచనలో శ్రీపురుషోత్తముని చరిత్రము సర్వము కన్నులకుఁ బొడకట్టుచున్నది. తద్యోయొడల మీరు కావించినవర్ణనలు మీకవితకు మెఱుంగు వెట్టినట్లున్నవి. తత్తత్కాలములఁ దత్తత్సందర్భములఁ దండ్రిగారింగూర్చి మహామహులు చేసిన ప్రశంసల నన్నిటి నొక్కటఁ జేర్చుట గ్రంథమున కలంకారము.

మీయట్టి సత్పుత్త్రునిఁ గన్న మీతండ్రి యెంతధన్యుఁడు!! వారి ప్రజ్ఞావిశేషము లట్లుండ, మీసంస్కార మెంతయతిశయమైనది! మీరు సార్థకనాములరు, మీమార్గము విద్వత్కవులైన పుత్త్రులకెల్ల నాదర్శ మగునుగావుత.

ఈ 'ఉత్తమ జీవయాత్ర, మీతండ్రిగారి నాఁటి సాహిత్య ప్రపంచము నంతటిని సాక్షాత్కరింపఁ జేయుచున్నది.

'శ్రీమద్గురుభాగవత' 'శ్రీమద్భాగవత మహిమా' ద్యనేక గ్రంథకర్తలు,
'ఉభయభాషాప్రవీణ' 'వేదాన్తపారీణ' 'కవిశేఖర'

## శ్రీమిన్నికంటి గురునాథ శర్మగారు, కాలేజిపండితులు, గుంటూరు

శ్రీపురుషోత్తమ కవీంద్రులయందలి భక్తియు శ్రీశాస్త్రులవారి కవితయుం బలిరక్తియు నన్నుగ్రంథము సాంతము చదివించినవి. సత్యేతర ఖ్యాతిశయోక్తుల కిందుఁ దావులేదు. 'నామైకదేశే నామగ్రహణమ్' న్యాయము చొప్పున, 'ఉత్తమ' యనఁ బురుషోత్తమకవీంద్రుల జీవయాత్రయుఁ, బురుషులలో నుత్తముఁడైన కామయార్యుని జీవయాత్రయుఁ, బుత్త్రులలో నుత్తముఁడైన మేధాదక్షిణామూర్తిశాస్త్రి జీవయాత్రయు నిందున్కి 'నుత్తమ జీవయాత్ర' యను నామము సార్థకతం జెందుచున్నది.

ఇది కేవలము 'నాఁడెల్ల'వంశ్యుల కథలనుచెప్పు గ్రంథమే కాదు. ఇది [illegible] [illegible] ఎన్నియో యుండఁ గలవు. వివిధములగు వర్ణనలు

గలవు. నయబోధలు, నద్వైతాది మతవిషయములు, స్వయంకృషి, అప్రతీగ్రహత, పట్టుదల, మతసమానము, పరోపకారపరత, రాజకీయ చతురత, దేశభక్తి, గురుభక్తి, పితృభక్తి, యెన్నియని వాకొనఁగలను?

ఈగ్రంథమునం దిట్టెన్నెన్నియో సుగుణరత్నములు గుప్పఁబడినవి. ఇది యొకవ్యక్తికిమాత్రమే సంబంధించినది కాదు. ఆవ్యక్తుల నడవడినుండి లోకము గ్రహింపవలసిన వెన్నియో సుగుణము లిందుఁగలవు.

కావ్యమునకు జీవమైనధ్వని యిందు మనోహరముగా ధ్వనించుచునే యున్నది. మఱియు, నప్పటి సాంఘికస్థితులు, నానాఁటి పండితకవులు, వారి చరిత్రలుం దెలిసికొనఁ దలఁచువారి కిది గని వంటిది. అంతేకాదు, ఇందుఁ గవితాకళ కళకళ లాడుచున్నది. పాండితీపటిమ తాండవించుచున్నది. వాక్కృతిదివ్యాకృతిఁ జెందియున్నది. గర్భకవిత సందర్భోచితముగా నావిర్భవించినది, బంధకవితాగంధము సంధిల్లినది. అప్పట్టున నప్పకవీయమున కిది గొప్ప లక్ష్యగ్రంథముగా నొప్పుచున్నది.

ఇందు జ్యోతిషము, వేదాన్తము, సారస్వతగోష్ఠి, మతచర్య, వధానవిధానములు, పరమపురుషస్మృతులుం గలవు. ఇది సర్వగుణమణులకు రత్నాకరము. ఇట్టిదానిని సృజింప నెంతమేధ కావలయు? ఉన్నను నొక్క కవిమాత్రునికిఁ దరమా? కనుక, దక్షిణామూర్తియే సృజించె. మఱి, పురుషోత్తమునకు దక్షిణామూర్తి యొదిగి యుండుటలో విశేషములేదా? ఉపాసనాబలమో, పితృపూజాఫలమో, వీరికి శబ్దజాలమంతయు జిహ్వాగ్రమున నర్తించుచుండును. లోకోక్తులు మేము మేమని త్రోసికొని వచ్చుచుండును. వీరి లేఖినీ రసమెట్టిదో వచనయోగ్యమగు నీరస వస్తువు గూడ ఛందోబద్ధమై మిసమిస లాడుచుండును. కొందఱు పద్యములు వ్రాయుచు బడలి, విశ్రాంతికి వచనముఁ జేపట్టుదురు. ఈ శాస్త్రిగారికిఁ బద్యము వ్రాయుటయే బడలికఁ దీర్చుకొనుట... 'కోలింగు'వాఁటి వలె వీరి కవిత్వధార పర్విడుచుండ నాయాపదము లుచితస్థలముల గుట్టుగా నడఁగియుండి పరిసరముల నొత్తుకొని సందులేకుండఁ జేయుచుండును.

ఈ వఱకు శ్రీ భువనగిరి విజయరామకవిగారి 'మురారి' నాటకమునకు వీరు వ్రాసిన పీఠికం జూచియే వీరి ప్రతిభావ్యుత్పత్తుల కలరుచుంటిని. నేఁ డిందుఁ గవితారసము నాస్వాదించితి, మఱియు నియ్యది వీరి జ్యోతిష వేదాన్త వ్యాకరణాది శాస్త్ర పాండిత్యమును బహుముఖముల వెల్లడించుచున్నది.

'వైయాకరణ కేసరి' 'విద్వత్కవి సార్వభౌమే'త్యాద్యనేక బిరుదవిభ్రాజితులగు

శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు—ముంగండ

శ్లో॥ యే లోకే పురుషోత్తమస్య సుకవే స్స్వాంలిప్సవో వృత్తత
స్తే పశ్యంతు తదాత్మజేన కలితాం తజ్జీవయాత్రాం బుధాః।
ఆజన్మామరణం యదీయచరితం మానస్యధర్మ్యసందర్భకం
సాధూనాం సకలైర్గుణై రసదృశం తాముత్తమాం వైబుధీం॥

శ్లో॥ విద్యాసంగ్రహ మాదిమాశ్రమవర స్స్వద్దేశికేంద్రాంతికాత్
హృద్యాం భోగతతిం స్వధర్మభజనైస్సాకం గృహస్థాశ్రమః
విద్యావైభవ మాధ్యసత్కృతిగతైర్వ్యాఖ్యానవద్భిర్వరా
త్సద్యాం ధన్యతమాం రమాంచ ధరణీం వాణీదధుర్యాభితిభిః 2

శ్లో॥ విజ్ఞానేన కలాను, సూక్ష్మకలన ప్రజ్ఞాన సంపద్యుజా
జానీం దేవ పితృ క్రియార్చనమఖైర్దక్షిణ్యం ధరాం ప్రీణయన్
శ్రీమద్దక్షిణవక్త్ర మాధ్యతపసా శ్రీ ధర్మదేవీం సదా
ధర్మైస్సైన్యైః పురుషోత్తమ స్స్వయశసా నిన్యేఽభ్యతం జీవితం॥ 3

శ్లో॥ అన్వర్థనామ విదితోత్తమ జీవయాత్రాం
మేధాయుతోఽచకల దాత్మజ దక్షిణాస్యః
ప్యాముత్తమాం కలయతాం భువి జీవయాత్రాం
మన్యే విదర్శయితు మిత్యవలోక్య తుష్టః॥ 4

శ్లో॥ ఇతి కల్య పుల్య వంశ్యో 'విద్వత్కవి' సార్వభౌమ పదవీకః
స ఉమామహేశ్వర సుధీ శ్శంసతి జీవిత మిహోత్తమం సుకవేః॥ 5

సంగీతసాహిత్యనిధులు, మహావిమర్శకులు, శ్రీ వేంకటేశ్వర ఓరియంటల్
ఇన్‌స్టిట్యూట్‌లో మ్యూజిక్ రీడర్ యుడనైన,
శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తిరుపతి.

తమ రచించిన 'ఉత్తమజీవయాత్ర'ను చూచితిని. ధీరమైన పండితశయ్యా తమరచనలో నిండియున్నది, 'అన్యం నయాతిహి విభూతి రపత్యభాజాం' అన్న అనంతభట్టునాటి తమయెడ సార్థకమైనది. కాని, సంస్కృతభూయిష్ఠమై శబ్దచిత్రములు నిండిన యీ ప్రౌఢరచన యెందఱి పఠితకు మెదుగునో తెలియదు. మఱియు, శ్రీపురుషోత్తమ కవిగారివంటి మేధానిధానుల జీవితమును గద్యరూపమున మీరు రచించియుంటిరేని, లోకమున కింకను ఎక్కువగా నుపకరించియుండునని నానమ్మకము.

## అఖండ సాహితీమండిత నిగమాగమ సారవేత్తలు 'వేదభాష్య విశారద'

## శ్రీ ఉప్పులూరి గణపతిశాస్త్రిగారు — కాకినాడ

శ్రీ శాదెళ్ళ మేధా దక్షిణామూర్తి శాస్త్రిగారు దయతో బంపిన 'ఉత్తమ జీవయాత్ర' యను గ్రంథరాజమును తీరిక లేక స్థాలీపులాక న్యాయమున జూచితిని. బందరులో 25 సం॥ముల క్రిందట నేను ప్రచారము చెప్పు సందర్భమున, శ్రీ శాస్త్రిగారితోను శ్రీ పురుషోత్తమ కవీంద్రులతోడను నాకు మైత్రి, చేకూరెను.

అప్పటికే శ్రీ శాస్త్రిగారి ఆశుకవిత్వధార ద్రాక్షామధురశైలి సంశోభితమై విద్వద్వరేణ్యులకు వీనులపండువయై, తత్త్వసంపద్వ్యాఖ్యానరూప రసభరితమై శబ్దార్థాలంకార లలితమై, బంధకవిత్వాది వివిధ భేదసంకలితమై, నిరవద్యమై, సర్వజన హృద్యంబనుటలో నతిశయోక్తి కానరాదయ్యెను.

మరియు, 'పుత్రాదిచ్ఛేత్ పరాజయమ్' అను నార్యోక్తిని సార్థకము గావించి శ్రీ పురుషోత్తమ కవిపుంగవుల నన్వర్థ నామధేయుల గావించిన యీ కవివరేణ్యుల యొక్కయును, వీరి పితృపాదుల యొక్కయు సర్వగ్రంథములు విశ్వజన హృద్యములని నా యాశయము.

## వ్యాకరణాద్యనేక శాస్త్రపారంగతులు వేద సంస్కృత కళాశాల ప్రిన్సిపాల్

## శ్రీ 'విద్యాభూషణ' 'విద్యావినోద' 'కులపతి'

## శ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు — నెల్లూరు

'ఉత్తమ జీవయాత్ర' అను ఈ 'గురుదేవచరిత్ర' పండితులు, కవులు, కళాకోవిదులు, తత్త్వవిదులు నగు పురుషోత్తమ శాస్త్రిగారి యసాధారణ ప్రతిభా విశేషములను, ప్రతి ఆశ్వాసమున, ప్రత్యక్ష దృష్టముగ నిరూపించుటచే, పఠించువారలకు చాల ఆకర్షకముగా నున్నది.

శైలి మనోజ్ఞము. రచన సంస్కృత పదభూయిష్ఠమైనను సుగమము, ఆయా ప్రకరణముల రసభావపరిపోషణము ప్రశస్యము. అప్రయత్నసిద్ధము లలంకారములు..

ఇట్టి 'యుత్తమ యోగిజీవితము'ను, హృద్యముగ రచించి లోకమునకు ప్రసాదించిన శ్రీ దక్షిణామూర్తి శాస్త్రిగారు ధన్యులు, పరదేవతానుగ్రహపాత్రులును.

## శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు, శతావధానులు—చిరివాడ

తాము పంపిన పుస్తకమును జూచితిని. ఏతద్గ్రంథరచన ద్వారమున, పితృఋణము దీర్చుకొనుటయేకాక, తెలుఁగువారికి సంతోషమును గూడఁ గలుగఁ జేసితిరి.

శ్రీరామ కథామృతోత్తరకాండాద్యనేకోద్గ్రంథ నిర్వాహకులు
శతావధానులు

## శ్రీ తాడేపల్లి రాఘవనారాయణశాస్త్రిగారు—చందవోలు

'ఉత్తమజీవయాత్ర' మహానందముతోఁ జదివితిని. మీ కవితాధార పూర్వపరిచితమే యైనను, ఇందు నూతనత సంపాదించినది. అది యట్టులుండ, నిట్టి గ్రంథరచన మిక్కిలి యరుదనిపించినది. సుప్రసిద్ధుల చరిత్రములు కొన్నిశతాబ్దములపైన విజ్ఞులూహించి వ్యత్యయముగా వ్రాయుటకన్న మీ పితృపాదుల చరితము మీరు ప్రకటించుట మీకు మీ కవితకు మీ పూర్వులకు యశస్కరము. మీ ప్రబంధమును గుఱించి సంతసించితిని.

రిటైర్డు వి. ఆర్. సి. హైస్కూలు పండితులు, 'విమర్శశాగేసర'

## విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు— నెల్లూరు

తాము దయతో పంపిన 'ఉత్తమజీవయాత్ర' చదివి ఆశ్చర్యానందము అందితిని. మీ తండ్రిగారివలె అనేక ప్రజ్ఞలుగల పురుషుఁడు నేఁటివారిలో నేకాదు, పూర్వులలోను నుండుట యరుదే. బహుభాషా పండితులై, బహు గ్రంథకర్తలై, బహువిద్వత్కవి వినుత యశస్సంపన్నులైన మీ పితృపాదులు నిజముగా పురుషులలో ఉత్తములు. ఆ 'పురుషోత్తము' ని 'జీవయాత్ర' నిరుపమానమైనది, ఉత్తమ జీవయాత్ర సాగింపఁగోరువారి కందఱికిని ఆదర్శమై, చిరస్మరణీయమై యొప్పుచున్నది.

మీతో రెల్లవిధముల ఆ తండ్రిగారికిఁ దగిన కుమారులు, ఆ మహామహుని కీర్తికిఁ దన్నె పెట్టు మీ పాండిత్య కవితావిశేషములును, అంతకంటెను, అలోకసామాన్యమైన మీ పితృభక్తియు జగత్ స్తవనీయములు.

హృద్యములగు పద్యములతో వివిధ విషయములను బోధించు 'ఉత్తమ కావ్యము' మీ 'ఉత్తమ జీవయాత్ర'. ఆ గ్రంథమును చదివి అచ్చెరువుపొందని వారును, ఆనందము పొందనివారును ఉండరని నా నమ్మకము.

ఉభయభాషా ప్రవీణ 'విద్యారత్న'

## శ్రీ ఆకిలి శ్రీరామశర్మగారు—ముత్తుకూరు

శ్లో॥ సలిలరుణ్మృతౌ పూర్వసమర్పణ ప్రతివచో నివితంత్వేద ముత్తరమ్
కృతదయాశలితేన హి చేత సా ఉద్ధృత మహో! భవతా భవితృదుత్రతమ్,

క॥ కృతి 'యుత్తమచరితము' మతి। కృతిరచనమె యుత్తమంబు, కృతికర్తమహా
మతి, యుత్తమజన్మండీ। త్రితయము నొడఁగూడె, మా యదృష్టము చేతన్

క॥ మిగులంగఁ దండ్రివలెఁ దై। వగజగతిన్ సుకృతివిరచనంబులచేఁ, బెం
పు గడించుకొంటి, జగమె। న్నఁగ, మేధాపూర్వ దక్షిణామూర్తి కవీ!

చ. పదముల పొంకమున్, రుచిరబంధపు బింకము పల్కు నోలియున్
మృదుల గభీరశైలియు సమిద్ధ సముజ్జ్వల సూక్తిగౌరవం
బొదవ రచించి తెంపెసఁగ నుత్తమవృత్తము గల్గు పాత్రమున్
మృదిత దురంత పాండితియు, మేధ, 'యనుత్తరమూర్తి' నాఁదగన్

క. సరస వచోరచనలచేఁ బరాకరించితివి తండ్రి పలుకుల నొకమై
నరసీ! 'పుత్రాదిచ్ఛేత్పరాజయ' మ్మనుపల్కు పరమార్థము కాన్.

తే॥ ఆంగ్లభాషను బరిణతం బైన పాండి
తీగరిమ గల్గి యుండియు, తేట తెనుఁగు
పలుకుబళ్ళకె మరగారు, బాగు! బాగు!
స్వీయ మగు దేశ భాషల ప్రేమ పెంపు

ఆంధ్రపత్రిక (8-8-52)

బందరులో సాహిత్య సాంఘిక జీవితములో నుత్తమశ్రేణి నలంకరించి, యశశ్శరీరులైన శ్రీ నాదెళ్ల పురుషోత్తమ కవీంద్రుల జీవితమును, వారి పుత్రులగు శ్రీ నాదెళ్ళ మేధాదక్షిణామూర్తి శాస్త్రులవారు సమగ్రముగా నీ గ్రంథమున చిత్రించినారు. పుత్రులగు దక్షిణామూర్తి గారికి పురుషోత్తమ కవీంద్రులు పితృపాదులే కాక, గురుపాదులు కూడ. కావుననే యీ గ్రంథకవితాలహరి యందంతటను పితృభక్తి, గురుభక్తి గంగా యమునలవలె సమ్మేళనము చెందినవి. పురుషోత్తమ కవీంద్రులు శతాధిక గ్రంథకర్తలు. నేటికాలమున ప్రాముఖ్యము వహించుచున్న హిందీ భాషలో 82 నాటకములు వ్రాసినారన్నచో వారికా భాషయం దెంతటి రచనా సామర్థ్యమున్నదో తెలియగలదు. గ్రంథమంతయు సత్యమగు చరిత్రమును దెలుపుచు, శాస్త్రులవారి జీవితమును గూర్చియే కాక, తత్సమకాలికుల జీవితములను గూర్చిన కొన్ని విశేషములు దెలుపుచు, హృదయాకర్షకముగ నున్నది. కీర్తిశేషులు వేటూరి ప్రభాకరశాస్త్రులవారు గూడ పురుషోత్తమ కవీంద్రుని పేర్కొన్నారు. ఆంధ్ర భాషాభిజ్ఞులెల్లరును పఠింపదగిన ప్రశస్త పద్యకృతి.

‘గ్రంథకర్తృ’ ‘షష్టిపూర్తిని’ శ్రీ శఙ్కర విజయశర్మ పురాణ ప్రసన్న
రాఘవాది కృతికర్త సమర్పించినదిది :

శ్లో॥ శ్రీశాఙ్కర్య సమాహ్వయాన్వయ సుధాకూపార రాకేందవే
విద్వత్తల్లజ పూరుషోత్తమ తపస్సారాత్త సన్మూర్తయే
మేధాపూర్వక దక్షిణాస్య భగవత్కారుణ్య సందీప్తయే
షష్ట్యబ్దోల్లసితాయ సంతు నతయః శ్రీ దక్షిణామూర్తయే॥

ఉ. ‘ఉత్తమ జీవయాత్ర’ యన నుర్వర సార్థకనామధేయమై
యుత్తమ నీతులం గలిపి యొజ్జలకొజ్జగ నిజ్జగాన, సూ
ర్యుత్తములై యొసంగు పురుషోత్తమ సత్కవిజీవితంబు స
ర్వోత్తమ మెన్నఁడో కృతి సమాహ రచించు గురు న్భజించెదన్॥ 2

క॥ పితృపాదుని గురుపాదుని నతిలోక గుణవ్రజాంచితామోదుని, స
త్కృతిగాదుం దౌధవ్యునిఁ గృతి శాశ్వతుఁ జేసియొసఁగు కృతి గురుఁగొల్తున్

చ. గొనముల నన్నిటన్ వెలని శూరిమి నోరిమి మీఱి ధీరతా
ఖనియను నుదారుఁడై తగి, జగాన సమానయశంబుఁ గన్న వా
నినిఁ బురుషోత్తమాభిధ మనీషివరుం గృతినేతఁ జేసి, వి
జ్ఞనగణనీయశయ్య, విలసత్కృతి సల్పిన సూరి సెంచెదన్॥ 4

ఉ॥ యోగుల నుత్తమసిద్ధి మహానిధియై, యనిలుఁడై ధరా
భాగమునందుఁ గాంచిన విపశ్చిదనీక వచఃప్రశస్య మే
ధాగరిమాఢ్య శేమనబుధప్రభు సచ్చరితంబు నో మహా
భాగ! భవత్కృతంబుఁ బితృపాదసమర్పిత మింకనొప్పెడిన్. 5

రానివారిపాలెం
మకాం బందరు,
విజయ పుష్య బ ౧౪ భాను

ఇట్లు
భవచ్ఛిష్య పరమాణువు
భమిడిపాటి వేంకటసుబ్రహ్మణ్య శర్మ

శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః

# ఉత్తమ జీవయాత్ర



## ప్రార్థనాదికము





దక్షిణాస్యమ్ముకులాంఘ్రి సరోజభృంగం
నాళీక సంశ్రిత కలశార్ణవ పూర్ణచంద్రం
విద్వద్విధేయ పురుషోత్తమ సత్కవీంద్రం
ప్రజ్ఞాతు నిత్యతముపాస్య సుధాంశుమౌళిః॥

శా. శ్రీసంపై, శిష్యానమోదదంబగుచు, నిస్సీమప్రతిభాధనమ్మై
మేధాస్ఫూర్తికి నాలవాలమయి, భస్మీభూతసర్వాఘమ్మై
ప్రోదింగూర్పఁగ జాలునద్ది, యదె, యెప్డు న్మన్మనోవీథి, నే
త్రాదృగ్వాగ్విభవాభిగమ్య గురుపాద ద్వంద్వమైనిల్చుతన్॥

ఉ. కీర్తిసుదాఢ్య సచ్చరిత కేవలయోగివశైకవర్తి, వి
తార్తి, జితారిమూర్తి, వినుతప్రథిత ప్రణతావనోర్జిత
స్ఫూర్తి, యుపాస్యమూర్తి పురుషోత్తమసంతత సేవ్యదక్షిణా
మూర్తి, సుశాంతమూర్తి, గుణ పూర్తి, కృపాపరిపూర్తి
నేలుతన్॥ 3

ఉ. చిత్తవిశుద్ధిఁ దోడ్పడెడిఁ జిత్తరుణీమణి ముక్తికాంత, సం
పత్తులఁగూర్చుతల్లి గుణవల్లి సరస్వతి, గౌరి, తానయై
యుత్తమ మాతృదేవి, పురుషోత్తమ సద్ధృదయానుమోద సం
పత్తిని, ముక్తి, భుక్తిఁ, బ్రతిపత్తిని, దత్తదభీష్ట దాత్రియై॥

చ. కవిపురుషోత్తముల్, బహుళ కావ్యవిధాతలఁగొల్తు; నాకు సం
భవముని, వ్యాసు, భాసుఁ, బ్రతిభాసురభాసురకాళిదాసు భా
రవి, నలమాఘహర్షుల, మురారిమయూరుల, దండిబాణులన్
బ్రవిమల సత్కవిత్రితయ, భాస్కర, పోతన, పెద్దనాదులన్॥

చ. కవిపురుషోత్తముల్ గలరుగాని, శమంబు, దమంబు, క్షాంతి, యా
ర్జవము, శుచిత్వ, మాస్తికత, స్థైర్య, మసక్తి, తపంబు, దానర
క్తి వఱలనై, శతాధికకృతిప్రతతిన్, క్షితినించి మించ నా
సువిశదకీర్తి, యోగిపురుషోత్తముఁడుండునె? కోటికొక్కఁడేన్

ఆ. దోసఁగు లెంచువారి దోషజ్ఞు లందురా ?
గానమె కొంటతగవు కోవిదులకుఁ
గాక, యెట్టిఁ గోర్మిలేకెన్న దోసముల్
'కుకవి' యన్న పేర్మిఁ గొనుటకె కద ॥ 7

చ. జనకుఁడు, సద్గురూత్తముఁడు, సార్థకనాముఁడు, పూరుషోత్తముం
డనుపమకీర్తిశాలి, రచితాద్భుతకావ్యచయుండు, సాధువ
ర్తనుఁడు, స్వకీయసచ్చరితదర్శిత సర్జితయోగిమార్గుఁ, డా
తని, గణితాగమజ్ఞవిదిత ప్రతిభాఢ్యు, బుధేడ్యుఁ గొల్చెదన్ ॥

ఉ. తొక్కని బాటలే, దెపుడు త్రొక్కినచో వెనుకంజలేక, యే
దిక్కున కైన సాగనగు ధీబలమబ్బుట, శాస్త్రవీథులం
జక్కటులెల్ల నారసి, యశంబు గడించెను మద్గురూత్తముం
డొక్కఁడ, సాటిఁ జెప్పఁగ, మఱొక్కనిఁ గానము దేనఁ జూచినన్

మ. గురుపాదాబ్జమరందమై, విహితవాక్సూనామృతాస్వాదన
స్థిరమై, నిర్మలదర్పణాభమయి, మచ్చిత్తంబు, తత్త్వాదృశో
ద్ధురమై, స్వామిగుణపరిపూర్ణమయి, సాధుప్రాపణోద్దామమై
సరసాలాపకథాసుధానిలయమై, సాయుజ్యమందించుతన్ ॥

క. అరికొనఁగాఁ దచ్చరితం
బున లోపము లెఱుఁగ దగ్గ పూర్వోత్తరముల్
విన సర్వహృదయ వీథుల
వనిశంబుఁ జరించు నతని యవ్రాత తోఁచెన్ ॥

క. పురుషోత్తమకృతులకుఁ బతి
పురుషోత్తమపూజితాంఘ్రి పురుషోత్తముఁడే
పురుషోత్తమ కృతిచరితము
పురుషోత్తమసాయకుండు, పురుషుండేలన్ ॥ 12

# యాత్రారంభము.



శా॥ శ్రీవిష్వంబక! శాంభవీహృదయ నీరేజాప్త! శుక్రార్కరా
జీవార్యంబక! శంబరారిదమనా! శ్రీకంఠ! మానీడ్యస
ద్భావా! భావితసత్స్వభావ! విను, మేధాదక్షిణామూర్తి దే
వా విశ్వేశ్వర! పూరుషోత్తమ కవి ప్రేప్సాశతస్యముఖ స్తుత్యమున్

కృష్ణాతీరము.

శా॥ శ్రీకృష్ణాపగ వాహినీపటలి సచ్ఛ్రీయంబు, గేయంబు గం
గాకల్లోలవతీప్రవాహ జననోత్కర్షంబు విష్ణ్వంఘ్రియు
గ్మ్నాకంబౌటనె, విష్ణురూపిణి యనంగాఁ బూజ్యతన్ బ్రాజ్యమౌ
నాకప్రస్థదిని కన్నఁగావునను గృష్ణ న్వెన్నెమిన్నెంచఁగదా॥ 14

శా॥ తత్తీరంబు, విధూత పాపచయ తీర్థక్షేత్ర సంఖ్యాతభా
స్వత్తేజోవిభవాధికంబు, ఫలపుష్పవ్రాత శాఖిగతో
న్మత్తారావపికాదికంబు, మృగసంతానాఢ్య కేదార సం
పత్తి ప్రోజ్జ్వల దిక్తటంబు బుధసంభావ్యంబు ధాత్రీస్థలిన్॥ 15

సీ॥ ప్రత్యూషస్నాన జపప్రార్థిత ద్విజ
వ్రాతాయితంబు కృష్ణాతటంబు
మాధ్యాహ్నికోష్మాప మర్దాపనోదిత
జంతువ్రజంబు కృష్ణాతటంబు
కల్లోల శీకరోత్కర సాంధ్యవాత తృ
ష్ణాళు జాలంబు కృష్ణాతటంబు
తరణార్థి జన సముత్తరణ కరోద్యోగి
నావికౌఘంబు కృష్ణాతటంబు॥

తే॥ సస్యవృద్ధికరంబు కృష్ణాతటంబు
నవ్యసత్ఫలదంబు కృష్ణాతటంబు
శస్త సచ్చరితంబు కృష్ణాతటంబు
సజ్జనావసథంబు కృష్ణాతటంబు॥ 16

ఉ॥ అందును గృష్ణవేణ్ణి దరియంగ నసంగ శరార్తి సాగరుం
డందుకొనంగఁ బోఁగెట నిజాయత బాహువుగోర్మికావళి
న్నందడి నంపుచోటబె పరిశస్త మహాస్త కళంకమాట, మ
ధ్యందిన భానుతేజము మహత్త్వ ఘనత్వ పటుత్వ సంపదన్॥

ఉ॥ పేరను గృష్ణయయ్యుఁ బృథివీస్థలి సర్వజనౌఘ పాపసం
హారిణి శ్వేతరూపిణి యటన్న యశంబును గన్నమేటి భా
గీరథి కర్బురాప్తి దరికెంజనఁ బాపుచుఁగాక రూపమున్
జారుమరాళగాత్రము నొసంగుట నంచలదీవి నాఁబడున్॥ 18

ఉ॥ కావున దాపురంబునను గాపురముబ్బినఁ గాపురంబదం
చేవిధి నెన్నఁగాఁదగమి, నెన్నికవన్నియ మిన్నమాట, మా
యావులు గానివారు మహితాత్ములు మోక్షపదాభిలాషులున్
వావిరిఁ జేరుచుందురు తపంబొనరింపఁ దరింపనెంచుచున్॥ 19

ఉ॥ అట్టియెడ న్ధరామర నరావళి వాసముసన్న గేహముల్
గట్టిన నగ్రహారమనఁగాఁ బడునయ్యది పావనాంబు సం
ఘట్టిత పాపసంచయము, కర్మఠులు న్నిజధర్మ వర్త్మలై
పట్టుదలం జరింపనగు పట్టది నెట్టనఁ బాపుఁజెట్టలన్॥ 20

వంశావతారము.

ఉ॥ ఆవివరం బెఱింగిన మహాత్ముఁడొకండు నృసింహభట్టనాఁ
బ్యావిది తాగమాంచిత రహస్యుఁ డుపాస్యుఁ డొకానొకప్పుసం
భావిత మౌనిమార్గుఁడయి, భాసుర మోక్షపదాభిలాషఁ గృ
ష్ణావనపావనుండయి ప్రశాంతిఁ దపంబొనరింప నెంచుచున్॥ 21

ఉ॥ తా నిజదారపుత్త్రి సహితంబుగ 'నాచెళ' విడి, కృష్ణవే
ణీ నదిఁజేరఁ గాల్నడ ననేకదినంబులు పోయిపోయి, స
మ్మాన్వితుఁడౌచు నొక్కటఁ గ్రిమాగత వైదికధర్మవర్త్ములం
దానును జేరమేలని ముదంబునఁ గట్టెఁగుటీర మయ్యెడన్॥ 22

ఉ॥ మీరెవరయ్య? యీడకునవీనముగా నరుదెంచిరంచు, నొ
వ్వారలు పృచ్ఛసేయ వినువారలు 'నాచెళ' వారనంగ న

వార్వారికి వారివారికినవారిగ నెప్పుడె నింటిచేఁ దై
సార మదింతయేకద, విచారణసేయ గృహస్థధానముల్॥        23

శా॥ ఈతీరై యటకన్యదేశముల నా రేతేర నందందు, ని
ష్ణాతుల్గొందఱు పాండితీగరిమకు న్సంతుష్టులై భూమిపుం
డాతీరస్థుల కిచ్చుమాన్యములు మాన్యత్వంబు శోభిల్లఁగా
సీతారామ పురాగ్రహారికులు నాఁజెన్నొందిరి యీ ధాత్రిలోన్॥

తే॥ అట్టిలీమన సగసింహభట్టుకూడ
వృత్తిధారుఁడు తానైయకృష్ట పచ్య
సస్య సంపత్తి చేబుత్తిజరపి ముత్తి
కొఱకు నాసక్తి నిజశక్తిఁ గొల్లకొట్టె॥        25

సీ॥ వైదికుఁడాతఁ, డాపస్తంబ సూత్రుండు
హారితసగోత్రుఁ, డాగ్యస్తుతుండు
వెలనాటివాఁడన వెలయునాతఁడు, మిన్న
యాష్టేయ పౌరుషేయమునానెన్న
యజురాగ మాధ్యాయి, యఖిల శాస్త్రార్థ
వేత్తృతా కలితుండు సత్తపస్వి
ధర్మమార్గైకవర్తనుఁడుగాఁ గనుసహ
ధర్మచారిణి యమ్మో ధర్మపత్ని.

తే॥ అట్టిదంపతులకుఁ బుట్టినట్టి ఘనుఁడు
వరగుణాకరుఁడౌట కబ్బురమె? యతఁడు
జనకబోధిత వేదశాస్త్రప్రశస్తి
నాఖ్య నాగేశ్వరుఁడు పితృప్రఖ్యుఁడెసఁగె॥        26

తే॥ అతని కాలంబునందుఁ బిత్రార్జితంబు
నందుఁబండిన ధాన్యంబు నతిథిపూజ
నాదికంబుల వెచ్చించి త్యాగియన్న
పేరువడసెను సాటియుర్వీసురులను॥        27

తే॥ ప్రకట పితృమార్గ నిత్యనైష్ఠికత, మఱియు
శర్మమొప్పు విద్యుక్తషట్కర్మ నిరతి

కాలుగడిగించికొనని నిష్కల్మషగతి
యలరఁ దృప్తియె యాస్తిగా వెలసె నార॥ 28

మ॥ అరయం బుత్త్రుఁడు వేంకటేశ్వర సమాఖ్యాకుండు జన్మించి వా
విరిగా నిర్మలబుద్ధికౌశలమునం బెంపొంది యింపొందె, స
త్వరశాస్త్రార్థ విచారణైక పరతంత్రజ్ఞాన సంపత్తి భా
స్వరుఁడయ్యెన్, గణితాగమజ్ఞుఁడవుట ప్రఖ్యాత సిద్ధాంతినాన్॥

ఆ॥ తాతతండ్రులటుల దక్షిణామూర్త్యుపా
సనము ఘనమటనుచు మనమునందు
నిలిపి సలిపి తపము నిర్మలవాక్సిద్ధిఁ
గనియె ననుపమానుఁ డని యనంగ॥ 30

ఉ॥ ఈతఁడు ఖ్యాతికాముఁడయి యెన్నికఁ గన్న మహాత్ముఁడయ్యెఁ దా
జ్యోతిషధర్మశాస్త్రములఁ జాతురిపేరిమి నారితేరి, భూ
మీతలనాయకుల్ దరిసి మేనుర భక్తిని మ్రొక్క నొప్పె, సం
పూత చరిత్రులాసుతులు పుట్టిరి సుబ్బయ కృష్ణయాఖ్యుఁడున్॥

ఉ॥ అందల యగ్రజన్ముఁ డనయంబు నయంబుఁ బ్రియంబు మీఱ సా
నందుఁ డదృష్టవంతుఁడు ననంగఁ గనంగ వినంగలారలా
నందఱు, మందిరాళిఁ బడియాఱును బాతిక లెక్కఁగట్టెఁ దా
సుందర సౌధభిత్తికలఁ జొప్పడ నొప్పు రహింపనొప్పఁగన్॥ 32

చ॥ తనకొనగూడ నందొకటి, తమ్మునకొక్కటి వామభాగ మం
దునమర లక్ష్మిదేవియను తోడనుబుట్టిన యాపెభర్తతో
డను సుఖమొప్ప వేఱొకఁడిడింగఁ దలంచి సమానరీతిన
త్యనుగత పక్షపాత రహితత్వముఁ జూపఁగ నిల్పెఁ దీరుగాన్॥ 33

క॥ భూవసతివృద్ధిపఱిచెను। గోవులు నిలువంగ నిల్పెఁ గొట్టములింకన్
జావిడులుఁ గుటీరమ్ములు। నావలఁ బాలేళ్లకొఱకు నలరి చెవరుసన్

ఉ॥ తాతను మించునట్టి నెఱదాత, విధాతను మించు వేత్త, ము
త్తాతను మించు నైష్ఠికతఁ దాత్త్విక సాత్త్విక లక్షణంబులం
బూతుఁడు భవ్యసేతు పరిపూజిత గాంగజలంబులం దొగిన్
స్నాతుఁడు గాశిఁదానరుగఁ జాతెను గాల్నడ రెండుసారులున్॥

తే॥ ఊరివారలందఱు కుపయోగపడఁగ
నీరుఁ ద్రవ్వించెనంట తటాకమొకటి
బ్రాహ్మణోత్తముల కట భూవసతిఁ గూర్చెఁ
దానొసర్చె ననేక గోదానములను॥ 36

ఆ॥ కాశి కేగుచుండఁగా మార్గమందొంట
దొరకెఁ బద్మనాభు దోరమొకటి
దానిఁ జేతఁగొంచుఁ దా ననుష్ఠించె, న
నంతు వ్రతమ దింట నాఁటినుండి॥ 37

ఆ॥ ఆతని ప్రియసతి మహాలక్ష్మియను పేరఁ
బరఁగు నాయమయనుపమగుణగణ
సుందరాకృతి జితశోభారతీసతి
మతినిసుమతి సుకృతి పతిహితగతి॥ 38

క॥ నాగేశ్వరసుతుఁడిట్టులఁ ద్యాగేశ్వరుఁడంచు నెన్నఁదగువిఖ్యాతిన్
భోగీశ్వరుఁడై యొప్పెను । వాగీశ్వర వర్ణనీయ వర్తనుఁడౌచున్॥

క॥ ఆగర్భ శ్రీమంతుం । డౌఁగదతత్సుతుఁడు, కామయాఖ్యాకుండై
శ్రీగౌరీడ్భక్తుండై యోగీట్పథ గామియయ్యె యోగ్యతనెన్నన్॥

మ॥ తనయుల్పెక్కురు పుట్టనేమిటి కనర్థప్రాపకు, ల్దీపకుం
డును వంశంబునఁ బేరునిల్పఁగల వాఁడుంజాలు నొక్కండ, పు
త్త్రున పుట్టంగనకుండ నెట్టఁగను బాత్రుండౌను బుత్త్రిండు, కా
వునఁ గామేశ్వరుఁజూచుకొంచు మురిపెంబుంబొందె నాతండ్రియున్॥

ఉత్సాహ: దినదిన ప్రవర్ధమాన తేజుఁడయ్యె బాలకుం
డనుపమాన దివ్యసుందరాకృతి ప్రకాశుఁడై
ఘనబుధేంద్ర వర్ణ్యబుద్ధికౌశలం బెసంగఁగం
గన దనూనసత్కీర్తి కాముఁడయ్యెఁ గాముఁడై॥ 42

ఆ॥ కావ్యపంచకంబుఁ గ్రమముగ నైషధం బల్ల నాటకాదులభ్యసించి
మంత్రగణిత శాస్త్రమహితవేత్తృతనందె నధ్యయనము వేదమైన
వెనుక॥

ఆ॥ ధర్మశాస్త్రమందు మర్మమ్ములనెఱింగికర్మనిరతిధర్మపరుఁడౌచు
నర్మసహితవాగ్వినిర్మలుఁడైయొప్పె శర్మమెసఁగఁగామశర్మతాను॥

ఆ॥ ప్రాకటముగఁ గాంచె లౌకికజ్ఞానంబు వ్రాతయందు లెక్కసేఁతయందు
సాటిలేమి, నూర్జనులు తనను జేరఁ దగవు సెప్పఁజాలు తగవరియన॥

తే॥ యోగులుబుధులైనను ఘనోద్యోగులైన
రాజులైనను ఘనకవిరాజులైన
స్వాములైనను బహుళభూస్వాములైనఁ
గామశాస్త్రివివంద్యునిఁగాఁ దలఁపరె?॥ 46

తే॥ కాముఁడయ్యును బేర, నిష్కాముఁడయ్యె
భోగియయ్యును, జూడవిరాగియయ్యె
నుర్విప్రస్తుతుఁడయ్యు, నిర్గర్వియయ్యె
బుధుఁడెయయ్యు నారాధిత బుధుఁడునయ్యె॥ 47

మ॥ ధనధాన్యంబులు వృద్ధియయ్యెఁ బహుసంతానం బనూనంబుగాఁ
గనుసంపత్తులతోడ నాడఁ దులఁదూఁగంజాలి సత్సంతతిం
గనియొప్పెన్ముదమార నెమ్మది నెసంగం గల్గెలింగాంబికా
తనయాకాముఁడు కామనాముఁ డసమస్తారామాభి రాముండిలన్॥

క॥ ఆతని సతి ప్రభలాన్వయ పూతశ్రీ వేంకటార్య పుత్రీమణి భూ
మాత, మహాత్మతస్త్రీ ఖ్యాతాయుతచరితమహిత, హతపాతకయుతా

క॥ అంబయనెనపేరున సుబ్బాంబ, సుగుణమణికదంబ, భర్తృపదాబ్జా
లంబ, కరుణావలంబ; రమాంబాడంబర కృతవ్రతారంభయునై॥

క॥ అతన్వి సత్కుల సంజాత, జ్ఞాతాఢ్యచరిత, సత్సుతమణి సం
ఘాత, స్వీతాఘ, సువిఖ్యాతసుకృతతతి సమేత యనఁ బ్రీతన్

క॥ ఈదంపతు లుభయులుఁ గడుమోదంబున శ్రీదుఁగొల్చి మోహా
పేతన్
బీదలసాదులఁ బ్రోచెడి సాదరమతులై యెసంగఁజాలిరి జగతిన్॥

## — ఉత్తమ ప్రసూతి —

క॥ అలసుబ్బాంబాకామాఖ్యుల కిలజన్మించి రసమ కులదీపకపు
త్రులు ముప్వురునిరువురు తనయలు, సలలిత రూపిణులు
బ్రియంబెసలారన్॥ 53

శా॥ ఆనందంబున బారసాలలను జేయం దత్క్రమంబెన్న ల
క్ష్మీనారాయణశాస్త్రి మంగమయు లక్ష్మీసుందరాకార, యా
పైనన్నిల్చిన ధీవరుండగు కడు సుబ్రహ్మణ్య సంజ్ఞుండు గా
నైనన్నిమ్మటఁ బూరుషోత్తమ సమాఖ్యాసుండు జన్మించెదాన్॥
మ॥ రుధిరోద్గారి సమాహ్వయాబ్దమునఁ దీర్థుల్ శంకరాచార్య స
* ద్బుధ రామానుజు లుద్భవించుట, జయంతుల్నేఁటికింజేయ నా
తిథి, వైశాఖపు శుక్ల పంచమిని సీతిన్బ్యాఖ్య బోధింపఁగా
నుదయించెం బురుషోత్తముండు మహోదండుండంగలగ్నంబునన్॥
ఉ॥ శ్రీమహిళాసమాన సరసీరుహ సుందరలోచనద్యుతుల్
భూమినెసంగ బాలుఁడు నభోమణితో జనియించె, సుబ్బమాం
బామృతగర్భశుక్తి మహితాంచితముక్తికమై, సురక్తిమైన్
రాముని యట్లు దుష్కృతి విరాముని యట్లభిరాముఁడై తగన్॥ 56

క॥ పురిటింటికి నూతనకళ యరుదెంచెను వేయిపుష్పాలరుక్మిణులఁ గుపజపించు రుచిని, మించెన్నించును, సురుచిర శిశుసౌష్ఠవంబు సుబ్బమదృష్టిన్

తే॥ బొడ్డుఁగోసిరి ప్రాకృతం బొడ్డువిడక
రొడ్డఁబ్రాగ్భవ వాసనలడ్డముండఁ
'గావుకా'వని యఱవ స్వభావసిద్ధ
మద్దికాపెద్దయంచును బుద్ధిఁదెలియ॥ 58

క॥ నాళచ్ఛేదనమటు గా
న్వేళ మసుస్నాతుఁడయ్యె, స్నాతకుఁడిఁక నై
నాళీకాసన సమకవి।
పాళిస్తుత హేళిఁ యూచు నరిలఁ జేయన్॥ 59

తే॥ ఎనఁగు మాలిన్యముడుపంగ రసము మొసవఁ
జేసి రదియాడ నవరస సిద్ధిఁగూర్ప
నేర్పడెనో యేమొ నానయ్యె నెంచిచూడ
రసమదేటికిఁ గూర్చు నీరసము కాక॥ 60

* 'క॥ రవిబుధులు లగ్నమందుం। గవికేతులు వాక్కునందుఁ గమలారి తుజాల్
[illegible]దవిలిరి మూడిట, నాటిట। రవిజుండేడిటను గురుఁడు రాహువు పుదచ్చెన్॥'

క॥ అనిజనకుఁడు తనమనమున ।
ననుకొనుచు జ్ఞాతకంబు నరయఁదొడంగం
గన నయ్యెను యోగంబులు ।
ఘనకీర్తి సమార్జనైక గణనీయములై॥ 61

—♦ జాతకఫలములు ♦—

క॥ 'సవితరి తనుసంస్థే శై ।
శవే'యనిరివ్యాధియుక్త జన్మండవు నం
చవుఁగాకిఁకఁ గవివాక్స్థితి ।
కవివాచస్పతిని జేయుఁగాయని తలఁచెన్॥ 62

తే॥ మిత్రుఁడుదయపారుఁడు సధిమిత్రులతోట
యింద్రవంద్య త్రిషష్ఠప కేంద్రగతి యు
సితముఖస్థితి హితగృహాసితవసతియు
నాయువిచ్చెడినని కాంచె నాబుధుండు॥ 63

శా॥ బాలారిష్టములేవి లేవు, మఱిసంభావింప నీతండె వం
శాలంకారుఁడు వంశవృద్ధికరుఁడౌ జాడ న్సుతస్థానపుం
డాలగ్నంబున నుచ్చఁగాంచె, శుభవీక్ష్యత్వంబు సంయోగమున్
లీలన్వాక్పతి పుత్రకారకుఁడు పొందెన్గేంద్రరాశిస్థితిన్॥ 64

సీ॥ సూక్ష్మబుద్ధి యశంబు సుఖమందఁజేసెడి
ఘన 'బుధాదిత్య' యోగంబెసంగుఁ
బండితేశు నరుగ్ణుఁబ్రఖ్యాతునొనరించు
'పర్వత' యోగంబు ప్రబలునొకటఁ
బ్రభుననామయుఁజేసి వరసౌఖ్యమందించు
'నధిలాభ' యోగంబు నలరుఁబెచ్చు
నీతిజ్ఞునింగార్యనిపుణు, జ్ఞానినొనర్చు
'నుత్తమ' యోగంబు నొప్పునింకఁ

తే॥ 'చంద్రమంగళ' యోగంబు, చకటని 'సుఖ
యోగమొప్పెడి నిర్మల భాగధేయ
వంశదీపకుఁడౌట నిస్సంశయంబు
యనెడునమ్మిక సంపత్తులరయుకొలఁది॥ 65

ఆ॥ రవికిషష్ఠమందు రవిజుం డెసంగుటఁ
బాచకుండయి యన్నపానవస్త్ర
భూషణాప్తి బహుళభూలాభ సౌఖ్యము
సైన్యశక్తులిచ్చి తనరఁజేయు॥ 66

సీ॥ మతిపారుఁ డుచ్చ వాక్పతివీక్షితుండౌటఁ
దావాక్కుశలమేధావియౌను
ధనసుఖస్వస్థితి స్వశాస్త్రసంగీత
కావ్యనాటకవేత్త గాఁగలిగెడి
శిక్షకూడసటనునిఁ జేకుటఁదత్పతి
నీచభాషా చాతురీచణుఁడగు
జితుమేంపుఁ డింగితజ్ఞతఁ బ్రియభాషణ
నాట్యజ్ఞత నొసంగు నగుమొగంబు॥
తే॥ కన్యనున్నట్టి శని చిత్రకారుఁజేయుఁ
కులఁ గలాంగిరుఁ డీవి మిత్రులనుగూర్చు
భాగభానుండు సత్కీర్తి సంతరింప
భూజుఁడు నృగుండు దుస్సహతేజుఁజేయు॥ 67

తే॥ కంజబాంధవ సౌమ్యలగ్నస్థితియును
బంగుషష్ఠస్థితియు దైవజ్ఞుఁజేయు
శ్యామగాత్రేక్షితాంగి రస్సప్తమాచ్చ
కేంద్రవర్తిత వేదాంతసాంద్రుఁజేయు॥ 68

తే॥ విక్రమారుఁ డవక్రపరాక్రమంబు
షష్ఠపాపుఁడు శత్రునాశంబుఁగూర్పఁ
దనుబుధుండును ధనసుతస్థిఁ డనుపమాన
కార్యవిజయంబొసంగనోఁ గదయితనికి॥ 69

తే॥ వాహనాధిపచంద్రుండు భాగ్యపతియు
నొగురుని చేత వీక్షితుండైనకతన
రాజపూజ్యత్వ మొప్పఁగా రాజతుల్యుఁ
డగును దద్వీక్షితౌజసంభవుఁ డవుటను॥ 70

తే॥ సప్తమగురుండు శివప్రతిష్ఠ యొనరింపఁ
జేసి జనమనిమించెడు వాసిఁగూర్చు
సితనృపస్థితి స్వార్జితశ్రీ దలిర్ప
స్తుతసమానుల నుత్తమశ్లోకుఁ జేయు॥ 71

తే॥ ఇట్టి తఱుఁగని యోగము లట్టివుచును
నెన్న వన్నియ మిన్నయశా సన్న నున్న
కోటి గల్గుటరుదు జనకోటియందు
నితఁడు దీర్ఘాయువౌనని మతిఁ దలఁచియు॥ 72

ఉ॥ అష్టమరాహు నప్పటిమహాదశ కీసుఁడుతండ యాట, వి
స్పష్టమిఁ కష్టకష్టములఁ బొల్పడఁజేయు నతండొకండ, యే
నష్టముసంభవించునో కనన్వలెఁగాకని యింత కెప్డు దై
వేష్ట మదెట్టులొప్పు నదెయేర్పడు లెమ్మని నమ్మనెమ్మదిన్॥ 73

తే॥ కనఁగ శైశవేవ్యాధియుక్త యను పల్కు
టుండ రాహువునందు రాహువున రాహు
విదశలోను రాహువుపై సూక్ష్మదశకూడ
నౌట నప్పుడె యొకకొంతవ్యాధియొదవె॥ 74

ఆ॥ చిత్తులోఁగి మాయచేఁజుట్టఁబడినట్లు
నిప్పు నివురుగప్పి యొప్పినట్లు
భానుఁగప్పి మబ్బుప్రబ్బినయట్లొప్పి
బాలకుండు పిదపఁగోలుకోఁగ॥ 75

తే॥ తిరుమలను మ్రొక్కుఁజెల్లించి మఱి జనకుఁడు
దా యథాగతి భక్తివిష్ఠాయుతుఁడయి
నిత్యనైమిత్తికమ్ముల నెఱపికొనుచు
నెట్టుచుండెను గాలం బదెట్టులన్న॥ 76

సీ॥ ప్రతిదినంబునను ప్రభాతకాలమునందు
మేల్కాంచి యీశుని మేలుకొలుపు
సంతతఁగాల్యకరణీయముల నిర్వర్తించి
స్నానంబొనర్చు నుషస్సునందు

సర్ఘ్యప్రదాన సంధ్యావందనానంత
రము జపపారాయణము లొనర్చి
ఔపాసనము బ్రహ్మయజ్ఞంబుఁ గావించి
మాధ్యాహ్నికం బంత మరలఁదీర్చి॥

తే॥ సలుపమొదలిడు దేవతార్చనము నంతఁ
దన్నివేదిత సత్ప్రసాదము భుజించి
తాళపత్త్రాల వేదాగ్రంథములిఖించి
తా నిశాముఖమంద వందనమొనర్చు॥ 77

తే॥ ఇట్టి నిత్యైకవారాశ నైకదీక్ష
జన్మసోమవార వ్రతాశ్రయ మటిండఁ
గార్తికమ్ముల సాగు నక్తవ్రతమ్ము
గాక శ్రావణములను నక్తములభుక్తి॥ 78

తే॥ జరుగ నాతఁడు ప్రతియేట శ్రావణమునఁ
దాసహస్రలింగార్చనాస్థనువహించుఁ
బ్రాజ్ఞవిహిత దేవీనవరాత్రపూజఁ
గలశమున్నిల్పి కావింపఁ గడఁగుచుండు॥ 79

తే॥ సర్వకాలము కృష్ణలో స్నానమొనరఁ
బర్వదినములయందును వ్రతదినముల
ననతిదూరస్థ హంసదీవ్యబ్ధి సంగ
మస్థలంబునఁ గామార్యమజ్జనంబు॥ 80

తే॥ ఇట్టులేగంగ నొకరేయి హితులుసేరి
నప్పుడు ప్రసంగవశమునఁ జెప్పెనతఁడు
పెక్కువిషయంబులం దిట్టు స్వీయమైన
భావిఫలమును వార లబ్రంబుసంద॥ 81

## భావిగతులు

చ॥ జగమొక పెద్దయంత్రమగుఁ జక్రసదృశము లెల్లఋతుమూల్
సగుణుఁడునా ననేకవిధసంజ్ఞలతో భగవంతుఁడంచు నెం

చెఁగఁబడు నిర్గుణాత్మకమగు చక్రమె తానసుతత్త్వ[illegible]
దగు, జనకర్మపుం బ్రకృతితత్త్వ మదిట్టుల వేద్యమయ్యెడున్॥

క॥ రిక్కలుతిరిగెడు లెక్కయె
చక్కనిగణితాగమంబు శాస్త్రములందున్
మిక్కిలి యుపయోగమగును
పెక్కురు తెలియంగ భావివిషయములదానన్॥ 83

క॥ కొందఱు తెలిసియుఁ దెలియని
చందంబునవాఁగి జ్యోతిషంబును సిరసిం
పందొడఁగెద. రదియజ్ఞత
నిందింపఁగఁదగునె? శాస్త్రనియతి నెట్లైనన్॥ 84

తే॥ అందు నిదిపేరనే గణితాగమంబు
నొకటిరెండు మూఁడొఁగద ప్రకటముగను
లెక్కసేఁతను దప్పులుపెక్కులుండుఁ
గాక గణితమెతప్పునఁగాఁ దగునొకో॥ 85

తే॥ అరయ జగమెల్లను బరస్పరానుబంధ
కలితమాటఁ గొనవలె సాంఘాతికముల
నంత మతభేదములను సమన్వయించి
కొనఁగవలయును గోచారమును గనవలె॥ 86

తే॥ ఋణముపొరపడకుండఁ జక్రిమునువేసి
సూక్ష్మదృష్టిని యోగము లూహించికొనుచు
గ్రహబలాబలములఁబట్టి కాంచిఫలము
తెలివియుపయోగపఱచినఁ దేలునిజము॥ 87

తే॥ కాని నక్తందివాభము లక్ష్టసుఖము
లందఱకుఁ గల్గునట్టుల నగపడుఁగద
యందుఁ గష్టముమాత్రమె ప్లగునొ తెలియ
నదియె మనమున వేధించు ననవరతము॥ 88

ఆ॥ ఆత్మలోఁగొన్న స్వానుభవ మందెఱఁగింపఁగఁ జాలువాఁడ నే[illegible]
పిలుత్ము. నేఁడు జన్మతిథి యేఁబదిరెండవ యేడుసొచ్చె నా[illegible]

జాతకమందు వైశ్యకులజాతునిపోషణ మీనవయస్సునన్
జ్యోతిష మభ్యసించునపుడుంబునఁ గాంచితి నాఁటినుండియున్॥

క॥ అది యిప్పటికున్నట్టుల విదితంబయి యున్నియేండ్లు పీడించెడి న
న్నిదియెట్లగునో యనియే తుదకిప్పు ననేకగతులఁ దోఁచెను మదికిన్

క॥ ఏనేండ్లశనియుఁ దోడై
తానోసఁగెడిఁ బ్రాణభయము స్థానచలన మిం
కౌను ధనక్షయ మెంతయుఁ
బైనం గార్తికఫలంబు పంథాఖ్యంబౌ॥ 91

క॥ నాసంగతియిట్లుండఁగ
నాసుతులవిజాతకాలు సప్తాధిక సం
త్రాసంబులుఁ దనుతాపపు
మాసఫలాలుగ నెసంగుమాదిరులొప్పన్ 92

ఆ॥ ఏడుగుడులటున్న రెూన్నికలోనిది రుద్రఖండమందు పవ్రిఖండ
మై రహాట్టుఁగొలిపెడిఁ బేననేత్రాక్షి ప్రళయకాలగతులు
పరఁగునని॥ 93

—♦ ఉప్పెన. ♦—

క॥ ఈప్రస్తావం బాశ్వయుజ ప్రాంతమునం దొకప్పుజరిగె నటుండన్
క్షిప్రంబుగనదియేగెను విప్రోత్తముఁ డన్నకీతి విలయమెపొసఁగెన్॥

క॥ పదునెన్మిదివందల యఱు
వదినాలు నవంబరొకటనదిన ముదయమే
మొదలిడి తుపనగఁ గ్రమముగ
ముదిరెను మెఱపులునుఱుములు ముప్పుఘటిల్లన్॥ 95

సీ॥ అలనాఁటి యుదయమే యంకురించిన వాయు
వేగంబు క్రమముగా వృద్ధియయ్యె
మధ్యాహ్నమున కెల్ల రధ్యానుకృతి నొందెఁ
బ్రొద్దుగ్రుంకెడి వేళ కుద్దిలేని
కూలంకషప్రజ్ఞ కూలంకషతరంగ
జాలంబుపైఁ జూపెఁజాలరవళి

నుద్భిజ్జముల సమూలోద్భేదన మొనర్చి
యిండ్ల పెంకులు లేవ నెగురఁగొట్టె॥
తే॥ దిక్కులం దుద్భటాస్ఫటి పిక్కటిల్లెఁ
బక్కు లర్బుదములు రాలె దిక్కులేక
బక్కమేనిమెకమ్ములు స్రుక్కెఁ గొట్లు
నిక్కడక్కడ జనములు సక్కిరిండ్ల॥ 96

సీ॥ పగలెల్ల దిగులొంది మొగిలుచాటున డాఁగి
హరిమున్నె నార్భటికడలి కడలి
దిననాథుఁ డిటుకాఁగ దిఙ్నాథులేమైరొ
బ్రహ్మాండభాండంబు బ్రద్దలయ్యె
గబ్బిజీమూతముల్ ప్రబ్బి యుబ్బె జగంబు
గాఢాంధకారమ్ము గ్రమ్ముకొనియె
ఝంఝానిలము రేఁగ జలధిమధ్యంబందె
బడబానలుండప్డు బడలివిడియఁ॥
తే॥ దటిదటన పటుఘటుకుఁడై తళతళమనెఁ
బిడుగుజడి వడుకైవడిఁ బెళపెళమనెఁ
ప్రళయ మనెవచ్చెనని జనుల్ కళవళపడఁ
జప్పున న్వచ్చె నుప్పెన నిప్పులుడుక॥ 97

మ॥ బధిరీభూతదిగంతరాళ మఖిలబ్రహ్మాండనిర్భర్త్సన
ప్రధనోద్ఘాతసముచ్ఛ్రయోచ్చల దదభ్రభ్రాంత రోద్ధూత బ
భ్రుధునీసంగమ రంగజాత తతబభ్రుజ్వాలమై యొప్పె నం
బుధిమధ్యోద్గమ తుంగభంగచలనంబుం దెల్పుశబ్దంబుతోన్॥ 98

సీ॥ కల్లోలమొదవించు కల్లోలమొక్కండు
నింగినంటెడిభంగిఁ బొంగిపొరలి
సంరంభమున రూఢసంరావతతితోడ
సంరోధములమించి సంహరించి
పటుధార్ఢ్యపటలాఢ్య తటనికేతనకుడ్య
శైలజాలంబులఁ గూలఁద్రోసి

భ్రాంతచిత్త ప్రాంతజంతుసంతానంబు
 లొక్కుమ్మడిని బెక్కు లుక్కడించి॥
తే॥ పంటగింటుల నెల్లను మంటఁగలిపి
 రోదసీకుహరమ్మును రోదనముల
 నింపి కంపింపఁజేసె, వర్ణింపఁదరమె
 సాగరుం డొనరించినయాగడంబు? 99

క॥ ఈసందడి నేమైరో యాసీతారామపుత్రరామరులుఁ దదా
 వాసమ్ములుఁ బశువులు మన వాసింగనుకామబుధుఁడు
 భార్యయుబిడ్డల్ 100

ఉ॥ దానికిసంచదీవి కడుదాపునసే పరఁగంగనాటఁ గృ
 ష్ణానది తత్సరిత్పతిని సంగమమైనప్రదేశమాచుఁ దత్
 స్థానముసంబె పుట్టు సలఘాటికి నాహుతి ముందిదయ్యెఁ బా
 రీనములట్లు తేలఁగఁ దుర్విటి న్బహుజంతుకళేబరంబులున్॥ 101

సీ॥ కానితపోధనుం డైనకామయయయ్యె
 దక్షిణామూర్తి సంరక్షితుండు
 నూరవారలయిండు లున్నతమ్ముగనున్న
 ముందుజాగ్రత్తచే సంజెమన్న
 నెక్కఁగల్గినవార లెక్క భోషాణాన
 నింతలోనసె నీరమింటనిండె
 శిశుపురుషోత్తముం జేతఁగోం చెక్కఁగాఁ
 జాలకుంటను మాత జాగొనర్చె॥
తే॥ నిట్టులుండఁ జేతఁగలట్టి యాబుడుతఁడు
 కనులుమూసియె దిగ్భ్రమింగఁగడఁగె జలము
 ఘనఘటోదరసంభూత కరణమనఁగ
 ఘనఘటోదరసంభూత కరణమయ్యె॥ 102

ఆ॥ బానకడుపువానిఁ బాపనిఁగొని కేల నెక్కలేనిదాని నీడ్చిపైకి
 జ్యేష్ఠసుతుఁడువలికె, నికనైన విడువీని, మనికిమనదె యేమొ!
 మనఁ డితఁడని॥ 103

మిత్రుఁ డసహాయశూరుఁడు మెల్లమెల్ల
నినడఁ దొంగిచూచుచువచ్చె ఘనులరుగఁగ॥ 111

తే॥ అలమహాబలుఁడాడికి నలయుభయము!
యాపదన్నారు మిత్రుఁడం డ్రినడిబిడెము!
పద్మినీకాంత యాచాయ బడలునెడలా!
బిక్కమోమిడినటులె సవిత్రుఁడు వెడలె॥ 112

సీ॥ ‘తపనుండవై వేల్చు ధాటియేమయ్యెను?
బ్రభునుండవని మించు పటిమమేది?
యుష్ణరశ్మినటంచు నుప్పొంగుచుండు వే
పాతిపోవఁగనె సప్తాశ్వగరిమ?
యమరోత్తముఁడ నవి సర్కుఁడ నొందువు
నీజగచ్చక్షుత యేజగతిని?
బూషణుండవటంచు భూషణం బందెదు
మార్తాండబిరుదంబు మాయఁదరణి!

తే॥ యేమిలాభము నీవైనభామునిధివి?
ఆపదలయందు మోమోడు దంశుమాలి!
లోకబాంధవబిరుద మేలోకదయ్యా!’
యంచుఁ దన్నెంతు రనుసంశయంబొ యేమొ! 113

తే॥ కానియెట్టులైన సూరుఁడొకతన నతని
కెప్పుడొకరీతి సంచార మేర్పడుటను
దప్పదం చెట్టకేలకుఁ జెప్పిత్లి
ప్రళయకర్మమ్ము లోకపరిఁ బాటఁజూడ॥ 114

సీ॥ ప్రద్యోతనుండౌచుఁ బ్రభనెసంగంజేయ
నిండులా? వాకిళ్లెందులేవు
ధృతసహస్రాంశుఁడై దెసల శోభిలఁజేయఁ
జెట్లులా? చేమలేచెంపలేవు
తా వివస్వంతుఁడై దర్శనీయతఁ సూర్పఁ
బూవులా? కాయలా యేవిలేవు

వరదివాకరుఁడౌచు వ్యాపృతులను జేయ
జనములా? వనములా? కనఁగ లేవు॥
తే॥ దిక్కులెక్కడ జలమయంబెక్కువగను
నెల్లెతెల్లములైనీటఁ దేలియాడె
సర్వవిధజంతుసందోహశవచయములుఁ
జెట్లుకాయలు పిందెలుం గోట్లుకొలఁది॥ 115

సీ॥ వటువాత స్నాతులై ప్రాతరర్ఘ్యంబిచ్చు
ద్విజవరులెల్లరు దివికరిగిరి
అంగడుల్తెఱచుచు వ్యాపారమొనరించు
వైశ్యులెల్లరు నశింపంగనైరి
బండినాఁగలిసాగ వ్యవసాయమొనరించు
శూద్రులెల్లరు దీర్ఘనిద్రులైరి
ప్రాఁచి శుద్ధినొనర్చి వంటపనులూనుచు
తత్సతు లెక్కడదక్కరైరి॥
తే॥ మేఁతకేగెడు పసులెన్నొ మిత్తినొందెఁ
జక్కఁగాఁగూయుపక్కులు సమసిపోయెఁ
దనను బిలుచువారలుగాని తలఁచువార
లేరు లేరయ్యెఁ దనయధికారమేడ? 116

క॥ ఇటులనుకొని కటకటపడి
చటులతవిడి యటుదినపతి జలమధ్యమునం
దుటజముమెయి నటియించెడి
యటమటవడు కామయాదు లటఁదగు కుటమున॥ 117

తే॥ తానుగనవచ్చె నన నయ్యెఁ దస్కరప్ర
విష్టగృహముఁ దత్పతియట్లు విష్టపంబు
సింధుదృష్ట్యపతిత ధర్మసంధనిలయ
మల్లప్రళయసమయ జగద్భ్రమట్లు॥ 118

తే॥ శ్రీకరుండైన యల్లదివాకరుండు
వచ్చునెప్పు డెప్పుడటంచువారు వేచి

యున్నవారాటఁ జూడనే కన్నతండ్రిఁ
బ్రాణములు లేచివచ్చిన పగిదినొప్పె॥ 119

తే॥ ముప్పుదప్పింపఁబడి యెటో తెప్పిఱిల్లి
నారతోటను వారి కానాఁటి వెలుఁగు
విరితరుచిఁగొల్పె మనములఁ జింతలుడిపె
సవితృశాంతత సూచింప శాంతికొంత॥ 120

ఆ॥ కాన వారుమెల్లగాఁ గప్పుఁదప్పించి
కొనుచుఁ దొలుతఁగొలుచుకొనిరి హరిని
నిత్యనిష్ఠ నెఱపనేరమింగామయ
పొంద నంచె మదిని గొంద లంబు॥ 121

సీ॥ అపుడు వారెటుచూడ నంభోధిజృంభణం
బొనరించినట్టి నాశనమె కనిరి
తమయిండులాకూలెఁ దమవారియిండులుం
దమదేశమేయెల్ల సమసిపోయెఁ
దమువందపసులునుం దమవారివింకన్ని
తమపాంతములవెన్నొ తెమ్ములయ్యెఁ
దమధనంబంతయుఁ దమవారిదెంతయో
తమయూళ్లవారిది త్రవ్వఁబడియెఁ॥

తే॥ దమహితు ల్సుట్టలందఱుం దపులఁబడిరి
పొలములను బైరులన్నియు సొలసిపోయెఁ
బారరహితమ్ము నీర మేపార దెసల
లెక్కమీఱుచుఁ దేలెఁ గళేబరములు॥ 122

తే॥ ఇట్టియిక్కట్టుఁ గన నెట్టిగట్టిమనసు
కలఁగుదిట్టులకైనను గడుపుపగులు
టబ్బురంబౌకో! చెదరదే నిబ్బరంబు?
నంతసంప త్తదింతలో సుంతలేమి॥ 123

తే॥ బ్రదుక బలసాకు నేఱకొంచుఁ దినెదమని
మొదలఁ బ్రాణమ్ములైనను దుదకునిల్పి

కొన్నఁ జాలునటం చనుకొందు రిపుడొ
హింసపడకన్న మెఱుఁగౌను వృత్తియెయంద్రు। 124

తే॥ ప్రకృతిలక్షణమిట్టులాపదలఁ బొదలుఁ
గాని ప్రాకృతుఁడే? మసకామయార్యుఁ
డెప్పుడేవనుభావ్యమా నప్పుడదగు
ననుమనోరూఢి గంభీరతను వహించె॥ 125

తే॥ వట్టియప్పు డీఁకెన్నైనఁ బలుకవచ్చు
'ధర్మపన్నము' లిటు కష్టతరుణమందు
హృదయపటిమంబు చెదరని కుదిరి కమరు
టరుదుకద్ద తద్విరాగిత యద్భుతంబు॥ 126

తే॥ సరి తరింపఁగ మార్గమిం కరయవలయు
ను 'గత జలసేతుబంధనము' గద వెనుక
దాని కొఱకింకఁ జింతింపఁగానటనుచుఁ
జుట్టుపరికించి యొక్కింత చూడనంత॥ 127

ఆ॥ క్రోశదూరమందుఁ గూలం బటనుకూల
మైనదున్నయట్టు కానుపించి
యాడఁ బిడ్డలట్టు లగపడ నొకఁడిద్ద
అపుడు వెడలఁదలఁచి రటకుఁదాము॥ 128

ఆ॥ చూచికొనఁగ నందుఁజోద్యంబిఁ కేమందు?
వలువలైన లేవు పలువురికిని
గానలేనివారు మానరక్షణ కున్న
వారికొంగు లుడిపి తారిడికొని॥ 129

ఆ॥ బారెడాఁడువారు మూరెడుమగవారు పీలికలనెకట్టి బైలువెడల
నిలువుదోఁపునాఁడు జలనిధికర్పించు సంగరహితుల క్లైసంగి
రపుడు॥ 130

క॥ తొందరలో వారందఱు ముందసువులునిలువఁబెద్దభోషాణమునన్
సందడినెక్కిరి కావున నందిత్తడి వేవొ పెద్దవగుగుండిగలై॥ 131

తే॥ విలువగలచాలపుత్తడి వెండినగలు
మొదలుగాఁగలచిన్నవి మూడుపోయె
నింకఁగావడిపెట్టె లేవెన్నియెన్నొ
పోవ నివియేలయనితోఁచి పోఁదలంప॥ 132

తే॥ తాళపత్త్రాల వ్రాసినవస్తవేజు
లెన్నొపోయినఁ జింతింపఁడింతయేని
యేనుతరములఁగూర్చిన వెన్నొగ్రంథ
జాలములుపోయెనని కామశాస్త్రికుందు॥ 133

తే॥ పాత్రమేదైనఁ గొనిపోవుమాత్రమైన
నాత్రపడిపల్కఁగాఁబోవ దాతనిస్థితి
పాత్రమాయము చేతిలోపలిది మనిస
నాత్రిలోకాధిపత్యం బడంచునెంచు॥ 134

## భూతదయ.

తే॥ అంత గమనోన్ముఖుల్గాఁగ నడుగునుండె
మెట్టుచేరంగఁజాలెనో పెట్టెక్రింద
లేఁగసవులేక యొకరెండులేఁగలప్పు
డఱచె 'నంబా' యటంచు నివ్వెఱపడంగ॥ 135

ఆ॥ పాలకేడ్చునట్టి పసిపాపలట్టులఁ గాల్ల వ్రేలఁబడెడిలీల నవ్వి
'బాబు! మమ్ము విడువఁ బాడిగా' దనుచున్న వాయటంచుఁదోఁచె
నఱపువినఁగ॥ 136

క॥ ఎవనికిఁబుట్టిన బిడ్డఁడవు? వెక్కివెక్కుచునిటేడ్తు? పొమ్మనలేమిన్
జవదాఁటి ముందడుగిడఁగను వెనుక కేగుటకును మదినూల్కొన
దాటన్॥ 137

తే॥ 'కాలిసంకెల' లనుకోఁగ నేల బ్రదికె?
వందతోఁబాటివియును జావంగరాదె?
ఛీ! యటనరాదు మనవంటివే యవియును
గర్మశేషములగల' దని కామబుధుఁడు॥ 138

తే॥ గుండెగలటన్న విడఁదలకొంటి మెట్టు
లావు పెయ్యల విడుతుము? జీవులయ్యెఁ
జూడకున్ననుసరె, యిఁకఁ జూడనెందుఁ
బ్రాణమాఁదీపి సర్వసమానమకద॥ 139

తే॥ దక్షిణాస్యుఁడు మనలఁ బరీక్ష సేయ
నోర్పుఁ గననెంచి యొనరించెనో యిదిట్లు
దిక్కులేకుండ వీనినిదించి చనిన
దిక్కుమనకాతఁ డెట్లుపొనోక్కొ! చెప్పుమ॥ 140

ఆ॥ 'చేసికొన్నవారు చేసికొన్నంతయు
ననుభవింతు' రనుచు వినమె యెందు ?
మనము బరువటనక కొనిపోవఁగా వీని
నిహము పరమటంచు నెంచి యంత॥ 141

ఆ॥ వంగి బిఱ్ఱబిగిసి వలిఁగొన్న లేఁగల
మెల్లమెల్ల లాఁగి మేనులందు
నిమిరి జాలిఁగొంచు నిలువెల్ల నీరుగాఁ
గనులు తుడిచికొనుచుఁ గొనభుజముల॥ 142

తే॥ తల్లి పోవుచుఁ బిల్లము త్తవ్వ మెడకుఁ
జుట్టిపోయెడికైవడిఁ జుట్టుకొఁగఁ
'దనకు దూరంగ లేదుక్రింత మెడకొక్క
డో' లటన్నట్లు వారలు బైలు వెడలి॥ 143

క॥ సుడిగుండములను ద్రోవను
బడకుండఁగ నూఁతకోలఁ బట్టుకొనంగాఁ
దడకనులాఁగుచుఁ గఱ్ఱలు
కొడుకుందండ్రియును ద్రోవకును నడపంగాన్॥ 144

సీ॥ సర్వస్వమల్ల విశ్వామిత్రునకొసంగి
వారణాసికిఁ బోవువారియట్లు
[illegible]దేశంబుఁ బుష్కరునకునోడి
పరదేశగాములౌ వారియట్లు

రాజ్యంబునెల్ల భరతునకర్పణసేసి
వనసీమకేగిన వారియట్లు
కలరాష్ట్రమెల్లను గౌరవేయులకిచ్చి
తా రడవికిఁ జనువారియట్లు॥
తే॥ తమధనంబెల్ల యల్లరత్నాకరునకె
యప్పగించి కష్టములపాలై తిరుగఁగఁ
గర్మసాక్షియె సాక్షిగా ధర్మమార్గ
వర్తులై పోవుచున్నారుకీర్తిధనులు॥ 145

ఆ॥ నిలువుదోఁ పలతిరుమలలో నొసంగి, ని
స్సంగులైనబాటసారులట్లు
వెనుకచింతవీడి వీతాఘులై వారు
పోవుచుండి రేదొ త్రోవఁబట్టి॥ 146

క॥ ఈశుని దృఢమతినిల్పి మ
హాశయులై మార్గమరసి యరుగుచునుండన్॥
స్త్రీశవములపై నగపడె
నాశంబుట్టింపఁజాలు నాభరణంబుల్॥ 147

సీ॥ అక్కడక్కడఁగొంద టెక్కడెక్కడివారొ
దిక్కులేనిశవాల ప్రక్కఁజేరి
దద్దజిల్లెడియట్టు పెద్దపెట్టన నేడ్చి
తదనాపేక్ష నబద్ధమాంక్షి
యలవారు తమకాప్తులొ బంధుగులటంచుఁ
గలనగలన్నియు నొలిచికోఁగఁ
గామయూడులుగాంచి 'రామరామ'యటంచుఁ
దామెటేఁగియును నిష్కాముటౌట॥
తే॥ వానిదెసఁ గాననైనను గానకుండ
నేరలఁగని మోహమందని తేజశాలి విన్న వి
వజుల, ఓమ్మువంటియు మొలబంతిగొంగగా లం
నీఁదులాడుచు దరిఁజేర నేగుచుండ॥

## దేవసహాయము.

సీ॥ ఏమూలనుండియో యింటికప్పొక్కండు
దట్టమైనది యొక్కచుట్టుగుడిసె
నీరమ్ముపైఁదేలి వారున్నవైపున
కే రాఁగడంగిన వారిలోన
సుబ్బమాంబికపల్కెఁ 'జూడరేయెవ్వరైన
నాముదంబందున్నదేమొ' యనుచు
విన్నవారలునవ్వి 'పిచ్చిదాన! రవాణ
చేయునెవ్వఁడుబిడ్డకై' యటనిరి॥

తే॥ కాని కామేశ్వరుఁడుమాత్రి మామెయినన
'కేమొహూతము సందేహమేల?' యనుచు
నత్తఱికిఁబోవఁ గనఁబడె దుత్తయొండు
తా ముదంబంద నందుండె నాముదంబు॥ 149

తే॥ చిత్రమేమందు? నందుండెఁ జెకుముకియును
సుబ్బమాంబయె యుబ్బితబ్బిబ్బులయ్యె
మున్ను పరిహాస మొనరించియున్నవార
లక్కజమ్మున వ్రేల్వెట్టముక్కుపైన॥ 150

మ॥ భగవన్మాయ యిఁకేమి చెప్పుదుము? సంభావ్యంబహా! యేమి? త
జ్జగదాధారుఁడు నిశ్చలాత్మకమనస్సంజాత తత్త్వను
న్సగృహీతిం దనయంత నమ్మ నిజభక్తవ్రాత కామ్యాఖిలా
ర్థగవేషంబొనరించి కూర్చుఁగద నిత్యంబప్రయత్నంబుగాన్॥

శా॥ 'నారుంబోసినదైవమేయొసఁగెడి న్నాసీర' మంచందు రా
తీరే యీడనుస్పష్టమయ్యెఁగద సాదృశ్యమ్ము వేజేల? త
న్నీరంధ్రింబుననుండి కాంచె నెటులో! నీరాటమధ్యస్థితున్॥
నోరేలేనటువంటి బాలకునిఁ గన్నులూర్మసియున్నాతనిన్ 152

మ॥ కరుణాపూరుఁడు పక్షివాస్యుఁడు కటాక్షంబుం బ్రసాదించి సా
దరదృష్టింగన నొక్కమాటు విపదుద్ధార్యం బఘచ్ఛేద్యమా

టరుదే? యకట! తత్కంబు వారికలుషాహార్యం బదానట్లు, దు
ష్కరమేముం జెడి నప్పురాత్మునకు సత్కంఠంబులం దీర్పఁగన్?॥

మ॥ వనమధ్యంబున బిడ్డకాముదము సంపాదింప నెవ్వారలెం
చిన సాధ్యంబవునో కటా! యీశ్వరుఁ డుదాసీనుండుగానుండఁదా
ననుకంపామతిఁజూడ లభ్యపడఁగా కామండ్రతైలంబు, కా
దని యెవ్వారలు వక్కఁగాఁగలరు? మాహాత్మ్యంబు జ్ఞేయంబుగాన్

సీ॥ దీర్ఘాయురానంద దేదీప్యమానుఁడౌ
వాఁడుగావున నింక బ్రదుకవలసె
సంతానసౌభాగ్య సంపత్సమేతుఁడౌ
వాఁడుగావున నింక బ్రదుకవలసె
సంపాదితాశాంతసత్కీర్తి ధాముఁడౌ
వాఁడుగావున నింక బ్రదుకవలసె
సత్కర్మకోదోద్భధితోత్కృష్టసేతుఁడౌ
వాఁడు గావున నింక బ్రదుకవలసెఁ॥

తే॥ బెక్కులేటికిఁ? బల్కంగ నొక్కమాట
యిట్టు లిప్పటి కీకృతి పుట్టవలసె
నట్టియప్పుడు దైవసహాయ ముండు
టబ్బురంబొకొ! యజ్ఞాని కప్పుడహహా! 155

క॥ సరెకాని సుబ్బమాంబయు
వరనిజభర్త్రంఘ్రియుగ్మ పంకేరుహాబం
భరగావున నాయమహ్మ
త్సరసిజమందిరుఁడుండి తాఁబలికించెన్॥ 156

ఉ॥ భావిఫలానుభూతి పరిపక్వహృదంబుజ కామయార్యసం
భావితమైయెయుండుటఁ గృపామతి తద్హృదయాంతరాళమం
దేవిధమైనచింతయు నొకింతయులే దనుభూతపూర్వముల్
దావొసఁగండు రామది కతఃపరమెంచఁడు నమ్ముమీశ్వరున్॥ 157

తే॥ తుదకు వారెట్లొ చేరిరి దుత్తఁగొనుచు
జామువాద్దెక్కువేళకుఁ దేమయాలు

మెట్టనేల యొకింతకన్పట్ట నటకు
వచ్చి రితరులుకొందఱు చచ్చిబ్రతికి॥ 158

సీ॥ తాళమందునొ నారికేళద్రుమాననో
మొవ్వనఁ గూర్చుండి ముప్పుఁదప్పి
గట్టుపైనొ లేక పుట్టలోననొ చేరి
నందున నెట్టొ ప్రాణాలుదక్కి
గోడమీఁదనొ యేదొ మేడనీడనొ చేరి
యుప్పెనదెబ్బను దప్పఁగలిగి
నడికప్పులం దెక్కి పడకుంత నీటిపైఁ
గొట్టుకొంచునువచ్చి మెట్టఁబట్టి॥

తే॥ "చచ్చిచెడి చేయువిన్నపం" బన్చోట నన
నన్నిమూలలవారలు నన్ని తెగల
వార లొక్కటఁజేరిరి వారివారి
కష్టనష్టాలవగ పొండొకంద్రువినఁగ॥ 159

తే॥ అపుడు మోహమెఱుంగనినాఁడ లత్యాప్తులైరి
యాత్రికు ల్దోనఁ గలిసినయప్పటివలె
జీవయాత్రలఁ గలిసెడిజీవకోట్లఁ
దివురుస్నేహానుబంధ మీతెఱఁగుదె కద॥ 160

ఆ॥ అటను సుబ్బమాంబ చిటిబిడ్డనుగ్గడె
గడియలోనె లోనికల్మషం బ
గస్త్యముక్తసింధు కలుషితజలమట్లు
పీడవిడనైన జాడఁబోయె॥ 161

ఆ॥ కనులువిచ్చిజననిఁ గనెఁ గనుఁగొం దదే
చిన్మయప్రకృతివిచేష్టయనఁగ
జనకుమించునట్టి జ్ఞానితానౌదునా
సంతసోవ సుంతచింతఁగనమి॥ 162

ఆ॥ అల్లతల్లికెల్ల యాత్రియడంగెను మోదమందిబిడ్డ ముద్దులాడె
లోకమెల్ల నంత నాకెసువికసించి వింతరుచుల నీనువితముదోఁప॥

తే॥ భానుఁ డపుడయ్యెనూత్నప్రభాకరుండు
నవనవారుణవర్ణ సువర్ణనము గనిరొ
వారిచవి వారిపింట యవ్వారిసేసె
జీవనంబప్పు మనుజునకా జీవనముగ॥ 164

మ॥ మనకామార్యుఁడ లూచనించి, కని తన్మాధుర్య మత్యద్భుతం
బునుబొందె న్మనుపెన్నఁ డాడనుజలంబుల్ తూరము న్వీడియుం
డ నెఱుంగండవుఁటన్మరందముగ, గృతస్నానుండు తానై యెన
ర్చె నెనుష్ఠాన మొకింత, యంత సనియె శ్రీకృష్ణనాన్వైష్ణవిన్॥

—♦ నీ శ్లో - లు. ♦—

శా॥ అమ్మా! పావని! జీవనీ! దళితను ర్వ్యవ్రాతసర్వాఘసం
ఘమ్మా! క్రమ్మఱ నేనిటన్మనుఁగు భాగ్యం బుండునో లేదో! తై
కొమ్మాభక్తునియంజలిం గరుణ నోకోమ్మా! సురేడ్యమ్మ! మ
మిమ్మాధుర్యపుఁజూడ్కుల బ్రోవుమకనిమిమ్మా, కృష్ణ! సాహిణ్ణవీ!

శా॥ నిన్నాధారముఁ జూచి కోరుచు భవదుస్సీలత్కృపాసార సం
పన్నత్వంబున వృద్ధిఁబొంది ఫలియింప న్వీయకేదారముల్
విన్నాణంబున సర్వసంపదల శోభిల్లంగ మాయయ్య యా
మున్నీ రేకద లేవఁగొల్చె నిటు మమ్ముంగృష్ణ! సాహిణ్ణవీ! 167

మ॥ జనకుం డప్పడు డాగ్రహించినఁ గటాక్షుంబుం బ్రసాదించుచున్
జననీరత్నము బుజ్జగించుగతి నీతూరంబిటుల్వీడి, నూ
తనమాధుర్యముఁజూపుచు న్నుతులకాధారంబు నీరంబుగాఁ
గను బ్రోలించితి మమ్ముఁబోంట్లఁబ్రదుకంగాఁ గృష్ణ! సాహిణ్ణవీ!॥

మ॥ నరసింహాఖ్యుఁడు తాతతాత తొలుత న్నాదెండ్లఁదావీడి, త్వ
త్కరుణాపాంగ విలోచనాగ్రితను మోక్షప్రాప్త్యపేక్షన్సరి
ద్వరమున్నిద్దరియంగ నేనుతగము ల్వాంఛేఁ బదద్వంబులా
దరముంజూపిన నీవె చేవిడుతె? మాతా! కృష్ణ! సాహిణ్ణవీ!॥

మ॥ మదిఁ జింతింపఁగ నేల? యేయెవరికిం బ్రాప్తింపనో నెప్పు డ 169
య్యదె ప్రారబ్ధవశంబునం గలుగు, మధ్యంబంబె టుల్మార్పనౌఁ?
దుదకున్నిన్నన దోసమయ్యెడిని, భక్త్యున్మేషసంయుక్తిఁ గొ
ల్చెద, నాశీస్సునొసంగుమమ్మ గుణవల్లీ! కృష్ణ! సాహిష్ణవీ॥

చ॥ అని యిటులైకృతాంజలి, పురోభిముఖంబుగఁ ద్రోవఁబట్టి నెం
చిన మదిఁ దోఁచెనిట్లు, చెడిస్నేహితునింటికిఁ జేరవచ్చు, బం
ధుని దరియంగరాదని యథోచితవృత్తినిజాదరంబు నం
దిసహితులం గృతజ్ఞుల విధిజ్ఞులఁ బ్రాజ్ఞులఁ జేరనాపయిన్॥ 171

తే॥ జంపతులు బిడ్డలేవురు శ్వశ్రువప్పు
ఁ జావుదప్పియుఁ గనులొట్టవోవ ననఁగఁ
బ్రాఁతదశవీడఁ గాల్నడ రాతిరికిని
గ్రోశపంచకముననున్న క్రొత్తపేట॥ 172

— ఆశ్వాసాంతము. —

రథబంధము.

క॥ శ్రీవిపులయశోరుచిరోద్గ్రీవవృషోచ్చండవాహు, ధ్యేయామోదా త్త
ద్యావాపృథివీజలమయ దేవున్నానసురేడతీతు స్వీడన్॥ 173
నడిమిని ‘ శ్రీపురుషోత్తమసుతుఁడన్ ’ అని తేలును.

కందగీతగర్భితము.

చ॥ వరసురపూజితా! వినుతభాసురగాథ! కవీంద్రవర్ణ్యసుం
దరధవళాంగ, సుస్థిరముదావహ! విశ్రుతదీనపోష! సా
దర! గరహారి! ఘోరవిసుధాకరపావక రమ్యనేత్ర! కం
జరిపుధరా! యిఁకంగరుణసాఁకెడు భారము కాదె నీదహా! 174

గర్భితపద్యములు,

క॥ సురపూజితా! వినుతభా సురగాథ! కవీంద్రవర్ణ్యసుందరధవళా!
గరహారి ఘోరవిసుధా కరపావకరమ్యనేత్ర! కంజరిపుధరా!

తే॥ వినుతభాసురగాథ! కవీంద్రవర్ణ్య!
స్థిరముదావహా! విశ్రుతదీనపోష!
రవిసుధాకరపావక రమ్యనేత్ర!
కరుణసాఁకెడు భారముకాఁ బెసేద?

♦ కందము ♦

వరకవి నాపెళ్లన్వయ। పురుషోత్తమ
జీవయాత్ర, పుత్త్రికకృతత। ద్గురుచరిత
దక్షిణామూ। ర్తిరచిత
మాశ్వాసమందిదియో
ప్రథమంబౌ॥ 175

# ఉత్తమజీవయాత్ర.



## ద్వితీయాశ్వాసము.

క॥ ఆకర్ణింపుమి భవ్యా! శ్రీకరపద్మాలయా శచీధవసేవ్యా!
ప్రాకటత్రిపురక్రవ్యా! దాకూపారైకకుంభ జార్యస్తవ్యా! 1

ఉ॥ వారలుతోవఁ బూర్వదినవాయుశరాహతిఁ బడ్డవేవో భూ
మీరుహపాళితక్కు జలమ్ముగ్యతఁగాంచి యటబ్ధిపాలుఁడిం
దారుసహాయమందఁదగుతావు సురక్షితమంచెఱింగి యా
ధారముచిక్కనంచుఁ బరితాపమువారఁగ 'నూరఁజేరఁగన్॥ 2

ఉ॥ మున్నొకయప్డు తారటకుఁ బోయినవైఖరి యిప్పుడున్న తీ
రన్న నిఁకెన్నఁడేమి? 'పువులమ్మినయూరనుగట్టెలమ్మ' నా
నన్నులమైతీమం చెదవిషాదముదోఁపఁగ వారలేగి రా
పన్నతనూరిలోనికి నెవండ్రును జూడఁగరానిచీఁకటిన్॥ 3

### — నిశాప్రవేశము. —

తే॥ పొదలగింగురుమనుధ్వని పొదలుచుండఁ
గడలనెల్లెడఁ జీఁకటుల్గడలుచుండ
జేఁచులను దమవేసముల్ రేఁచుచుండఁ
గసమసఁ జనిరి చుక్కలాకసమునిండ॥ 4

మ॥ సరసీరుట్ప్రభుఁ డంబుధి న్నరసహస్రంబుం బ్రసారంపు టా
విరులందేల్ప ఘనంబదై మరల నుర్వి న్వర్షపాతంబుగాన్
శరదభ్రంబది కీర్తికాములకు సాక్ష్యంబొప్పఁగా నిష్కళం
క రుచి న్దేజెడి గోళదీపికల బుఋానీకముం దాల్చెఁదాన్। 5

సీ॥ గగనపారావార కదనసీమామగ్న
ఘనచమూపతుల నౌకాదళంబా!

గణ్యసంగ్రామరంగస్థల భంజిత
శోభాతిరేక మత్తేభచయము!
ఘనవాయుసంగరాంగణ ఘూర్ణితాభ్రంక
షానేకపవన యానావళియొకొ!
రణపురందరబాణ రక్తధారాసిక్త
కుంభినిపతిత రత్నోత్కరంబొ!॥

తే॥ నాఁగ నాగము ల్నాగాభ నాగము లట
నాగగనమందుఁ గనరాని నాగములట
నాగభోగప్రకాశమా నాగశీతమ
నేఁగరీమ మంది యలరు నానాగతులను॥ 6

ఆ॥ ఖగకులాయఖచితఖద్యోతచయమట్లుఖగపగమనసాభికమలభవుఁడు
ఖగశకలిత కలితఖద్యోతకరము లనఁగ ఖగాళినిలిపె జగతిఁదనుప॥

క॥ దీపావళిసనఁగా ర్తిక దీపావళి గగనమందు దేవతలునుపన్
గాపు రజనీచరుల నిల నాపం గరదీపిక లగునవి యననొప్పెన్॥

తే॥ ఎవరు వేల్వెట్టిచూపని యెన్నికఁగని
తన్నునించు పాతివ్రత్య ధర్మనిరతి
బన్నమెఱుఁగని యల్లసుబ్బాంబఁగాంచి
ద్యుతిఁ దొఱంగెనుగా నరుంధతికనంగ॥ 9

తే॥ తానిశాచరుఁడయ్యును దారఁగూడి
పరఁగఁ బారాధవాఖ్య యన్వర్థముగను
స్మరరిపుచ్ఛేదితుండయి మరుని సఖతఁ
దాఁగళాహీనుఁడై విధుండేగఁదొడఁగె॥ 10

తే॥ అబ్ధిఁబొంగించువాఁడని యబ్జరిపుని
బ్రదికియున్నారు తూలనాడెదరటంచు
నతఁడు వెఱచెనొయనఁ దృతీయాశశియపు
డాకసమునఁ దానుగృశించి యణఁగియుండె॥ 11

తే॥ కాదుకాదదిచంద్రశేఖనుదిలకము
గాఁగ దిద్దెను నుదుటనాకాశకాంత

ఋక్షమణి భూషితాంగి సద్వృక్షరహిత
యింపుమదినింపఁ దనియింప నిట్టులుండ॥ 12

—♦ ఆ ప్తా ద ర ణ ము ?—

క॥ వినఁబడియెను ధ్వనులిండ్లను
గనఁబడియెను లోనిదీపకాంతు లటునటన్
దనశ్వశురుని సోదరిగృహ
మునుగని కామార్యుఁడాగె ముందిర వేదికాన్॥ 13

తే॥ పాఁతపాఁతల పీరలఁబాఁతఱదరి
నాతఁజంగని వారెవరో తెలియక
'యెవరువా' రని యడుగుచుగృహిణివచ్చి
బిచ్చపు స్వేసముల సిల్చుపీరిఁగాంచి॥ 14

సీ॥ ఆశ్చర్యముననామె నిశ్చేష్టరాలయ్యె
వెఱఁగంది చూచినవిధముతోఁచె
నంతలోఁ జింతతోఁ గొంత తెప్పిఱిలిన
నానెయిట్లని సందియంబువాడమ
'గద్గదికను ఁజెల్లి! గతిపట్టెని' ట్టన
లింగాంబ యాలింగి తాంగయయ్యె
నటులనే తత్పుత్రి యామనసుబ్బాంబఁ
గౌఁగిలించివగచెఁ గడుపుపగుల॥

తే॥ ఁరోదయి' దేమని గృహమేధి కదలివచ్చి
కామయాదులఁ గాపీనగాములఁగని
గాములిటు తప్పఁజూడ్కి కక్కజమునంది
వారలందఱలోనికిఁ జీరిపిలిచి॥ 15

సీ॥ కామార్యుకైవట్టి తాముందునడవఁగాఁ
దనపత్నిఁదక్కువారనుగమింపఁ
బాద్యంబుముందిడి పదపడివారికి
స్నానార్థముగ నుష్ణజలమొసంగి

మడిగట్టునింతలో వడివడిఁ వంటలఁ
జేయించి వారిభుజింపఁజేసి
వారందఱకు నూత్నవస్త్రమ్ములనొసంగి
ధరియింపవేఁడి యాదరముమీఱ॥
తే॥ వచ్చిరీపలు మమ్ముఁ బావనమొనర్ప
నాదుసుకృతమ్మునంజేసికాదె మాదృ
శులకు మీరొనర్చు సహాయముల నిదరయ
నగునె యెన్నఁగ నొకసహస్రాంశమైన? 16
తే॥ ఇంతకెంతైనఁ బ్రాణంబులేనిదక్క
నంతయేచాలు ననిసంతసింతమనిరి
పిదపరేయెల్ల మాటాడి, పిచ్చిపాడి
రెండుమూడుదినాలట్టి యండనుండ॥ 17
చ॥ వరమతినప్డు హూణవిభువర్యులటుప్పినదెబ్బ తాఁకునన్
ధరఁదమయాస్తిఁ గోల్పడి వెతన్పడియున్న జనంబునెల్ల నా
దరమునఁబిల్చి వారలకుఁ దత్తదుపార్జిత విత్తనష్టపున్
గురులఘుతారతమ్య మెదఁ గూర్చువిధమ్మున నీయనీవులన్॥
క॥ ఆయీవులవిషయము విని
యాయావతుజనమ్ములట కసతి దూరస్థం
బై యొప్పిడిబందరునకుఁ
బోయిరి కామార్యుఁ డట్లుపోయెం గైకోన్॥ 19
ఉ॥ వీరు ధనాఢ్యులంచుఁ గడుఁబేరిమిఁగాంచిన వారలయ్యు నా
ధారములేని దుస్థితికిఁ దారిపుడిట్టుల వచ్చిరంచు, స
త్కారము నగ్రగణ్యముగఁగాంచిరటవ్వదిరూప్యము ల్మదం
బారఁగ వస్త్రముల్మఱి పదార్థచయంబుఁ గ్రయంబొనర్పఁగాఁ॥
ఉ॥ ఆపదలన్నరాధిప పరాదరణంబు విధాయకంబటం
చీపగిది న్గ్రహించిరి సరే, యిఁకముందొనరింత మేదటం
చాపయిఁజింత సేయ ననె నగ్రతనూజుఁ డిఁకెప్డులేని దే
వ్రాపులిఁ కేల? యప్పఁగొనువారలమందని వారిఁ గోరఁగాఁ॥ 21

క॥ ఆమాటవించువలదనెఁ గామార్యుఁడదేలయన్నఁ గడతేఱక పి
రీమెయిఁ బీడింపఁబడికి రేమో యనికొంద్రటనియె నిచ్చోటి
జనముల్॥

శా॥ కర్తవ్యాంశమిఁకేదినాననియె, యోగ్యప్రాప్త భాగ్యుండు కీ
ర్తిం జెన్నువహించియొప్పు నలతాతాపద్మనాభాఖ్యస
త్క్షత్రిశ్రీవిభవాభిరాముఁ డనికాదే వింద గోల్కొండలో
వర్తిల్లన్ ఋణదాతనేనయితిఁ దీర్పన్లేదతండింతకున్॥

క॥ అదిమూలధనముగాఁగొని
యదృష్టమును గలిసిరాఁగ వ్యాపారంబున్
మొదలిడి హైదరబాదునఁ
బదపడి లక్షాధికారపదమతఁడందెన్॥

చ॥ అతఁడుధనాభివృద్ధిని మదాధికతం గనకుండునంచు, సం
తతసురవిప్రభక్తిసకృతజ్ఞత నాయెడఁజూపునంచు, న్యా
నతఋణమింకఁదీర్పమి కనారతముంగని యద్దితీర్ప, ని
శ్చితమతిఁ దానవత్తునని చెప్పెనటంచును వింటి మున్న నే॥

క॥ అతఁడు బాల్యస్నేహితుఁ
డై తొలుత సహాయమొందె నదిమఱచితి, నే
నీతఱి గతియదియేకా
నై, తగుస్థితినాతఁడునికినద నడుగంగాన్॥

చ॥ అనిజనకుండుపల్క విని నంతనె యగ్రతనూభవుండు హే
లనితలపోసి యిర్వురమునచ్చటికేగుద మద్దివృద్ధితో
డను నతఁడిప్పుతీర్ప మనడబ్బెయదాటఁ గోనంగవచ్చు నీ
మనస్థితివద్దిమాదరవు మానుగనౌనని యుత్తరంబిడెన్॥

ఉ॥ కానఁగుటుంబముందగిన గ్రాసముఁగూరిచి క్రొత్తపేటలో
నేనివసింపడించి చనిరిద్దఱుఁగాల్నడఁ బద్మనాభు ల
క్ష్మీనిలయంబుఁజేరఁగఁ గుచేలుఁడు మున్నలపద్మనాభుల
క్ష్మీనియంబుఁ జేరఁజని శ్రీవిభవాఢ్యతఁగాంచుచాడ్పునన్॥

—♦ శై శ వ దు ష్ట శి క్ష ణ ము. ♦—

ఉ॥ ఇట్టుల వారువోఁ బరిపుష్టించెడిఁ బుష్పము పుట్టినప్డె' య
న్నట్టులనొప్పుచుండె నలయన్నకుఁడా పురుషోత్తముండిటుల్
బొట్టిఁ భుజంగ' మంచనఁగ ముద్దులమూటలుగట్టు' మాటలా
పట్టునఁబల్కు చాటలను బాటలఁ గూడుచు నీడుబిడ్డలన్॥　　29

క॥ ఒకనాఁడాచిన్నన్న బడికిఁబోవుచునుండ వెంబడించె బుడుతఁడా
గక, వలదనినను దప్పించుకొను చరిగిరంత నగ్రజుండున్మిత్రులున్॥

క॥ గునగునలాడుచు 'నన్నా'
యని పిలుచుచుఁ జేలనడుమ కాతఁడువోవం
గనఁబడమి బిక్కమోమిడి
వనరుచునున్నంత నొక్కభామిని రాఁగాన్॥　　31

క॥ తనయాటనెచ్చెలులమా
తనుగా గుర్తించెనాపె దయగలయదిమైఁ
గనఁబడి ముద్దిడికొని కా
ళ్లనుగడియింప మొలబిల్లలనులాగికొనెన్॥　　32

తే॥ వానిబొడ్డున నిడికొని హానిసేయఁ
జేతులాడమి నజ్ఞాని చేయునెదని
యిల్లుసేరంగఁ దోవఁజూపించి దాఁటె
నంతలోఁ దమ్ముఁడేఁడని యన్నమరల॥　　33

క॥ 'సుబ్బిరామితల్లె దబ్బునననుఁగాల్లు రెండుదగ్గఱగాఁ బె
ట్టబ్బా' యనిలాగెననుచు దబ్బఱకాకుండఁ జెప్పెఁ దత్తణ
మతఁడే॥　　34

ఆ॥ బుడుతనెత్తికొంచుఁ బోయి న్యాయాధిప!
వివరమెఱుఁగఁజేయు బిడ్డఁడనుడు
'సుబ్బిరామితల్లి' చోరతబెదరక
తెలిపెఁబలుక ముద్దులొలుక నిసుఁగు॥　　35

క॥ ఆమాటవినఁగ ముద్దై
తా మేజిస్ట్రేటు బిడ్డఁదనతోడ నిడికొం

'చేమోయి చిట్టిఫిరియా
దీ! మఱినీపేరదేమి? తెలుపు' మటనుడుఁ॥ 36

క॥ తలవంచి 'బుజంగ' మనియె
'మొలబిల్లలుతీసె' ననియె, ముదముననల్లే
యలవిషయ మరసి వ్రాయుచుఁ
గలసాక్ష్యమదొక్కటైనఁ గడువడినమ్మెన్॥ 37

ఉ॥ ఏలన నజ్ఞుఁడౌట నిసు వేయనృతంబు నెఱుంగఁజాలఁడ
శ్లీలము లేమి నేరఁడు కలి న్వయసెక్కుడుగాఁగఁ జెల్వియున్
జాలజనుల్ ఋతేతరవచస్కులు బోనులనెక్కిపల్క,నీ
బాలుఁడు పున్నెమేదవునొ పాపమెదో యెఱుఁగం డొకింతయున్॥

చ॥ అనుచుఁ బొలీసువారి నరయంజని తోడనెదొంగ నప్పటె
మ్మనియనుపంగ న్యాయపునియానతి వారట కేగినంత నే
కనసల యెఱ్ఱటోపులను గంపముసాగెను బల్లెటూరికిం
బనిఁగొని వారలేమిటికివచ్చిరొ యంచరయంగ నేరమిన్॥ 39

ఆ॥ ఎవనికొంపమునుఁగు నేమగునోయని
తెల్లవోయిచూచి రెల్లజనులు
వెఱచి యూఁడువాండ్రు బెదరిపిల్లలుడాఁగి
దడులచాటునఁ దగి తారుచుండ॥ 40

ఆ॥ పాపఁడుండిచేతఁ జూపగమ్యస్థాన
మల్లరక్షకభటులన్నహితులు
వింతఁజూడవచ్చి వెంటఁబడినజట్టుఁ
గలకలముగనిలువ గడపముందు॥ 41

ఆ॥ కొంతదవ్వు నుండి కొంపమీఁది కెరాక
తనదు దొంగతనముఁ గనుఁగొనిరని
ముడియవిడ్పు తీసి మొలబిళ్లలంతలో
ముసలియత్తమీఁద విసరిపోవ॥ 42

ఆ॥ అమ్మగారివిషయ మదివఱకేకొంత
తెలిసియున్కి నేము తెచ్చిపెట్ట

ననుచు గుంపుఁగాంచి, కొనివాని నెదురేగి
'యెవరికొఱకు? బిళ్ల లివిగో' యనియె॥ 43

ఆ॥ 'కడుపుఁజించికొన్నఁ గాళ్లపైఁబడు' నని
పిల్లవాఁడు పాఱవేసికోఁగఁ
దెచ్చెఁబిల్ల వారికిచ్చిరాఁ బోవఁగా
బయలుదేఱుచుండ వచ్చితి రనె॥ 44

క॥ అడుగమినేతడఁబడి 'గు
మ్మడికాయల దొంగ' పగిదిమాట్లాడంగా
వడినందఱు కదితెలిసెను
'జిడిముడిపడుదేల? యన్న! చెప్పు'మటనుచున్॥ 45

క॥ తా, డాబుగఁ గాంస్టేబులు
కోడలదేమూలడాఁగెఁ? గొనితెమ్మనుడున్
వీడమి బలిమాలినఁ దుద
కాడకుఁ గొనిరాఁగబిడ్డఁ 'డదె' యనిచూపెన్॥ 46

ఆ॥ కష్టమింతలేక స్పష్టంబుగా నల్ల
దొంగయదియుఁదీయు సంగతియును
నెల్లనిట్టు తేట తెల్లంబదై యింటఁ
జొరకయుండ సొత్తుదొరకుటయును॥ 47

క॥ మెడఁబట్టినెట్టఁదొడఁగుచు
గడగడవడఁకగఁ దమయధికారియెదుటికిన్
విడువక 'కాలన్ర్వేలం
బడి' నను గుండెలుదడదడఁబడ నడ యడుగన్॥ 48

క॥ ఏపాపంబెఱుఁగనిదై యాపాపనితల్లి సుబ్బమాంబిక యేవే
వోపనిపాటలఁదగ నెవరోపోయి, యిదెల్లఁజెప్ప నోహాట
మొదవన్॥ 49

ఆ॥ వేలకొలఁదియాస్తికూలిపోవఁగనిట్టి కొద్దిదానికింతరద్దియేల?
క్రోధమిద్దిప్రాణబాధకమానేమొ! బిడ్డకంచుఁ బంపఁ బిన్నతండి)

క॥ వడికెడి జందెపుఁగదురిడి
వడిఁజని రక్షకభటులనుబతిమాలె,సతిన్
విడువుండనియభియోగం
బుడిగితిమే మెట్టులీక లోనరిం త్రిసఁగాన్॥ 51

క॥ ఓ బాపనాయనా! విను మీబిడ్డఁడెమాకుసాక్షియిది పోలిస్కే
సౌ, బలమైనది, విడువ న్మాబోంట్లకుఁదరమె? యాజ్ఞనడపఁగ
వలయున్॥ 52

తే॥ అనుచుబలవంతముగ లాగికొనుచుఁబోయి
యరయనంపుమేజిస్ట్రీటు నానతిమెయి
దొంగఁగొని తెచ్చితిమి, యిదెదొంగసొత్త
టనియెదుటఁబెట్ట నత్యుగ్రుఁడై యతండు॥ 53

ఉ॥ ఓసిదురాత్మురాల! నిను నొత్తిగిలంబడఁగొట్టి ముక్కలం
గోసినఁబాపమున్నె? పసికూన, యెఱుంగఁడు పాపకర్మముల్
దోసమటంచునెంచ కిటుదొంగిలెదే? యలబిడ్డవస్తువుల్
గాసినిబొంద, సంచవజకంబు, విధించెద నీకుశిక్షగాన్॥ 54

ఉ॥ గొడ్డునకైన గుండెకరుగున్ వినఁగాఁ గనఁ బల్కనందమున్
బిడ్డలఁ గన్నతల్లివయి వ్రీడయొకింతయులేక నిష్కృపన్
బిడ్డనుమోసపుచ్చి మొలబిల్లలఁ దీయఁగఁ జేతులాడెనే?
దొడ్డకొలమ్ముఁ గీరితి యధోగతి పాలయిపోవ, దుర్మతీ! 55

చ॥ అనవుడుఖిన్నురాలవుచు నానన మెత్తక దొంగనిల్చెఁ, 'జు
ట్టును దమయూరివారలరుడుం దలనేలనుగొట్టినట్టు' లై
కనుగవ నీరుగార, 'నపకారికిఁ దానుపకారముం బొన
ర్పు' ననఁగ సుబ్బమాంబయె కృపం గనుఁడ న్మొఱ చేరనంపఁగాన్

మ॥ విని న్యాయాధిపుఁ డంతరంగమున సాధ్వియోగ్యత న్మెచ్చికొం
చును, వంశోన్నతియు న్మదిన్నిలిపి, తీక్ష్ణోద్దేశము న్మార్చికొం
చనుకంపామతి 'నైను'తోఁ బ్రథమపర్యాయమ్ముఁ బోనిత్తు, నిం
క నొక్కప్డిట్టిది సేసినం గఠినశిక్షాపాత్రతం గం డనున్॥ 57

ఆ॥ పిదప మందలించి బిడ్డల నగలతో
వదలఁదగదు, కలుగుఁ బ్రాణభయము
దృష్టవంతు లీర లిప్పటికంచని
విడిచె నిటు దినములు కడచుచుండ॥ 58

— యాపన పుటభేదనము. —

మ॥ అటఁ గామాఖ్యుఁడుఁ దత్సుతాగ్రజుఁడు హాయ హైదరాబాదు,న
చ్చటఁ దాతాన్వయునాదరంబుఁ గన దీక్షం దా రహోరాత్రులం
బటుకష్టమ్ములకోర్చి కాలినడక న్బల్లెల్లఁ గ్రామముల్
చటులారణ్యములుం దరించి చన దృశ్యంబయ్యెఁ బ్రోల్లోకటన్

మ॥ ఉరువీధి న్ఘనఘర్ఘ ఘర్ఘరము లేమో నా, శతఘ్నిధ్వనుల్
బెడిదంబై యడిదోగ్రకుంతధర విద్విణ్ణాశ కోద్యచ్ఛవుల్
గడుదుర్భేద్య మొనర్ప నేర్పడిన 'లష్కర్' చేరువం గల్గన
వ్యోమ, గోల్కొండ యదెట్టిదో యనుచువా రేమేమొ
చింతించుచున్॥ 60

మ॥ పరరాజన్య భయంకరంబయి యటం బ్రాకారమొప్పారం, దదం
తరమందు న్బహుహర్మ్యహర్మ్యతతిమధ్యంబందు లక్ష్మీకటా
క్షరుచిం దేరుచు సౌధరాజమునఁ గశ్యస్థాంసపర్యంకమం
దురు సౌభాగ్యుఁడుగా నవాబలరు నం చూహించుచుం బోవఁగాన్

శా॥ శీలాబెంచి విరించి మించితగ నిర్మించె న్బ్రభాధామముం
బ్రాలేయాచలసాలభింతికలు నభ్రంబంటువప్రావళుల్
ల్లాలోత్తాలవిశాలమాలికలలీలం జాలసౌధంబులున్
గ్రాలన్ స్థూలకవాటపంక్తి పురభాగంబుల్ వ్యభేదింపఁగాఁ॥ 62

శా॥ నా, మోదావహమైనపట్టణము విన్నాణంబుగా శోభిలున్
'పామల్బ'ండను వప్రభాగమున లష్కరుకు న్సమీపంబునన్
శ్రీమంతంబయి దర్శనీయమగువాసిన్ హైదరాబాదనం
గా ముస్నెంతయువినికిఁ గష్టములిక న్గటెక్కనం చెంచుచున్॥

మ॥ కనిడాయ న్మనుముంద, కాలయవను న్ఘర్షింప శ్రీకృష్ణ ద
ర్శనమై, తన్మచుకుందమౌని మును కృష్ణాస్నానముం జేయఁబో
యినత్రోవై మునియేఁబునాఁబరఁగు కృష్ణేజ్య న్నుమూసీతరం
గిణి, గేయంబకెక్షేయమై యలరుదానిం గాంచి వారిర్వురున్॥

క॥ స్నానానుష్ఠానంబుల నానాఁ డాపావనవనమంద, ముదమునం
గానిచ్చుకొని 'నయాపుల్' పై నావలికరిగి హైదరాబాదుఁ
గనంగాన్॥ 65

ఉ॥ చాకుతరంబుగాఁవగు బజారున నద్దెసలాదు నేన్గునం
బారియుఁ బోవపీలయినభంగి నెసంగెడియార్చిగేట్లచేఁ
'జారుకమానునాఁ బరఁగు సందడిచోటికి వారురానటం
'జారుమునార' మధ్యమున స్వర్గపుఁదోవన నొప్పె వింతగాన్॥

మ॥ జలనిమ్నంబు రసాతలంబునకు దుష్టవాత్రిముం జేర్చున
ట్టు లెసంగ న్మను ద్వారకానగరమట్టు ల్కట్టిరవ్వారిఁ బం
క్తులుగా నొప్పెడి స్తంభజాలముపయి న్దోరంపుసారంపు టు
జ్జ్వాలసౌధంబుఁ బురారికేతనము నిల్పంబడ్డ చందంబునన్॥ 67

మ॥ రవికి న్నిరమగమ్యగోచరముగాఁ గ్రాలు గ్రసాంతస్థితిన్
దివికింబోవుట నగ్రభాగమె భువిన్ దృగ్గోచరంబౌట లే-
దు, విచారింపఁగ నిష్టదైవమగు నిందుండంచుఁ గాల్మొప, న
య్యావనోర్వీతలనాయకుం డెవఁడొ రమ్యంబిద్ది నిర్మించెఁబో!

చ॥ కరము మనోహరంబయి జగంబున నద్దొకక్రొత్తవింత మా
దిరి యపదం బనందగుగతిం గడునున్నతిగాఁ జిరప్రియ
త్నరచితమైన సౌడిమి కనంగ మనంబులఁ దోఁచు, నెక్కఖే
చరులకు నీకుగా నదియెసంగెడునఁ చిరవాంఛనందమై॥ 69

ఉ॥ దానికిఁజుట్టు వర్తకపుఁదావు విశాలముగాఁ దనర్చుట
న్మానవపాళి యచ్చోట నొనర్చుటకుం గ్రయవిక్రయంబుల
న్భానుఁడు పూర్వభూధరనివాస మొనర్చినమీఁదఁ జేరఁగాన్
మానిత మెప్పుడద్దియువునాఁ గనమెచ్చెఁగఁ బాంధులెల్లరున్॥

మ॥ అటురాఁబోవ నదృష్టపూర్వమయి యత్యాశ్చర్య సంత్రాసదో
త్కటమై శాబకపోతవిక్కికలఘోషంబు ల్వ్యాశాగర్జితో
ద్భటదానార్ద్రఘటాఘట్యయూథపతి సంతానంబటంజూడ, ము
ష్పటగా హాస్తిక మొక్కటన్నెఱలేఁ బ్రాజ్యంబైన ఫీత్కారనాన్

సీ॥ నజిత్రిదాశికినోడి పాఱియనసరాజ్య
మ్మాదఁపతిం జేరు నభ్రములనఁగ
ఘనమార్గరోధముం గలిగింప సౌధముల్
పడియున్న జీమూతపటలమనఁగ
ప్రభుయశశ్చంద్రిక వ్యాప్తమైవారింప
నిటఁ బెడఁబట్టు చీఁకటులనంగ
రాసుతై పేరిన మూసినదీస్నాన
ముక్తమ్ములైన కర్బురములనఁగ

తే॥ గజబిజందగె కోరాడు గజతఁగనిరి
దానపంకిలహాటట్టి తావునుండి
బంధురం బయుగ్మచ్ఛదగంధమట్టు
ఘూర్ణనోచనమయ్యె దూరమ్మునుండి॥ 72

క॥ ఎఱుఁగని యూరందురకం
బెఱుఁగక, తికమకలువడుచు నిటునటుచనుచుం
జెరువడయుచు వారిర్వురు
నరుగుచునుండంగఁ గాంచి రష్జల్ గంజున్॥ 73

మ॥ కరిరాజల్ గిరిరాజసంతతి మహాంగంబు ల్తురంగంబులు
ద్ధురభద్రాంగసుభద్రసాళి రథపంక్తుల్ రథ్యల న్మధ్యమం
దిరుపార్శ్వంబుల వచ్చుపోవుజనముల్ హేరాళసంఖ్యాకులేన్
దరల న్వాలయి నేత్రపర్వమగు నేతన్మార్గముం గాంచుచుఁ॥

మ॥ మఱిసాగం గని రొక్కరీతిఁదగు హర్మ్యవ్రాతకత్న్యాళి, యం
బరవీథిన్నిజకీర్తి కాంతకయి యష్జల్ దాల యమ్దేలు భూ
వరుఁడేర్పాటొనరించుమార్గ మటులొప్పన్ దీపికాస్తంభముల్
వరుస న్నెక్కరు మిక్కుటంబుగను శోభం బెంపుఁజేయుండగన్ 75

క॥ అల్లేగుచు నరయంగాఁ
జొల్లమహారాజుగంజు చాయల యవలం
గోల్లకొలంపిగ బ్రిదుకం
బుల్లిన్నని చెప్పరాని పోడిమి నొప్పన్॥ 76

## —◆ మిత్రసమాగమము. ◆—

చ॥ తిమిరముదాఁటినట్టులయి తెల్లగఁ గొల్లగ నాడనున్న బి
య్యముఁగన భూతపాళికి నిటాదరువౌనన స్వచ్ఛకీర్తి స
త్రము 'కొడిసేలవారిది'యుఁ దద్దయుఁజేయుచుఁ బద్మనాభు గే
హముఁ గనన్యోఁ గన్గొనఁగ నంపిరి లోనికివర్తమానమున్॥ 77

మ॥ ఎవరోవచ్చిరిపిప్పలంచనని పూజింపంగఁ దావచ్చె, భ
క్తివిశేషంబునఁ దామపద్దగియు, గుర్తింపంగ విభ్రాంతిఁ జెం
ది, వచోతీతముదార్తిసంభ్రమగతి ద్రృజ్ఞనముం బాద్యమి
చ్చె, వడిన్దాను బ్రణామ లబ్ధవిహితాశీర్వాదుఁడై లేచుచున్॥

మ॥ తనుదర్శింపఁగ వచ్చినారలు గుమాస్తాలొకరు ల్పెక్కురు
న్నను న్యూనంబన కల్లపాదముల లగ్నంబైన మృత్తంగుళిం
గొని ఫాలంబున నుంచుకొంచుఁ గడుసంతోషంబు దీపింప, మ
న్ననతో నర్హసుఖాసనస్థితుల విన్నాణంబునం జేయుచున్॥ 79

మ॥ కుశలప్రశ్నమొనర్పఁ గామయయనె న్గూపారుఁ జేపార, దు
ర్దశపాల్పించెనుగాని ప్రాణములెటో దక్కె న్ధనంబేగిన
న్వ్యశేమున్నియది విన్క, జ్ఞప్తికిని బాల్యస్నేహముం దెచ్చికొం
చశనాధాపము నందవచ్చితిమినా నాశ్చర్యనిర్మగ్నుఁడై॥ 80

తే॥ పద్మనాభుండు నిశ్చేష్టఁబరఁగి యంతఁ
దర్జనిన్యస్తనాసుఁడై ధరణిఁగూలి
తెప్పిఱిల కొంతసేపటి కప్పుడని యె
బాష్పపూరితనేత్రుఁడై వారిఁగనుచు॥ 81

ఉ॥ ఎంతటివారి కెంతదశ యెంతటిలో నెటు కల్గనౌనో యా
నంత యెఱుంగలేముగద, యచ్చెరువౌ భవుచిద్విలాసముల్

వంతరవంత లేక సుఖవారిధిఁ దేలుచు నుమ్మ బోంట్లఁ బో
షింతమటంచుఁ జూచు మిమ్ముఁ జంతల వారిధిముంచి వేసె నే?॥

ఉ॥ ఉప్పెనవచ్చెనంచు వినియుంటిని గాని మహానుభావులీ
చొప్పున నీరసులైతిరని సుంత యెఱుంగను దూరదేశమం
దొప్పుటఁ బాదసేవకయి యొద్దను జేరి ఋణంబుఁ దీర్చికో
నెప్పటికబ్బునో యనుచు నెంతయుఁ జింతిలుచుంటఁ దప్ప నేన్॥

ఉ॥ ఏమొనరించి మీఋణము నెట్టులఁ దీర్చికొనంగఁ జాలుదున్
స్వామి! విచారమింత యనఁ జాలఁ గృతఘ్నత తోఁప నయ్యో, మీ
మోమును జూడ సిగ్గవు 'నమోనమ' నన్ను క్షమింపుఁ డింకఁ నీ
గీముధనంబు మీయదియ, కేవల సేవకు నగ్రహింపుఁడీ॥ 84

మ॥ అని కామార్యపదాంబుజాతములఁ దా నాలింగనంబుం బొన
ర్చెను, దేవుండవు తండ్రివీవ, భవదాశీఃపాత్రుఁడ న్నేనటం
చని, నీవిడ్డభిక్ష మిద్దనియె, సాష్టాంగప్రణామంబులం
గొనుచున్నీవిటనుండఁగా నవలె నటంచు న్నమ్రకేలఁ బ్రేమంబునన్

ఉ॥ ఆతని యోగ్యతాధికత కాతని భక్తికి నట్టి సూక్తికిం
గాతని సత్కృతికిన్ హృదయమందు మహాద్భుతమంది, విన్న వి
ఖ్యాతికి నున్నరీతికి నయం బనయం బభయంబుగాఁగఁ బెం
పైతగుట న్ముదావహ మనైన వచించిరి కామధీమణుల్॥ 86

తే॥ చెల్లియుండియు నైరణసేయునతని
వన్నెమిన్నాఁగదన్న సంపన్నుఁడవయి
విఱ్ఱవీఁగక సామాన్యవిప్రు, నన్ను
నింతగౌరవమునఁ జూడ వింతగాదె?॥ 87

తే॥ ఇమ్మహీస్థలి వినమె? 'ధనమ్ము చాయ'
యనఁగ నటుగాక నీవు ధర్మనిరతిఁ దగి
యైహికాముష్మిక సుఖాప్తి కాదరువగు
పథమునందునిఁక వర్ణ్యంబు పద్మనాభ!॥ 88

తే॥ గడువుదాఁటిన యప్పునే నడుగవచ్చు
'క్షేమొగ?' మ్మని పొమ్మన కింతదయను

బాల్యమైత్రిని బాటించి పలుకునిధ మి
ద్దేఙ్గునే ఁిచెట్లయ్యె, నింకవినుము॥ 89

క॥ ఈపగిదిని నాకుశర ద్ద్వాపంచాశత్తునందు వైశ్యునిప్రాపౌ
నాపన్నత కలుగకనుచు నాపొందినవుం నదిందు నఖుడు
వడియెన్॥ 90

క॥ ఏలవ ఁనుదుటనుప్రాసీన
వాక్యో లనుభాష్యంబుగాక పాయ వ్యైకన్॥
శీలాఢ్య! కృతజ్ఞా! సి
పాలం బనుటకె మునంబు బాల్యాప్తవరా ! 91

తే॥ కాని నీయింట నేనుండఁ గలుగదెప్పుడు
స్వగృహ మేర్పడువఱకును సత్త్రిమేదో
నిలువ నెడగ నేర్పాటు గలుగునేని
నెట్టఁజూచెదఁ గాలమ్ము నీదు దయను॥ 92

క॥ అనిసమ్మతింప హృదయము
ననుమోదమునంది పద్మనాభుండంతన్
దనదాపునఁ గొడిసెలరా
మనసత్త్రమునందె నెల వమర్చుచునిల్పెన్॥ 93

క॥ ఆనాఁడె మొదలు గురునిఁగఁ
దానాతనివాంఛితార్థ తతి మునుగని స్వీ
యానందము వెనుకఁగనుచు
నానతిమీఱకయ భక్తి నాతఁడు నెఱపెన్॥ 94

ఆ॥ సేదదేఱినంత సేవకుల్బండ్లతో
గురుకుటుంబ మటకుఁ గొంచురాఁగఁ
దత్కుమారునంపి తానండయైయుండి
నిత్యనిష్ఠసలుప నిలిపెగురుల॥ 95

శా॥ ఆవివరమ్మెల్ల విని ప్రస్తావవశమ్ముగను జెప్పఁ దాతాన్వయుఁడా
ధీవరుపూర్వస్థితి ప్రకృతావస్థయుఁ బ్రాజ్ఞతయు మహత్త్వ
మానేనుల్॥ 96

చ॥ ధనికులు ధార్మికుల్సతతధర్మవిచారులుతారువైశ్య పా
ళిని శుచితాప్తి నింకమఖిలీపురవాసితఁ గూడనెంచి, యం
దునుమనపద్మనాభు సురతుల్యునిఁగా నతిభక్తిఁగాంచు స
జ్జను లలవంద్యవంద్య సుపసన్నిధిఁ జేరుచు నుండి రెందఱో॥

— నిష్కామవృత్తి. —

ఉ॥ అట్టులఁ జేరువారలకు నాతఁడు ధర్మరహస్యము ల్గనన్
రట్టవునట్టుపల్కుచు విన మ్రిత వారలు మ్రొక్కి దీవనల్
వెట్టుచు నప్రతిగ్రహపవిత్రచరిత్రత మీఱ నొప్పఁగా
నిట్టులఁ గాలముగ్గడప నెంచినఁ బర్వదినం బొకండురాన్॥ 98

శా॥ మూసిన్ స్నానమొనర్చి యాడనె జపంబుం జేయ దర్భాసనా
చ్ఛాసీనుండయి యోగనిష్ఠ హృదిఁగా సచ్చిత్స్వరూపైక్యమున్
మూసె న్నేత్రయుగం బటుండనటనే మోదంబుతో స్నాతులై
వాసింగన్నఘనుల్ ప్రదక్షిణమొనర్పంబోయి కామేశ్వరున్॥

క॥ ఆతని నిర్మలపదకం జాతమ్ములపయిఁ గనకరజత నాణకసం
ఘాతంబుల రత్నంబులఁ జేతోముద మారఁ బూజచేసి రనేకుల్॥

క॥ అదిగని యింకంగొందఱు
తుదకెల్లరుచూచినారు తోఁచినదేదో
పదములదరిఁబడవైచిరి
గద శక్తికొలఁది 'గతానుగతికు' ల్పథికుల్॥ 101

తే॥ కొంతసేపటి కాతండు గుటిసరిపడఁ
గనులువిచ్చుచు ధనరాసులను గనఁగనె
బెదరియిదియేమ టంచును విదితమగుడు
ముట్టకేదియుఁ జనెదర్భకట్ట దులిపి॥ 102

ఉ॥ దాంతియు శాంతియుంగలిగి తత్త్వవిచారణసేయువార మం
చెంతయుఁ బల్కవచ్చును సరే, ధనరాశినిజూడ మెట్టవే
దాంతములివ్వియేమగునొ! యయ్యదివీడఁగఁ జేతులాడునే?
**స్వాంతమునొప్పునే? తరుణమందు విరాగిత యుట్టిపడి కాన్?**

క॥ తనకై యుద్దిష్టంబగు ధనమాయె, నయాచితముగఁ దనకాళులపై
నదుబడ వేయంబడినదె కొనరాదే? యా స్త్రీవోయెఁ గూడంగాదే!

క॥ 'సిరిరా మోకాలొడ్డెడి'
నరుసను ధనమిట్లువదలవచ్చునె? నాఁగా
సరిపడ కాతఁడురోసెను
బరుల విషపుఁగాసులవ్వి వర్జ్యములంచున్॥ 105

ఆ॥ పద్మనాభుఁ డెపుడొ 'బాబదేమాడనే
వదలివచ్చిరంట భక్తిమీఱ
మిమ్ముఁబోలినార లిమ్మహిలేరని
పాదపూజసలుప వార'లనుడు॥ 106

ఆ॥ ఎఱుఁగఁ జరతరాల సీసీరుకాసుల
కేను బాల్పడంగనౌనె యెందు?
నేఁటికి విధితప్పి నీపోషణంబందు
టసునె యొడఁదఁగుంద నకలుషనుతి! 107

తే॥ ధర్మమర్మము వినుము షట్కర్మనిరతి
తగునుగాక యందరయు నుత్తమవిధాన
మా నైనను దానమేయందకున్కి-
యంటువడచుఁ బ్రాయశ్చిత్తమందుకంటె॥ 108

తే॥ అప్రతిగృహీతృ విప్రోత్తమాప్తి దాన
మట్టివానికె యొసఁగుండటండ్రు మిమ్ము
నప్రతిగృహీతు విప్రోత్తమాప్తి దాన
నట్టిదాని నందవలదటండ్రు మమ్ము॥ 109

క॥ మోధర్మఫల మధికమగు
సాధనమది యెట్టుకూర్చు సాయుజ్యంబుఁ
మాధర్మపథ మధికమగు
సాధనమిది యట్టుకూర్చు సాయుజ్యంబున్॥ 110

క॥ కాన స్వయంతీర్ణుండే
తా నోరులఁదరింపఁజేయుఁ దగెడున్ జగతిన్

గానట్టుల నేనింకను
మానంబే? బామరుగుల! మఱు బాముడుగన్॥ 111

క॥ ఏకించిత్సాహాయ్యము నీ కెప్పుడొ నేనొనర్చ నెనరు కలిమిచే
సాఁకందగుదవి యర్థము కైకొందుధనద్విగుణము, కాసికనొల్లన్॥

క॥ అనియుగ్గడింపనగు తృ
ప్తి సకలుషతఁ దెలిసి భాగధేయముస్వీయం
బనుపమమహాగురుకుక్షిం
దసద్ద్రవ్యము సేనననుచుఁ దా హృదిఁ బొంగెన్। 113

క॥ ఇటులేగఁ గొన్నిదినముల
చటికేతెంచుచుఁ గుటుంబసహితమ్ముగా ము
న్నటుపంపఁబడిన తనయుఁడు
భటదర్శితమార్గుఁడౌచు స్వాగతమంచెన్॥ 114

## —♦ హైదరాబాదు నివాసము ♦—

చ॥ అడుగిడి బాలకుండిటుల హైదరబాదున ద్వాదశాబ్దముల్
కడపెనటాటపాటలను గష్టసుఖంబులగుర్తెఱుంగఁగాఁ
దొడఁగెను, నీతిమార్గమునె తొక్కఁగఁజేసెడి విద్దెయబ్బ ధీ
రుఁడయి యిఁకెట్టిబాములను దోసిచరింప, గడింపఁగీర్తితాన్॥

తే॥ జనున కేర్పడుఁగాదె నైసర్గికముగ
నంగవైఖరుల ట్లంతరంగగతులు
తెలివితేటలు ప్రాక్కర్మ ఫలముకాచు
దానిఁబట్టియె కాదె జాతకమునడచు॥ 116

తే॥ మఱియు నింకొక్కటాను సామాన్యముగను
భావిజాతకచర్యకు బాల్యమందె
తత్తదనుకూలసంపత్తి తనరుచుండుఁ
గార్యకారణసంబంధగరిమఁ దెలియ॥ 117

తే॥ మంచిచెడుగులు కలిసియేమసలుచుండు
గుణముతోడనె దోసంబుకూడ నుండు

బాగుపడువాఁడు సదసద్వివక్షఁ జేయు
నంచవిషమువిడిచి క్షీరమందునట్లు॥ 118

మ॥ అటులే యీమనపూరుషోత్తముఁడు బాల్యంబందె సంప్రాప్తసం
కటదేశాంతరవాసితాత్త బహుళఖ్యాతిప్రదార్థాప్తి సం
ఘటల న్వర్ధిల సార్థకాఖ్యుఁడగు యోగంబుల్కిఁ గాకున్నఁ జె
ల్పెప్పాటకేముం జెడెఁ? బాటుగాటగున వెప్పుంగల్గుఁగా మార్గముల్

తే॥ సైఁగ నాతనికష్టసంప్రాప్తమైన
స్థితియు సాంఘాతికమ్ములు చెఱుపఁదగినఁ
జెడక యెల్లెట్లొ గౌనమందె సేకరించెఁ
బంకమంటక లేఁదిఁగ ప్రాఁకుకరణి॥ 120

సీ॥ జనకుఁడో భవునట్లు జపమొనర్చుచెతక్క
నైహిక మింతయు నరయఁడయ్యె
జననియో యతిథిపూజనకర్మముల దక్క
పనిపాటులం జెప్పు మునుఁగనయ్యె
నగ్రజలిర్వురి యందొకండుద్యోగ
మున కన్యుఁడు సదువఁ జనెడునయ్యె
నీతుజోడుగనింట నాడుకోఁగాఁబుట్టి
పెరుఁగుబిడ్డ లిఁకేరు దొరకరయ్యె॥

తే॥ మఱియు నావాడ శిశువులే కఱవుగాఁగ
నిరుగుపొరుగున నటనట నెల్లరతని
ముద్దుపలుకుల నాడించి ముదముతో వి
నంగఁ దా 'భుజంగముఁ' డయ్యె జంగముందు॥ 121

తే॥ క్రమముగా నాడ నేర్కెడిగడప దిగడి
గడప' యన్నట్టు గునగున నడచుచెప్పుడు
చవితినాఁటి వినాయకు సరణిఁ గనుచు
'నింటనింటను దీవించి' యిల్లుసేర॥ 122

తే॥ తల్లిముద్దిడి నాయనా! తగునెనీకుఁ
గానిదేశమునందిట్టులా నెతిరుగ

నసుడు ‹భయమేమి? యేదేశమైననేమి?
‹సుబ్బిరామంతల్లులు' లేనిచోటెదియును॥ 123

తే॥ ఇట్టి చవిగలుఁపల్కులఁ గొట్టిపోసి
ముద్దులొలికించి నవ్వించి ముదముఁ బెంచి
మురిపెమొసవించి బాలుండు పెరుఁగనొకటఁ
బిలుచుటకునైన పిత యంకపీఠి నిలిపి॥ 124

క॥ పంచమహాయనమందు
న్బంచమనాసమ్మునందుఁ బంచమదినమం
దంచితపంచమ ఘటికను
బంచాక్షరినేర్పఁ జదువు ప్రారంభముగాఁ॥ 125

క॥ అరుదాపిత్రంకస్థితి గొరకెనటను సంతసంబుతో గుటినిల్పెన్
మఱియెప్పుడువరుసగన క్కరములనే ద్దారిఁ కేరు కటపకయున్నన్॥

తే॥ బహు తపోధనజనక వాఙ్మహిమమొకొ!
పార్శ్వకనార్యోక్త సుముహూర్తబలమదొకొ!
బాలకకుశాగ్రబుద్ధి సత్ఫటిమమొకొ!
‘గాలికబ్బెను'గద యక్కరాలచదువు॥ 127

క॥ ఆపంచమహాయనమం దేపన్నదినంబునందొ యెవ్వరోవిప్రుల్
దాపున జపనిష్ఠందగ సెపిన్నయతంబుడాసి యిందొక్కరుని॥

ఆ॥ చెప్పుమంత్రమోయియప్ప నాముద్దుగాఁ
జెఱుకువరకుల సన్నింహుఁడతఁడు
దీపికాసరస్వతీమంత్ర ముపదేశ
మోర్పుమీఱఁజేసె నొద్దఁజేర్చి॥ 129

క॥ ‘పువుపుట్టఁగానె పరిమళ
ము' విదితమనుచందముననె ముందితనిమనం
బువఱలు జపముననసై
శవమందాటలనుగూడ జపమేయయ్యెన్॥ 130

క॥ అకలంకపు బాలకహృది వికసిల్లఁదమంబువాయ విజ్ఞానపు దీ
పిక సల్పినవైఖరి దీపికహృత్పీఠమునవిల్చి వేత్తృతఁ గూర్చెన్॥

## జనకుల యప్రతిగ్రహనియమము

క॥ గడచుచునుండఁగ దినములు
కొడుకుల రామన్న యనెడు కోటీశ్వరుఁడా
తఁడె తత్పుత్రాధిపుఁడ
ప్పుడు కామేశ్వరునిదాయఁబో నొకనాఁటన్॥ 132

తే॥ సత్త్రమధ్యస్థమైన విశాలశాల
సీననై యున్న దేరిదో ధేనువుఁగని
తాఁ గ్రయమొనర్చి యప్పుడే దానమీయ
ఫలదమని కామఫేమణిపాదములకు॥ 133

క॥ రభసంబునఁ సాఁగిలఁబడి
'యభవ' తరింపంగఁ జేయుఁ డయుతధనముతో
నుభయముఖీగోవత్సము
శుభమతి మీరల్గ్రహించుచున్నా నంతన్॥ 134

క॥ 'కాలన్వేలంబడినను' జాలగ బతిమాలుకొనిన జాలం బేలో?
వేలెన్నిచ్చినఁ గొననే స్వేతా పండితులకొఱకు వెదకుదమంచున్

తే॥ తృప్తియను నాస్తి యీశు నర్థింపఁగూర్చు
బకజపంబొనరింపఁ గానుకలకొఱకుఁ
గాలుకడిగించికొనన నేను గైకొననెది
సుతులకష్టార్జితంబింక భృతికిఁజాలు॥ 136

తే॥ అయిదుతరములఁ గూర్చిన యర్థమెల్ల
తెప్పపాటున మాయమైనప్పుడైన
ధనపునస్థిరతనుగాంచి మనఁగలేక
కూడఁబెట్టఁగ నిట్టికక్కుఱితిఁ దగునె? 137

తే॥ చిరతపఃఫలమెల్ల మీపరమొనర్చి
పరము నాకింక శూన్యమైపరఁగునట్లు
దానము గ్రహించుటను మీఋణానఁబడుచు
భవభవంబులఁ దీర్చికోవలయుఁగాదె॥ 138

తే॥ దాతవేఱు మఱిప్రతిగ్రహీత వేఱు
గాదటను వేదసారంబుఁ గన్నవారు
మిమ్ములఁదరింపఁజేయసౌ మిన్నవారు
నున్నవారుకదయ్యా రామన్నగారు! 139

తే॥ ఆత్మతరణార్థమే పాటునందువాఁడ
నగుట దయతోడ ననువీడనగును బ్రోడ!
యిన్నిదినములు సత్త్రమి ట్లిచ్చినాఁడ
విట్టి మేలేనుమఱతునే యెపుడుకూడ॥ 140

శా॥ దీవెంబెట్టిననీదుపేరెతలఁతున్ దీవింతునెల్లప్డు, సం
భావింతు న్ననుఁగష్టకాలమున నవ్యాజానురాగంబునం
గావంజూచిననీయుదారగుణ సంభూతంబె స్తోతవ్యమా
దేవీగంజునఁగట్టితిన్గృహముఁ బ్రీతిన్వీడుఁ డేఁబోయెదన్॥ 141

తే॥ వరమతింగని, కనకవిష్ఠురతదీన
నన్నుమోమోటపెట్టకు మెన్నఁటికని
పరిసరస్థితుఁ డొక వేదపారగునకు
దారవోయించిసుకృతంబుఁ దానుఁగనె॥ 142

తే॥ ఇట్టివిప్రాగ్రమవృత్తి నిక్కట్టులందు
నైత నొకరీతి వర్తిల్లుజనకునీతి
పుత్త్రిలకు నుగ్గుఁబాలతో బోధచేసె
నప్రతిగ్రహనిత్య దీక్షాచరణము॥ 143

## —♦ లో క జ్ఞా న ము. ♦—

తే॥ వీరలంతట స్వగృహప్రవేశమైరి
బాలకుండీడవలె నాటపాటలకటఁ
జేరువందగు నిండ్లకేచేరుచుండ
నందు నొక్కటియయ్యె వేశ్యాలయంబు॥ 144

తే॥ బాల్యన కదెశిక్షాపాఠశాలయయ్యె
గణికలఁగనఁ బ్రాపంచకజ్ఞానమబ్బె

సతినాథుఁ డక్రీడి కాక్కి తిరిగెలియు
బుద్ధివికసించె, బహుళ నైపుణ్యమొదవె॥ 145

క॥ ఆయింటన్ జననీసుత లై యొప్పు న్వాకాంత లందపునికఁ గల్
ప్రాయపువారాధవులు నేయుద్యోగస్థులైన నిలుసేరంగాన్॥

తే॥ వారితోడను దద్బాటు వారితోడ
బాలకులు చేరి చతురంగ ఖేలనంబు
చీట్లు పేకటాలపాటఁ బచ్చీసు నారి
తీరి గంజీఫయు దశావతారి యాటు। 147

తే॥ ఆభుజంగులు ద్విజులైన నధికులైన
జారసతులస్పృశ్య పదేశకముగాను
దమలమూయుట కొట్టుట తన్నుటయును
నీ 'భుజంగము' కనుచుండె నిట్టులుండ॥ 148

తే॥ ఇతర విప్రులో నిజ పురోహితుఁడో రాఁగ
మూలమూరంగ నాసీను ల్మునుఁగులఁ గొని
వారి సతు లెదురేగి తత్పాదధూళి
ఫాలమునఁగొని భక్తిఁ దాంబూలమొసఁగ॥ 149

తే॥ సంపద యెకున్న దొంగాట జారుఁడైన
ధనముమరియాదవా ననాదరముఁ గనుట
ఘనుఁడుగాకున్న దొరయాటఁగామిగామి
వేశ్యయు న్వానినే గౌరవించుటయును॥ 150

క॥ ఈనాటకములఁ గాంచుచుఁ
దానాడనెయుండి బుడుత తత్త్వమెఱుంగం
గానయ్యెను బురుషోత్తముఁ
డై నిర్మలచరిత మొప్పనట్లు మెలఁగన్॥ 151

తే॥ ఇట్లు కొంతలోకజ్ఞాన మేర్పడుటయె
కాక నేవుల నచ్చోటఁ గలియుచుంటఁ
బ్రేలఁగొట్టుచునుండెఁ దుర్కియునాడ
భరతశాస్త్రమ్ముఁ గొంత యభ్యస్తమయ్యె॥ 152

క॥ అష్టమవర్షమురాన పుష్యసుశుద్ధిగ ముహూర్తమూరసి ద్విజతన్
శిష్టత సుతునకుఁ గూర్చు న శ్రేష్టముతో నుపనయనము పిత
గావించెన్॥ 153

తే॥ విమలత నీఁక సంధ్యావందనము త్రికాల
ములఁ బొనర్చుచు నర్చనంబున సహస్ర
లింగములనేఁత నింట మునింగివిన్కి
మంత్రసూక్తాళి నమక చమకములబ్బె॥ 154

తే॥ ఉపనిషన్ముఖ్య వేదభాగపరిచితియుఁ
గోశశబ్దావళీకావ్య కోవిదతయు
వ్యాసవాల్మీక కర్తృక పాఠకతయుఁ
జెవులఁబడవచ్చెఁ బోతభాగవతగతులు॥ 155

మ॥ జనకాధ్యాత్మికబోధలం దెలియఁ బ్రజ్ఞావైముషీ శేముషీ
ఘను లుద్యోగులు సాహుకారులును రాఁగాఁ దానునా ప్రక్కఁ జే
రి నిదానమ్మగ ధర్మమర్మముల గుర్తింపం గనెన్ బ్రాజ్ఞతన్
దినముల్గొన్ని యిటుల్లసన న్మొదటమ్రిందె నోసదకీజ్యేష్ఠతాన్॥

తే॥ అదె కుటుంబక్షయంబున కాదిగాఁగఁ
గష్టమననేమొ తెలియఁగాఁ గలిగె దాన
నంతట ద్వితీయభగినియు నంతరింపఁ
గొలఁదినెలలకె యింట వ్యాకులము హెచ్చె॥ 157

మ॥ ఇలువీడన్మనసాడదయ్యొ, నెపుడాయింటందగ న్మాత గా
సిలుచుంటం గనఁజాలఁడయ్యె నిటులం జింతాకులస్వాంతుఁడై
తలపోయం జనిపోనివారెవరు? ఖేదంబంద లాభంబు లే
దిలజన్మించు టిదెల్లఁ జచ్చుటకెకాదే యంచు నెంచంగనెన్॥

మ॥ జనకుం డింతటిగర్భశోకముల నీషణ్మాత్రమే నైక్క సే
యనిహృద్రూఢిని నిత్యనిష్ఠఁ దగి వేదాంతార్థము న్తెల్పు రీ
తిని జూడంగను బ్రాజ్ఞవర్తనము గుర్తించెన్ హృదిన్నాటఁ దా
ననుభావ్యాఖిలకష్టనష్టములఁ జింతాపేతచిత్తుండుగాన్॥ 159

ఉ॥ ఇమ్మెయి మాసముల్ గడవ, హృత్పుటిమంబుఁ బరీక్ష సేయనో!
తొమ్మిదె యేండ్లయప్పు డటఁ దుఃఖపరంపర ప్రాప్తమయ్యె నొ
క్కుమ్మడి నొక్క మాసమున నూర్ధ్వగతింజన నాఁడఁ దండ్రి దూ
రమ్మునఁ బెద్దయన్న తన ప్రాణము వీడఁగఁ దల్లితల్లియున్ 160

ఉ॥ ఏమని చెప్పుదున్? దుహితలిద్దరు భర్త మహానుభావుఁడౌ
కామసుశేవధుండు తన్నుఁగాచెడి జ్యేష్ఠ తనూభవుండునుం
బ్రేమనుగాచుతల్లి మరణింపఁగ నేవురు నొక్కమాఱుగా
రామ! యిఁకెట్లు జీవములు ప్రాలక నిల్చునో సుబ్బమాంబకున్॥

క॥ కడుపుబ్బఁ బొరలియేడ్చును
నడిరేయిని బావిదరికి నడచియుఁ బడఁగా
నుడుకును నసిగందులు సుతు
లిడుములఁ బడిపోదురనుచు నెదఁ దోఁపంగాన్॥ 162

క॥ ఉదవధియె పొంగిననాఁడే
మొదలే లేకుండఁ బోయె, 'ముప్పునఁ దిప్పల్'
'పదిమందితోడఁ జనిపో
నది పెండ్లితోసమంబ' టని మదిఁ గుందున్॥ 163

ఆ॥ దుఃఖమాపలేక తోఁచనమైనెంచి
కోలెకాని మార్చికోఁగఁ దరమె?
యెవనికర్మఫల మదెప్పటికట్టుల
ననుభవింప నగునో యట్లవుఁగద॥ 164

తే॥ ఎఱుఁగనప్పుడు మృతియననే భయంబు
వరుసఁజూడఁగ నదె పరిపాటికాదె?
లేఁతదైన యెడఁద నవనీతసదృశ
ము నదె వరుసఁ గష్టాలంటి మొద్దువాఱు॥ 165

తే॥ కానఁబ్రపంచ మొకనాటకంబుగాను
కష్టసుఖములను సమానదృష్టితోను
గనఁగఁజాలుటె ప్రాజ్ఞత యనునిరూఢిఁ
జిత్తమునఁగాంచెఁ జినపురుషోత్తముండు॥ 166

క॥ తరువాతమూఁడుసంవత్సరము లటజ్ఞాతవాససరణి న్వారుమ్మ
వ్వరు జననీసుతు లుండిరి పరస్థలమ్మునను పమనివాసము
గాఁగాన్॥ 167

## అయాచితముగా నబ్బిన విద్దె.

సీ॥ ఆకాలమున వారు లేకాకులైయుండ
శ్రీకాకులం జేరి సుబ్బమాంబ
నూరార్ప నొకవృద్ధవారాంగనారత్న
మేకెత్తెపరిచర్యఁ దమ నొనర్ప
మున్నన్న యుద్యోగమున్నన్న సేయఁబోఁ
జిన్నన్న చనుఁబితృశిష్యులఁగనఁ
జేరిమమ్మున న్వారు సేమమ్మునారయఁ
గా మంజులోక్తి సుఖంబుఁ దెలుపు॥
తే॥ బుద్ధిమొద్దిక ముద్దవు సుద్దులారఁ
గలిసిమెలసి తత్తనయుల చెలిమిఁబలిమి
గ్రాల బెలపరిపహానుమంతరాట్సమాఖ్యుఁ
డవుహుజూరుఖజాన్జి గృహంబుఁ జేరు॥ 168
సీ॥ శిరిగల్లు నున్నతోద్యోగుల సుతునకు
విద్దెఁగఱపెడి మౌల్వీలిరువురు
పారసీకం బుద్దు నేరుపగణితంబు
సంస్కృతంబుం జెప్ప శాస్త్రియొకఁడు
నొఁగాకవానికి నలవడెఁ 'జెవిటికి
శంఖమూఁదిన' భంగిఁ జదు వొకింతె
శాని పరికరనుజేరి కామయార్యతనూజుఁ
డాసక్తినాలించి యన్ని నేర్చె॥
తే॥ ధాతుమంజరిఁ గోశకథలనుఘార్ని
యురుదులక్షణశాస్త్రము వరకృతులును
యుక్తిలెక్కలు గీర్వాణమొక్కకొంత
'సానవెట్టిన రతనంబు' చాడ్పునఁదగ॥ 169

సీ॥ ఒకమాఱు ఉటుమికాపునకుఁబోయి హితులతో
నరుగు మీరారాము చెరువుఁగనఁగ
నొకతూరి తన్మిత్రశకటంబులెక్కి సీ
తారామ బాగు నుత్సవముఁగనఁగ
నొకసారి దీపావళికి నూరను నవాబు
వెలిఁగింపఁజేయు దీపికలఁగనఁగ
నొకతేప మొహరమునను బయల్వెడలెడి
రమణీయముల సుమ్మటములఁ గనఁగ॥

తే॥ నేగుఁ బలుసాయలేన్లపై నెక్కఁగనఁగ
ఘనమహారాష్ట్ర హరిదాసకథలువినఁగ
స్వమతబోధల బుధపురాణములఁ దెలియఁ
దఱచుగానెచ్చరెంచు నేత్రంబుమీఱ॥ **170**

సీ॥ 'ఇత్యర్థ లిటిభాష' లేవేళ వినుచుంట
నాదిమభాషఁ బునాదివడియెఁ
బురుషసూక్తోక్తమా పూజావిధానంబు
నిత్యముంగన దాన నేర్పుకుదిరె
నాంధ్రభాగవతంబు నపుడప్పుపఠియింప
భక్తిభావంబేరుపడియెఁగొంత
యల్లమహారాష్ట్రహరిదాసు లురుములోఁ
బలుకుకథల బలపడెనమెంతో॥

తే॥ చెప్పనేర్చినదొకఁ-ఘాక్సియె యైన
నోజనబ్బినదే వట బీజసదృశ
మామెఁబురుషోత్తమత్వంబు నందఁజేయఁ
దగినవినయంబు నొడఁగూర్చెఁదాల్మి హెచ్చ॥ **171**

తే॥ చెఱకునరసింహగురుఁడప్డు చేరఁబిలిచి
వేదమధ్యయనంబు కావింపఁజేసి
మంత్రశాస్త్రములందలి మర్మములను
గఱప శ్రౌతముసామిద్రికంబుఁ గొంత॥ **172**

సీ॥ ఈరీతిగానాడ 'నింటికంటెఁగుడిప
దిల' మన్న చందానఁ జెలఁగుచుండ
సన్యోన్య మైత్రి పెంపండ నేర్పడినార
లెడఁబాయనొల్లమి యెసఁగుచుండ
శ్రమమొకింతయులేక చదువునేర్పఁగలారు
కోరకుండనె తాము కుదిరియుండ
నెందఱోపితృశిష్యు 'లెఱుక యేపిడి కెడు
ధన' మనఁదగినట్లు తనరుచుండ॥
తే॥ నట్టితావును విడనాడ నరిది యైనఁ
గట్టినగృహంబుఁ గూడనిక్కట్టులుడుప
నైన వచ్చినయొనమంద్ర నప్పుడుముప్పురే
హైదరాబాదు విడిచిరా నైరితుదకు॥ 173

—♦ ఆ శ్వా సాం త ము. ♦—

ఖ డ్గ బం ధ ము.

క॥ వనజనయనసాయక! కనకనగ నవధృఢతరకార్ముకా! త్రిపురహరా!
ధనదసఖ! శ్రితవరద! శివ! కనఁగదవే కరుణనివ కాచెదుగదరా॥

మ త్తే భ కం ద గ ర్భి త ము.

సీ॥ కుధరధీరాహార! కుంజరాసురహరా!
ధౌతాచలాగార! ధ్యానగమ్య!
శ్రితరమానాధ శచీడ్వ్రిధిత్రిదశ సం
త్రాణైక దీక్షాపరా! పరేశ!
ప్రవరబాణాసుర బాంధవా! పురసుప
ర్వాణారి సంహార! వ్యాఘ్రపీఠ!
గళరమదుర్భూషణ! కంధరాంతరధృతా
లంకార! హాలాహలా! త్రినేత్ర!

తే॥ వినుముభవదాప్తకథయిది ఘనకవిపుర
షోత్తమాఖ్యకర్తృకపతి! యోర్పుమీఱు
మనుపరి! దయనేలఁగదవె; వినుతచరిత!
దక్షిణాంగ! వేడ్కనిడి సదాశివాంక!॥ 175

## గర్భితపద్యములు.

మ॥ ధరశేఖరా! హర! కుంజరాసురహరా! ధౌతాచలాగార! ధ్యా
తరమానాథశచీడ్విధి త్రిదశసంత్రాణైక దీక్షాపరా!
వరబాణాసురబాంధవా! పురసుపర్వారిసంహార! వ్యా
ఘ్రరమద్భూషణా! కంధరాంతర ధృతాలంకార హాలాహలా॥

క॥ వినుముఁ భవదాప్తకథయిది
ఘనకవిపురుషోత్తమాఖ్య కర్తృకపతి! యో
మనుపరి! దయనేలఁగదవె
వినుతచరిత! దక్షిణాంగ! వేడ్కనిడిసదా॥

వరకవినాదెళ్లాన్వయ పురుషోత్తమ జీవయాత్ర
పుత్త్రికకృతతద్గురుచరిత, దక్షిణామూర్తి
రచితమాశ్వాస మిందిది
ద్వితీయంబు॥



# ఉత్తమ జీవయాత్ర.



## తృతీయాశ్వాసము.

క॥ సోమేశ్వర ధృతగంగా కామేశ్వరసుతభుజంగకధ వినుమున్గా
భీమేశ్వర! హృతభంగా రామేశ్వరరామలింగ! రంగారంగా॥ 1

### రామనగరవాసము.

మ॥ భవితవ్యంబులు వక్ష్యమాణగతి నొప్పం దల్లి తానన్నయున్
యువసంవత్సరమందు నగ్రిజవివాహోద్యోగ సద్యోమివన్
యవనోర్వీస్థలివీడి బందుగులడాయ న్వచ్చి, యాంధ్రావనిన్
నివసింపదగుఠావు రామనగరి న్నిర్మించికోనాటయున్ 2

క॥ క్షామపరిస్థితియొదవిన క్షేమముగా రామనగరసీమ నెధాతః
దామటఁగాలక్షేపం బామాడ్కిని పాఠశాలనారంభింపః॥ 3

మ॥ మనబాలుండట నీడుజోడుబుడుతల్ మన్నింపసంప్రాప్త నూ
తనసౌహార్దవిలాస మింపెసఁగ హైదర్బాదునం దానునే
ర్చినయంశంబులబోధసేయు, భజనల్ సేయించు, నయ్యంజనా
తనయుంగీర్తనసేయుచు న్సతతమున్ ధ్యానించుచారామునిః॥

క॥ చిఱుతలు చిఱుతలు కరములఁ
జిఱునవ్వులు మోములందుఁ జెలువారంగా
గుఱిహారి వరపదములనిడి
రఱిమ్రుఱిఁబాప న్భుజంగమానందమువః॥ 5

క॥ అలరామనగరమందుం గలరామాలయముదరిని గ్రాలన్ హనుమ
న్నిలయంబొకండు పర్ణం బులతో నిర్మించి నెయ్యమునఁ
దనరంగాః॥ 6

క॥ వారలఁగొందఱు 'కస్తురి
సూరనపంతులుసమాఖ్యు శుశ్రూషమెయిన్
జేరుటను జల్లపల్లికిఁ
బ్రారంభం బాంగ్లవిద్య పదపడియటఁగాఁ॥ 7

మ॥ చినపాయంపుభుజంగరా వపుడుఫార్సీలబ్జులం జేర్చి హిం
దినిమాటాడెడి పొందిక న్మఱియు బుద్ధింగల్గు నాయొద్ది క
న్వినయంబొప్పుహసన్ముఖుంబుఁ గనుచుం బ్రేమోదయంబొట, నొ
ద్దనుజేర్చెం జనువిచ్చె, మెచ్చె, బడిపెద్దం జేసె, నోజ్జాతనిన్॥

క॥ గురుబుద్ధికి గురుబుద్ధిగ గురుబుద్ధినిదోఁప గణితకోవిదుఁడనఁగా
మఱియక్షరములు ముత్తెపు సరులట్టుల వ్రాయునెంతొ
సంతోషముగాఁ॥ 9

ఆ॥ అన్యభాషలందు న్వ్యాకరించు తెలుంగు
నెఱిఁగి యాంగ్ల మన్వయింపఁగడఁగి
చదువులయ్యెఁ జేరి సందేహములఁ బాయు
స్నానభోజనాది సమయములనె॥ 10

తే॥ అంతఁబొత్తులు నిద్రింపఁ జింతనంబు
తనకదౌనట్లు బోధించుఁ దక్కొరులకుఁ
'జిన్నపంతులుగా' రనుమన్ననఁగన
బోధనైపుణ్యమున్మెచ్చ బోధకుండు॥ 11

శా॥ ఉల్లం బుల్లసిలంగదేశిక్షున కేయుయ్యాలమంచమ్మొ సం
ధిల్లంజేయు, ఘటిల్లఁజేయమదిఁబ్రీతి న్దేనఁ, దత్తత్సహా
త్సల్లాపంబుల 'మాభుజంగ' మనుచుం దానెన్నసూరన్న, యే
మల్లావఝ్ఝుల వేంకటాహ్వయుఁడొ పల్మార్వించుఁ దానొక్కటఁ॥

శా॥ ఛాత్రుండన్నను ఛాత్రుఁడిట్టిఁడ యశస్సంపాదకుండంచు గా
యత్రిఁ బాలుఁడొనర్చునిష్ఠఁగని యవ్యాజానురాగంబునన్
బాత్రంబౌనని యిట్టివానికిడిన న్మంత్రోపదేశంబు తాఁ
మైత్రింజేర్చి యొసంగెఁ దారకమహామంత్రమ్ము ధీతంత్రముఁ॥

మ॥ చదువున్స్మంత్రము లింతవట్టును యదృచ్ఛాలాభమై యబ్బ చే
గ దినంబుల్ చిరయత్నమప్పటికినై కస్తూరి సూరన్నయే
కదలె న్బందరు తింత్రిణీనగరభాగంబందు స్వాగారమం
దుఁ దగంగొంచు భుజంగరావు నటహిందూస్కూలునం జేర్పఁగాఁ

తే॥ చదివెనాతఁడు గొన్ని మాసంబులాడఁ
దగుచునగ్రినఁ దోడివిద్యార్థులందుఁ
జెప్పియితరుల కార్జించి జీతముకయి
కస్తితో దినమొకయింటఁ గడపెభుక్తి॥ 15

తే॥ సెలవులొకయప్డూరాఁ దనుసెలవు సేరి
తిరిగిరా నిరీక్షించిన గురుసుతుండు.
పిత నిజాంగనవినఁగఁ గోపించుటనొకా!
'రమ్ము'పోవలె బంధుగృహమ్మునకనె॥ 16

—♦ క వి తా స్వ యం వ ర ము. ♦—

ఉ॥ ఏరికిఁజెప్పకుండ నటులిర్వురు కాల్నడ నేగిరప్పు డి
చ్ఛారతి ముందువెళ్ళలువిచారణసేయక, కాళులీడ్వనా
దారినిబట్టి యారయక దవ్వది యింతనిచింతలేక, వే
సారక యాటపాటలను, సత్త్రములన్ డిగు చచ్చుటచ్చుటన్॥

ఉ॥ బాట బయళ్ళుఁ బల్లెలును బట్టణము ల్వనసీమ లెన్నియో
దాఁటుచు దర్శనీయవివిధస్థలము ల్గని సంతసించుచుం
గూటికిఁబాటులంబడచుఁ గొన్ని దినంబులు పస్తులుంచు, దే
శాటనకష్టము తెలియఁజాలిరి బాలు రపేతభీతులై॥ 18

ఉ॥ ఆతటఁ గోనసీమఁదిరుగాడి సరస్సులమున్గి, సైకత
వాత్రిములన్వసించి ఫలభార వినమ్రమ తరువ్రి జంబుల
న్గోఁతులమైఁజరించి, నవకోమల సుస్వన కీరశారికా
గీతము లాలకించి, తిలకించి, విరించి సృజించు టెంచుచున్॥ 19

శా॥ చేతంబై కవితాలతాంకురసమీచీనం బెటంబల్లకీ
ప్రోఁత ప్రోన్మఁగి ప్రతిధ్వనింపఁ గవిభీముండల్లశ్రీనాథుఁడున్

జాతోదారవసంతపుష్పాకరకలి తేజస్స్ఫూర్తి దీపించిరో
పూతప్రాగ్భవపూరుషోత్తమకళాపూర్ణోదయం బాడఁ గాన్।
ఉ। కోమలచారుకైరవసఖుల్ సరసుల్గొనియాడ యామినీ
కామిని సౌరభాంచిత వికాస విలాస విశేష సత్ప్రథో
ద్దామిని సాంద్రపప్రభ సుధాకరు నాకరుణాకరు న్ప్రభున్
గామునిఁగూడి రా, సరిగఁ జక్కలయుంబలె నొప్ప శోభిలన్। 21

ఉ॥ అల్లనఁ బిల్లగాల్లు పరిమాచకమాడఁగ, నాడనాడ స
త్పల్లవ కోమలాంగులు లతాలలన ల్తల లూఁచుచుండ, ను
త్ఫుల్ల మనోజ్ఞ శోభవతు ల్నవపుష్పవతు ల్సుమావళు
ల్జల్లన రాల్పసంబోదవ జాఁగఁజేయఁగఁ గొమ్మ లమ్మహిన్।
ఉ। కోఁతులు రాలుగాయలనఁ గొమ్మలపైఁబడి పండ్లురాల్పఁగాఁ
జూతము చూతమంచరిగి సూనశరుం డటఁడాఁగి యెక్కిడం
జేతము లెల్లమాఱె తమచేష్టలుదప్పి వసంతరాత్రిలం
బోతులు పెంటుల న్వెదకఁబోవఁగఁ బెంటులు పోతులంగనన్॥

ఉ॥ స్వాదుఫలంబులన్మెసవి సైకతసీమను విశ్రమించి, యా
హ్లాదదచంద్రికాద్యుతి వియద్రమణీయతఁ గాంచి, బంధురా
మోదసమీరతాడన విమోహితుఁడై యొకరాత్రి నాత్మ భా
వోదయ మేర్పడంగఁ బురుషోత్తముఁ డున్నెడ కేగుదెంచితాన్॥
సీ॥ చంచరీకావళీ సామ్యాలకవిలోల
చారూత్పలాయతేక్షణసుకాంతి
చంపకనాసికా చంద్రికాహాస, శ్రీ
సమకర్ణ రాజిత చంద్రవదన
మేఘవిస్ఫూర్జిత మేచకధమ్మిల్ల
కుసుమవిచిత్ర చికురసుగంధి
మౌక్తికమాలికా మణిభూషణ ప్రభా
కలితాల్పతనుమధ్య కనకలతిక।
తే। ద్రుతవిలంబితమత్తేభ రుచిరగమన
మత్తకోకిలాసుస్వన మంజువాణి

మదనవిలసిత రమొకతన్వి మధుమతియిడె
స్వాగతంబుఁ బ్రియార్షిణి యాటవెలఁది॥ 25

సీ॥ భూరికార్ముకవిముక్త పుంఖానుపుంఖ 'ఖాశు'
గాలోకనానీక కదనసీమ
ముఖకాంతి దివ్యసమ్మోహనాస్త్ర విలగ్న
లలిత 'చిత్ర' కళా విలాససీమ
వ్యాప్తబాహుమృణాళ 'బంధ' ప్రబోధిత
బహువైఖరీగమ్య భాగ్యసీమ
నర్మ 'గర్భా' లాప నానావిధ పదసం
దర్భ శృంగార సౌందర్యసీమ
తే॥ బాలకవిరామ సుకృతివిపంచికామ
నోహరారామ సూత్నవినోదసీమ
గేయవృత్తామలానంద కీర్తికామ
మదనశరధామ మయ్యెఁ దద్హృదయసీమ॥ 26

చ॥ అతనువికాస మేర్పడ నయాంచితవృత్తి స్వయంవర ప్రకీ
ర్తితసరణి న్వరించి నిజధీధితినించి వరార్థలీనయై
యతిహితసత్పదాప్తి ముద మందఁగఁ జేయఁగ వాక్ప్రమత్రికా యో
న్నతి మెలఁగం జెలంగెఁ గవినాథ సనాధ కవిత్వతన్వి తాన్॥

ఉ॥ ఆకవితావధూటి హృదయంబు హరించి యటావరించి, భూ
లోకమె నాకతుల్యమన, లోలతఁబెంచి సమంచితావనీ
ప్రాకటవైభవ ప్రకృతిబంధ నిబంధన వర్ణనంబు ల
స్తోకముగా నొనర్పఁగ, రసోదయవాక్కలనం బెసంగఁగన్॥ 28

శా॥ దక్షధ్వంసకశిక్షితామరరిపు త్రైలోక్యకుటుంబరుం
డుదారూఢకటాక్షవీక్షణుఁడు, విద్యుత్తుల్య దేదీప్యమా
నాక్షీణాసమ భీమభీమ నుతభీమాభిఖ్యుఁ డేలంగ సా
క్షారామపురంబుఁ జేరి, కవినాథస్తుత్యు దర్శింపఁగాన్॥

మ॥ కవితాభోగిని వెంటనంటి తోలువంగా, నాడ నుద్రేక సం
భవమై వేములవాడభీమజనకు న్వర్ణించి ప్రార్థింపఁగా.

భవ్యుఁ డానందమునంది సాయమొనరింపంగూర్చెఁ జేయూఁతఁ ద
త్కవితామానినితోడి కాఁపురము సాగం గీర్తిసంధాత్రిగాన్॥

ఉ॥ ప్రేరణ దైవికం బనఁగ వేగమ పోయిరి వృద్ధగౌతమీ
తీరసమీపమల్లవరదేశమునందుఁ వెలుంగురాజ సో
దారకవి ప్రసాదిత పదార్థసుకస్తురి కాన్కవాయుటా
సూరసయన్నదమ్మునను జూచిరి తత్సుతు గోపనాహ్వయున్॥

చ॥ పొలముల కీడుజోడుగను బోవుచు సాత్త్వపదీనభావముం
వెలుపు ప్రసంగముల్నడవఁ దేజరిలం గవితాప్రచార శ
క్తులు, పురుషోత్తముండు నలగోపసమాఖ్యుఁడు నాశుధారలం
బలికి పరస్పరాభ్యుదయశక్తిఁ దలంచుచు సంప్రతించుచున్॥ 32

తే॥ పావుటావున గోపాలరావు వ్రాసె
గణయతి ప్రాసనియమ సంగతులుకొన్ని
తమ్కముప్పావుటావునఁ దానువ్రాసి
యిచ్చెఁ బురుషోత్తముఁడు కొన్ని హిందినుడుల॥ 33

క॥ ప్రత్యుపదేశప్రక్రియ నత్యల్పమె తానునేర్చి, యాదృచ్ఛిక సాం
గత్యంబున, నెల్లప్పుడు సుత్యుండని యతనిఁ బూరుషోత్తముఁ
డెంచన్॥ 34

క॥ ఒకపూటఁ గవిత నేర్పిన సుకరుం డనియట్టిగోపసుకవి న్వర్ణిం
చి, కృతుల నప్పటినుండి ని జకృతజ్ఞతను బ్రకటించె సద్బుధు
లెన్నన్॥ 35

తే॥ పీ రిటుండ వెనుకనుండి వెదకికొనుచు
వచ్చి యన్నసుబ్రహ్మణ్యుఁ డచ్చటికిని
గద్దదికఁ బిల్చి, తమ్మునిఁ గౌఁగిలింప
నయ్యె నిశ్చేష్టితుండు భయంబు గదుర॥ 36

చ॥ అనుకొన కిట్లకాత్తుగఁ బ్రయాణ మొనర్చ, నకారణంబుగాఁ
దనకొఱ కగ్రజుండు పరితాపముతో వెదకంగ రాఁగ రా
మనగరమందు నొక్కరిత మాత విషాదిత యేమియయ్యెనో!
యనితలపోయుచుం గదురయంబున నచ్చటువాసె నన్నతోన్॥

తే॥ కానరాకుండఁ దనవెంటఁ గదలివచ్చు
నూతనార్థాంగలక్ష్మి శోభాతిరేక
తరుణకవితావిలాసిని మురిపెమిడఁగఁ
జేరిగృహ, మంబకున్మ్రొక్కి, చింతలుడిపి॥ 38

మ॥ చినపాయమ్మునఁ దన్వరించుసతి నాశ్లేషించు నానందమే
యనయం బందుచు నెంచెడిన్, 'సుకవితా యద్యస్తి రాజ్యేనకి'
మ్మనుచుం దత్పదసంవిధాన గరిమాయత్తంబు చేతంబు, నూ
తనభావోదయ దోహద ప్రికృతిచోద్య ప్రేక్షణోన్మత్తమై। 39

మ॥ తనర న్నిర్జనసైకతస్థలులఁ గేదారప్రదేశంబుల
న్వనభూమీరుహశాఖికావళుల నానాఖేచరానీకముల్
వినువీధి న్విహరింపఁ బందెమునకు న్వీడ్కొల్పి తన్మాన సం
బును, దేహం బటుడోలలూఁచుచు, శిరంబుం గంప మందించుచున్॥

మ॥ ముదుతల్వ్రాజినఘాలమేర్పడ నభంబుం జూచు చేకాగ్రితః
జడదారుల్బలెఁ దన్మయత్వమునఁ జాంచల్యంబుఁ బోకార్చుచున్
జడతం దోఁపఁగఁ జేయు చూపొదవ, భాషాకామినీధ్యాన ని
ష్ఠుఁడతండై, పరిణయాగ్రహోపశమనస్తోత్ర ప్రచారంబులన్। 41

శా॥ నిద్రాహారములెంచఁబోక కవితానిర్నిద్రకాంతాలస
చ్ఛిద్రాపంబె విలాసదాయినిగ రంజిల్లం బ్రఫుల్లానసాం
చద్రాజీవనటత్పదోల్లసిత భాషావైదుషీ శేముషీ
విద్రాణంబుగ నాంధ్రభాగవతము న్వీక్షింపఁగా నొక్కటన్॥

శా॥ ధారానిర్జితజాహ్నవీలహరి, శబ్దవ్రాతధారానట
ద్ధారాటంబు రసామృతాంబుధి, యగాధప్రత్నగాథాళికాం
తారం బుత్తమపూరుషోత్తమపద ధ్యానైకవృత్తప్రసూ
నారామంబు మనోభిరామమృదుశయ్యాలంక్రియాగారమై। 43

శా॥ శ్రీరామార్పిత సత్ప్రబంధకవితా సింహాసనంబోయనం
గా రాజిల్లుముముక్షుకల్పకము, భక్తానందసంధాత్రి, భా
షారామామణిభూషణంబు, హరిసాక్షాత్కారనిధ్యాని, యా
ధారం బయ్యెను బోతకర్తృకము విద్వన్మార్గవిజ్ఞానిగా॥ 44

క॥ అవియేమటను చానిడికొని
ముదమందుచు నందుఁ బాదములఁ గొల్చుచుఁ గా
గిదముం బనకోడనూనుచు
నెప ముందుగ రాముఁ బలఁచి కృతిసాగించున్॥ 45

క॥ తనమది కెదికుదిరికఁదగు
ననితోఁచు నసెల్లర్వాసి యాసక్తిమెయిన్
గొనిసంచిట దోషజ్ఞుల
కును జూపంబోవ వారు కోపంబొదవన్॥ 46

క॥ దోషజ్ఞులె తామవుటను
దోషంబులె పెక్కులెంచి దూషించిగుణం
బీషత్తుం గననట్టుల
భాషించుచు 'వెఱ్ఱివాఁడ! పద' మని యనుదున్॥ 47

క॥ ఖిన్నుండై తలవంపుగఁ దన్నంతే వెనుకకీడ్వఁ దగు నట్టులవా
రన్నప్పుడు 'కవనంబిఁక నెన్నంగను జెప్పఁగూడ దెందుల'కంచున్॥

క॥ మరలను మరలను మరలను మరకట్టుగఁజేసి కైత మరగింపంగా
మరపయి మరపయి మరుపయి మరయన మరువునను మఱుఁగ
మఱిమఱియాపైన్॥ 49

## —♦ సాక్షాత్కారము. ♦—

క॥ 'ఏమయ్యా? భీమయ్యా!
కామయ్యసుతుండఁ గరుణఁ గాంచఁగదయ్యా!
రామయ్యా! మీజోలికి
రామయ్యా దయ్యమిద్ది రానేమనుచున్॥ 50

క॥ కన్నుల నశ్రులురాల వి
షణ్ణుండయి కూరుచున్న సమయము నందున్
వెన్నునఁ దట్టుచు విప్రుం
డెన్నండు నెఱుంగనట్టి యితవరి యెవరో॥ 51

క॥ సాదరముగఁ దననుగని వి షాదంబునఁ బద్యమల్ల సాగ దిదేలో!
స్నేహోరణి నేఁజెలియఁగ నేదే న్వినిపింపు, వినఁగ నేవచ్చితినాన్॥

క॥ తనపిచ్చితనకె కాకిటు లనువారలు నున్నవారె? యనితనమదిలో
ననికొంచు సవినయంబుగఁ గనుఁగొని జనకాప్తుఁడంచు గౌరవ
మొనయన్॥ 53

క॥ తెప్పిజేన ట్లప్పుడుతాఁ జప్పునఁగాగితముఁదీసి చదువుచుఁదప్పుల్
చెప్పుండని మెప్పందుచు నుప్పొంగి, యిదేమి? సామి! '
యొరులని ఁరిసి' నాన్॥ 54

మ॥ కవితాకన్యక శాబ్దికుంబితఁగఁ బర్కజ్ఞు, న్నిజభ్రాతఁగా
ను వరింపంజన దంత్యుఁగాఁ దిగెడి స్థానంబున న్నృపక్ష వే
దవిదుంగాంచి నపుంసకుంబగిదిఁ బొందంబోదు మీమాంసకున్
భువిఁ గావ్యజ్ఞు నలంక్రియాజ్ఞుని రసజ్ఞుం జేరఁ దాఁ గోరుచున్॥

మ॥ కవిసార్వాది చిరప్రియత్నరచిత గ్రంథాచ్ఛభూపాళిఁ జూ
ప విచారించి బుధుల్సరాబు లనాలోపంబున్న శంకించి మే
రువుఁగానెంచి కృతిన్ హసించుట పురంధ్రుల్ స్వైర గోష్ఠాల్ల భా
వ పరక్తింగని బిడ్డనొప్పిని గ్రహింపనేక వాపోవుటా॥ 56

క॥ నీపూర్వపుణ్యవశమున నీపాలిటఁ బజెనుగైత నిర్మలయశముం
జేపట్టుదు కృతిరచనన్ బ్రాపై నీకొప్పు దక్షిణామూర్తియనన్॥

క॥ 'బాబూ! త్రోవంజూపుం
డేఁ బోయెద నతనిఁజేరఁ గృపఁగనుఁ' డనుడుఁ
నేబ్బాసు మంత్రిజపమున
నీబుద్ధిని గుదిరికొప్ప నీకడన తగున్॥ 58

ఉ॥ తాతలనాఁటినుండి సతతమ్మును మిమ్ములఁగాచుచుండి ని
ష్ణాతులఁ జేయుచుండు కరుణామయుఁ డాతఁడె, తత్త్వపంబునన్
బూతుఁడు కామయార్యుఁడయి పుత్త్రులకయ్యెదె నేర్పె, వర్ణనా
తీత మదన్నఁగోరి యుపదేశమునందు మటంచుఁ బల్కెపోన్॥

క॥ తానింటికిఁ జనియడుగం
గా నన్నయు ననుజరీతిఁ గనితనమదిలో

రానౌ కార్తిక పూర్ణిమఁ
దానే యుపదేశమిడఁ గఁ దలఁచితి ననుడున్॥ 60

## —♦ శ్రీ దక్షిణాస్య ప్రసాదము. ♦—

ఉ॥ ఏమఁగు నెక్కినట్లరి యెప్పుడ చెప్పుడటంచుఁ దజ్జపా
ధీనమనస్కుఁడౌచు నుపదేశదినంబునకే యహర్నిశ
ధ్యానపరాయణుండయి దినార్థము లబ్ధములట్టులొప్ప, నీ
ధ్యానముకై గణించిగడియల్, భజియించుచు దక్షిణాస్యునే॥
క॥ ఇరువదిదినములు గడపం బరమపవిత్రప్రమాథి వత్సరమదిగాన్
గురుఁడై సుబ్రహ్మణ్యుఁడు పరమపవిత్రప్రమాది వత్సరమునఁదాన్
శా॥ బోధించెం గవితావశీకరణసంభూతైకయంత్రమ్ము, స
న్మేధావిస్ఫురణప్రతీత విబుధానికేద్య తంత్రమ్ముఁ బ్ర
జ్ఞాధైవత్యవిరత్యయ ప్రిగుణానిష్ఠాసాధ్యజంత్రమ్ము, స
ర్వాధిప్రాధమికాంత్రివిర్దళనగ మ్యాదంత్రిము న్మంత్రమున్॥
మ॥ పెదవుల్దాఁటి గురూక్తి కర్ణపుటము న్భేదించి లోఁజేర, నె
య్యదియా సర్వనిజేప్సితార్థదమటం చాలించి యాసించి, నె
మ్మది నక్తందివము ల్వరించిఁ గరుణింపంగోరి ధ్యానించె, న
య్యదె, ప్రాపించి తరించి మించితినటం చాసక్తి శిష్యుండికన్॥
శా॥ విద్యుచ్ఛక్తిపరీత లోహలతికా విద్యోతి తాగ్నిద్యుతి
ప్రిద్యోతప్రతిభాభిరామ కళికాగ్రప్రిజ్వాల ద్గాఢమో
హ ద్యుమ్నాంధ తమఃప్రిదీప సదృశవ్యాకోచ హృత్కంజ స
ద్విద్యా స్పృష్ట కుశాగ్రబుద్ధి లతికా విస్ఫూర్తి దీపింపఁగాన్॥
మ॥ గుడిలో నిర్గుణసచ్చిదాకృతిని భక్త్యున్మేషమేపార, స
ద్గురువర్యాంకిత దివ్యలింగు, స్ఫటికాంగున్, స్వచ్ఛముక్తావళీ
ధర, దివ్యామృతభాండసంకలిత ముద్రాభోగిభూషేందు శే
ఖర ఫాలేక్షణదక్షిణాంగు సగుణాకారంబుగా నెంచుచున్॥ 66
శా॥ 'నాన్యఃపంథ' యనంగ సంతతశర ణ్యాగణ్యపుణ్యాఢ్య స
న్మాన్యాముష్మిక సాంప్రదాయక లసన్మార్గోత్త మాంఘ్రిద్వయీ

విన్యాసానుగతోపదేశ మహిమావిర్భూత తత్త్వైక చై
తన్యప్రాభవ ధీబలంబొదవఁ దద్ధ్యానంబె యానంచెదన్॥ 67

మ॥ చలనంబింతయులేని నిబ్బరముతో సంతుష్టచేతస్కుఁడై
నిలుపం దద్ధృదయాబ్జపీఠమున వాణీవల్లభత్వంబు ప్రా
ప్తిలెనా సూక్తిపటుత్వభాసి కృతికర్తృత్వానుకూలప్రభా
విలస ద్బుద్ధివిశారదత్వమున దీప్తిం గాంచిన ప్లాటయున్॥ 68

క॥ స్థిరమై యదియలరఁ బుర శ్చరణంబుఁ దదేకదీక్ష సాగింపంగా
నిరువదిదినములు మనమునఁ బరిపక్వస్థితి యగపడె స్వప్నం
బందున్॥ 69

క॥ కుదిరికచిక్కనపిమ్మటఁ జదువ న్మొదలిడిన కావ్యజాలమునందున్
మదికేక్లిష్టతతోఁపక విదితముగా నన్వయార్థ వివరణ మదెకాన్॥

తే॥ రచనవైఖరి తెలియఁ దా రచయితయయి
దక్షిణామూర్తిదీపికా ద్యష్టకములు
గురునమస్కార పద్యము ల్గూర్చియంపె
రహినిగస్తురి గోపాల రాయనికిని॥ 71

క॥ అంతట గురుశిష్యులకు
న్నంతనములఁ బ్రేమ హెచ్చ నవ్యవిలేఖల్
పంతంబులతో సాగఁగ
వింతగస్ఫూర్త్యాభివృద్ధి వెలయుం గవితన్॥ 72

చ॥ ఇదియిటులుండ జీవనమదెట్టులముం దనుచింత కల్గనే
యధమము భ్రాతృవిత్తమగు స్వార్జితమైననె యుత్తమంబటం
చెదఁ దలపోసి, కూడదు శ్వవృత్తి పరిభుత్వపువారి సేవయుం
చుఁ దుదకునొజ్జయైన యలసూరనమార్గమె యాశ్రయింపఁగన్॥

క॥ మది నిశ్చయించి మునుదాఁ
జదివినదా చల్లపల్లిఁ జదువులబడి క్రొ
త్తది స్థాపించి తెనుంగు
న్మొదలిడి యాంగ్లంబు ఫార్సి బోధింపంగాన్॥ 74

క॥ చదివించుట, కాంచుకుప్రతు
పదిహేకలు స్వార్జితంబు పాండిత్యంబుం
గుమరుల వ్యాసంగముగా
బడియేనదయేట జనులం బలువురువినఁగాన్॥ 75

క॥ శతకము సీతారామాం
కితముగ 'మన్మతి చరిత్ర' కృతులింకేవో
కలిపియు పద్యశ్లోక
ప్రతతియు వినిపింపమెచ్చు రసికుల కోకటన్॥ 76

క॥ సంతోషమొదవ రాయలు
కంతేటిక్ములీఘుఁడా నోకానోక వైశ్యుం
డెంతయు నెయ్యంబొనరం
బంతులుగారిం బిలిచ్చి బందరు కొనిపోన్॥ 77

తే॥ పీఠిబడి గౌరవము కాదు వెడలుఁడనుచుఁ
దమగృహంబున స్నేహమైఁదనరుమనుచుఁ
బూటకూటింటఁ దిండి కేర్పాటొనర్చి
కోరినదొసంగి సేవంబు నారయంగ॥ 78

క॥ పనిసెప్ప ఱెడ్డియైనను దనతోఁగాలంబుఁ గడపి తరుణానందం
బునుగూర్చెడి యాశుకవిత చనువునఁ దానడుగఁ 'జెప్పు, చాలు'
నటనుడున్॥ 79

చ॥ ధనికసహాయ మష్టముల దైవికమై సమకూడ నాడఁ బ్రా
క్తనబహుళాంధ్రసాంస్కృతిక కావ్యములం గొనిపించుచుం బఠిం
చినయది సాహుకారునకుఁ జెప్పుచు నెప్పుడు గ్రంథచింతనం
బునఁ గవితావిలాసములఁ బ్రొద్దులుపుచ్చుచు బుద్ధిఁ ద్రచ్చుచున్

క॥ చతురంగ ఖేలనంబునఁ
జతురత నవధానపటిమఁ జాటి సమస్యల్
నుతమతిఁ బూరింపంగా
హితులెల్లరు మెచ్చ నిచ్చ నెచ్చరిక మెరుఁగున్॥ 81

క॥ భువి 'దుర్జనస్వభావా
భివర్ణన' మను నొకపేరు పెట్టుచుఁ గబ్బం
బెవరో పరధనహర్తల
యవగుణముం దెల్పు సుగుణ మంది ప్రకటించెన్॥ 82

క॥ ఈమెయిఁ జను దినములలో
నేమాత్రము వీలు చిక్క నేదో లెక్కన్
దా ముచ్చట పడి వ్రాయుచు
నేమియు నలదన్న వినక ఋణ మిటు తీర్చెన్॥ 83

ఉ॥ కోమటులందు బందరునఁ గోవిదవర్యుఁడు కీర్తిశేషుఁడౌ
మామిడి వేంకటార్యునిది మాన్యవిఘుంటువరేణ్య మా విశే
షామరముం బరిష్కరణ మాతని పౌత్త్రుని ప్రార్థనంబునన్
ధీమెఱయంబొనర్చి ప్రణతింగొనెఁ దద్ధనరూపసత్కృతిన్॥ 84

తే॥ అంత వేఱొకవర్తకుఁ డాశ్రయింప
నీతిమంజరి కర్థముల్ నియతి వ్రాసి
యిచ్చి యాతండె యద్దిముద్రించి యమ్మ
వచ్చు లాభంబు నం గొనెఁ బ్రతిఫలంబు॥ 85

క॥ ధనమిట్టుల ననుపుపడం
గ నదప్పటియతఁ డుగాన కావ్యోత్తమమై
తనర 'సహాల్యా సంక్రం
దన నాటక' మొకటి వ్రాసి తాఁ బ్రచురించెన్॥ 86

క॥ మఱి బడిచదువున భుక్తికి
వెనవుగ నల 'ఫిప్త్ర్ గేడు' 'స్పెషలప్పర్ ప్రై
మరి' 'యంకవనెంబె' ల్లను
పరీక్ష లప్పుడు మున్నె ప్యాసైయుంటన్॥ 87

క॥ ఆపట్టున నూతనముగ
స్టైపెండేర్పాటుగలుగు ట్రైనింగ్ సూ్కలున్
స్థాపింత్రన దరఖాస్తును
ప్రేషంపి పరీక్షఁ దేరి వెంటనె చేరెన్॥ 88

కం॥ [illegible]
గాలవమునఁ బ్రధానబోధక ప్రార్థితుఁడై
'బాలవ్యాకృతి' సత్పత
ల్యాలోడన మొనసిచేయ లఘుకౌముదియున్॥ 89

తే॥ అప్పుడందందుఁగల సందియంబులుడుగ
* ధాతురత్నాకరగ్రంథ ధాతయైన
నరకొమాండూరి రఘునాథ పండితేందుగ్రఁ
జేరఁ బ్రశ్నములనుమెచ్చి చెప్పనతఁడు॥ .90

క॥ ఇవ్విధమున లక్షణకృతు లెవ్వేవో కలిసివార లెవ్వారుసదువన్
నివ్వటిలెం బాండిత్యము నువ్విలనాదరువుఁ బుణ్యపురు
షార్థంబుల్॥ 91

— శ్రీ ము క్తి కా న్తా పా ణి గ్రహ ణ ము. —

క॥ ఆపట్టునఁ గన్నెలపిత లాపొందిక లెల్లఁగాంచి యత్యాతురతన్
మాపిల్లను మాపిల్లను జేపట్టుమి రమ్మటంచుఁ జేరగనందున్॥

---

* 'సీ॥ శ్రీవైష్ణవాచార్య శేఖరగ్రహమిత్రుఁ
డా కొమండూరి వంశాబ్ధిసోముఁ
డతులసర్వజ్ఞతా ధృతసర్వమంగళుం
డవనిపసభికొంతరార్యబుధుఁడు
విద్యార్థినిర్జరవితతి గురుఁడు, ధాతు
రత్నాకరాదిక గ్రంథసుకవి
బహుశిష్యలాలనావహశోభమందుండు
వరపండితోత్తమ భానురాహు॥
గీ॥ దక్షిణ లక్షణపారజ్ఞతాంకకేతుఁ
డు, రఘునాథార్యుఁడురుయశుండు
హిందుహైస్కూలు పండితుండిహమువిడిచె
గ్రహములవేలకీ హరియనుగ్రహముతోడ'
[బుధవిధేయిని 20—9—1888]

క॥ ఘన జమ్మలమడకాన్వయు లను బండితవర్యుఁడైన లక్ష్మీనారా
యణశాస్త్రిపట్టి చక్కని దనమును గోనమును వినికిని దానీ
కొనియెన్॥ 93

ఉ॥ అన్నయుఁ దల్లియు న్నివుల హర్షమునందుచు నార్షపౌరుషే
యోన్నతబాంధవమ్మునకు నొప్పఁగఁ జప్పననిశ్చయించి యా
సన్నముహూర్తకాలమున సన్నుతశాంతను ముక్తికాంతను
న్వాస్నేనుమిన్నయటా వసువివాహ మొనర్చిరి పూరుషోత్తమున్॥

చ॥ జనకుఁడు వేదసారయుత శాస్త్రవిదగ్రణి భాగ్యశాలికిన్
జననికి రాజ్యలక్ష్మికను సద్గుణజాలను సాధుశీలకున్
ఘనవిదుషీలలామకు సకామకు సంతతి లేక లేక క
ల్గినసుత రూపసంపద నిలింపులరాణి సువాణి వాణినాన్॥ 95

ఉ॥ చూపఱకెల్లవారలకు సొంపుగ దంపతు లింపునింప ల
క్ష్మీ పురుషోత్తముల్సిరి, శచీపురుహూతులు భోగమందు, వి
ద్యాపరమేష్ఠులాయువున, హైమవతీశులు భూతి, ముక్తికాం
తా పురుషోత్తమాఖ్యులు, తారయివర్తిల నీయ దీవెనల్॥ 96

ఉ॥ బత్తిని సుబ్బమాంబకును బావకు మ్రొక్కుచుఁ దోడియక్కకున్
జిత్తము ముక్తికాంత పతిచెంత నెనిల్పఁగఁ బూరుషోత్తముం
డత్తసమాను కంగనకు హర్షమొసంగు తెలుంగులొప్పు సం
పత్తులుగల్గి, ప్రేమమెయి వర్తిల నేగెఁ బదాఱుపండువుల్॥ 97

## — రేపల్లెయందుపాధ్యాయత —

క॥ ఆపై నుద్యోగముకానై పోయెను దల్లిఁగొంచు నధ్యాపకతన్
రేపల్లెను బోర్డుస్కూలునఁ బ్రాపింపం జేసికొనుచు
వసియింప నటన్॥ 98

చ॥ తనకడఁ జేరినారలకుఁ దానలచిన్నయసూరికర్తృకం
బును వివిధాంధ్రకావ్యముల బోధమొనర్చుచుఁ బాఠశాలలోఁ
జనవును గౌరవంబెనయ ఛాత్రులు [illegible] విద్యాలయ
ధను బొనరించి యెంతయు నిదానముగాఁ దగి [illegible]॥

క॥ పీఠాపుర సంజనిత 'మెడిల్
స్కూ'లను జేరిచె పరీక్షకుం జనిపాస్యైసై
యాలీలన 'ప్రైవేటుగ
శాలను మెట్రిక్యులేటు నాద'మటంచున్॥ 100

క॥ మదినెంచి క్రమక్రమముగఁ
బదపడి పాండితిని వృద్ధిపఱచికొనంగా
మొదలిడి రేయుంబవళులు
చదువఁగ గ్రంథాళి నట్టిసమయమునందున్॥ 101

క॥ దుర్భరత, స్వభానుననం
తర్యాతోష్ణ ముబుకంగఁ దనుతాపఫలా
విర్భూత మశూచికమున
స్వర్భానుగ్రస్తభాను సామ్యంబొదవన్॥ 102

తే॥ బ్రతుకె దుర్లభమన భార్య త్రాటిబలిమి
రెక్కెనెం గాని తప్పె మెట్రిక్పరీక్ష
యంతగ్రహచారమెఱుఁగంగ నరసిచూడ
జనకరచితంబుదొరకంగ జననవేళ॥ 103

తే॥ ఒరులనడుగంగఁ గీడెందు మఱుఁగుపఱచి
మేలుమాత్రమె చెప్పరు రేలయింత
శ్రమమునకు నోర్చి శాస్త్రమే చదివికొనిన
నద్దమునఁజూచికొన్నమై నౌనటంచు॥ 104

శా॥ ప్రాజ్ఞుం డేవులపల్లివంశజుని సంప్రాప్తార్థ్యసంస్కారు డై
వజ్ఞున్మిత్రుని వేంకటప్పయను సంభావించి జ్యోతిర్కలా
విజ్ఞానప్రద తాళపత్త్రిరచి తా వేలప్రమాణచ్ఛటా
జిజ్ఞాసంగొని వారియింటఁగల ప్రాచీనార్జితగ్రంథముల్॥ 105

ఉ॥ ఆతఁడువ్రాసికోఁదొడఁగి యందలియంశముల గ్రహించుటన్
జాతకభాగముందెలిసి సొంతముగాఁగ ముహూర్తభాగమున్
జ్యోతిషికుండుగాఁగలిగె, సౌమ్యతనుస్థితి ధృష్ణువాక్పతి
ఖ్యాతధనస్వగేహగ సితాప్తిని వాక్పతికేంద్రవర్తితన్॥ 106

ఉ॥ తీరయి శాస్త్రసమ్మతి గతించినకాల మదష్టమస్థిత
కూ్రరదశాదిభు క్తియయి కూలినమ స్త మరణ్యవాసతు
ల్యోరుభయంకరస్థితుల నొందఁగ మ్రందఁగ నందుబందుగుల్
చేరియి పెట్టకేని ఫలసిద్ధిఁగనం, గవిదృష్టి సంతటన్॥ 107

క॥ గురుదశ శుభసూచకమై
పరఁగవివాహంబు చిత్రభాన్వబ్దమునన్
జరుగ, మశూచికమసితాం
తరమునన్నై సౌమ్యవిదశ, తారణనప్పుడె॥ 108

క॥ గణితాగమ వేత్తృత్వము
గణియింపఁగఁజాలు వీలుకల్గుట దానన్
గణనీయుండై ఘనసఖ
గణమేర్పడి యడుగ నుడువు గ్రహచారంబుల్॥ 109

చ॥ తలఁపుననిల్పశాస్త్రమును దాల్మి ధనాశ లవంబులేక, మి
త్రుల కటు తెల్పుచుండుటయు దొడ్డగృహస్థులుచేర నా ప్రతన్
నెలవుదినంబులంగలిసి చీటులయాట యరేబియన్ కథా
విలసితకావ్యప్రవచన వెళ్లఁగఁబుచ్చఁగ నిచ్చనచ్చటన్ 110

క॥ కవిగండ పెండెరంబును జెవులకుఁగుండనములుండఁ జేకట్లున్, శ్మ
శ్రువుల న్మొలివైచుచు రవ రవ, రవగాలున రవాళి రంజిలుతీవిన్॥

క॥ అచ్చోటికి నొకదినమున
విచ్చేసిన తంతువాయవిద్వాంసు, ద్విజుల్
మచ్చర మెచ్చఁగఁ గ్రచ్చుఱ
రచ్చకు శ్వేతాశ్వమెక్కి రాఁ గనిరంతన్॥ 112

క॥ ఆహాగ రడఁచంగావలె
'నోపురుషోత్తమకవీంద్ర! యొజ్జా!' యనితా
నాపట్టునఁ దచ్చాతుర్విం
డాపండిత విప్రుఁడొకఁడ డతిరభసమునన్॥ 113

క॥ ఏకాక్షరకోశంబును వాకొనఁ బలుపంతపెట్టి వ్రాయించిరియొకం
డాకపె స్థంబకుసుమ దాకొల్పుచుఁ గయ్యమునకుఁ దలపడఁ
జేయన్॥ 114

క॥ 'మిన్నఁగ నెన్నఁగ నన్నిఁగ మున్నింపఁగపన్న చిన్నమనవింగొన్నన్
మన్నామము మన్నారను మన్నారనిపిన్నసన్న మన్నాఱంగన్॥

క॥ చిన్నప్పుడు కస్తురి సూ
రన్నాహ్వయుకడఁ బఠించి క్రమముగఁ గవితా
సన్నతఁ జదివితిఁ గొలఁదిగ
వన్నియ వెట్టంగ మిన్నె ప్రార్థింతునవన్॥ 116

ఉ॥ ఎన్నఁగరానిహర్ష మొదవ నేర్పడ నెయ్యము మీఱఁ జేరుచున్
వెన్ను నదట్టి తా బయటఁ బెట్ట సతీర్థ్యతఁ బూరుషోత్తముం
'డన్న' యటంచు మున్నరపు డచ్చెరువంది కవుంగలింపఁగాఁ
జిన్నయసూరికృత్రకముఁ జెప్పెడ కన్మిని నేర్పెనాప్తతన్॥ 117

క॥ అనేర్పు నేర్పుచందము తానెందఱో చెప్పవించుఁ దహసీల్దారై
యానివసథమున సుస్థిరుఁడై నలచేవెండ్రి వేంకటాచల
మొకటన్॥ 118

క॥ పురుషోత్తమకవివర్యా!
వరమతి నాంధ్రంబునందు వ్యాకృతియొక్కం
డరుదౌ తెఱఁగులఁ గఱపఁగ
మఱుఁగులువిడ నీవు వ్రాయ మహితమటంచున్॥ 119

ఉ॥ మోదము మీఱ నంచు ననుమోదముఁ గొంచు, మదిన్వహించు న
త్యాదృతి మించు వైదుషి సమంచితరీతిఁ దలంచి తాఁ బరి
చ్ఛేదవిభాగము ల్రచన చేసియొసంగుచుఁ బ్రోత్సహింప నా
మీఁద నుదాహృతుల్వాదక మేధనియుక్తముగాఁగ నున్నెడన్॥

—♦ నాటకరంగము. ♦—

శా॥ ప్రాయానుక్రమ తత్త్వభేదములు నిర్ధార్యమ్ములౌనట్లు, భా
షాయోషామణి రాజసమ్మతదశన్ న్యాసించి సూక్తిస్మృతి

సేయఁగ ౯ంధనికాయరూపమున బోధింపఁ బ సుహృత్సమ్మితి
జ్ఞేయాష్టాదశ సత్పురాణకృతుల న్నైషేతిహాసమ్ములన్॥   121

శా॥ కాంతాసమ్మితరూపకమ్ములఁ గనంగాఁ జేసి నాటం గవి
త్వాంతప్రక్రియ నాశ్రయించెఁ గద గీర్వాణంబునం దట్టులే
యంతర్వాణికృతేతిహాసరచనా ద్యాంధ్రీకృతుల్గాఁగ, ధీ
మంతు ల్మెచ్చఁగ సత్ప్రబంధకృతి నిర్మాణంబు లాపైనఁగాఁ బ॥

క॥ సిద్ధేంద్రయోగియనఁగఁ బ్ర
సిద్ధుండయి కూచిపూడిఁ జెలఁగినకవియొం
డిద్ధంబౌ నొకనూతన
పద్ధతిఁ దా వ్రాసి నేర్పె భాగవతంబున్॥   123

ఉ॥ ఆదిగ దృశ్యకావ్యముల కాంధ్రమునం దదెయాచుఁ గూర్పఁ బ్ర
హ్లాదము, యక్షగానములటంచు రచించిరి కొంద రంతఁ 'ప్ర
హ్లాద' కథాదు లప్పుడె 'యహల్య' నుగూర్చెఁ గథాధిపుండటుల్
ప్రోదిగ నాంధ్రదేశమునఁ బొల్పువహింపఁగ వీధినాటకుల్॥

ఉ॥ ఆడకువచ్చియొక్కట నటాడఁగఁ జూడఁగఁ గ్రొత్తఫక్కి, 'ధా
ర్వాడసమాఖ్యదేశజులు, వాడలవాడల వారిఁ గూర్చి మా
టాడఁగఁ జూచినారు కొనియాడఁగఁ గూడఁగ నూత్నసంఘముల్
నాఁడుల వీఁడులందు వచనంబున నాటక మభ్యసింపఁగన్॥

క॥ బందరునందును నప్పుడె
కొందఱువిద్వద్రసికులు కూడిసమితిగా
'హిందూథియేట' రనుపే
రందగుచు నలవడి యాడఁ బ్రారంభింపఁ బ॥   126

పంచ॥ పసందుగాను ధారువారు వారిజాడ హిందిభా
ష సంతరింపఁ జేసి యాడఁ జాలమే లటంచునెం
చి సంతసంబుతోడఁ గూడి 'నేషనల్ థియేట్రికల్
సొసైటి' యన్న పేరనొప్పఁ జూడఁ గొంద ఱయ్యెడన్॥   127

క॥ ఆపైనఁ ద్రోవఁ జూపఁగ
రూపకరచయిత యెవరో నిరూపింపఁబడఁ బ

శేషల్లెనాడ కొప్పిషే
మహాపురుషోత్తముఁడై దిక్కటం చనికొంచున్। 128

క॥ తద్దర్శనార్థ మందు న్బద్ధగుమే నేజరపుడ వెడలియునటమం
దద్దయుబత్తిని మ్రొక్కుచు 'నద్దేనియు వ్రాసి హిందీ' నిమ్మని
యడుగన్। 129

చ॥ తెనుఁగున వ్రాసియిచ్చెదను దేనినిఁగోరినఁ జిన్ననాఁటిహిం
ది నిపుడుకొంత నేమఱచితి న్విడుమంచనఁ గాదు కూడదం
చనుసరణంబొనర్చి, పనియందును జొన్పఁగ నెచ్చరింపఁ జూ
తును సరిలెక్కటంచుఁ దొలుదొల్త గజాననుఁ గొల్చి భారతిన్॥

క॥ తనయిష్టదేవు ధృతిమైఁ
గొనియాడుచు నొక్కరాత్రి కూర్చుండిమహా
స్థను మునుదాను బ్రిదర్శన
మునఁ గను కాళాసురవధమును మొదలిడుదున్। 131

చ॥ హరికథలందు బాల్యమున హైదరబాదున విన్న తత్కథా
చరణములట్టి కీర్తనలు సామయికంబుగఁ బాడఁజేసినం
జరితము ద్రిష్టలందఱికిఁ జక్కఁగ గోచర మానటంచుఁ దోఁ
ప, రహిని సూత్రధారుఁ డనుపాత్ర వచింపఁగఁ గూర్చెఁగొన్నిటిన్

క॥ ఇఁకవచనపు సంభాషణ
సుకరంబని యెంచి తాను జూచిన యానా
టకపాత్రముల న్బావా
జికి దీటా శైలితో రచింపం దొడఁగెన్॥ 133

ఉ॥ నేచినసంస్కృతోక్తులు మునీశ్వరవాక్కులఁ బారసీకమున్
రాచరికంబు గల్గునెడఁ గ్రాలఁ దురుష్కము నీచపాత్రిలన్
వాచకమెల్ల హిందిగను వ్రాయఁదొడంగిన దానికద్దె పా
త్రోచితభాష యేర్పడె, బుధు ల్గొనియాడ భయంబు వీడఁగన్॥

క॥ ఆవైఖరులం గూర్చుచు
దేవప్రార్థనలపట్లధీ మెఱయంగా

సేవృత్తములోఁ బయ్యెదు
లోఁ వఱలఁగ దండకంబు లొక్కొక్కయెడన్॥ 135

క॥ వెరవెఱిఁగి యల్లెపంచా
క్షరిమహిమ' మనెడినాటకం బింకొక్కం
డు రచించియు నారెండను
సరించుకొను నేమనల్ సొసైటి కొసంగన్। 136

ఉ॥ కన్నులనద్దికొంచు నవి కైకొని వారి మెనేజ రేగినం
బెన్నిధిలబ్ధమౌకరణిఁ బ్రీతిదలిర్పఁ దలంచినంతకున్
మిన్నగు వన్నెనొప్పి పఠనీయ మదైన తెలుంగు వ్రాఁతగాన్
గ్రన్నన నాటకుల్ సదివి గంతులువైచుచుఁ జింత్రిణీపురిన్॥

క॥ బిరబిర భాష న్నేరుచు
తెఱఁ గుత్సాహముగఁ గవికిఁ దెలుప (సుభద్రా
పరిణయ భస్మాసురవధ
లు' రచించి 'కళావతీ' తలోదరి చరితన్॥ 138

క॥ ఆమూడు నాటకంబులు
వేమా 'ఱెప్పె'టంచు వేచి యడిగిపో
నా మెంబర్ల కొక్కొక్కటి
గా మాసము లోననె యొసఁగ న్నేర్పుమెయిన్॥ 139

క॥ వా రభ్యసించి యాడం
బ్రారంభింపంగఁ దలఁచి రప్పించి కవిన్
దాదు ప్రదర్శకపాత్రల
తీ రారసి లోటు లున్న దిద్దుఁ డనంగాన్॥ 740

మానిని. అంచెల నంచెలఁ గొందఱుగా నవహారముల న్ఫలవారములం
గొం చరుదెంచు నటాగ్రణులందును గొందఱుముంద పిఱుంద
తగన్
బంచి సమంచిత గౌరవచర్యల, స్వాగతమీ ననురాగమునన్
గాంచి నుతించి ప్రదర్శనమున్ హితకాండము నెంచి
యఖండముగాన్॥ 141

క॥ కుదిరెన్నరి నేపథ్యము
లదనున కగు పరికరములు 'నాపరితోషా
ద్విదుషాం నసాధుమన్యే'
కద యండ్రార్యులు ప్రయోగ గౌరవ మెఱుఁగన్॥

క॥ అని సాంఘికులను ధార్వా
రు నాటకులు మెల్ల బందరునకు గ్రాన్వా
రి నెదుట నిడికొని యాడఁగ
నినుగుదురునఁ గపియమర్చి, యీస్టరు నందున్॥ 143

సీ॥ ఒకయంచలను గాంచ నొకరు లెంచఁ గడుమించ
సకలధార్వారు నాటకు లెసంగ
నొకచెంపఁ బరికింప నురుసంపదల పెంప
రయఁ గల్గు నుద్యోగి చయ మెసంగ
నొకకేరిఁ బదభావ ప్రకటానగతి తేవఁ
గనిపట్టు రసికశేఖరు లెసంగ
నొకచక్కిఁ గృతిఫక్కి యుఱుకెక్కి కననిక్కి
యలరు పండితులు గాయకు లెసంగ॥

తే॥ నగు సభాస్థలిఁ జూచి పుష్పాంజలి యిడి
సూత్రధారుండుగాఁ బురుషోత్తముం డు
పన్యసించి కళావతీపరిణయంబుఁ
దనరఁ జేసెను ప్రథమప్రదర్శనంబు॥ 144

స్రగ్ధర. గంభీరోదార ధారోత్కల సవినయ వాక్యప్రచార స్తుత ప్రా
రంభోపన్యాసశైయ్యా ప్రతిముఖ చరణ ప్రాశ్ని
కోద్బోధ్యగాథా
రంభానృత్య ప్రగల్భ ప్రకటిత నటక ప్రష్ఠ సామర్థ్యలీలా
జృంభ ద్వ్యాయామ ఖడ్గస్థిత కరచలన స్థేయసంతుష్టచిత్తుల్॥

క॥ జిహ్వాగ్రోదితభాషకు
వహ్వాయనిపించు సూత్నవైఖరులనఁ దా

రాజశ్వాన మందినాకలు
బహ్వానందాబ్ధిఁ దేలి పర్ణింపంగాన్‌। 146

ఉ॥ ఆకృతి యాకృతింగన నిరాకృతి, యాకృతి యాకృతిం గనన్
బ్రాకటసత్కృతిం గొలఁదివ్రాయను నైక నన్యభాష ము
క్కాకలు తీఱినట్టి నటకప్రకరం బలఘాటువారు వా
రాకడఁ దాముసంగి యహాహా! యని మెచ్చి బహూకరింపఁగన్

తే॥ ఇనుమడించిన గౌరవం బెనయ సకల
మల ఘనోద్యోగ లక్షవారాను లొప్పుచు
సంఘ మభివృద్ధిఁ గనియుఁబ్రోత్సాహమంద
నాడఁ జేయఁగ నవ్యాదృశ్యంబు లింక॥ 148

ఉ॥ అత్తఱి వ్యాసకర్తృకము లామ మనంబున కింపుఁగూర్చు బ్ర
హ్మోత్తరఖండముంగని, ప్రమోదన సేతుమహాత్త్వ గాథలం
జిత్తమెలర్చు రామకథఁ జెన్నువహించు ప్రబంధసంగతుల్
క్రొత్తగఁ బూనఁ బోత్తముఁడు కూర్పఁ బొడంగెను నాటకంబులన్॥

క॥ పగలెల్లఁ జదువఁ జదివిం
ప వెడలఁబుచ్చుచును రేయి వ్రాయంగూర్చుం
డ పనిన వారమునకు పొక
టి వంతునను బూర్తిగాఁ బఠింప న్నటకుల్॥ 150

క॥ క్రోధిశచ్చాదశకంబును
దా శనివారమునఁ జని, ప్రదర్శన మట నెం
తే శోభిల్ల న్నడపియు
నాశుగతి న్నాభనువారి మందిలుసేరున్॥ 151

క॥ ఈవిధమునఁ జనదినములు
వేవేగ రచింపఁ గృతులు, పెక్కురు నుతులం
గావింప యశంబు దెసల
నావిష్కృతి నందుచుండ నష్టాక్కవొదన్॥ 152

క॥ అద్వితీయ పండిత రాణ్మా
* డభూషి కులజాత వేఙ్కట కవిశ్రేష్ఠుం
డభినందించెను గృతిఁగనఁ
గ బిల్హణీయకథ నాటకం బాడంగాన్॥ 153

క॥ అపురూపపు భాషయు నే
త్రపర్వములు వేషము లతిరమ్య విశేషాల్
విపులానంద మొసఁగ న
న్నపురములకుఁ జని ప్రదర్శనంబు లొనర్పన్॥ 154

క॥ అచ్చోట రసికు లెందఱొ
మచ్చికపడి కవిని జేరి మాకు న్మనుం
జెచ్చెర దయసేయుండని
ముచ్చట శాఖాసమాజములుగాఁ గూడన్॥ 155

---

* అద్వితీయ శతలేఖిన్యవధాన దక్షులు నేకసంధాగ్రాహులు శ్రీమాన్ మాడభూషి వేఙ్కటాచార్యాభినవపండిత రాయలవారు నాటక ప్రదర్శనముం గాంచి యభినందించిన విధమిది:

కల్యాణములఁగూర్చి, కడు వేడ్కఁ
బ్రోవుమయ్యా, కమలామానస నాయకా॥ (పల్లవి)

కల్యాణగిరిధీర, కారుణ్య సౌశీల్యాను
కూల్యాది మహోదార, గుణరత్న రత్నాకరా॥ (అనుపల్లవి)

జనులకైహికానందమున కాదికారణమై, తనరు శృంగారరసమున మించు నాటకముల, వినిపించుచును బృందావనపురి నెలకొన్న ఘన నేషనల్ థియేట్రికల్ కంపెనీవారలకు॥ కల్యాణ॥

తరుణత్వమున మేధా, దక్షిణామూర్తిదివ్య, కరుణామహిమలబ్ధ, కవితాసంపదగలిగి, నరులు మెచ్చఁగ వివిధ నాటకరత్నముల, విరచించు శ్రీ నాదెళ్ల పురుషోత్తమకవికి ॥కల్యాణ॥

నవనవరసముల, నాటక వినోదములఁ దవిలినమనములఁ, దప్పక రంజించేయు కవులకు రసికులకు, ఘనులకు, ధనికులకుఁ, గవి మాడభూషి వేఙ్కటదాస దాసునకు ॥కల్యాణ॥

తే॥ పూటపూటకు నొకనూత్న నాటకంబు
వ్రాసియీయంగ సాంఘిక ప్రార్థనముల
నిట్టి దేవనిగాంగఁ రెండేండ్లు కడచు
చుండ నయ్యోను ముప్పదిరెండు కృతులు॥ 156

తే॥ అట్టికాలంబు నందొకయప్డు పిలువ
రెండుచింతల యచ్చ్యయాఖ్యుండొకండు
తాశతాధిక సప్తాహ ధార్మికుండు
గంటసాలను విశ్వేశుఁగనుచునిలుప॥ 157

క॥ సౌజన్యవర్ణనాఖ్యం
బైజగతిఁ దగఁ గృతిఁ జెప్పి వ్యయశివరాత్రిం
దాఁజెంచె దక్షిణాస్యవి
రాజిత మణిఖచిత రమ్యకాక్మబిరుదముల్॥ 158

క॥ తదచనకుఁ బూర్వమున స
ముద్రస్నానాభివర్ణనును వ్రాయఁగా
ముదాలయమునఁ దగెని
ర్నిద్ర న్వ్యయవ్యయముగాఁగ రేపల్లెపురిన్॥ 159

## — స మ ర స భా వ ము. —

క॥ వైదిక నియోగి కక్షుల
నాదిమజన్మస్థలం బదై పద్ధతికిన్
జేదఱవడు నొండొకళుల
వాదములుం జెద్దియుముల్ ప్రబల సచ్ఛ్చటన్॥ 160

ఉ॥ వైదికదూషణం బొనరుపం దలపెట్టి, నియోగియొక్కరుం
డైదు తెలుంగుపద్యముల నల్లి యటంబ్రచురించినంత నే
వైదికు లాగ్రహంబొదవఁ బద్యములం బ్రతివ్రాసి యిమ్మనం
గాదని పూరుషోత్తముఁ డొకానొకట న్నమకూర్చి యెల్లరన్॥

ఉ॥ దండుగవ్రాఁత యద్దియనఁ దప్పులకుప్పల నందుఁ జూపుచు
న్నిండుసభ న్మహాస్థను మనీషు లనేకులు వారువీరుఁ గూ

ర్చుండ మహర్షు[illegible] పాపకారకమను నిష్కలంకమై
యుండ [illegible] నైతికదోషాదిరేఖ్యుల కెల్లకాలమున్॥ 162

శా॥ తెలివిగలారు బాపలని, దేహబలాఢ్యులు క్షత్రియుల్ క్షమా
కలితులు వైశ్యనామకులు, కాఁగ విధేయులు శూద్రసంజ్ఞకుల్
తల భుజ మూరు వంఘ్రియును, సత్త్వమువాత్త గుణాకరంబులౌ
నెలవుల సృష్టికర్తకె జనించినవై నన యుక్తియుక్తమై॥

ఆ॥ ఏర్పా[illegible] తర్గంగ గనక వృత్తుల నేర్పునై
నాశ్రయించుచుండ నాశ్రమముల
నవస్థరించి [illegible] [illegible]ఘన్నముల్
చెప్ప రొప్పె నప్పు డిప్పు డమిని॥ 164

చ॥ తెలివిగలారు బాపలని, దేహబలాఢ్యులు క్షత్రియుల్ క్షమా
కలితులు వైశ్యనామకులు, కాఁగ విధేయులు శూద్రసంజ్ఞకుల్
తల భుజ మూరు వంఘ్రియును, సత్త్వమువాత్త గుణాకరంబులౌ
నెలవుల సృష్టికర్తకె జనించినవై నన యుక్తియుక్తమై॥ 165

తే॥ పరఁగఁ గాలక్రమంబున బ్రాహ్మణులను
వేదపఠన, శ్రౌతస్మార్త విధుల సేఁత
వేదికదరిం బగుట నైరి వైదికులు, ని
యోగులైరి మంత్రిపద నియుక్తతఁ గని॥ 166

ఆ॥ ఏకవర్ణజులము నేకైకగోత్రజ
ఖ్యాతిఁ గాంచినార మయ్యు నిట్టి
భేదభావ మొప్పఁ గాఁదగు పద్ధతుల్
వ్రాఁత లిట్టిరింద సేఁతతగునె? 167

తే॥ తెలివి యేకముఖంబైన గెలుచుజగతిఁ
గాన 'బ్రాహ్మణానా మనేకత్వ' మంచుఁ
గాదె యెంతురు లోకోపకారకముగఁ
దగదె మనకింక నైకమత్యంబుకల్మి॥ 168

ఆ॥ అవయవంబు లన్ని యనుకూలతనుగన్న
సౌఖ్యమబ్బునట్లు సంఘమందు
నొకనికొకనికి హిత మొప్పుచునున్న నే
నాగరికత యనుచు నచ్చఁజెప్పె॥ 169

తే॥ బహుళ సాంఘికాంశములందుఁ బాల్గొను రచ
న 'పురుషార్థప్రదాయినీ' నామ పత్రి
కను 'వివేకవర్ధని' ప్రాఁత ఖండనఁ గని
హితులు పత్రికఁ బ్రచురింప నెచ్చరింప॥ 170

తే॥ మానుకొననెంచి నిజపరాధీనవృత్తి
ధనసమార్జనమార్గంబుగను బొనర్చె
బాలకాళికి 'నక్షరాభ్యాస' మాది
నోనమాల్ప్రిఁ జెప్పఁగా నొనసంగ॥ 171

శా॥ ఇంక న్బుద్ధివికాసమెంతయును దీపింపంగ లీలావతిం
బొంకంబై తగు పావులూరిగణితంబున్మించ నా లెక్కల
'యంకజ్యోత్స్న' యనంగ యుక్తి మెయి సాధ్యంబౌనటుల్ గూర్చెఁ ద
న్నంకింపం బటుమేధ కల్మి బహుళవ్యాసంగ సంశోభియై॥ 172

సీ॥ 'నశ్వవృత్తికదాచన' న్యాయవర్తికి
బోరు నౌకరి చేయఁ బోలదనుచు
నెట్లైనఁ దప్పని యేర్పాటు కాలంబు
కానైనఁ గొసరేఁడు కడపఁగనుచు
రాత్రింబవళ్లు రచియించు కృతుల దా
రుణబుద్ధి వేధను రుగ్ణుఁడగుచు
నీరు మార్పఁ దలఁచి నేషనల్ సంఘాభి
మానుల కోర్కెఁ బల్మాఱు వినుచుఁ॥

తే॥ గొనుచు నెల వౌషధంబుఁ గైకొనఁగఁ దొడఁగఁ
బాత్రములయచ్చు నయ్యెడఁ బొందువడఁగ

మొదలిడెను బత్త్రికను బని తుదకువిడఁగ
బందను పురంబున వసింప ముందు కడఁగ॥ 173

— ♦ ఆశ్వాసాంతము ♦ —

సాంకేతచక్రబంధము.

క॥ వరగుణసదనా! వృషగమ
న! రక్షితసురచిరవిరచనచణా! మదనా
గరిపుసమూహహారి! ఫణా
ధర తతినర్తిత గళ! గరధర నిలుపుమునన్ 174

♦ ప్రాసాంత్యనియమఘటితమత్తకోకిలాకందగర్భితము ♦

సీ॥ శ్రీరమాధవసాయకా! రణసీమఁ దుం
చితి దైత్యులన్ సురహిత మొనర్ప
పూరుషోత్తమ భక్తపూజిత ప్రోవ నెం
చితి భృత్యులం బరిచితి దలిర్ప
మారసంహార యోగిమార్గ మాద్రిమిం
చితి నిత్యులన్ దృఢమతిని నేర్ప
పారమార్థికచింత వర్తిలు వారిఁ గాం
చితి స్తుత్యులంచుఁ గామితముఁ గూర్ప॥

తే॥ కలుషము లడంచి మోక్షముకలుగఁ దగిన
త్రోవఁ జూపి కావఁ గలుగుదేవుఁడవని
తెలియ నెదనమ్మి కబ్బపుఁ జెలువ నొసఁగి
దానఫలముఁ జెందనగుఁగదా యిటవని॥ 175

— ♦ గర్భితపద్యములు. ♦ —

మత్త. శ్రీరమాధవసాయకా రణసీమఁ దుంచితి దైత్యులన్
పూరుషోత్తమభక్తపూజితప్రోవనెంచితిభృత్యులన్

మారసంహారయోగిమార్గులమాద్రిమించితినిత్యులన్
పారమార్థికచింత వర్తిలు వారిఁగాంచితిస్తుత్యులన్॥

క॥ కలుషములడంచి మోక్షము
కలుగఁదగిన త్రోవఁ జూపి, కావఁగలుగుదే
తెలియ నెదనమ్మి కబ్బపుఁ
జెలువ నొసఁగి దానఫలముఁ జెందనగుఁ గదా॥

వరకవినాపెళ్లాస్వయ। పురుషోత్తమజీవమాత్రి
పుత్రికకృతత। ద్గురుచరితపక్షిణామా
త్రిరచితమాశ్వాసమింది
ది, తృతీయంబౌ॥

---



# ఉత్తమ జీవయాత్ర.



## చతుర్థాశ్వాసము.

క॥ ఆలింపుమయ్య యతితా! శైలతనూజామనోబ్జ సవితా! కవితా
సాలాలవాలభణితా! ప్రాలంబాకృతి సరీసృప వితానవృతా॥ 1

### బృందావనము.

శా॥ శ్రీరామామణి కన్నతండ్రియని పేరెల్ల రత్నాకరుం
డై రంజిల్ల, సుధాకరుంగని సముద్యత్ప్రీతి నుప్పొంగ, గం
భీరాకార తరంగ 'బాహులతికా ప్రేంఖా సమాశ్లిష్టయై
పారావారసమీపమందు 'మఛిలీబంద' ర్పురంబొప్పఁగన్॥ 2

మ॥ 'శివగం'గాఖ్యశిరమ్ము నాగసరమై చెన్నొందనా నాగులే
రు విషంబొప్పెడికంఠమై కుచపుఁదీరుం జూప రాబర్ట్సన్
చపుకన్నేత్ర! జలజంపుఁగంబ మలరన్ 'సర్కా'ల్వ 'ఖత్రింబు' బా
హువులై 'చిల్కలపూడి' 'మాచవర' పాదోచ్ఛ్రాయ సోమాకృతిన్

శా॥ వామార్థంబవె సర్వమంగళకర ప్రాచుర్యమాణప్రభా
ధామంబై తగు 2 నాఁగ వత్రి ముదసంధాన ప్రిజాయుక్తమై
శ్రీమంతంబులు 3 నాగవాసములు ము 4 న్నైనానివాసమ్ములా
సీమల్గ్రాలఁగ దక్షిణార్థమున వాసింగన్న 5 రక్తాక్షితన్॥ 4

శా॥ గంగాసంగత తచ్ఛివాకృతికి భంగంబొప్ప, భంగోన్నతిన్
రంగత్తుంగ మతంగజాంగ సముదగ్రివ్యగ్రితన్, దన్నిజా

---

1, ఇదివ్రాయఁబడినవాటికి బందరు నడిమిని మంచినీటికుండు నందు నడిమిని స్తంభముగానుండెను గాన దీనిసార్థక్యము.

2. పురవరమర్థనారీశ్వరముగా సమన్వయించుచో, గజానవార్థమున ఖండబిందు రహితము. 3. పురమందలి వేశ్యావాటిక 4. బందరుకోట 5. వత్సరార్థకమయినపుడు వైపద్యములో నన్వయించి 1864 సం॥ ఉప్పెనవలని నష్టముం దెల్పును.

ర్ధాంగి న్లాగికొనంగ సాగరుఁడు నిద్రాణాంప్రసదాక్రికృతిన్
శృంగారం బెడల న్నివారవము లక్షీణాంబుగాఁ జేయఁగన్॥ 5

మ॥ ధమనిప్రాయ 6. హృదుద్గత పరిస్రుత రథ్యామధ్యమప్రేక్ష్యమా
ణ మహిస్థాఖిల జంతుజీవననిధా నానల్ప నానాపదా
ర్థ మనోజ్ఞాపణ మాలికాచతుర బంధప్రోధ బృందావనా
ఖ్య మహాశాకృతి పూరుషోత్తమశరణ్యాం బయ్యెనప్పట్టునన్॥

మ॥ హరువాస్త్రవ్యము, ముక్తికాంతనిలయుంబాఁ గిరికాంతాస్వయం
వరరంగంబగు శ్రీదరాజ విబుధావాసంబు లాసక్రియా
భిరతాభ్యాశము సన్నివేశము భయాపేతైకదేశమ్ము, దా
7. శరధిప్రాప్త శరాసనోద్ధత బలచ్ఛాత్రాహి తాదేశమై॥ 7

మ॥ సుమనస్సేవ్యము పత్రికాండచతురస్తోతవ్య భాషావిహా
ర మహామాత్ర లసత్త్రిలింగనిలయ ప్రాచీన దేశావతం
సము బృందావన సన్నిభాచ్ఛ యమునాసంగాభిరామంబు, నృ
త్య మనీషా పురుషోత్తమాత్త కవితాతస్వి ప్రియారామమై॥ 8

మ॥ వెలయంగా మధురోక్తిసంయుత కలాపిత్రీ బత్రికాగణ్యా, రా
చిలుకై గోకులవర్ధనాచ్ఛ మురళీ చిహ్నానువాదంబుగా
జలజాతాక్ష శరస్వరూపగరిమన్, సారంగపాణిప్రభా
కలితోర్వీ సుమనోవనోత్కల కురంగ ఖ్యాతిదీపింపఁగాఁ॥ 9

సీ॥ ధాతురత్నాకరధాత శాబ్దికుఁడు, కొ
మాండూరి రఘునాథ పండితుండు
ఘనసుధార్ణవకావ్య కర్తకోరాడాబ్ధి
చంద్రసత్కృతి రామచంద్రసుధియు
వినయైకనిధి తపస్వి సుకాశినాథను
లీనుండు, బ్రహ్మయలింగ బుధుఁడు

6. రాబర్ట్సన్ పేట కుండులోనుండి తూములద్వారమున నూరంతకు మంచినీరందింపఁబడుచుండెననుట. 7. పరశురాముఁడు తనశరమురిగినంతదవ్వు సముద్రునివల్ల భూభాగమంది తపంబొనర్చిన తావిదియనుట,

మంత్రాగమాబ్ధి కుంభజుఁడు మల్లాద్యుప
  నామునఁ డచ్యుతరామధీమణియును॥
తే॥ నింక నితర విద్యావయోవృద్ధులుండఁ
  ద్వ్యాసు లుండఁగ, నండ యుద్యోగులుండ
  నటహితావళులుండ గానములు నిండ
  బుధవిధేయుఁడు పురుషోత్తముఁడు నిటుండ॥ 1

♦ 'బుధ విధేయిని' పత్త్రికా ప్రకటనము. ♦

సీ॥ శ్రీయక్షిణీ సుపత్త్రిక తత్త్వబోధినీ
  క్రమ వర్తమానతరంగిణియును
నిఖిల సుజనరంజనియును గోదావరీ
  విద్యాప్రబోధిని, పిదప నాంధ్ర
సంజీవనీ పురుషార్థప్రదాయినుల్
  చన స్వధర్మప్రకాశినియుఁ బెరలు
పేరెక్కియున్న వివేకవర్ధనియు నాం
  ధ్రప్రకాశిక యప్పుడనరుచుండఁ॥
తే॥ దానువెడలఁగ దేశాభిమాని యొకట
  నెగడఁగా రసికోల్లాసినీ ప్రభృతులు
  సర్వజనాగ్రశీర్షమానసమున వెడలె
  బుధవిధేయ సమున్నాయి, 'బుధవిధేయి'॥ 1

సీ॥ పాడం జమత్కార పద్యంబు లయ్యాయి
  హాస్యోక్తులాడనిల్లాల ననుచుఁ
బుణ్యచారిత్రముల్ పూజ్యాష్టకంబులుం
  జెప్పంగ మురిపెంపుఁ జెల్లి ననుచు
వ్యాకృతి బోధించి వైద్యాంశములు నేర్పి
  తప్పులు సైరింపఁ దల్లిననుచు
వింతవింతకథలు వినిపింప లోకవా
  ర్తలుసెప్పఁ జేనొప్పు తనయననుచు॥

తే॥ గాన కవనములను రసికత యొసంగ
వలయునీతియు ధర్మముల్ భక్తిఁగఱప
బుద్ధి సెప్పి భాషామతబోధసేయ
రాజకీయ లోకజ్ఞతఁ జాణ నిడఁగ॥　　12

సీ॥ పండితపామర పఠనీయ మనిపింప
వృత్త్యనుప్రాసాదు లింపునింప
నుపమాద్యలంక్రియా యుక్తత నాటింప
లోకోక్త్యుదాహృతుల్ జోకఁ బెంప
సంవాదరచన హాస్యరసంబు నూరింపఁ
గృతసమస్యాపూర్తు లతకరింప
వ్యాసము ల్గుణమెంచు దోసముల్వారింపఁ
బద్యాళి బోధింపఁ బ్రస్తుతింప॥
తే॥ 'బుధవిధేయిని' పాఠకాభ్యుదయదాయి
నిగను వెలువడి యొకతూరి నెలకురెండు
సార్లు ముమ్మాఱునైతిక సాంఘికార్ష
సత్పథవిధాయినిగ నొప్పి సార్థకాఖ్య॥　　13

♦ నై తి క బో ధ. ♦

సీ॥ అజ్ఞాన మడఁగించి విజ్ఞాన మొనఁగూర్పు
మూఢభక్తిమహత్త్వమును దెలుపుచు
దేవుఁ డొండునికి మదిని నమ్మి కొల్చిన
నిహపరంబుల సౌఖ్య మొసఁగుననుచు
నుండఁ గొల్వమి కన్న నుండమిఁ గొల్చుట
నిర్బాధకంబయి నెగడు ననుచు
వినఁ బురాణంబులు వీడుచుఁ గల్పనల్
తత్త్వంబు గుర్తింపఁ దాల్మిఁ గనుచు॥
తే॥ వక్ష్యమాణనయంబుల లక్ష్య మిడుచుఁ
దారు మెలఁగుచు, సత్ప్రవర్తన మిదనుచుఁ

తెలియఁజెప్పుచు, సుతుల వర్తిలఁ గఱపుచుఁ
జనకుఁ బలుకుచు, నీతిబోధన మొనరుచు॥ 14

క॥ 'సెనోరా! నుంచిపైనను
గానేదె యూరుపుంచి?' కామిన్ ధరలోఁ
'దానెంత చేసికొనునో
కానా నాయంకై కాదె!' కర్మఫలమనన్॥ 15

చ॥ ఒరులకుఁ గీడు సేఁత తగ దొప్పదు, మోస మమాయికావళిన్
ధరను దురాశ దుఃఖద మటం గని సత్య మహింస పండితా
దరము గుమప్తిపత్తిఁ బరబాధనానుగతిన్, స్వకీయసుం
దరిని నిజార్థ మన్యులకుఁ గోరఁగ నొప్పుని నెంచి మానవా॥ 16

మ॥ నగలం బెట్టిన బాలకావళికిఁ బ్రాణాపాయ మొక్కప్డు కా
నగు నెవ్వారలు దొంగిలింపనిది విద్యాభూషణం బొండె, కూ
ర్పఁగ మేలౌ సుగుణాళి నాటఁగ, దురభ్యాసంబులం గల్పఁ దీ
యఁగ నుల్లేఖిత రత్నవైఖరిని సౌందర్యంబౌ దీపింపనౌన్॥

♦ సాంఘికము. ♦

మ॥ ధరణి న్బాలకుల న్గతానుగతికాంధన్యాయ మొప్ప న్మతాం
తర దుర్బోధల కాకరంబులగు విద్యాశాలలం జేర్చి సం
కరులం జేయక నీతివిద్య మతసంస్కారంబుఁ జేకూర్పనౌ
గురులం జేర్పనగున్ స్వవృత్త్యుచిత మార్గుల్ గా నొనర్పంగనౌన్॥

సీ॥ వేదశాస్త్రములెల్ల వెనుకఁబడుటుండ
'సందెముక్కలు' గూడఁ జట్లు గాఁగ
'వేషభాషలు' మాఱి వెఱ్ఱులని బుధుల
నెకసక్కెములనాడ నేవ గాఁగ
నెచ్చుజీతంబుల వెచ్చించి దుస్తులఁ
'గొంపగోడి'యు నీడ గుల్ల గాఁగఁ
గడకుఁ గృతార్థులు గాలేకయో మైన
నలక్ష్యవృత్తులు గూడ నరుదు గాఁగ॥

తే॥ స్వకులవృత్తులు విడనాడి పాడుగాఁగ
స్వమత మన్యులు బోధింప వలసి రాఁగ
హూణవిద్యనె చొనుపుచు నుభయగతుల
భ్రష్టులను జేసికో నౌనె బాలతతుల? 19

ఆ॥ నేతిజారినుండి చేత జారిననేయి
జారి నెట్టు తిరిగి చేర దట్లె
హైందవమతము విడనాడు మతాంతరు
ల్వాగచి తిరిగి చేర వలనుపడదు॥ 20

శా॥ తత్త్వంబారయ నైకమత్య మిల లేదా, బ్రాహ్మణానామనే
కత్వ'మ్మన్నటు లెంత తెల్వి కలుగుం గాకేమి? సంఘైక క
ర్తృత్వప్రాప్తఫలంబుమై నొకఁడు సాధింపంగనే, కార్యశూ
రత్వం బబ్బునె? సన్మతంబగును బ్రారంభింప సంఘాకృతిన్॥

మ॥ అతిబాల్యంబున మానవచ్చును వివాహంబు ల్ప్రౌనర్వం గుమా
రితలం గాని, పురాకృతాఘమునఁ దీఱెంబో, పతిన్వేఱుగా
నతికింప న్మతికింపు గాఁదగునె? వర్ణాచార ధర్మాతిరి
క్తత ప్రాపింపదె? పూర్వకర్మమనుభోక్తవ్యంబు గాకుండునే?॥

ఉ॥ బూతికిలేమి నెత్తనగుముష్టి, దరిద్రత తీఱ నేర్చునే?
కూఁతుల నమ్మికొన్న నది కూళతనం బవుఁ గాక మాంసవి
క్రేతల కీడుగా, నిలఁజరింప హరింపఁ దరింప నేర్తురే?
పాతకులై యిహంబునను బా డయిపోరె? పరంబు వీడఁగాఁ॥

ఉ॥ వేడుకకింత యంతయని వేరువచింపరు మేలు, శక్తికిం
గూడ నతిక్రమింపనయి కూడనిమచ్చున వెచ్చఁబుచ్చుచున్
గోడిగ లేను లెక్కతుదకుం జెడి పోడిమి, పాదచారియౌ
జాడనుగాక, పెండిలుల సద్వ్యయమే యొనరింప మేలగుఁ॥ 24

మ॥ వరశుల్కాలపునాది స్నాతకుల కేర్పాటైనగోదానమై
పెరుఁగంజొచ్చె సహస్రసంఖ్య నగుసీవిం గొరకేమిచ్చినన్

సరియాఁగా కవిపేరమైనఁ బరము న్సాధింపఁగా నేర్తురే?
తెరువు న్విడి ధనాశఁ జొల్పడినఁ గీర్తిన్ డించి యార్తిం బడన్॥

చ॥ క్రమముగ షష్ట్యాబ్ధి జనకంబుగ, ద్యూతముఁ జీట్ల యాటఁ బా
నము నిల నాశ్రయింపక ఋణంబులపాలయిపోవఁగా వివా
దములను బెంచి, కోర్టులకుఁ దార్చు దివాగణిక ల్వకీళ్లు వి
త్తమును హరింపఁజేక, కల ధర్మ మొనర్చి యశంబు నందనా॥

శా॥ మారాలోచనలేమి, భూషణములందు న్మోహ, మజ్ఞానమే
పార స్వార్థ్యము, 'నాఁడుబుద్ధి యపరత్వంబు' న్నిరూపింపఁగాఁ
గారిత్వంబున ముద్దరాంధ్ర మగధీరుల్ గొట్టదిట్ట న్నిరా
ధారు ల్వావ్విలపింప నయ్యోడిని, విద్యాలోపముం జేసియే॥ 27

ఉ॥ కావున బాలికామణుల జ్ఞానము వృద్ధియొనర్పఁజాలు నా
నావిధ కావ్యపంక్తుల ననారతముం బఠియింపఁజేయుచున్
జావళిపాటల న్వదలి, శ్రావ్యపు మంగళహారతు ల్నుప
ద్యావళి గేయములఁజూపి యర్థమెఱుంగఁగఁ బాడఁజేయనౌన్॥

క॥ వారికి లోకజ్ఞానం
బేరీతిని గల్గు నద్ది యెఱిఁగి యమర్ప
న్నేరుపఁగా లఘువైద్యముఁ
దీరుపు సంసారమందు దేఁకువ యొనరున్॥ 29

తే॥ ఔషధమిషంబునను బెక్కు రర్థ మెంతొ
యన్యదేశములకుఁ జేర్తు రజ్ఞులవుచుఁ
దెలిసివాడిన మనయోషధులసమములు
'వెల సులభము, ఫలమధిక' మిలనివరయ॥ 30

క॥ ఆపదలమొ్రక్కుచుంటలు
నాపై నవితీర్ప బాధ లందుచునుంటల్
దీపితవరా నజ్ఞానమె
లోపం బది తీర్పకున్న లోటా గదవే॥ 31

తే॥ నో రెఱుంగని సాధు జంతువుల నఱవ
నఱవ గొంతులఁ గోయఁగా నౌని లగ్గు?

ప్రాణికోట్లను హింసింపఁ బాడిగాదె?
మఱి బలుల్ జాతరల్ సాగ మాహాత్మ్యమ కద॥ 32

క॥ ఎఱుఁగరె? చెప్ప 'నహింసా
పరమోధర్మ' యని బుద్ధభగవానుఁడదే
వరవడి దిద్దం జేయుచు
సిరపడఁ బఱపంగలేదె దేశదేశములందున్?॥ 33

క॥ దయయు సత్య మహింసయు
భయముడిపి జయంబుఁ గూర్చుఁ బ్రాజ్ఞ నొనర్చు
న్నయవిదుల కనుష్ఠేయం
బయి సర్వమతానుకూల మత్యుత్తమమౌ॥ 34

## —♦ రాజకీయము. ♦—

క॥ మన సౌరులది హింసించుట
యును హింసల నధికహింస, యొకఁడొ కోడ
ల్గ నెఱింగియు నాబాధలఁ
జనునే కోడఱిక మిడఁగ, సాగిన నత్తల్? 35

క॥ అసలేమన దౌర్జాత్యము
గుసగుస లింకేల భేదకోవిదులేలన్?
బసచెడ్డ పెద్దసేవకు
లిసి! చిన్నల నొంపఁజూచు టెట్టిదకాదే? 36

తే॥ వర్తకమిషంబున న్వచ్చి పడ్డవారు
దొడ్డవారయి యేల్చఁగా దొంగదొరలు
దోఁచుకొనిపోవు చున్నారు దుర్నయముగఁ
బిల్లి కనుమూయ నెలుక లొప్పినవిధాన॥ 37

తే॥ తెల్ల మొగములఁ జూడఁగా నెల్లసుఖము
లల్ల తెల్లమొగాలకే యుల్లసిల్ల
'నేటి కొక్కఁడు లాగఁగాఁ గోటికొక్కఁడుఁ'
గడకు దానసెమనకౌను 'గట్టఁ దాళ్లు'॥ 38

తే॥ మనకుఁ నిజమైన దేశాభిమానమున్న
'నొక్కపరరాజు మనభూమిఁ ద్రొక్క నేల?'
యను మనోరూఢి దౌర్బల్య మడఁచివైచి
పిఱికితనమూడ్చి మెలఁగినఁ బెలుకలేమొ? 39

తే॥ భేదతంత్రజ్ఞతను దక్క, వేలువచ్చి
కోట్ల నేలంగఁ దరమౌనె? 'కొంపతీసి'
'మేఁకపోఁతు గాంభీర్యమే' కాకిఁ కేమి?
వెడలి నడవరె? వార్వట్టిపిఱికిబంట్లు॥ 40

తే॥ సమర మేటికి? స్వజననాశనకరంబు
మనమె పరదేశవస్తువుల్ మానివేయ
దాన నరికట్ట ధనమూడ్చు దారులెన్నొ
మొండితన మింక సాధింపకుండు నద్ది? 41

తే॥ ఎప్పు డుద్యోగ వ్యాదోగ్రగ మెడలిపోవు
నప్పుడున్నతి ప్రాపించు నందఱకును
మనము వ్యవసాయశాస్త్ర మర్మంబు తెఱిఁగి
రత్నగర్భను నమ్మిన రాణఁ గనమె? 42

తే॥ అఖిలభారతదేశ మహాజనసభ
యొకటి స్థాపించి పదుగురు నొకటఁ జేరి
బాధకములైన చట్టము లాపికొనుచు
సంఘబలమును గుర్తింప సాగఁ డనుచు॥ 43

తే॥ ఐకమత్యప్రయోజన మందఱకును
మనసులను నాట నిజపత్రికను బలుమఱు
చాటఁజొచ్చె మహాసభ నేటటంచుఁ
దేటమాటల పరిపాటి పాటికెక్క॥ 44

తే॥ అన్నిమూలలనుండి మహాజనసభ
యందు నెల్లరు పాల్గొనసౌ నటంచు.
నమ్మహాత్త్వముఁగూర్చి మహాత్మ్మదీయ
వర్గ మెట్టుఁగ నురుదున నుపన్యసించు॥ 45

క॥ ఎల్లరకు దేవుఁడొక్కఁడె
ముల్లోకములేల నతఁడె మ్రొక్కు లిడంగాఁ
దల్లియుఁ దండ్రియుఁ దానై
'యల్లా' యన 'నచ్యుత!' యన నానంద మిడుఁగా॥ 46

ఆ॥ మత మెుదైన దేశమాత యొండే యాటఁ
దండ్రి యొకఁడె మనకు దైవ మాటఁ
బారతంత్ర్య ముడుగు భ్రాతృవాత్సల్యాన
మెలఁగవలె నటనియె మేలుగలుగ॥ 47

—♦ భాషాపోషణము. ♦—

క॥ యోషామణి లజ్జ్యాయెడ
వేషమ్ములనింట బయట వేసినకీతిన్
భాషయెటన్న న్మాలల
దోషాకరగామి వ్రాఁతఁ దోషంబిడునా॥ 48

క॥ శిక్షణకై ప్రశ్నోత్తర
లక్షితమానట్టికీతి లలితంబనుచున్
లక్షణసారముఁ బలెకను
దక్షతసులువుగ లభింపఁ దత్పరితలకున్॥ 49

క॥ కోరాడ రామచంద్ర సు
ధీరమణుఁడు మెచ్చియనె యదృచ్ఛాభిజ్ఞుం
డై, రాట్పడు బుధలోకము
నారాయణదాసువలన నా విని యడఁపన్॥ 50

ఉ॥ ఆయెడ యావనోదయము నందినధీమణి యాదిభట్ల నా
* రాయణదాసుఁడ న్హరికథాచరణైక దిగంతకీర్తి 'వి
ద్యాయుతులేఁగెలెనొ? యవధానమొనర్తు' నటంచుఁ బూన, x
ధ్యాయతనంబు గాఁదగదటం చిటనుం గలుపాపహంబుగా॥

---

* క్రొత్త మాదిరిగా నేఁడు మాయూర నష్టావధానమొకటి జరిగినది. అది సంగీతనిధి యను బ్రహ్మాధియు ననఁదగు శ్రీవిజయనగర నారాయణదాసుగారిచే నేయఁబడినది. అపనులకతి ప్రసిద్ధకష్టావధానాష్టకము కాదు. ఏవోకొన్ని చిన్న

క॥ నీరసములు నీరసములె
నారసములు నారసాలె నైరాశ్యముగాఁ
వారసములఁ వారసములె!
వారసముల వారసాలె వైరస్యముగాఁ॥ 52

---

సనులగుంపు. దానికిని గాలము రెండుజాములు పట్టినది. అందును అనువైన వన్నియు సాధారణ లోపములతోనే సాంతము లైనవి. ఆయనకు ధైర్యసాహస సమన్వితముగాఁ జెప్పఁగలదు గాని పాండిత్యము సంగీతతరమందు మెండుగా లేదనవలసి వచ్చినది.........'

20-7-1890 'బుధవిధేయి'

'దాసుగారు ఉటంకించిన ఒకేరంగుగల దోవతివలెఁ బూర్వపాండిత్యము ఒకవిషయమందేకలవారు గాక నానావర్ణాంచితమగు రుమాలువలె మూడు నాలుగు సంగతులు కొద్ది కొద్దిగాఁ జెప్పినవారుగాన, రుమాళ్లను బోలునట్టి యిప్పటి కాలమున ఆయన యంతగాఁ బ్రకాశించుట కవకాశము కలిగినది.........పూన్కితోఁ బనిచేసి చేతనైన నేనాఁటికి యినను అల్పప్రసిద్ధావధానము కొంత యనఁ జేసి, చేసినట్టు మాచేతనే వినుతింపఁ బడినచో మాయీవ్రాయుకష్టము నకు ఫీజాగిట్టునుగదా యనుకొను చున్నాము. దీనికి జవాబని యెవరు ఏమి వ్రాసిపంపినను మేము తప్పక ప్రకటించి ప్రత్యుత్తర మిచ్చెదము.'

5-8-1890 'బుధవిధేయి'

'కలుషహారిణీ పత్త్రికా కాంతులార!
రండు రండయ్యలార! యేముండఁగనుఁ
జేసుమాసిన వెన్క మీ పెద్దతనము
'బుధవిధేయి'యె మీకుఁ బ్రాపుండు నుండు'

'బృందావనమను సుప్రసిద్ధమహారణ్యమునకు అఁబోతు ఒకటివచ్చి రంకెలు వేసి మెప్పించి, ఒకసింహముతోఁ జెలిమిచేసి దానిప్రాపునఁదాను రైలులాగు పాటి శక్తికలది యన్న బిరుదు నొందుటకు అనుసరింపఁగా ఖడ్గవ్యాఘ్ర శరభాది కములను అది సభఁగూర్చెను. వానియెదుటను ఆయెద్దు రోలులాగ మొదలిడఁ గా.........ఒకపెద్దపులి తాను బనిఁబూని 'ఇదిగో ఆయె ద్దీడ్చినది రైలుకాదు రోలే' యని యెత్తి చూపి యందులోను ద్రాడు తెగినదని ముక్కులేరిచూపి మరల సభచేసి యెద్దును రప్పించిన మోకాలుకొట్టుకొని పోయినపుడ్లుకూడఁ జాపెద నని బొబ్బలువెట్టెను......ఎద్దు తోఁకముట్ట యెత్తుకొని పారఁజూపి యింటికిఁ బోయి తిరిగిచూచెను.'

20-8-1890 'బుధవిధేయి'

ఉ॥ తాను సభాస్థలంబుల నవధానముల న్బహుశస్తిఁ గొల్పి, ప్ర
జ్ఞానిధియన్న పేర్మిఁ గని, ఛాత్రుల నట్లొనరింపశక్తులం
గా నొనరించి నిశ్చయముగాఁగ సదస్సుల వారిఁ జేర్చి, వా
దాన జయింపనేర్చి యనుతాపముఁ గూర్చి హితం బొనర్చినన్॥

---

క ,శ్రీపురుషోత్తమకవి గారు చేసి చూపిన యష్టావధానములందలివి.?
'శ్యామల బాలెంతగఁ దన కోమలమానుదుట బూది కుదిరిచి పైనన్
గామించి తళుక్కుబొట్టిడు నామె సోమార్క అన్నామం దుండుర్రి దివిన్॥'

ఉ॥ బందరుపట్టణంబునను భాసిలు నాశివగంగ యుత్సవం
బందముగా హిమాచలవరాత్మజ పెండిలి వేడ్కఁ జెల్వుమై
నందముఁ జేరునప్పు డదియారజతాద్రివితాన నొప్పెడిన్
ముందటనున్న వారమరముఖ్యులు మర్త్యులిటం చభేదమా॥

20-8-90 'బుధవిధేయ.'

అప్పటియాశువులలోనివి.

సీ॥ ఉత్తముం డేవేళనుండు సజ్జనులతో నధముండు దుర్మార్గులందు మెలఁగు
ఉత్తముండు యథార్థమొప్పి పల్కుచునుండు నధముండు తప్పుమాటాడుచుండు
ఉత్తముం డెదుట నచ్చొత్తిన ట్లనుచుండు నధముండు చాటున ననఁగఁ జొచ్చు
ఉత్తముం డున్నెడ సౌఖ్యం బదనిపించు నధముఁ డుండెడిచోట దల్లడిఁబడు॥
వినయ ముత్తమధర్మంబు విధియె తెలుపు। వినమె యనయంబు నధముల విధ మిదంద్రు
'చంక దుడ్డున్న శరణార్థి' సామెతవలె। వినర నారాయణా! ...............

సీ॥ సిగను బూవులుసుట్టి నగుమొగం బాగఁబట్టి నగలమారిగనున్న మగువ మెచ్చుఁ
దానమ్ము లవి యొసఁగుచుఁ దందనా లాడుచుఁ జిందులు ద్రొక్కిన శిశువు మెచ్చు
దుడ్డుకల్గినబూని బుడ్డవారలఁ గూడి బొంకము ల్వల్కఁగాఁ బిలికి మెచ్చు
బరువులెత్తఁగఁ బోయి పడిపోయినను లేపి వెన్నుఁ గొట్టుచు నొక్కి పెట్టి మెచ్చు
మెచ్చులివియౌనె? గచ్చుల మెచ్చు లరయ సరసులకలంకముగ మెచ్చ జన్మమదిర
కాసుకెక్కు? బంగపు కాసె కాను వినర నారాయణా।..................

20-9-90 'బుధవిధేయ'

సీ॥ ఆజానుబాహుఁడే యందలేని ఫలమ్ముఁ బొట్టివాఁ డెట్లొపుఁ బట్టికోయ?
ఆదిభట్టారక నాదలోపంబుండ మూఢుఁ డెట్లొపుఁ దూఢిసేయ?
కయిసరుం డెదొచెప్ప కైతంబుఁ దప్పన్నఁ బామరుం డెట్లొపుఁ గామ్రవ్రాయ?
దండహస్తుఁడు పారుచుండఁ దిట్లండుచుఁ గూబిరొట్లొప్పు జవాబు నీయఁ?॥
దెలివిలేమియొ మూర్ఖ్యమో తులువతనమొ పిచ్చియో యున్న నేకాని
చొచ్చునె పని?

ఉ॥ దాసుఁడనంచుఁ జేయుచు సతంతము 'నమోనమ' యన్నమీఁద ను
*త్రాసము చెంతఁ బోవక సుతం బనయంబు నయంబుమీఱఁగాఁ
జేసెను బూరుషోత్తముల సోద్యము లెయ్యెడ నెన్ని భంగుల
న్వాసికి నెక్కకుండఁ జేసిన? యీ జలధర్మము లిట్టివేకదా! 54

మ॥ అసదృగ్బల వైభవోదయుఁ డశక్యప్రాప్యతేజుం డధీ
త సమస్తాగమ నైగమ ప్రకట విద్యాభూషి యస్మాదభూ
షి సువంశీయుఁడు వేఙ్కటప్పయ కవిశ్రేష్ఠుండు, తా బిల్హణీ
య సమాహ్వాస్త హ్వాయబ్జుఁడై, కవిని జాయన్వచ్చియగ్గింపఁగాన్॥

క॥ తనయింటి కరుగుదెంచిన
ఘనభరతాభ్యుదయకర్త గౌరవమొనయం
గ నుతించుచు జాతీయము
లను దెల్గున రూపకంబులను వ్రాయుమనెన్॥ 56

తే॥ అదె హరిశ్చంద్రనాటక మాదిగాఁగ
వచనరూపకముల నాంధ్రవాక్సరణిని
వ్రాయఁ బాత్రానుకూలభాషణముల
నయ్యెఁ బోత్సాహకము హిందియందువలెనె॥ 57

ఉ॥ ధీవిభవాభిరాముఁడగు తేజ మొలర్ప శతావధానియౌ
దేవులపల్లి సుబ్బకవి తేఁగువ నెంచి, కడు నుహించు మే
ధావిని మండపాక కులతామరసారవి పార్వతీశు, నా
నావిధబంధ బంధురమునం గవితం దనియించి వించుఁ దా॥

ఉ॥ ధీమహితుండు భాగవత దివ్యకథావిధి యైన దాసు శ్రీ
రాముని వాక్సుధాగరిమ రంజకమౌ నని మెచ్చ నాతఁడో

---

'పిల్లిచెర్లలాట మెప్పదు బల్లికవరెశి వినర నారాయణా॥...............

5-11-90 'బుధవిధేయి'

* "......ఘనులుకల చిన్నసభలో ఆ'కలుషహారిణి' పల్లిషర్సు కామునిపని బారపాటునఁ జేసినాము' అని పశ్చాత్తాపపడి......ప్రార్థించిరి.. 'ఇంతకుముందు వారు విహితులు, ఇందు అహితులు, అయినంతున అల్లి విశారాశారము అను విడిపించి, హితులనుగా భావించితిమి."

20-2-1891 'బుధవిధేయి'

1, హా! మహనీయపాండితి మహోన్నతి నన్నిటఁ గన్నమిన్నవై
ప్రేమముచేతఁగాదె ననుఁబ్రీతి నిటు ల్గాని యాడుదం చనన్॥

ఉ॥ దాపగుబంధుతాప్తిని సదా బహుళాదృతిఁ గాంచుచుండు న
ద్దేపలిసోమనాథులను ధీగణనీయుల శిష్యుఁడైన తా
2. డేపలి వేంకటప్పయ పటిష్ఠతఁ గాంచి కవిత్వనైపుణిన్
దీపితభక్తి రామకథఁ దెల్పుఁ బల్కఁగఁ బ్రోత్సహించెఁ దాన్॥

తే॥ కందుకూరి వీరేశలింగకవి యెపుడు
సంఘసంస్కారమునకుఁ బ్రోత్సాహి యాచు
నెన్నొ వ్రాసిన వాని ఖండించుఁగాక
కలిసినప్పుడు మైత్రితో మెలఁగఁ గనిరి॥ 61

ఉ॥ కాసును దాఁ గవిత్వమునఁ గైకొనుచుం గృతులీయకున్న నా
నాసుగుణాకరుల్ హితు లనంతభవప్రియధర్మతత్పరుల్
వాసికి నెక్క వర్ణనలఁ బల్మ జొనర్చువిధాన ధార్మికో
ల్లాసముఁ గూర్చు వర్ణనముల న్నగుధర్మమె ప్రోత్సహించెఁ దాన్॥

---

1. దేపీభాగవతాద్యనేకగ్రంథకర్తలు బ్యాయవాదులు, శ్రీదాసు శ్రీరామపండితులు:—మీచేర రచియింపఁబడిన పెక్కులు గ్రంథములు నేను గన్నులారఁజూచి విమర్శించుట కలిగినది. మృదుశైలియు నిర్దోషత్వముఁ గల్పనా ప్రౌఢియుం జక్కఁగానున్నవి. మిగుల సంతసించితి. మీగ్రంథములఁ బరిశీలింప సమర్థుఁడనని వ్రాయుటకాదు. నాకు బుద్ధిపుట్టి నాసామర్థ్యముకొలఁదిఁజూచి వ్రాసితినే కాని వేఱుకాదు,

చ॥ సిరిచెలువొందఁ సోము నిజచిత్తమహోత్సలవాసుఁ జేయుచున్
2. సారిదిఁగవీంద్రులైన పురుషోత్తమపండితవర్య! మీకృతుల్
సరసత సత్ప్రసిద్ధిఁగన, సజ్జనులెల్లెడ హర్షమందఁగాఁ
దిరమగు చెల్వుతో 'బుధవిధేయి' సమస్యలఁదెచ్చియిచ్చెదున్॥

తా॥వేం॥ 'బుధవిధేయి' 20-12-1890.

మ॥ అమితానందమునంద బందరున సభ్యానీకముం గూర్చి, విం
టిమి, మీ 'రామకథామృతం'బిపుడు తాతేపల్లివంశాగ్రణీ!
సుమనస్సుస్థిరసారగుంభిత వచశ్శుద్ధిం బ్రకాశించు క
బ్బముటం దియ్యది యగ్రగణ్యమగునప్పా! వేంకటప్పార్యయా॥

నాదెళ్ల పురుషోత్తమశాస్త్రి.

## —♦ ప్రధానాధ్యాపక పదము. ♦—

ఆ॥ అరటిపండు నొలిచి యరచేత నిడినట్లు
లెంత చిక్కుగలది యింతలోనె
బుడుతవారికైన బోధించు నేరుపు
కలిగి బుధవిధేయుఁ డలరుచుంట॥ 63

క॥ హిందూప్రాఁచిస్కూలున
కుందగు హెడ్మాస్టరపుడు కొదవైయుంటన్
గొందఱయభ్యర్థనమున
నందులకు న్వల్లెయనియె నాతండంతన్॥ 64

ఆ॥ విన్నవారలెల్లఁ బిన్నవారలఁ జేర్చ
నున్న తావు చాలకున్న దాట
హితులఁ దానప్రోత్సహించుచు భవనంబుఁ
బారశాలకొఱకుఁ బడయఁ జేసె॥ 65

ఆ॥ బోధనీయమైన భూగోళవిషయాళి
సాఖ్యవిషయ గుచ్ఛసంగ్రహంబు
నాంగ్లవాక్యపంక్తి వ్యాకరించు తెఱంగు
నింక నిట్టి వెన్నియేని కూర్చె॥ 66

ఆ॥ పలుకు పలుకులెల్ల వ్యంగ్యమర్యాదతో
నీతిబోధ సేయనే తనరెడి
నేర్పుకల్మిఁ దఱచు కూర్పనేర్పఱచుచు
వారికెల్లఁ దా నుపన్యసించు॥ 67

ఆ॥ వాకొనంగఁదగిన లోకోక్తులెన్నియో
చాటుపద్యపంక్తి వాటమైన
కథలు నవ్వుఁగొలుపఁ గలుగువైఖరిఁ బల్క
నింపులొలుకఁజేయు నెచ్చరికగ॥ 68

ఆ॥ ఎప్పుడెప్పు డంచు హెడ్మాస్టరందఱుఁ
విలువనంపుకొఱకు వేచియుండ

నోరు తియ్యఁబఱచి నోరూర సీతులు
మదికి నెక్క నేర్పు ముదము గదుర॥ 69

ఆ॥ కాగితాలొసంగి కత్తిరింపఁగఁ జేసి
యక్కరాలు దాన నలవఱచుచు
నవిగుణింపనైన యక్షరాభ్యాసానఁ
దల్లి తండ్రి గురుఁడు దైవములను॥ 70

క॥ కొనువార లమ్మువారలు
గను బాలురలో నమర్చి కావలసిన లె
క్కను వా రొండొరువుల నడి
గిన లీలల నాటమెయినె కిటుకు దెలుపున్॥ 71

క॥ ‹ఇచ్చిన దడిగిన నెయ్యది?
విచ్చుటను న్మడియ విడియ వీలెటు ? ›౦చున్
గ్రిచ్చఱ నదికనుఁగొనఁగా
మచ్చికపడ లెక్క లెన్నొ మతి కెక్కించున్॥ 72

క॥ వ్యాకృతిపాఠంబైన న
దే కతమో యన్నపగిది నింపుం గొలుపున్
లోకజ్ఞత చేకూర న
నేకాంశము లింకఁ జెప్ప నేరుపుమీఱన్॥ 73

క॥ అందందును గురుభక్తికి
నందించెడి గాథ లెన్నొ యనుసంధింపన్
సందేహము విడివడఁగాఁ
గ్రిందుకొను న్ప్రపంచయము కనుగవయందున్॥ 74

క॥ ఏదో సందునఁ గొంచు
న్వేదాంతపు బాటఁ ద్రొక్కి వేద్యమొనర్చున్
సోదాహృతి మోదంబిడి
యాదటమెయి నాలకింప నద్వైతంబున్॥ 75

క॥ ఏకులమైనను బాలుర
నేకులఁ జేకొనుచు విద్దె లెన్నఁ గఱపున్

వాకొన నూఁకొనఁ జాలు
ప్రాకటముగ వృద్ధినందు వడువును బడయన్॥
క॥ బిడల కెల్లర కుచితము
గాఁ దనదరి నేర్పి పైనఁ గలుగసహాయం
బేదైనను దాఁజేసెడిఁ
గాదన కితరులకుఁ జెప్పఁ గడతేర్పంగాన్॥ 77
క॥ వారలకుఁ దిండికొఱవడ
వారమ్ములఁ దానొసంగి పైచదువులకుం
గోరిన జీతము బత్తెము
నేకిత్రనిగాని కూర్చి వృద్ధికిఁ దెచ్చున్॥ 78
క॥ ధనికులు తమబిడ్డల కిం
డ్లనుగూడను నేర్పు మనుకడంకను వారిం
చును, నిఱుపేదల జోడిం
చును, భృతి భరియింపఁజేయుచును గఱపించున్॥ 79
ఆ॥ హెచ్చుగా నొసంగు నేజమాన్దారులో
తనకె చెప్పుమన్నఁ దగ దటంచుఁ
జిన్ననాఁటి తనదు స్నేహితులను జేర్చి
యందువలని మేళ్ల నందఁగూర్చు॥ 80
క॥ భృతకోపాధ్యాయతకే
వెతనందుచునుండ నిట్టివితమెదిరియొల్లన్
మఱియున్నఁ బాఠశాలను
హితపడ నిడు తనదుబోధయే చాలుననున్॥ 81
క॥ వెలయు సహాయోపాధ్యా
యులు తప్పు లవేనొనర్ప నొంటరిగా వా
రలఁ బిలిచి మందలించును
దెలియ న్వ్యాంగ్యోక్తి నొకట దిద్దం జేయున్॥ 82
తే॥ అంతెకాని చెప్పఁ డధికారులకు నద్ది
రద్దిఁజేసి దాన రాయిడిఁగూర్పఁడు



బందరు హిందూ బ్రాంచ్‌స్కూలు హెడ్మాస్టరు

శ్రీ నాపెళ్ల పురుషోత్తమ పంతులుగారు

వృద్ధులైనఁ జేయ వీలైనపను లిచ్చి
కష్టమెల్ల నందఁ గడఁగుఁ దాన॥ 83

క॥ వేతనము తనది పెంపున
కేతఱి నడుగండు చెప్ప నితరుల పెంపుం
జేతం బాటించు విషయ
మూఁకముఁ గావింపఁ బూరుషోత్తముఁ డనఁగాన్ 84

క॥ తా నడువలుకువారల
కేనాఁడే కీడు సేయ నెంచినఁ బైవా
రూనం దామై యెపుడే
న్మానఁగ మనుగడకుఁ బిదప మార్గముఁ జూపున్॥ 85

క॥ అదియేది యొరుల మెప్పుల
నొడవించికొనంగఁ గాక నొక్కింతైనన్
మెదలఁడు తనవిధియనుకొం
చదలఁడు కదలం డెవండె పరయం డాడఁగన్॥ 86

క॥ తనపనినె యనుసరించును
దనధర్మమె వీడకుండు దర్శనములకుం
జనఁ డెన్నం డధికారులఁ
గన వారలు మెరమెరాఁ గలవరపఱచున్॥ 87

క॥ వెనుదీయు కెట్టివాఁడే
న్షనతను దక్కించికోక గడిదాఁటినచోఁ
దనపత్రిక కెక్కించును
వినువారలు నవ్వ హృదిని వెత నతఁడొందన్॥ 88

## దీనోద్ధరణము.

క॥ స్త్రీలకుఁ దగువిద్యాప్తికి
బాలికలకుఁ బాఠశాలఁ బ్రారంభింపన్
వీలౌనెడ హితబోధలు
చాల న్బొనరించి చేయు సత్కారంబుల్॥ 89

క॥ నిఱుపేదలు వస్తువుల
కిరవ్వం దనయింటఁ గూర్చి యెంవెంద్రైనం
గొఱవడినను బూరించుచుఁ
గఱప్రుచుఁ ద్రోవలనుజూపు గడనకుఁ దొడఁగన్॥

క॥ అంధుం జెలిపిగలారికి
మందులతోఁ బొత్తుఁగూర్చి మతులకు నెక్కం
పందను బొందికఁ నేర్పుచు
నందఱఁ గ్రమముగను వృద్ధి నందంజేయున్॥

క॥ తనయింట నాహారము
నను బీదలకిడు టటుండ నానాగతులం
దినఁ గూడు దొరకనప్పుడు
చనవుగఁ దా నాదరించి సాపడఁ జేయున్॥

క॥ ఏరికి దుర్మతిగలిగిన
వారికిఁ దగుమందుఁ దోసంగి వారింపంగాఁ
గోరుచు గోసయిచట్టాల్
నేరిచి సులువుగను మాన్ప నేర్పరి తానై॥

క॥ మనుజుల నౌషధు లేవో
కొనితేరఁగఁ జేసి నూరికొను భైషజ్యం
బును వారికి నలవఱచుచుఁ
దనుజేరఁగ నుచితవైద్య ధర్మము నెఱపున్॥

క॥ కులభేదముఁ బాటింపక
కలిసి యొకటం డొకని కొక్కొకడుపునఁ బుట్టం
గలిగిన వారలవైఖరి
మెలఁగుచుఁ దోడ్పడఁగఁ జేసి మే లొదవించున్

క॥ పఠుచుటఁ బ్రార్థనపద్ధతి
నుడుగక మతధర్మవిధుల నుద్ధతి నైచ్యం
బెడఁదల బెడఁదలఁ గుడుపక
యడఁకువతో నెల్లరొప్ప నలవఱచెడిఁ దాన్॥

క॥ సెలవులఁ బండువు దినములఁ
దలయంట్లకుఁ దా నమర్చితలలొ కఁ దొం గ్రొం
డులఁ గంటుకొనం గడఁగుచుఁ
బలువురు జలకంబులాడ వల నేర్పుఁజుమున్॥ 97

క॥ ఏనికి నభిరుచి దేనన్
దానికె దోహదమొనర్చి తనగోపాయం
బూనంగా నగువైఖరిఁ
దా నేరుపఁజూచు సర్వతంత్రజ్ఞండై॥ 98

మ॥ కవితాకీర్తుల నేర్పిపెక్కుఱకు శక్త్యన్వేషియై యర్వాలె
ల్ల వధానంబుల నారితేరఁగను జల్లాసుబ్బయ న్సారయన్
భువి నద్దేపలి రామశేషయఁ గుటుంబుం గాచిభట్లాంకుఁ జే
సి వివాహంబుల నింక నెందఱినొ వాసింగూర్చెఁ దాఁ జేర్చుటన్

మ॥ ఒకఁ డిస్మాలు మహమ్మదీయకులుఁ డెట్లో గోపభక్తుండుగా
నకలంకం బదియం చెఱింగి, కవనం బల్లంగఁ దా నేర్పి, వా
నికి నబ్బాటను సూటిగా నడచుట న్నిష్ణాతుఁ డొనట్టు లో
పికదీపింపఁగ నేండ్లు బోధసలిపె న్విజ్ఞానియై దాఁటఁగాన్॥ 100

మ॥ ఒకజాత్యంధుఁడు ముచ్చిసుబ్బయ కవిత్వోద్యోగియై చేర, వా
ని కవిత్వంబు సమర్థ పద్ధతిఁ గన న్నేర్పెం గృతుల్గూర్ప, న
ర్భకు బాలాజిని బొందిలిన్ మఱియు సుబ్రహ్మణ్యుఁడ న్సంగమున్
సుకథాకల్పన నీలకంఠముఖుల న్శోభిల్లఁజేసె న్వడిన్॥ 101

క॥ అనుదినముం జదివించుచుఁ
దనయింటఁ బురాణకథలఁ దత్త్వాసారం
బును దెల్పుచుఁ బరమార్థము
వినిపింపంజేయు విన్నవీనుల కెక్కన్॥ 102

క॥ ఆయావేళల శ్రోతలఁ
బ్రాయికముగఁ దగు తలారిరంగాహ్వాయుఁ డం
దేయేవిషయము కావలె
నాయది తెలిపెడినియొఁ బరమహంస మనంగాన్॥ 103

క॥ పాశ్చాత్యుల కలసి జపంగ
గురుఁ డాశుకవిశ్వమల్ల గుఱుతున నిల్పెం
బరమార్థవిషయతతులను
దరిఁజేరుచు వించు నవ్వొ తఱచుచునుండెన్॥ 104

క॥ బంగారము వెలిగారపు
సంగతి మాలిన్యముఁ బాపెడుపగిఁ గాఁగా
రంగావధూత యయ్యెనె
సంగన్ దశదిశలఁ గీర్తి జ్ఞానాధికతన్॥ 105

## మతోద్ధరణము.

క॥ పాపలమెప్పుడ మొదట న
దేపగిది నిజాంగపాళినెల్ల నడంచున్
బాపలకర్మభ్రష్టత
యాపగిదినె సంఘమెల్ల నణఁగంటించున్॥ 106

క॥ కావున సంధ్యావందన
మేవారును మానకుండ హిందూమత వి
ద్యావృతి 'బాలసమాజం'
బై వెలయఁగ బోధసేసె నాదిగురుండై॥ 107

క॥ మత మెది తెలియమిఁ గ్రైస్తవ
మతబోధల మోహమంద మాననెవం డే
పితవుం బుట్టునొ వాఁడా
పితమార్గము వీడకుండు వెత మలపఱచెన్॥ 108

క॥ కొందఱు బ్రహ్మమతం బను
చుం దమయిచ్ఛనువచ్చు చొప్పులఁ జెప్పన్
ముందఱ వారల నిడికొను
చుం దమశాస్త్రీయవాద చోద్యమెఱుంగన్॥ 109

తే॥ వర 'పురాతనశాస్త్రి' తో బ్రహ్మసంఘ
పు 'నధునాతనరావు' వా పోవుసరణిఁ

బ్రహసనంబుగ ఖండించెఁ బ్రాభవముగను
సాంఘికాచారలోపము లన్నియఁజేయ॥ 110

క॥ తమలోని లోటులెల్లం
దమరే సవరించికొనుచుఁ దా రన్యులకుం
గ్రమమైన పథముఁ దెలుపఁగ
సమరసభావాప్తికొఱకు సఫలంగూర్చెన్॥ 111

క॥ తమదేశము తమవర్ణముఁ
దమయాశ్రమ ధర్మములును దమతమవృత్తుల్
తమయాచారంబులు విడు
వమి తగు నైచ్య మొకఁ డొకనివల్లఁ గనమియున్।

క॥ ఏమతమైనను శంకర
రామానుజ మధ్వగురులఁ గ్రమముగఁ గొలువం
గా షహితబోధ లెల్లం
దా మవి తత్తన్మతాప్తిఁ దగు వర్తిల్లన్॥ 113

ఆ॥ ఎవరిమతము వార లెచ్చనుకోవచ్చుఁ
బరమతంబుఁ దగదు పరిహసింప
నన్నిటికిని మున్ దయాసత్యశౌచముల్
గలిగి మెలఁగవలయుఁ గాదె జగతి। 114

క॥ గీతాపారాయణములు
చేతఃప్రీతిదము లవ్వి చేసినమాత్రఁ
నీతిగవర్తన ముండమి
భూతలమున గౌరవంబుఁ బొందఁగనౌనే? 115

ఆ॥ జీవకోట్లనెల్ల దేవుండె కలఁడంచు
నెఱిఁగి హింసయుడిగి యెవరికైన
నుపకరింపఁజూడ నుత్తమం, బదియాను
దేవసేవ ద్యానసే వఱలెడి॥ 116

క॥ ఈవిధమున బోధించుచుఁ
గావించుచు మార్గదర్శిగా నయ్యెడలన్

రావించుచు శిష్యావళి
తో వెడలఁ బరోపకృతుల దోహలుఁడౌచున్॥ 117

—♦ సంఘ సేవ. ♦—

క॥ ఒకయింటఁ 'బూటకూటికిఁ
డికాణ' లేమి సుతమృతి ఘటించుటయు న్వా
హాకు లెచ్చుగ నడుగుట వి
న్కికి మిక్కిలివగచి రిక్తునిం గడ తేర్చెన్॥ 118

ఆ॥ నడుముఁగట్టుఁ దాను నాటకసాంఘికుల్
శిష్యతతులు సంఘసేవకు దిగఁ
గట్టుబా ట్లొనర్పఁగా నైచ్య మెంచక
వెక్కు రట్టి పనికి వెడలి రంత॥ 119

క॥ పలువురు చేరెడి దేవళ
ముల భజనాలయములందు మురికొన మఱికిం
డలపడఁ దానై తత్రి
త్యలు వెసనది యందికొనుచు నూడ్వఁగ నాపెన్॥

క॥ ఎన్నో జీర్ణోద్ధరణము
ల న్నెఱపెడ వేళలందు లంపటమనకే
మన్నిని సాయమందక
ళి న్నాణముదోఁప నెగ్గ వీళ్లం జూచున్॥ 121

క॥ అందొక్కటి యంచలదివి
యం దడవిని డాఁగియున్న యలగోపాలున్.
వందారుల కందింపఁగఁ
బొందికగాఁ బూజ లంతఁ బొసఁగంగలిగెన్॥ 122

క॥ భజనానుకూలకీర్తన
ల, జనానందదపురీతులం దాఁగూర్చెన్
నిజశిష్యజాతములతో
నజ సేవలకై కడంగి తా నారాధించున్॥ 123

—♦ 'నో మాతుః పరా దేవతా' ♦—

ఆ॥ భ్రాతృవిత్తమథమమా తెఱంగు నెఱింగి
స్వార్జితాప్తి మనెడియప్పుడెమొదలు
మాతృపోషణంబుఁ బ్రీతినారంభించి
తనువుబాఁటువఱకుఁ దాన నెఱపు॥ 124

తే॥ తల్లికంటె లేదు దైవంబు లోకానఁ
దండ్రియే గురుండు దైవ మెందు
వారి నడిగి గురుల భజనము ల్సల్పుట
తగదటంచు ముందె తల్లి కెఱుఁగు॥ 125

—♦ సహధర్మచారిణి. ♦—

తే॥ సతి పతివ్రత సహధర్మచారిణియయి
తనమనంబును గనిపట్టి తానునగలు
నాజ్ఞము లోసంగకున్న దెన్నకయు సేవ
నిరత మొనరింప భర్త సాన్నిధ్య మెనయు॥ 126

తే॥ అత్తగారికిఁ బరిచర్య నాస్థనెఱపి
తోడికోడండ్ర సోదరీతులలఁగఁ గని
యతిథిపూజలఁ దనిపి యభ్యాగతులను
దగవు సెప్పంగనేర్చె నెందఱకు నేని॥ 127

సీ॥ తనతండ్రి యఖిలవేదాంతార్థ విజ్ఞాన
కలితుండు మహితుండు గణియు గుణియుఁ
దనతల్లి విహితవేదాంతార్థ వేత్త్రితా
గరిమమ్ముఁ గాంచు నగణ్యపుణ్య
తనభర్త వివిధసత్కావ్యావళీకర్త
యభ్యస్తబహుకలాయతుఁడు నుతుఁడు
తానన్నఁ 'గార్హ్యేషుదాసి' యుం చనసైన
సల్లక్షణాన్విత స్వాధి పృథ్వి॥

తే॥ సాటి సావిత్రి దమయంతి చంద్రమతియుఁ
జెప్ప నొప్పగు నొప్పిద మొప్పమేటి
సూటి కనుపాటి సురవాటి సొబగుబోటి
ధన్య, గుణపేటిముక్తి కాంతావధూటి॥ 128

శా॥ ప్రస్థానత్రయ వేతృతాగరిమ మొప్ప న్సాధకుండౌచుఁ జి
త్తస్థైర్యం బాదవింప శిష్యులకు బోధల్సల్పు ధీశాలియై
యాస్థం దండ్రియె పుత్త్రికామణికి నయ్యై వేదితవ్యార్థముల్,
బ్రస్థాపించియు స్వస్థచిత్త మొదవ బ్రస్థానకాలంబు రాఁ॥

తే॥ ఔటను దదేకసూన లనన్యగతులు
తమదరినె యుంచ నల్లుఁ డల్లితోడ
నెన్నివిధములఁజెప్పి చెప్పింత్రుగాక
తల్లి తీఱెడిదనుకఁ దా నొల్లఁడయ్యె॥ 130

తే॥ పురుషసంతతి వారికిఁ గొఱవడుటను
వారుకోరినవాని స్వీకారమైనఁ
దానెవిద్దెయు బుద్ధి యందంగఁజేసి
వఱలఁజేయుదునన ననె శ్వశురుఁడంత॥ 131

తే॥ ఉభయకర్మములును భ్రష్ట మొకటఁ గాఁగ
దత్తుఁ గొనుకంటె దౌహిత్రు నెత్తమేలు
పుత్త్రను దరింపఁగాఁ దపంబులను సేఁత
పిండు పిఁదియేటిదని దశవిధములఁ గన॥ 132

ఆ॥ ముక్తికాంతఁబిలిచి మూర్ధమాఘ్రాణించి
'తల్లి! కలుగు నెపుఁ దనయుఁ డతఁడె
మూకుఁ దారకుండు మఱిచింతలే' దని
దర్భశయ్య విడిచెఁ దనయసువులు॥ 133

తే॥ జననిమరణింపఁ దత్పూర్వముననె యగ్ర
జన్ము విధురత వోఁ దదాజ్ఞానుసృతిని
శ్వశురు కడపటి దినముల శాంతిఁగొలుప
నచ్చటన యుండి వారల యిచ్ఛఁదీర్చు॥ 134

## కర్తృజననము.

మ॥ ప్రజలో మున్న సరస్వతీజననమై వర్ధిల్లఁ బుత్త్రార్థులై
భజియింపం గవివారజన్మ మెనయ న్ఫల్గున్యుత్తోషఃకలా
'విజయో' దంచితదీప్తిఁ 'బుష్య' బహుళాప్తి 'న్పంచమి' న్గ్రంథక
ర్త జనింగాంచ నిజేష్టసుస్మృతిగ, మేధాదక్షిణామూర్తినాఁ॥

సు॥ ధనమందు న్రవియున్బుధుండుఁ గవి భ్రాత్రాగారముం జెంద, వి
ద్యను రాహుగ్రహ, మెన్న బుద్ధి గురుఁడుంచ, న్గేతువున్రాజు, రా
జ్యనిధి, న్భానుజుఁ డుచ్చలాభము, వ్యయస్థానమందం గుజుం
డును జన్మించెను జంద్రహోర ధనువందుం జక్రి మెట్లయ్యెనాఁ॥

మ॥ తనపుత్త్రుండు 'కవీశ్వరుండవునె? నాథా' యంచు నేయంబ, భ
ర్తను దైవజ్ఞునిఁ బూరుషోత్తమునిఁ గాంతారత్నమా ముక్తికాం
త, నితాంతస్తుతశాంత తా నడిగె నేతత్పూత భూమాతృప
ద్యనజాతభ్రమరాయమాన హృదిసంధానింపఁ గా చెద్దిఁకఁ॥

మ॥ పలుకు న్భర్త నిజాత్మజుం డోకకవిత్వంబేమి? దైవజ్ఞతా
విలసద్ధీమణి శాస్త్రవేత్త యశసున్ విద్వత్కవీ ద్గ్యుఁడై
వెలయ న్వంశకరుండుఁ గీర్తికరుఁడై పేర్మిన్ ధనాప్తిం గనం
గలుగున్ ధర్మపరత్వబుద్ధి గుశుభక్త్యన్వితుఁడై భూతలిన్॥ 138

సీ॥ 'బోధక' యోగ మొప్పు సమగ్రపూజ్యత
గద్యపద్యాత్మకవిద్య యమరఁ
'బర్వత' యోగాప్తిఁ బాండితి ప్రఖ్యాతి
రోగానపేతతఁ దాఁ గనఁ గను
ఘన 'చతుర్ముఖ' యోగమునఁ గావ్యకర్తృత
బహుశాస్త్రవేతృత ప్రబల ధనము
'నుత్తమ' యోగాన విత్తంబు జ్ఞానంబు
నీతిఁ గార్యంబుల నిపుణత తగు॥

తే॥ 'శంఖము'న నొను ధనియు శాస్త్రజ్ఞసుకృతి
'సునఫ' నైపుణి పూజ్యత ధనముఁ జదువు
వీతభయత వాగ్మిత 'శుభవేశి' ని గన

క్షీణను గలాప్తిఁ జంద్రాధి పీతరోగి
యగా జితారియు సుఖియు దీర్ఘాయు వనియె॥ 139

క॥ ఏపూర్వసుకృతఫలమున
నాపితరుల సూనుఁజేచు నావిర్భావం
బాపాపఁ డందఁగలిగె, ని
రూపింప గ్రహాల కెఱుక, రూఢం బటుగాన్॥ 140

క॥ ప్రసు విడికొని తనయొడిలోఁ
గనుఁగందున కీయ ముక్తికాంతాస్తన్యం
బనవృశమని యేమెఱుఁగును?
దెసఁ గనఁగాఁ దనదు భాగధేయ మదంచున్॥ 141

క॥ అతీపిగా కెఱుంగునె?
మాతనుఁ దనయుందుఁదీపి మమతం గొలుపం
జేతంబున బుధుతం డ్రోఁ
గాత 'స్థవి' యన్న హృదయగతముగఁ గుడుపన్॥

క॥ కవిహృదయప్రియ యగాటయుఁ
గవిహృదయమెఱుంగు విదుషిగా నెగడుట లో
క విహృదయ భావ మెనయుటఁ
గవి, హృదయంబున, సుతుండుగా భావించెన్॥ 143

క॥ ఏతాదృ క్సాత్రపితల
పుణ్యాతోదంతంబుఁ బలుకుపుణ్యము వాచా
తీత తదీయ మనోబల
భూ తాశీర్వాక్ప్రభావ పుంజీభవమా॥ 144

సీ॥ తనపితామహుఁ డధీతనిగమాగమ విశు
ద్ధాంతరంగాఢ్య మహాతపస్వి
తనపితామహి నిరంతరభర్తృపాదాంబు
జద్వయ సేవనాసక్తహృదయ
తనదుమాతామహుం డనుపమాధ్యాత్మిక
విద్యావివేక పవిత్రబుద్ధి

తనదుమాతామహి వినుతవేదాంతార్థ
విజ్ఞానసంపూత విమలచరిత।
తే॥ తనదుజనకుఁడు బహుకళాధనుఁ డసముఁడు
తనజనని మహితవిదుషి ధన్యచరిత
తానుదద్గర్భగుక్తిముక్తాఫలంబు
గాఁగ జన్మింపనె తదిచ్ఛఁ గానిదేది?॥ 145

## అన్యకులజాతోద్ధరణము.

మ॥ అగజాధీశుల కర్చలన్నలుపఁగా నచ్చోనె విచ్చేయు పు
ష్పగిరీశుల్ స్తుతి హిందిఁ గూర్పుమనఁ జెప్పన్స్వాత్రజాతంబులన్
దగునంచు న్ముదమంది వైశ్యులకు వేదప్రక్రియం గూర్పఁగా
నగునే యన్నవివాదమే ర్పడఁగ వ్రాయంగోరఁ దద్గ్రంథమున్॥

క॥ వైశ్యులవైశ్యత నిల్పుచు
వైశ్యపురాణోక్తకీర్తి వర్తిల్లంగా
'వైశ్యబ్రాహ్మణవాదపు'
దృశ్యము పుష్పగిరిపతి నుతింగనఁ గొలిపెన్॥ 147

క॥ మేదరులనుఁగల నైచ్యం
బేదుకునై యేదుడుకులు నేమందురుగా
కాదట 'మాహేంద్రపురా'
ణోదితగాథను రచించె నుద్ధరణముగాన్। 148

చ॥ ఎవ రెదికోరఁ గాదనక యెవ్విధివారల నుద్ధరింపనై
న విధ మదారయందొడఁగ, నమ్మినవారికి నెమ్మిఁ గూర్పు, రా
యవరపు పూర్ణయాహ్వాయ నిజాప్తుని కోర్కెని స్వర్ణకార వ
ర్ణ విహితగాథలం దడవి నైచ్యమువాపఁగఁ దోడ్పడంగనెన్॥

మ॥ ఒక శ్రీవైష్ణవుఁ డాశ్రయింపఁగ వివాహోద్యోగియై, వానినే
ర్పు కనం గొన్నిటఁ గొన్నిపద్యముల నింపుంగొల్పు రాగంబులం
బ్రకటింపం గవనంబునేరమి నెవోపద్యాలఁ దానల్లి యి
చ్చి కృతార్థుం డవధానినాఁ గొలుపుచు న్జేయించె సత్కారముల్

### —♦ విద్వత్సమ్మానము. ♦—

క॥ విరవిర గణబద్ధముగా
మారిదేవర సుబ్బరాయఁ డందురటంచున్
పరిఁజేరుచు ధర్మాగ్రము
పరిదేవనముం బొనర్పఁ బ్రాపితృఁడయ్యెన్॥ 151

ఉ॥ బంగరువంటివిద్యఁగలవా రిటఁగొంతలు కల్గియుండియున్
సంగతులన్ని గానమునఁ జక్కఁగ నేర్పెడి దిక్కులేక, వీ
రాంగముదక్క సన్నయిల రాణనుగానము, శాస్త్రవ్యాపారముల్
జంగముఁడైన కోటయ యొసంగనొనర్పఁగఁ బ్రోత్సహించెఁదాఁ॥

తే॥ అలఘు గానవిద్యాయుతుం డలసుసర్వ
దక్షిణామూర్తిశాస్త్రి యత్తఱి నిటడిగి
బాపలకు విద్దెఁ గఱపెడి పట్టునందుఁ
దద్దయుండు రాఁ గూర్చె సత్కారములను॥ 153

మ॥ గురుపీఠంబనఁగా నెసంగుకతన న్గోరందు దానొట నెం
దఱువిద్వాంసులు ప్రోక్క బందరునఁ దత్తద్యోగ్యత ల్దానెఱిం
గి రచింపంగ సహాయుఁడై చెసఁగె సత్కర్తృత్వ లెసల్లిండ్ర, వ
చ్చిరి, శా నాశ్వయుజంబున న్బుధుల కిచ్చెంజెప్పి యిప్పింపఁగాఁ

### —♦ శివాలయనిర్మాణము. ♦—

సీ॥ ఏభవ్యవైదుష్య శోభితస్త్రీరత్న
మా గళస్థాపరోత్సాహానుభూతి
యేవినిర్మల హృదబ్జవికాసభాసిదా
ఘనవాసు దేవాఖ్య మననరీతి
యేభర్తృసేవైక లాభసంప్రీతదా
కలితాంతరంగ భాగవతనీతి
యేపూతదా కథాలాప సీతారామ
వాయుపుత్రాప్త సంవాదభాతి॥

తే॥ యా సతీమణి రాజ్యలక్ష్మీసమాఖ్య
గతులు భర్తకుఁ గలిగింపఁ గంకణీసి

## సనాతన స్త్రీవిద్యాస్వరూప నిరూపక లేఖా భాగము.

గ్రంథకర్త్రుజనని, విదుషీమణియగు 'ముక్తికాంతామణి' స్వర్లోకవాసిని యైనతఱిఁ దొమ్మిదేండ్ల యీ మనుమనిఁ బెంచి పెద్దఁజేసిన మహావిదుషియగు మాతామహి (118 వ పుటలోని 155 వ పద్యమునం దభివర్ణింపఁబడిన) శ్రీ సోమేశ్వరాలయ నిర్మాణ కారయిత్రి, జమ్ములమడక రాజ్యలక్ష్మమ్మగారు తన భర్తయగు వేదాన్తశాస్త్ర పారంగతులు శ్రీ లక్ష్మీనారాయణశాస్త్రిగారి పేర ది 3 జూన్ 1872 తేదీగల జాబు నుపక్రమించిన విధము యథాతథము:

దివిసీమను గోదూర దేవళంబు
నాతఁడె వెసఁ గట్టింప జామాతకొసఁగ॥　155

తే॥ శ్వశ్రువిచ్చినదానితో సాగఁజేసి
యద్దియెటులైనఁ బూరింప నప్పుఁజేసి
మించుభక్తి దేవళము నిర్మింపఁజేసి
తివిరి యందు సోమేశు ప్రతిష్ఠఁ జేసి॥　156

తే॥ వృత్తియమరి ఫలంబు లభించువఱకు
దీపనైవేద్యకల్యాణ సోపపత్తి
కమ్మునర్చుచుఁ దీర్చుచుఁ గ్రమముగాను
జేయనర్యేను సోమేశ్వరీయమంత॥　157

తే॥ "తరముమాలినబరువు' లెత్తంగనేల?"
'తననుమాలినధర్మమ్ము' తగునెజగతి?
ననక నిజనారి యనుసరించును సతంబు
నుత్తమపథంబు లేవైనఁ జిత్తమలర॥　158

సీ॥ తరలివా నొక్కటఁ దమనగ లోఁ-లోఁప్వ
దొంగలు తమయింట ద్రోఁప నొకటి
తమనగ లెరువిచ్చి తమయింటనే చేయ
మూడేండ్ల కవివచ్చు జాడనొకటి
పెట్టుబడులెట్టి నెట్టింప నెట్టులో
తుట్టతుదకు నెగఁబెట్ట నొకటి
పల్లకినెక్కించి పంప నావలికెట్లో
పొందికొ బిడ్డఁ గోల్పోవ నొకటి॥

తే॥ యిట్టియిక్కట్టు లెన్నైన నెట్టుకొనుచుఁ
జట్టుజట్టుల కొనరింప సాయమెంతో
స్నాతకంబాది నెరువిచ్చు నగలవఱకు
సతి హితంబున్న నేకాదె సాగెనిన్ని!　159

ఆ॥ ఊరిపెండ్లి పీర 'లొడలిట్టు కాల్చికో
నొడలె కాల్చికొనిరొ బుద్ధిఁ దొకటు

దాహపీడఁ గనుఁ గృతఘ్నతాపీడను
భిన్నఁ జే మెఱుంగు వియ్యపుసాదరి॥ 160

## —♦ స ర స్వ తీ ప రి ణ య ము. ♦—

తే॥ నిజకుమారికిఁ బరిణయనిర్ణయంబుఁ
జేయ వరజన్మవేళను జెప్పెఁడన్నఁ
దెలియదన దాన, భారమ్ము దేవునిదని
స్థిరమ టనుకొన్న పిదప డాఁచిన దెజెంగి॥ 161

తే॥ తత్కళత్రాంతరస్థితిఁ దనదుసతికిఁ
జెప్పి కర్తవ్య మప్డు యోజింప నావె
త్రికరణంబుల నవశిష్ట మొకటె కాఁగ
'ధర్మముం గీర్తిసిక' 'మెటుతప్పదు' మనె॥ 162

తే॥ ఉభయులమతమ్ము నొకటయి యున్నకతన
వెను కడుగులేక సాగించి రనుపమముగ
ముందు కల్యాణమంటపంబును నమర్ప
స్వయముగా నేర్పరింప రవాకు లెన్నొ॥ 163

సీ॥ సున్నాలు జేగురుల్ వన్నెవన్నెలపూఁత
పసపుఁ గుంకుములను నలుకఁ జేసి
పందిళ్లు వేయించి చాందినీలట్టించి
తోరణాల్ గ్లోబులతో నమర్చి
రంగురంగు తివాచులం గొని తెప్పించి
యిండులు వాకిళ్లనిండఁ బఱచి
ఘనముగా వాగిటను నగార నౌబతుల్
లోగిటఁ దార్యత్రికాగమముగ॥

తే॥ సకల విభవాళి భక్ష్యభోజ్యంబు లోలిఁ
దనరఁ గూరిచి గుణరూపఖనిని సుతను
ధారవోసిరి తెచ్చి కుమారవరుని
కైదుదినములు ప్రమష్టాన్న మంద ఱంద॥ 164

తే॥ దానవేళను 'నమమ' నాఁ దగదటన్నఁ
దుదకె టొప్పించునప్డు తప్పదుగదన్న
కంటఁ దడిపెట్టఁ బెచ్చు ముక్కంటి యున్న
గతి యెఱుంగుట నయ్యె నగ్గల మిటెన్న॥ 165

తే॥ నో రెఱుంగని చిన్న కన్నారితల్లి
నెఱఁగి యెఱఁగియు మిత్తిచే నిడితిమన్న
యట్టి చందము మదిఁ బొడకట్టిన యెడ,
జ్ఞానియైనను నొకట మోహానఁ బడఁడె? 166

తే॥ కర్మసూత్రానుసారమై కవనడచెడి
నున్నయంతకె యానంప మొందుదమను
నిచ్చ, నిత్యకల్యాణముం బచ్చతోర
ణముగ నడపుచు నుండ దినంబు లంత॥ 167

తే॥ దీపికాసరస్వతి కళద్దేర నెదుగఁ
బలుకు పలుకుల నింపులుగులుక మెలఁగ
నీడుజోడైన వారలఁ గూడి చెలఁగఁ
బితను జేయింపు బొమ్మలపెండ్లి యనఁగ॥ 168

## బొమ్మల పెండ్లి.

తే॥ ముచ్చటలు దీర్ప 'సరె'యని కచ్చుఱఁగొని
యెచ్చుమెచ్చుటి బొమ్మలే నెచ్చుగాను
జిన్నపల్లకి ముద్దుగాఁ జేయఁజేసి
పెండ్లిజతనాల సాంగిచెఁ బెచ్చుగాను॥ 169

తే॥ తమసరస్వతి యందు 'మేధావి' వియ్య
మంచు శుభలేఖ లందఱ కందఁజేసె
వేడ్కఁ జూడఁగఁ జుట్టాలు వేగ రాఁగ
నైదుదినముల పెండ్లిగా నద్దిసాగ॥ 170

తే॥ విధివిహితరీతులం గొంత వింతతోఁ బఁ
బూటపూటకు నాట్యాలు పాటలొప్ప
గరికపత్తి కోటయ్య దేవరది యొకట
జరుగుచుండంగ శిష్యులహరికథలును॥ 171

సీ॥ వరుస నగారనౌబతులు తా
షాలు బాకాలు రండోలులుండ
జోడుసనాయిలతోడి మేళమటుండ
రంగురింగు హారంగు గ్యాలుచుండ
దోహాలంబిచ్చు హిందూస్థానిమేళంబు
కులు కెచ్చు మేళంబు తెలుఁగుదుండ
ముద్దుబిడ్డలతోడి ముత్తైదువులునిండ
బిల్బండ్లు కోచీలు వెంటనుండ॥

తే॥ విహితు లెందఱో కా వేనవేలు నడువఁ
'బెండ్లి యెవరిది?' యని జనుల్ పృచ్ఛసేయ
'బొమ్మలదె' యన్న వినువారు బమ్మెరవడ
బుల్లిబాలురు మోసి రాపల్లకిఁ గొని॥ 172

తే॥ అయ్యావియ్యాలవారికి సంపకాలు
తమ్ముబంధుగుల కేవొ సత్కారములును
నెవరియిండ్లకు వారేగి యెంచికోఁగఁ
జెవినిబడ నద్దియూహూరఁ జెప్పికోఁగ 173

— ఆశ్వాసాంతము. —

పుష్పమాలికాబంధకందము.

గరిసరి! గిరిజావర! వర।
వరద! మదనదమన! దాన వానల రహార।
ద్విరదారి! దారితరిపూ!।
హర! హరిహస్త! యమయమ! యుయుః ధరధరధరా॥ 174

కందసగ్విణీ భుజంగప్రయాత గర్భిత ప్రాసాంత్యనియమ ఘటితము

సీ॥ దారితారీ కరీ, దైత్య సంహారకా!
దారుణాత్మా! యహాస్త్రాభుజాల!
శౌరిధారీ సురేట్సత్యలోకేశ! శు
ష్మప్రతీ త్ర్యాధిపా, శా ప్రచేల!
సూరి! గౌరీవర! స్తుత్య కామ్యార్థ వ
స్తుప్రచారా! భవా! సోమపాల!
వారిజారి స్మరప్రత్యనీక ప్రమా!
వ్యాళహారా! శివా! కాలకాల!॥

తే॥ వరద మముఁబ్రోవ వలయును గరుణ నెపుడు
'భక్తకల్పకా' యని కొలువం జనాళిఁ
గరము ననురాగమునఁ గని స్థిరసుఖములు
యశ మొసంగుదేవుఁడ వనసాఁ గదయ్య॥ 175

—♦ గర్భిత స్రగ్విణి. ♦—

దైత్యసంహారకా, దారుణాత్మా! యహా!
సత్యలోకేశ శు, ష్మప్రతీత్ర్యాధిపా!
స్తుత్యకామ్యార్థ వస్తుప్రచారా! భవా!
ప్రత్యనీకప్రమా! వ్యాళహారా! శివా!

♦ గర్భిత భుజంగప్రయాతము. ♦

కరీ దైత్యసంహారకా! దారుణాత్మా!
సురేట్సత్యలోకేశ శుష్మప్రతీత్ర్యా!
వర స్తుత్య కామ్యార్థ వస్తుప్రచారా!
స్మరప్రత్యనీక ప్రమా! వ్యాళహారా!

## గర్భితకందము.

వరద మముఁ బ్రోవ వలయును
గరుణనెపుడు భక్తకల్పకా !యనికొలువం
గరము సనురాగమునఁ గని
స్థిరసుఖములు యశ మొసంగు దేవుఁడ వనఘా॥

వరకవి నాదెళ్లాన్వయ । పురుషోత్తమ జీవయాత్ర
పుత్రికకృతత । ద్గురుచరిత, దక్షిణామూర్తి
రచిత మాశ్వాసమందిది చతుర్థంబా॥

# ఉత్తమ జీవయాత్ర.



## పంచమాశ్వాసము.

---

క॥ చెవియొగ్గి వినుము భీమా! కవిలోకైకపరికామ కల్పకసోమా!
భవ కామాంబుజసోమా! ప్రవిమల భవభయవిరామ! పావన
నామా! 1

### ♦ విచారసాగరము. ♦

ఉ॥ ఇప్పటికే 'విలంబి' యిదియేగ 'వికారి' గ మందమందతన్
ముప్పు ఘటిల్లకున్నె? మునుముందుగఁ జెల్లెలు త్రోవఁదీయఁగా
నప్పుడ 'దీపి' కాస్తమయమయ్యె, నిదేమని లోకులెన్నఁగా
నప్పురుషోత్తముండు వగ పైనను బొందక, పుత్రినెత్తికోన్॥ 2

సీ॥ అమ్మలక్కలువచ్చి బొమ్మసారెనుమెచ్చి
యందచందములెంచి 'యయ్యొ!' యనఁగ
నెక్కడెక్కడిమిత్రు లొక్కుమ్మడినిజూచి
తెలివితేటలువల్కి దేవురింప
నఖిలబంధువు లప్పు డాదరింపం జేరి
యనువర్తనంబెంచి యావురుమన
నగణితశిష్యాళి యారాటమున డాసి
సుగుణపుంజము లెంచి పొగులఁదొడఁగ॥

తే॥ ముద్దుముచ్చటలెల్లను మూలఁబడఁగ
రోదనంబుల నెపుడు మొత్తుకోయనంగ
నరులకియ్యదె ప్రత్యక్షనరకమనఁగ
నున్నచో బిడ్డ దజ్ఞాని యొంటియగాట॥ 3

ఆ॥ నాన్నగా రిదేమి? నాచెల్లి యక్కయుఁ
బోయి రెటకు? నేనుఁ బోవవలదె?
యాడుకోఁగ నాకు నీడ నెవ్వరులేరు
నన్నుఁగూడఁ బంపుమన్నఁ దండ్రి॥ 4

ఆ॥ 'కాదు, నాన్న! వినుము, రాదట్లుపల్కఁగాఁ
బిలువనపుడు తగదు వెడల' ననఁగఁ
'బిలిచి రెవరు? చూపు, పేరంటమా?' నాఁగఁ
'గాదుగాని పోవఁగా ద' టనియె॥ 5

ఆ॥ 'జబ్బురాదె నాకుఁ జప్పుననిద్రవో
నక్కచెల్లులేగు నటకుఁ బోదు'
నన్నవాని కనెకు, 'మున్నొడ లాక్కల్చికో
మానలేవె? యిట్లు మాను' మనుచు॥ 6

ఆ॥ ఏమిచెప్పఁగాక యీచింతమానఁడు
పైకిననక యున్న భయమువల్ల
బాలు మది నిదుడికి లోలోన గుబులుగా
నిదురరాక వేఁడిమొదటి కెక్క॥ 7

క॥ తలమీఁద నొకటి యేర్పడెఁ
బలుమందుల పూఁతలెవ్వి పనిసేయమిచేఁ
గలుగు 'మనోవ్యాధికి మం
దులులే' వనిపింప వెఱపు దోఁప న్మదులన్॥ 8

క॥ 'పొగలఁ బ్రయోజన మేమిటి?
దిగులున వీఁడేమియౌనో! దిగమ్రింగనిచో
సగ మైపోయెనె!' యనుకొని
మిగిలింపఁగ మనియెఁగొల్వ మృత్యుంజయునిన్॥ 9

క॥ అల్లు ద్వితీయవివాహపు
సల్లాపము వించుఁ దనదు సమానమోముంగన్
వెల్లఁగఁ గట్నా లంపుచు
నెల్లప్పుడు [illegible]॥ 10

క॥ లోకుల జాతకచర్య ల
నేకము పరికించుపట్ల నీశ్వరలీలల్
వాకొను నూఁకొనువారికిఁ
బ్రాకటమా మైత్రికొలఁదిఁ బ్రాపౌనంతేన్॥ 11

క॥ దినపరభాగచ్ఛాయగ
మునుకొని వర్ధిల్లు కటకము మదనగోపా
లుని మైత్రిని దత్సతి వా
యిన నతని పునర్వివాహ మెనయంజేసెన్॥ 12

క॥ వేఙ్కొకపుత్త్రిఁడు లక్ష్మి
నారాయణశాస్త్రి యనియనం జనిఁగన సాం
సారికమేఘావృతిలోఁ
బాటిన విద్యుత్ప్రదీప భంగి నెసంగన్॥ 13

క॥ దానికె తల్లియు ముత్తవ
ప్రాణమ్ములు లేచివచ్చు పగిది న్ముద మెం
తేనియు నందఁగ నన్న య
నూనప్రేమమ్మునం గనుం బసితమ్మున్॥ 14

క॥ వీఁడపుడే డెండ్ల వయ
స్సాడుం బ్రైమరిపరీక్ష ప్యాసై యమరం
బేడం గొఱవడకుండెడి
జాడగ నాయాంధ్రనామ సంగ్రహముం గాఁ॥ 15

క॥ మునుముకొన న్శబ్దావళిఁ
గొని రామాయణ సమాసకుసుమావళులున్
మనమునఁ దగ రఘువంశం
బును బఠియించుచుఁ గవిత్వమును మొదలిడఁగాన్॥ 16

తే॥ ధాతుమంజరి వల్లించు రీతి నెనయు
సంస్కృతోక్తుల గణబద్ధ సరణిఁ గాంచి
తప్పు టడుగుల కుబ్బిన యుప్పుటివలె
ముద్దుమాటల శాబ్దిక న్మురిసెఁ దల్లి॥ 17

తే॥ మొగ్గకే పిత యానంద మొగ్గకున్నఁ
జేర్చి గణముల నప్పుడే చెప్పకున్నఁ
రంగదాసుఁడు దనను జేరంగరాఁగ
నాశుధారను బల్కంగ నద్దివించు॥ 18

క॥ అదిమొదలు కందగీతము
లుదితమ్ములు గాఁగ నోట నూరెడిమాట
ల్మదిలో నదె కవనంబని
ముదమందుచు వీఁడు పల్కె మోదద మదికాన్॥ 19

## — సం ఘ సం స్క ర ణ ము. —

క॥ ఆపట్టునఁ బణ్యాంగన
లీపట్టణమందు జట్టు లేర్పడి మేళాల్
రూపొందఁజేయు వైఖరి
మాప న్సంస్కరలూని మాపంబడఁగాఁ॥ 20

క॥ గురుభావం బీపురమునఁ
బురుషోత్తములంద కలదు, పూనిననాతం
డిరపుకొనుం దదోర్బధలు
పరిదేవన మతనిఁజేయ బాగని డాయన్॥ 21

క॥ తనమాట పాటికెక్కుట
కును గారణ మనును దాన కూనా తటిదా
ననుభవగాధం బెల్చుచుఁ
గనకుంటనె వేశ్యహత్తు గౌరవమిడ నాన్॥ 22

ఆ॥ ఆటవెలఁది పొందుచేటుఁగూర్చ దదెందు
నిల్లు నొల్లనల్ల గుల్ల సేయ
గుణము నెంచుపట్లఁ గొఱఁతపడంజేయఁ
దుద కదెక్కె రచ్చఁ దూలపుచ్చ॥ 23

క॥ కులవృత్తి యిట్టిదౌటయు
నలకాంతలమేళవాట నందలియాటల్

కలలకు నుద్ధృతి కంటెను
గలుషపు టుద్ధరణమునకుఁ గారణ మిపుడే౯॥ 24

క॥ అని మున్నె యెంచి యె ట్లిది
పనివడి నేరూపుమాప వలయునో యంచున్
మనమున నెంచుచు నుంటిని
గనఁగలుగుదు రిద్దిమాయఁ గ్రమముగ నంచున్॥ 25

ఉ॥ అంతట వర్తమానమున నందఱు నొక్కటఁ జేర నాకలా
వంతులు దేవదాసు లను వారలుగాఁ దొలి నేర్పడంగ ధీ
మంతులయాదరంబుఁ గను మన్కిని గాంచి క్రమక్రమంబుగా
నింతటి హీనదుస్థితికి నెట్టులవచ్చిరొ పల్కఁజొచ్చుచున్॥ 26

తే॥ భరతశాస్త్రమ్మునందలి వైభవములు
గానశాస్త్రమ్మునందలి తానములును
దన్మయతఁ గూర్చు నయ్యాయి తాళగతులు
వెనుకఁబడ జావళు ల్పాడు విధము లెంచి॥ 27

తే॥ ఏరసజ్ఞత లడుగంట జాఱఁదుదకు
జారచోరుల పాలైన వారసతుల
వలనఁ గులమెల్ల నల్లనై పాడుగాఁగఁ
గాసుదాసులు వారైరి గతులఁ దిట్టి॥ 28

తే॥ మగతనము లేదె? పరువెల్ల మంటఁగలియ
సొమ్ము దొరకిన నెట్లైన సోమరులయి
తాగి పడియుండ నింతులులోఁగ నిట్లు
మేళములు గట్టఁగా మిసిమింతులౌట॥ 29

తే॥ తగదు తగ దింక గన్నె లందఱకుఁ బెండ్లి
చేయనౌటయు నితరు లార్జించుకొఱకు
నాటకాలాడు సంఘము లౌటమేలు
హాని నియామములు లివియంచుఁ దానుదెలిపి॥ 30

తే॥ గద్య పద్యాత్మ కమ్ములై క్రాలునట్టు
లాంధ్ర నాటకములు కొన్ని యపుడు వ్రాసి.

తత్త్వదర్శన దీక్షను దగుఁడటంచు
సంఘసంస్కార పథమున సాగఁ జేసె॥ 31

క॥ ఆ కవితావ్యాసంగం
* బే కొమరునిపద్యరచన కిచ్చల్గొలుపన్
వాకొనఁగా గణబద్ధతఁ
జేకొని తన్నాటకాళిఁ జేర్చుటయుం గాన్॥ 32

క॥ కవినై తిని దాననికొని
యవినాటకు లాడఁ జదువ నానం దముతోఁ
జవిఁగొని యందే తవిలె
న్భవితవ్య మిదంట నిట్లు బయలువడంగాన్॥ 33

---

దక్షిణామూర్తి విరచితముల శ్రీగురుమూర్తులు తమ నాటకములందుఁ దాలిచ్చిన వానిలో మచ్చునకుఁ గొన్ని:

—◆ శారంగధర నాటకము. ◆...

నాంది:- సారంగధరుఁ డుమేశుఁడు సారంగాంకార్ధధరుఁడు శాత్రవదళితే
ట్సారంగహరుఁడు మిము మన శారంగము బ్రోచుచుండు ననిశం బవనిన్॥

సారం:- వందనా లివె మీ పదాబ్జాతములకు మేడ నెక్కి నపావురం బేడఁ గలదో
విడిచి పుచ్చిన నదె నాకు వేనవేలు ఋణమునిలుపంగ నాకిందుఁ గాదు తల్లి॥

...◆ పారిజాతాపహరణము. ◆...

కృ:- సుదతిరో నేఁడు నీతోడ వాదమాడఁ గోరఁ బోఁడను నీ వొప్పుకొందు వేని
చేటిఁ దేఁబంపు మిష్ట పాఠికల పేటి నిర్ణయింతుము నీవ పన్నిద మదేదో॥

రు:- నీవ గెలిచిన నీపాదసేవ యెపుడు నే నొనర్చుచు నుందును గాని యొడల
నన్ను విడనాడి నీ వేగకున్నఁ జాలు నింతకంటెను బన్నిద మేదివలయు॥

సత్య:- కైతవమ్ములరో పారిజాతమిడుచు నెత్తి నెక్కించితో, పొమ్ము చిత్తరువు నె

కృ:- స్వల్ప మదియేల? శత్రుభూజమ్మునెట సత్యయాప్రేమఁ గొనుఁగొందు
సత్య! యిపుడు॥

—◆ ద్రౌపదీవస్త్రాపహరణము. ◆—

ద్రౌ:- లోకవంచన [illegible] తెచ్చు [illegible]
మన్న [illegible]

## — శ్రీముక్తికాన్తాస్వర్గమనము. —

తే॥ శోభకృత్తుగ వీసితో సురభి రాఁగ
రోగతాపాల గ్రీష్మమ్ము సాగిపోఁగఁ
గ్రమ్మమబ్బుల వింట వర్షమ్ము రాఁగఁ
గాంతను జ్వరాతిసార మత్యంతరుజగ॥ 34

తే॥ అరసి యాయమ తెలిసి నిజాంత మదిగ
మదిని గోర్కెలె లేమిని మమత లుడుగ
నెప్పు డెప్పు డటంచు చప్పు డెచ్చరికగ
ముక్తికాంత నిజస్థానమునకు నరుగ॥ 35

మ॥ తనహస్తమ్మును భర్తృపాద జలజాతద్వంద్వ నిక్షిప్తముం
బొనరించె న్నిజహృత్సరోరుహమునందు న్నిల్పెఁ దద్రూప మా
ననసీమ న్వికచాబ్జవైఖరిని మించ న్మందహాసమ్ము లో
చనపంకేరుహపత్త్రిము ల్దివినిగాంచం జూప నుత్సాహముల్॥

తే॥ పరఁగఁ జేసితి వీవు శివప్రతిష్ఠ
కలిగెనెల్లోక న్యాదానఫల మదింత
పుత్త్రివతివైతి వసదృశ పూతచరిత
గౌరి స్వాగతమిదుఁ బొమ్ము నా రమణుఁడు॥ 37

సీ॥ గంగడో లసియాడఁ గంచుగంటలుమ్రోయ
నెద్దుపై వచ్చె నా మేశుఁ డనియె

---

కాక నన్నోడి తన్నోడఁ గడఁగినాఁడో
తగవు సెప్పరే! దాన, నోధర్మవిదులు!॥

భీ:- ఓరి దుశ్శాసనా! నాదు నారినీడ్చి చీరెలాలించిన యానీదు చెయిదమునకు
దూష్యత్వమునగ నీదురొమ్ము వ్రచ్చి పచ్చినెత్తుటిఁ గ్రోల నే! వ్రాల్చియెపుడో!
ఇందు మీఁదును గానక కృష్ణఁదనదు తొడను జూచ్చుండఁబిల్చినదుర్మదుతోడ
గ ధసంగరమున గదాఘాతములను నుగ్గుసేయమి భీమసేనుండె వీఁడు!॥

ద్రౌ:- గోపికావస్త్రములసెల్లఁ గొల్లకొట్టి చేతులెత్తినఁ జీరలిచ్చినమహాత్మ
నాథులుండియు నేఁడి ట్టనాథనంబాతి మానరక్షణ సేయవే! మాననీయ!॥

ముంజూలు మోములమోస్తరు కేసరాల్
గల సింగమున వచ్చుగౌరి యనియొ
తపతపలాడు శబ్దపుఱెక్క గ్రద్దపై
వైకుంఠవాసులే వత్తురనియొ
హస్త చాలన మొప్పు నైరావతము నెక్కి
సాగివత్తురు శచీసహితు లనియొ॥

తే॥ క్రిక్కి నురుఁగులు పరువిడు కాసరంపు
మెడవి గంటల దేదాచప్పుడు వినంగ
నాలకింపఁగ నా పరధ్యానమె యన
ఱిచ్చవాటున దృష్టి సారించి యాఁగ॥ 38

సీ॥ వేదాన్త మదియంత యేదారిఁ బట్టెనో
పిల్లుగా నాతల్లి గొల్లుమనఁగఁ
దద్ఘోష మాలించి దద్దఱిల్లుచుఁ బెద్ద
కొమరుఁ డప్డే లేచి కూయిడంగ
నటనున్న శిష్యులు నయ్యయి బందుగు
లత్యాప్తులెల్ల 'హాహా' యనంగ
'నర్ధరాత్రి యిదేమి యాపద' యని యిర్గు
పొరుగుల వార్వచ్చి పొగులఁ దొడఁగ
తే॥ ముప్పదేడులు నిండని యప్పడంతి
సుతుల ముద్దులఁ జూచికో వెతలఁబడమి
పతి సతిని బుట్టినింటికిఁ బంపినట్టు
చెదరకుంటయుఁ జూడ నచ్చెరువుఁ గొలిపె॥ 39

సీ॥ మోమునఁ గల్యాణపుంబొట్టు ముక్కున
ముకుపుడ్క ముక్కఱ ముక్కుఱఁగమ్మ
పైన రాగిడి చందువంకలు ముడిచిన
కొప్పు తిర్గుడుపూవు నొప్పులొలుక
నల్లపూసలు కంటె పిల్లకాసులపేరు
నాను జిగిని చేత నాగవత్తు

మొలనూలు పాంజేబుగొలుసు లందెలు కడే
ల్విల్లాడులు న్మట్టె లుల్లసిల్లఁ॥
తే॥ గానెసంగడితల్లి బంగారుబొమ్మ
యందఱునుఁ దలనాలుకగా నలరునమ్మ
యిట్టియిల్లాలి నీకఁజూడ మేడనమ్మ
యనుచు నెల్లరు వల్కఁగా నరిగె సుమ్మ॥ 40

తే॥ కర్మకాండమ్ములై తండ్రిగారు సనఁగ
మునుఁగ ముత్తవ దుఃఖసముద్రమందు
నెక్కినిచ్చెన కాశికి నేగెనంచుఁ
దమ్ము నూరార్ప నన్న పటమ్ముఁ జూప॥ 41

తే॥ ఆపె యొప్పమి, లేమి ఛాయాపటమ్ము
తాను జూపఁగ రవివర్మ 'తార' 'అమ్మ'
యన్న తమ్ముని యజ్ఞాన మెన్నఁదొమ్మి
దేండ్లయప్పుడె పెద్దగా నెంచికొఁగ॥ 42

—♦ భీ ష్మ త. ♦—

చ॥ క్రిమముగఁ గర్మకాండములు గాఁగఁ దదాప్తులు శిష్యబంధువ
ర్గము గుమిగూడి యగ్రజపురస్సరులై యతనిం బునర్వివా
హము నొనరించి కొమ్మనుచు నందులకై పురికొల్ప నన్నపా
దములను శీర్షముంచి తనధర్మము విగ్రహమంచుఁ బల్కుచున్॥

శా॥ అన్నా! మీపదమాన యెన్నటికి నన్యాంబింకఁ జింతింప మీ
కన్న న్దైవము నాకులేరు, మదిలోఁ గాంక్షు ల్విడంజేయ మీ
రన్నంజాలుఁ గృతార్థతం గనుదు, గార్హస్థ్యంబునం దొఫలం
బెన్న స్సంతతి, కల్గనేకలిగె, దీవింపుండి వార్ధర్థిలన్॥ 44

మ॥ అనుచు న్బ్రొమ్మక్కుడు నన్న యశుభ్రివులతో నాశీస్సిడు న్శిష్యులం
దు నొకండేడ్చుచుఁ గాళ్లపైఁబడి యనెం, దుష్టిం గొనంజాల, నా
కును బోవ న్సతి, సంతుగల్గినను మీకుం జెప్పనెట్లయ్యెఁ? బెం
డ్లిని నేఁజేసికొనంగ నావుడు, గురు ల్శిష్యు న్నివారించుచున్॥

మ॥ వినుమీ నీసతిచెల్లియుంటయును, బాత్రి ప్రీ నన్నంతతింగాంచ దా
టను నే జాతక మారయంగనుట, వింట న్వశ్వశ్రువు న్మాతృ పి
త్రనుజ న్మాత్మజముఖ్యులం దనుపఁగానౌట న్విహితం బద్దినీ
కనితి న్లేదిట నట్టిపెద్ది యనఁగా నాతండు నిశ్చేష్టుఁడై॥ 46

శా॥ ఉండ న్నాసుతివు దుఃఖమాపుకొని వేఱొక్కర్తుఁగైకొన్న న
ల్లుం, డద్దాని నిజాత్మజాతఁగను జాలుఁజూడఁ దా నంచు నా
వుండు న్నీసుతయుండి నే మృతిఁగన న్పొల్పొందునే యిట్లు? నే
నుండం గూడునె కుల్క వేఱొకతెతో నూఁకొట్ట నాకెట్టులోఁ?

మ॥ గుణరూపంబుల కిక్కయైనసతి నాకుం బుత్త్రిలంగూర్చి పో
షణమాత్రంబును బుద్ధిఁ జే కితరమం దాసక్తి నేనంది, దా
రుణపాపంబుల కాకరంబులవు దుర్దోషంబుల న్నల్పఁ గా
రుణికత్వం బెటుసూపు నీశ్వరుఁడు? దీర్ణంజేయ నెట్లయ్యెదుఁ?

మ॥ వరపూజాచరణైకతత్పరయు యావజ్జీవసేవాధురం
ధరతాబంధుర సత్క్రియాళి పరతంత్రత్యాగరాగాయ తా
దర భావోదయ సంతతస్ఫురణ భద్రిస్వీయ సమ్య గ్విస్ఫు
త్వర దాక్షిణ్యగుణాదిమేదురయుఁ గాంతారత్న మిట్లాటచేఁ 49

మ॥ ఇదిగో నేనిదె బాసచేసెదను మీరే సాక్షులై యుండఁ గో
రుదు నేనెప్పుడు తప్పుఁజేసినను గాఋల్వాల్క నన్నుద్ధరిం
పఁదగుం జెప్పినమాట నేవినమిఁ జెంపం గొట్టినట్టాను, క్రొమ
కుక్కదు మీయందలి దైవతంబునకు దిక్కుంగూర్ప నాకెక్కడఁ।

చ॥ అని కృతనిశ్చయుండయిన యాతని చందము మార్పఁగామి నె
వ్వని తెరువంది వాఁడరుగ వార్ధకరుగ్ణతలబ్బ దుఃఖపూ
ర్ణను దనశ్వశ్రువు న్నిజమనంబునఁ దల్లిగనెంచి యాదరిం
చును నిజపుత్త్రిపోషణము చొప్పడఁ దా జపనిష్ఠ నొప్పుచుఁ॥

తే॥ జ్యేష్ఠసుతునకుఁ గావ్యాలుఁ జిన్నసూరి
వ్యాకృతియు నప్ప కవికృతి నాంగ్లమందు
నల్ల 'లోయరుసెకండరీ' యను పరీక్ష
కనువుగా నేర్పి కడతేర్పఁ గను చుండె॥ 52

—♦ సాంకర్య నిరసనము. ♦—

ఉ॥ అప్పుడు రాణ్మహేంద్రపురియందు వితంతువివాహములు వినం
జొప్పడ బందరందొకటి చూడఁగ నల్లాదినుండిపిల్వనై
మెప్పుఁ గొనంగఁ జేసినసమీక్ష్యకృత్యము గర్హ్యమం చిటం
జప్పునఁ గక్షలేర్పడఁగ నవ్యవహార మనర్హ మంచనన్॥ 53

ఉ॥ చేరినయాసభాసదుల 'స్ట్రైకటక్' యనసీతఁడేర్పడన్
గాటియఁ జెందినార లధికారముఁ గల్గినమేటులైన, ధి
క్కార మొనర్పఁగా విడమిఁ గైకొనికాని సభావిధేయముం
గూరిమినందినన్ హృదులఁ గొందలమూఱక డింద నెందఱో॥

క॥ పూర్వాచారపరాయణుఁ
డర్వాచీనపథవిముఖుఁ డౌనితఁ డనఁగా
న్నిర్వాహకతం బూనుట
కోర్వంజాలుమిని గొంద ఱొంటమిమీఱన్॥ 55

క॥ తనసుతునకు నుపనయనం
బును జేసి వివాహ మపుడె పొసఁగింపంగా
ననువుపడం బొనరింపఁగఁ
దనరె స్వీళ్లందు భేదతంత్రజ్ఞులకున్॥ 56

సీ॥ ఉన్నతోద్యోగాల నున్నమిన్నలు దేన
నండగా నొప్పక యంపివైచి
భూరూపసత్కారము నొసంగుదు మటంచు
వచ్చినవారలఁ బుచ్చివైచి
వేయినూరాటులు నేయవో కానుకలు
వెట్టుదు మనువారి నెట్టివైచి
తాఁ గవివరుఁడౌచుఁ దనపుత్రిఁ గవయిత్రి
నర్పించెద నటన్న నాపివైచి॥

తే॥ వంశగౌరవమందిన వారిబిడ్డఁ
'బార్వతిని' గళాత్తూ మనిరాగ వల్లెయనుచుఁ

గానుగవ్వాల కట్నాల కాసపడమిఁ
గయ్యమెందును గలుగని వియ్యమైన॥ 57

క॥ ప్రాచీనౌన్నత్యం బ
ర్వాచీనధనాగమాప్తి పట్ల నిరసనం
బే చూపఁగ నదియోర్వమి
నేచిన యాయాకుతంత్ర నిర్గతులొప్పన్॥ 58

ఉ॥ వానిని లెక్కసేయక నివారిత మాగతిఁ బూర్వకక్షలం
దాను దొలంగఁ జేసి యొకదారిని బెట్టిన వైఖరుల్గనం
గా నవనాగరావళి కగమ్యములై కనుపట్టె నట్టి శి
ష్టానియమప్రచారములు సాగ యథోక్త పథానుయాయితన్॥

తే॥ చిన్నకొమరుని కప్డె యాసన్నమాచు
నాఱువర్షాలె నిండమి నూఱు నిండ
నాశఁ గొల్పినవాఁడు నిరాశఁ గలఁప
గట్టిగుండెయు దాననే వట్టిపోవ॥ 60

తే॥ పుత్త్రశోకంబు దుర్భరంబుగను దోఁపఁ
బెంచుమత్తవ కాయార్తి పెచ్చుపెరుఁగఁ
దోడు కోల్పోయినసుతుండు దొగలఁబొగుల
నంధకారమయంబైనయట్లు లైన॥ 61

—♦ కవితావ్యాసంగము. ♦—

తే॥ అల్లనక్షత్రమాలిక యాంధ్యముడుప
దాన నారాయణస్మృతిగా న దడఁపఁ
దాను సాగింపఁదొడఁగె గీతాపఠనము
సత్పురాణ కథార సాస్వాదనంబు॥ 62

ఆ॥ వంగదేశమందుఁ బ్రాజ్ఞస్థితప్రజ్ఞ
వరుఁడు రామకృష్ణపరమహంస
తెలుప వేదసార మిల వివేకానందుఁ
డెల్లదెసలఁ జాటనెసఁగుచుండ॥ 63

ఉ॥ ఆయెడ రంగదాసుఁడు జ్వరాప్తిని బోవుదు మందువద్దనన్
డాయ గురుండు కర్మమువిడం గొను మేదిడ నన్నుఁ గొన్న, నె
ట్లాయె న దంతమేయవుట నందఱకోర్కి గురుండ 'రంగదా
సీయ' మనంగఁ గూర్చియది చేర్పబుధాళికి నింకఁగొన్నిటిన్॥

చ॥ అరుదవు జంటగా నమరి యద్భుతకీర్తి గడించినట్టి యా
తిరుపతివేంకటేశ కవిధీరులఁ దిర్పతి యొక్కనాఁడు సా
దరమతి డాయవచ్చి మును త న్గనినప్డు పురాణబంధుతన్
బరఁగిన రీతి నెంచి కవనంబును హిందె ముదంబుఁ గాంచఁగాన్॥

ఉ॥ ఏయెడ నేరికైన వినవింపవు గాత్రపుసొంపు నింప ధా
* రాయుతవాగ్ఝరి న్సులభ రమ్యమృదూక్తుల వేంకటేశ్వరా
ఖ్యాయుతుఁడొప్ప నిప్పరినె హైస్కులుపండితుఁడౌచు రంగదా
సీయపు శైలిమెచ్చుచు వచించుచు నెయ్యముతో మెలంగఁగాన్॥

---

* శ్రీ తిరుపతి వేఙ్కటకవు లందలి వేంకటకవిగారు తుదకుఁ బ్రథమాస్థానకవి పదమందినపు డందంజేయఁబడినవి:

శ్లో. శ్రీ చెళ్లపిళ్ల కులవార్నిధి పూర్ణచంద్రం
శ్రీప త్యుదీర్ణ కవిసంయుత వాక్ప్రచారం
చర్లాన్వవాయ బుధబోధిత శబ్దశాస్త్రం
ప్రష్టాతు దత్తగురుమూర్తి రుపాత్తకీర్తిః॥

శా. ఏనాఁడో మును మాడభూషికవి యార్జించె న్వధానక్రియా
నూన ప్రజ్ఞను వేఙ్కటాహ్వయుఁడు తానుం దిర్పతిం జేరి యా
పైన న్నవ్యశతావధాన కవితాప్రావీణ్యముం జూపి యా
స్థానోత్కర్షము నొంద నంచె నిపు డాస్థానప్రకర్షం బిటన్

చ. తిరుపతికొండదండ ఝుటితిస్ఫురణోదయ వాక్ప్రమత్రికా యా
పరిచిత గాంగధారల యభంగురసంగతి ముం గనంగ 'న
ద్దిర!' యనిపించె మున్ను సుగతిం గొలి పెన్నద నేఁడు వేఙ్కటే
శ్వరునకు నేడనైనను సపర్యలు లభ్యము గాకయుండునే?

ఉ. ఏకవి వాక్ప్రచారము లనేకుల కీయొరవక్కు పెట్టి, సు
శ్లోకము సాంధ్రమండలములో నలుదిక్కుల కెక్కఁజేసె, నా
శ్రీకర చెళ్లపిళ్లకుల సింధుసుధాకర వేఙ్కటేశ్వరా
ఖ్యాతుఁ డసీతిసేర నిపు డయ్యెను రాట్కవి యర్హపూజ్యతన్

శా. ఆయాపండితమండలుల్ కవులు గ్రంథానీకముం గాంచి యెం
తో యానందము వెల్లడించి విపులంబ్రోత్సాహముం గూర్పఁగా
వ్రాయంబూనెఁ బరాభవాబ్దమున నే రామాయణం బద్భుతం
బై యొప్పార ననేకబంధకలితంబై యింపు సొంపారఁగాన్ 67

---

మ. శ్రవణానందకరప్రసంగ నరరాట్సందర్శనాసంగ సం
స్తవనీయాష్టశతావధానకవితా సంగానుషంగాదులా
రవితారంబు ధరాతలంబునఁ దలిర్పంగా యశోవల్లరిన్
దివి కేగంగ సతీర్థ్యుఁ డీశ్వరకృపాప్తి న్నిల్పుఁగా కితఁడే॥
మ. అవధానమ్ము లనేకము ల్సలిపి గ్రంథానీకముంగూర్చి యి
య్యవనిం దిర్పతివేంకటేశ్వరు లనన్యాదృగ్యశోభాసులై
కవిలోకంబున వన్నెకెక్కి రిపుడీ గణ్యత్వ మీఁ పొందు ని
శ్చవిరాడ్గౌరవ మందనామయత కల్గంగాదె, కామేశ్వరీ!

నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రి

శ్రీ మాహేంద్రిపురాణ సోమేశ్వరీయాదులను గూర్చి
శ్రీ కంకపీంద్ర ఘటాపంచాననాది బిరుదాభిరాములు
తిరుపతి వేంకటకవులు

అయ్యా! తమ రాశీపూర్వకముగా నంపించిన 'రంగదాసీయము' 'మాహేంద్రపురాణము' 'సోమేశ్వరీయము' 'నారాయణ నక్షత్రమాలికా కీర్తనల'ను బ్రత్యేకించి చదివితిమి. కవితాశైలింబట్టి అన్నియుఁ బరమానందదాయకములే యైనను 'రంగదాసీయము' మాకు మిక్కిలి కూర్పునది యైనదని విన్నవించుకొనుచున్నారము. అతిశయోక్తి రవంతయు నతికి యయ్యనఘునిచరిత్ర మెప్పుగొలుపుచున్నది. ఆ పుస్తకమునకుఁ దామిచ్చిన నామముతోఁబాటు 'ఢుం ఢుం' అను నామము కూడ జగత్ప్రసిద్ధం బగుఁగాక.

అష్టావధాని, చల్లా సుబ్బారాయశాస్త్రిగారు రాజమహేంద్రవరం.

అస్మద్గురు వరేణ్యులకు నమస్కారపూర్వక విజ్ఞప్తి:

క. మీ రంపిన కబ్బంబులు
సేరెన్ మీ తెఱ నమ్మదంబు, చిత్తంబునకిం
పారెం గనఁగ సముంచిత
మీ రంగని చిత్రచరిత మిదిగురుమూర్తీ.

తే. 'జగమెంతటిదైన కాపునకిని బండమేలు'
అనిన నెసఁగిన రంగదాసుని చరిత్ర,
పురుషోత్తము లౌదలంబూని పొగడ,
మేలిమికిఁ దావిఁగూర్చిన ట్లుండదా?

మ॥ కలికాలంబున దైవభక్తి కలుగం గాఁ గష్టమౌఁ గల్గినన్
నిలుపంగా మతికష్టమౌ, నిలిపి తా నిర్ణీత కాలావధిన్
జలనం బందక 'రంగదాసు' నియతిన్ సాధించె మోక్షంబు ని
శ్చలవృత్తిం జరియించువారి కిల దుస్సాధంబె యేదేనియున్ ?

తే॥ మంచిచెడుగులు వేఱెలెక్కించి చూడనవసరము లేదు, పదుగురేమనిరో యదియె
ప్రబలసాక్ష్యంబు పండితి పామరులకులందమిచ్చిన నట్లు వచించువారె ?

బెజవాడ హైస్కూలు తెలుఁగుపండితులు
శ్రీ జానపాటి కామశాస్త్రిగారు

భవద్రచితంబులయిన మాహేంద్రపురాణాది గ్రంథంబులు స్థాలీపులాక న్యాయంబునఁ గాక సాంతంబుగఁ జదివినాఁడ. శైలి నాతి కఠినంబయి రసవంతంబయి చదువఁజదువ నానందంబు కలిగించుచున్నది. కల్పనమందలి చాతుర్యంబు చేతే వ్రాయనక్కఱలేదు. సరసులందఱి ప్రాప్తింబుల నామాలాగ్రంబుగఁ జదివెదరు.

శ్రీ మహామహోపాధ్యాయులు 'విశ్వేశ్వరీ' యాది గ్రంథకర్తలు
శ్రీ కొక్కొండ వేంకటరత్నశర్మగారు రాజమహేంద్రవరం.

సీ॥ పద్యైకవిత్వంబు పటిమంబుఁ బ్రకటించు సోమేశ్వరీయంబు సుధయనంగఁ
బదకవిత్వంబు సత్ప్రాటవంబుంజాటు సోమేశగీత భాసుర సుకృతియె
పౌరాణికస్తుత వరికవనముఁ జూపు రమ్య మాహేంద్రపురాణరచన
యాధునిక ప్రశస్తార్థకవిత్వముఁ జెల్వు రంగదాసీయసుకృతి॥
కరుణ రసవర్షి మఱఁగను గానుపించు లక్ష్మణ పేరి నారాయణ లలితమైన
యట్టి నక్షత్రమాలిక, చిట్టికృతులనైన నాదెళ్ల పురుషోత్తమాఖ్యుఁడు తగు॥

శ్రీ పిఠాపురం రాజాగారి హైస్కూలు హెడ్మాస్టరు

గౌరాంగచరిత్రాది గ్రంథకర్తలు

శ్రీ కూచి నరసింహం పంతులుగారు

Many thanks for your books. Owing to press of work I have read them only cursorily; but read enough to appreciate their merits. Your style is flowing & pleasing to the ear &

varied; & shows the great command you have over the language. Some of the verses indicate the depth of the devotional spirit you possess. God bless you with long life and enable you to enrich the Telugu literature with more books of the kind.

వేంకటగిరి టౌన్ హైస్కూలు పండితులు

శ్రీ వెంపటి రామనాథ శాస్త్రిగారు

మీచే విరచితంబులగు పుస్తకంబుల స్థాలీపులాకన్యాయంబుగా నవలోకించితి. అవి సరసానవద్య పద్య గద్యంబులచే హృద్యంబులుగా నున్నవి. సంగీతకవనంబు సర్వజనానందకరంబయి మహాసమజ్ఞా సీమంతినికి సర్వాలంకార సమంబయి విలసిల్లును. ఇవి నీతిభక్త్యాది బోధకములై లోకోపకారకములౌచున్నవని నొక్కివక్కాణింపఁ గలను.

అమలాపురం హైస్కూలు తెలుఁగుపండితులు

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

మీ గ్రంథములను సాదరంబుగఁ జదివితిని. శైలి మృదుమధురముగా నున్నది. ఈ కవిత్వము నందలి గుణంబుల గ్రహించు సరసులకు సారస్యంబు తేటపడునని వక్కాణించుచు లోకోపకారకంబులగు నిట్టిపొత్తముల రచింపఁ బ్రార్థించుచున్నాను.

చిత్తూరు బోర్డుహైస్కూలు తెలుఁగుపండితులు

శ్రీ చావలి వేంకటశాస్త్రిగారు

మీ రంపిన పొత్తంబులం, జేకొని పరికించి యమందానంద తుందిల హృదయుండ నైతిని. అందలి సరసపద రచనాచాతురి భవదీయ పురుషోత్తమత్వంబును బ్రకటించుచున్నయది. పరబ్రహ్మ విద్యాధికృతంబును, భగవత్సంతోషాధాయకంబును, తదీయ లీలావిభూతి విరాడ్విగ్రహంబునకు భూషణరత్నంబును, దత్తదింద్రియాధిష్ఠాతృత్వేన సర్వదేవతోపాసయోగ్యంబును పరబ్రహ్మస్వరూపరూపగుణ విభూతిబోధక భగవన్నామ సంకీర్తనాది గౌణఫల భక్తివిధాన నిధాన పురుషరత్నంబుం గనిన ప్రయోజనంబుం గొని మనితిరి. కలియుగప్రాధాన్య ద్యోతక నామసంకీర్తన ప్రధానోపకరణంబగు కీర్తన గ్రంథరత్నంబును భక్తశిరోమణులగు త్యాగరాజాదుల కీర్తనశైలి ననుకరించుచుఁ గడు హృద్యంబై యున్నయది.

ధూమానంద ప్రకాశికాది పత్త్రికాధిపతులు, భాగవత వివేక చూడామణి
ప్రభృతి గ్రంథకర్తలు

శ్రీ కోవ్వూరి పట్టాభిరామయ్యగారు, కడప

క. సరస చతుర్విధకవితా పరిచయ గంభీర విమల, వాగ్ధోరణి ! నా.
పురుషోత్తమ సుకవీ నీ యరుదగు సౌజన్య మెంత, యని వర్ణింతున్ ?

క. అకృత పరస్పర పరిచయులకు మన కనిమిత్తరాగ, లత మెచ్చె నిదే
సకిసల కుసుమామోదా సక్త దాకృష్టాన్య సుకవి, షట్పద యగుటన్॥

తే. నీవు నాకంటె నాలుగు నెలలు పెద్ద వాఁడవును వైదికుఁడవు
విద్వాంసుఁడవును
సుకవి వింకెన్నివిధములఁ జూచినను మహాత్మ! నాకీవు వంద్యుఁడ వనఘచరిత!

పెద్దాపురం ఎ. ఇ. యల్, యమ్ హైస్కూలు పండితులు,
శలపాక వేంకట సూర్యప్రకాశంగారు

క. మృదుపద లలితములై బుధ హృదయములకు ముద మొసంగి యొంతయు
నొప్పంగద పురుషోత్తమకవి కృత సదముల కావ్యంబులెల్ల, క్ష్మాతలమందున్॥

శతావధాని వేమూరి నృసింహశాస్త్రిగారు, కావలి

కవివర్యాః భవద్భి రచితం మహ్యం ప్రేషితం పుస్తక పంచక మవాలోకి మయా కవితాయా శ్శైలీ స్వభావమధురా సరసాభిప్రాయయుతా, పదమైత్రీ భాసురేతి ప్రకటమ్. కింబహునా? మన్యేఽహం మాహాత్మ్యం స్వభావసిద్ధేయం కవితామనోహారిణీతి. యదస్తికిల 'కవితా వనితా చైవ స్వయమేవాగతా వ'రేతి

బందరు నోబుల్ కాలేజి పండితులు వైయాకరణులు

శ్రీ కోరాడ దుర్గానాగేశ్వరశాస్త్రిగారు

కవిత రచించిన పాత్రము లవి తామంపినవి సేరెనందితి ముదముల్
జవి పెచ్చుచుఁ జదువరులకు జెవి కింపై మోదపఱుచుఁ జిత్తం బలరన్॥

కంచి మిషన్ హైస్కూలు సంస్కృత పండితులు

చక్రవర్తి కవితార్కికసింహ వేంకటవరదాచార్యులుగారు

శ్లో॥ పురుషోత్తమార్య కవినాథకృత్యా రచితాంధ్రపద్య రూపేణ
శ్రీవిష్ణు బుద్ధమాలా కేషాం మోదాయ నోభవదేషా. 1

శ్లో॥ అతిచిత్ర యోగిచరితం నవాంధ్ర శైలీంచ బోధ్యమిచ్ఛథచేతో
పురుషోత్తమార్యరచితం రమణీయం పఠత రంగదాసీయమ్॥ 2

శ్లో॥ విచిత్రవృత్తే వ్యథితేషులోకత్త్వేషు గౌరీశ్వర సంస్తవేచ
భవేద్బుభుత్సా యదివోఽతిహృద్యం సోమేశ్వరీయం పఠతాతి మోదాత్॥

శ్లో॥ ఆంధ్ర మాహేంద్ర జనతా వృత్త బోధక మద్భుతం
పురుషోత్తమ సూరీంద్ర రచితం పఠతాదరాత్॥ 4

శ్లో॥ పురుషోత్తమార్య సుధియా భక్త్యారచితాని కీర్తనాదీని
యఃపఠతి సాతిమోదం భక్త్యుత్కర్షం సవీవబోధేత॥ 5

శ్రీ దుర్భాల రామకృష్ణ పండితులు—కంచి

సీ॥ పుడమిని నాదెళ్ల పురుషోత్తమాఖ్య సత్కవిరచితంబులు ఖ్యాతిఁగాంచు
సోమేశ్వరీయంబు సోమేశ్వర ప్రియంబు భక్తిసంభరితంబు పావనంబు
మాహేంద్ర మన నొప్పు మహిత పురాణంబు సత్కథా పుంజంబు సరసఫణితి
వివిధగానంబుల విలసిల్లు భజనామృత కీర్తన బృందంబు కీర్తిదంబు
రంగదాసీయంబు రమణీయ రసపూర్ణ మానందదాయక మగుచునవురు
నారాయణీయము తారావళియుఁ గూడఁ గరుణకు నిలయమై క్రాలుచుండఁ

తే॥ జూచి యలరితి శ్రీ కంచి మాతనాథు కరుణచే బుధసంప్రీతిఁ గాంచుగాతఁ
దనరుఁగావుత నాచంద్ర తారకముగ నమరదుర్భాలరామకృష్ణాఖ్యవినుతి॥

క. పురుషోత్తమార్య విరచిత వరకావ్యము లన్నిసమవు వారల కింపై
యురుతర నీతిద మయ్యెడు ధర నవిశ్రావ్యములు విబుధతతి యొల్లరకున్॥

రాయవేలూరు హిందూహైస్కూలు తెలుగుపండితులు

శ్రీ పాకాల ఆలూరువాసుదేవశాస్త్రిగారు

క॥ శ్రీ నాదెళ్ల సద్వంశాంభోనిధి సంపూర్ణచంద్ర! పురుషోత్తమసం
జ్ఞానకవీంద్రా! కీర్తి నిధానా! విజ్ఞప్తి పుణ్య తరగుణ సాంద్రా!

భవత్ప్రేషితంబులౌ గ్రంథంబులం జూచి సంతోషాయత్తచిత్తుండనైతి. గోస్తనీ పాకంబునఁ గ్రాలు సోమేశ్వరీయము నాటకాలాగ్రమునాఁ బఠించినచో విశదగ్రంథములం జూడనక్కరలేకుండ వివిధపద్యరచనా సామర్థ్య మబ్బఁ దగినట్లు లాంధ్రవిద్యార్థుల పాలిటి పెన్నిధిగాఁ దోఁచుచున్నది. 'మాహేంద్రపురాణము' చదువఁ జదువ నతిమనోహరంబై సూర్యచంద్రాదివర్ణన లతిరమణీయంబుగఁ గల్పనాతిశయంబులతో నిండి లక్ష్యలక్షణసమన్వయంబు మీఱియున్నది. శ్రీ లక్ష్మీ నారాయణ నక్షత్రమాలిక' యనునది నిరంతరము పారాయణమునకుఁ పాత్రం

మ. ధరణిం గల్గినయాంధ్రవాఙ్మయమునం దద్గ్రంథవిన్యస్త ప
ద్యరమావైభవ మెందుఁ గానఁబని యత్యైవర్ణ్యనాంశాలియుం
బరమానందదమంచుఁ బండితులు చెప్ప న్మెప్పుగా నవ్యతో
త్తరరామాయణకావ్యరత్నమును సంధానించె శీఘ్రంబుగాన్.

మ. అదిముద్రించుచుఁ జెన్నపట్టణమునం దారంగయశ్రేష్ఠిఁ జూ
డ, దిదృక్షుంగని యచ్చుపత్త్రములఁ దా ట్రాన్స్లేటరై జెక్కునబు
క్కదికాఁదగ్గది, ముందు పండితుల కీరంపుండి, యామోదమం
ద్నుదు రవ్వానిని గూడఁజేర్చి యనుపం దుష్టింగడుం గూర్చునాన్

ఉ. ఆలలితప్రబంధ మపు డంపఁగ' బేరిమిఁ గన్నదేశదే
శాలబుధాళి యద్దికని సంతసమంది యమందసంస్తుతిన్
మేలొనరించుబాలుర కమేయముగా నుదికెక్కఁజేయ నాన్
గ్రాల నొనర్ప నేర్పడెను గైకొనఁ బట్టపరీక్ష పాఠ్యమై॥ 70

శా॥ శ్రీపాదాన్వయ కృష్ణమూర్తి కవిరాట్సింహుండు, దోషజ్ఞతా
టోపోద్ధూతకవీంద్రకుంజరుఁడు దీటుంగాన నంచెంచ, వి

---

బగుచున్నది. 'రంగదాసీయము' వర్తమానాంధ్ర భాషాశైలిలోఁ జక్కఁగ నున్నది. భజనకీర్తనలు రాగతాళజ్ఞుల కతిమనోహరములు.

చ॥ శుకములు మంచిపండ్లుతిని సొంపుగఁ బల్కెడుమాడ్కి ధాత్రిలో
సుకవులు మీ సుకావ్యములఁ జూచి బలేయని మెచ్చుకుందురే
బకములు మీలగుంపుఁదిని పల్కెడిఁ గొక్కొక యంచునాక్రియన్
గుకవులు తప్పులంచు నెవి కూసినగొప్ప తొలంగి పోవునే?

గుంటూరు మిషన్ కాలేజి సహాయ సంస్కృతాంధ్ర పండితులు

శ్రీ పెరవలి పార్వతీశ్వరశాస్త్రిగారు

తే॥ రంగదాసీయ మది నూత్నరమ్యశైలిఁ గొన్ని దేశీయపదముల కన్నెకెక్కఁ
బరఁగ సోమేశ్వరీయంబు పద్యవితతి పలువిధంబుల శైలులఁ బ్రబలియుండు॥

క॥ నవ మాహేంద్రపురాణం బవని న్మధురంపుశైలి నమరున్మిగులన్
గవివర! పూర్వపుఁ గవితన్ భువి నాదెళ్లాబ్ధిచంద్ర; పురుషవతంసా!

తే॥ 'పదచతుర్కృతి వృత్తాదిపద్ధతులను బెంపువీడంగఁగ వనంపుసొంపు [illegible]
తేయు మీగ్రంథరసపుష్టిఁ జెప్పఁదరమె యరయ నాదెళ్ల పురుషోత్తమార్యవర్య

ద్యాపారంగతు లెందఱో పొగడ, మేధాస్ఫూర్తి విద్వేశ్వరీ
యోపజ్ఞం డది మోదదం బనఁగ నార్యుల్మెచ్చఁగాఁగ్రిచ్చుటల్

---

శ్రీమదద్భుతోత్తర రామాయణముంగూర్చి

శ్రీ 'మహామహోపాధ్యాయ' 'కళాప్రపూర్ణ' 'కవిసార్వభౌమ' ప్రభృత్యనేక బిరుదాభిరామ శ్రీ కృష్ణభారత భాగవత రామాయణాది

శతాధికోద్గ్రంథ నిర్మాతలైన 'ఆస్థానకవిశేఖరులు'

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

మ. వరసాదెల్ల కులాబ్ధిసోమ! సుకవివ్రాతాంచసాధామ! మీ
పరిపూర్ణప్రతిభన్ రచింపఁబడి విశ్వవ్యాప్తమౌ నద్భుతో
త్తర రామాయణ కావ్యరత్న మది మత్కార్యాలయాలంక్రియా
గరిమం గైకొనెఁ జూచి మాదృశు లెదం గౌతూహలం బందఁగన్॥

మ. పరికింపం బరమాద్భుతప్రకరమై భవ్యప్రబంధప్రథో
త్తరమై రామకథానిధానమయి, విద్వద్రాజసంవేద్యమై
గరిమం గాంచుట మీప్రబంధమది లోకఖ్యాతిమై నద్భుతో
త్తర రామాయణ మయ్యె సార్థకమునై తత్త్వార్థ వృత్తంబునై॥

క. పురుషోత్తముఁడవు గానం బురుషోత్తమ! నీ కవిత్వము ప్రశస్తంబై
పురుషోత్తమ సంస్తుతిమైఁ బురుషోత్తములకు నొసంగు ముదమును సుగతిన్

చ. వ్యసనదినంబులందుఁ గడుభక్తిమెయి న్భగవంతు నెంచుచున్
మసలక మీరుచేసిరను మాటయె కాని, పరిశ్రమాధిక
ప్రసరమునందునైన బహుళంగుల వర్ణనలించు సత్కవుల్
పసగలవంచు నెంచుగతి భాసిలు నీదు కవిత్వ మగ్రణీ!

తే. నాతికఠినంబు మృదుమధురాధికంబు శాస్త్రబద్ధంబు నిర్దోషసన్నుతంబు
మీ కవిత్వంబు సుకవి మోదాకరమని కృతుల వర్ణించు శ్రీపాద కృష్ణమూర్తి॥

శ్రీ శ్రీ జయపుర సంస్థానాధీశ్వరులు

శ్రీ విక్రమ దేవ వర్మ మహారాజేంద్రులు

భవద్విరచితమౌ శ్రీ సీతామాహాత్మ్యమును నద్భుతోత్తర రామాయణము మృదుమధుర శైలితోడను చిత్ర కవిత్వము తోడను నొప్పి పాఠకుల చిత్తమును రంజింపఁ జేయుచున్నది.

బురంపురం కళ్ళికోట కాలేజి సంస్కృతాంధ్ర పండితులు నష్టావధానులు

'శ్రీ కాకరపర్తి సూర్యనారాయణ శాస్త్రిగారు'

ఉ. పెక్కులలంకృతుల్ శ్రవణపేయము లైతగు సత్కథావళుల్
చక్కని కబ్బపుంబటిమ సాధుపదప్రకరంబుఁ గల్గు నీ
ఫక్కిక లెల్లఁ జూచితి నపారముదంబును జెందుచుంటి నా
తిక్కన కింత కాలునకు ధిక్కృతికర్తె నటంచు నెంచితిన్॥

ఉ. భారతమాదిగాఁ గలుగు ఫక్కిక లెంతయు నీతిరీతులం
జేరిచి చెప్పటంగద విశేషము గౌరవ మొందెడిన్ రసో
ద్ధారపదార్థ చిత్రకవితా నునయాద్భుత వృత్తజాతి కా
ధారముగా విరాజిలెడు త్వత్కృతి యే బుధమాన్య యెయ్యెడన్.

'విమర్శ కాగ్రేసర' శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు

మీ యద్భుతోత్తర రామాయణ మద్భుతముగనే యున్నది. కవిత్వము మృదుమధురధారకలిగి చక్కఁగాఁ నడచుచున్నది. ఊహలు మనోహరముగా నున్నవి. ప్రస్తుతకాలపురుచి కనుకూలముగానె యున్నది. పెక్కులకీ మీ గ్రంథము విద్వాంసులకును విద్యార్థులకునుగూడఁ బఠనీయముగా నున్నది.

'కావ్యకంఠ' శ్రీ ఏ. గణపతి శాస్త్రిగారు

శ్లో॥ య న్మ్యబంధి పురుషోత్తమ త్వయా । జానకీచరిత మాంధ్రభాషయా
చిత్ర చారు మధురే విపశ్చిత । శ్చిత్త మత్ర నరమేత కస్యవా॥

శ్లో॥ మతిమండన పండిత మౌళిమణే । పురుషోత్తమ తే లలితా కవితా
సరసా సగుణా సదలంకరణా । దయి తేవ సతీ విదధాతి ముదమ్॥

బహుశాస్త్ర పారంగతులు గుంటూరుకాలేజి ప్రధానపండితులు.

శ్రీ శిష్టా సీతారామ శాస్త్రిగారు

శ్లో॥ ఆంధ్ర్యా గీర్వాణమయ్యా రసగుణలహరీ యుక్తయా త్వద్గిరో ర్వాం
సంతుష్టిం కో నగచ్ఛే ద్యదవిదితవతిః పండితో౽భూ న్మనుష్యః
శ్రీ వాదెల్లాన్వవాయ ప్రథిత కవివర! త్వద్విధా స్సంతి కేచి
ల్లోకే ద్రాక్షా గుళుచ్ఛ రుపమితవచసః పండితాః ప్రాయ ఏవ॥

గుంటూరు మిషన్ కాలేజి సహాయాంధ్రగీర్వాణోపాధ్యాయులు,

శ్రీ పెరవలి పార్వతీశ్వర శాస్త్రిగారు

తే. అద్భుతోత్తర రామాయణాఖ్యకృతిని జిన్నపదము లలంకృతిఁ జెన్నుమీఱ
నర్థవతిగాను జేసితి రరయ నిట్లు బుధజనవిగేయ వాదెల్ల పురుషవర్య!

ఉ. కంకణము న్వెలుంగు మణిఁ గైకొని, యమ్మణి వెల్గు దానిచేఁ
గంకణరత్నయోగ మిలఁ గ్రాలుఁగదే కరసంశ్రయంబున
న్వంకయె ? యట్లె నీదుకృతి శస్తగుణంబుల యూనివర్సిటీ
కంకువదాఁ గశాధ్యయన మొందెడు శాలల నుండ నిమ్మగున్

చిత్తూరు బోర్డుహైస్కూలు పండితులు

## శ్రీ చావలి వేంకటశాస్త్రిగారు

ఇమ్మహాగ్రంథం బద్భుతంబగు శ్రీరామకథా ప్రతిపాదకత్వముచేత నే యత్యాశ్చర్య సంపాదకమగుటకాక భవదీయ రచనా నైపుణ్యముచే నత్యద్భుతాపూర్వ వృత్తాది గ్రథితంబయి యత్యద్భుతత్వ విశిష్టంబై నన్నయ భట్టారకాది పూర్వ కవితుల్యంబయి సకల సూరిజ నాదరణీయంబై యున్నయది.

నరసాపురం టైలర్ హైస్కూలు పండితులు

## శ్రీ దర్భా జగన్నాథ శాస్త్రిగారు

తే. వర రసప్రసాద సమృద్ధి వన్నెకెక్కి సకలకవులకు నానంద సమితిఁ గూర్చు
తమ ప్రబంధతరంగిణి ధ్వనుల మెఱసి ధరణి వర్ధిల్లు నాచంద్రతారకముగ॥

తే. ఎన్న నిర్దుష్టకవితను నన్నపార్యుఁ బెఱుఁగు పదగుంభనంబునఁ దిక్కయజ్వఁ
దేటమాటల కల్మిని దిమ్మకవిని బోలియుండితి వయ్య యోపురుషవర్య !

## శ్రీ కలువలపల్లి రంగనాథ శాస్త్రిగారు—ఏలూరు

మ॥ ఉపబంధాది కవిత్వభేద విలసద్వ్యుత్పత్తిఁ జేకొంచు మీ
రుత్తర రామాయణ, కావ్యము సుజన బృందస్తవ్యము న్వ్రాయఁగా
నిక్కా ఁ డెత్యాదృతి నాకొసంగఁ దుదిదాఁకం గంటి మోదంబునన్
బురుషోత్తంసమ ! పూరుషోత్తమకవీ ! భూమీసుర గ్రామణీ !

ఉ॥ పిన్నటనుండి సన్నుత కవిత్వవిశేష విమండవాచు నీ
సల్పిన మేలికబ్బము లపారముదంబునఁ జూచి సారధీ
మన్నికరంబు మెచ్చి కడుమన్నికసేయఁగ మేటిజాణవై
యొన్నిక కెక్కినావు బళిరే! పురుషోత్తమ ! వేయునేటికిన్ ॥

ఉ। తొంటికవీంద్రులెవ్వరును ద్రాక్కి యెఱుంగని త్రోవఁ ద్రొక్కి మ
క్కంటి యనుగ్రహంబునను గబ్బములన్ రచియించు పేరుపు
గంటిపి, పుంచిపేరు నిలఁ గాంచుము నుంచిగ మేలు మేలు, నీ
వంటి కవీంద్రులెన్నఁ గలదా ! కవిసత్తమ పూరుషోత్తమా !

ఆ. "స్తుత్యమాన" యనిరె స్తూయమానముకాదె ?
"ప్రాసనునికి దిద్ద వలనుపడదె"
యన్న "చెళ్లపిళ్ల" నున్న దాసిని సాధు
వానరుపంగఁ జూడు మనెవితండు॥ 72

---

చ. జనకసుతామహామహిమ సజ్జను లందలు వేయు భంగులన్
విని వెఱఁగొందుచుం బొగడ వింత తెఱఁగునఁ గోమలోక్తి గుం
భనగరిమన్ వెలార్చి యిటు పన్నితి కబ్బము నౌర ! నీకుశా
ల్పనికత పాటవంబు, నుడు వందరమే ! పురుషోత్తమార్యయా !
చ. సలుపఁగ వచ్చుఁ గబ్బములు జాణతనంబున నెన్నియేనియున్
వలనగునే భవాదృశుని వైఖరి లాఁతికిఁ బెక్కు పోఁకలన్
దలఁపఁగ బంధగర్భకవితా చతురత్వముఁ జూప, బాపురే !
వలఁతివి చిత్రశిల్పమునఁ బండితవంశత పూరుషోత్తమా !

విశాఖపట్టణము లండన్ మిషన్ హైస్కూలు పండితులు,
శ్రీమాన్ తిరుమల పల్లెకుమూడి రామస్వామి ఆచార్యులుగారు

శ్రీమత్ అద్భుతోత్తర రామాయణము ఇతిశ్రీగాఁ జదివినాఁడను. ఇందు మహాప్రబంధమునకు ఉండఁదగిన వర్ణనాదులన్నియును నాకు మిగుల హృద్యములుగా నున్నవి. అచ్చటచ్చటఁ గొన్ని కొన్ని యంశములు మనుచరిత్ర, వసుచరిత్ర, ఆముక్తమాల్యద, కవికర్ణ రసాయనము మొదలగు ప్రబంధములను బోలియున్నవి. కాన నా గ్రంథకర్తల శక్తియొక్క నాదెళ్ళ పురుషోత్తమ పండితులవారి యందే యున్నట్లు నొక్కి చెప్పఁగలను.

శ్రీ భాగవత 'వివేక చూడామణి' ప్రభృతి గ్రంథకర్తలు
శ్రీ కోవ్వూరి పట్టాభిరామయ్యగారు, కడప.

సీ. పోతన పోకలఁ బోయి యొక్కొకచోటఁ, దిక్కనజాడలఁ దెలిసి యొకట
తిమ్మన వైఖరిఁ దీరిచి యొకచోటఁ, బెద్దన మర్యాదఁ బెంచి యొకట
సూరన నిపుణతఁ జూపి యొక్కొకచోట నారనతీరున నడచి యొకట
సింగనభంగి విజృంభించి యొకచోట మల్లన పోలిక నల్లి యొకట
లలిత నియమిత సముచి తాశ్లేష గభీర విపుల సంఫుల్ల సారస్య వివిధగతుల
నరసి నాదెళ్ల పురుషోత్తమార్యసుకవి యద్భుతోత్తర రామాయణాఖ్యఁ జేసె.

'ఆస్థాన కవి' శేఖర 'కలాప్రపూర్ణ' శతావధానులు
శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు

అయ్యా, తమ గ్రంథము చాలభాగము చదివితిని. రమణీయముగా నున్నది. సంస్కృతాంధ్రమ్ముల యందుఁ గొన్ని యపూర్వ ప్రయోగము లున్నవి.

ఆ. తోఁచెవఁ గనమిఁ జెప్పె, స్తుత్యమానాంబు
రూపమును నటన్న లోపమేమి ?
రైన 'స్తుతి' 'కమాన' యనుపదం బదుకంగ
'నుతి కతికమైన' వితమిదియని॥ 73

క. వేదము వేంకటరాయుం డేదో ప్రాస్తావికముగ నెం దుండవాకో
మాదిరికివ్యర్థపదములు కాదందురె? చెపుడ, సార్థకంబిదియెటులో?

ఉ. "అంకముఁ జేరు పద్యమున నప్పలిచ నాను బాల్యచేష్ట "బా
ల్యాంకవిచేష్ట" యంట మఱొకంకము'ను వ్యపదం బదేల ?' నా
'నంకము లెన్నొయున్న నిది యందొకటైనవిశేషచేష్ట వే
దాంకసుధీ !' యనె న్విన 'స్థితస్యగతిఃపరిచింత్య' యంచనన్॥

క. పురుషోత్తములకు గానం బురుషోత్తమ సత్పథంబె పొడకట్టునరే
పరికించువారిదృష్టికి నెరసు లి టెందైన దొరక నేరవె?యంచున్।

తే. "కొండ త్రవ్విన యట్టు "కొక్కొండ" పలికె
* 'ఛాందసానంద" మనుకంటె సరసమైన
వితము దొరకదె ?' యన, సర్వనుత మనెఁగద
యనుడు "ఛాందస" మది "సర్వ" యతికె యనియె॥

ఉ. ఏయెడఁ బుట్టపట్టికి నొకించుక దూరముగాకయుండ రా
‡ మాయణము న్రచించుటను మాన్యతఁ గందన వాసుదాసు, న

---

కాని వాని కన్నిటికిని దామ తగిన యాధారములను జూచుకొనియే యుందురని తలఁచెదను.......

శ్రీ ఓత్వేశ్వరీయాది ప్రబంధ కర్తలు
'మహామహోపాధ్యాయ' శ్రీ కొక్కొండ వెంకటరత్నశర్మగారు

తే. అద్భుతోత్తర రామాయణావ్యయకృతి యరయనాదెల్ల పురుషోత్తమాఖ్య
* రచిత మహావా! శ్రీ దక్షిణామూర్తి కర్పితంబు ఛాంద సానంద మగుఁగాదె
సర్వనుతము.

క. కృతికర్తయొ పురుషోత్తముఁ డతిచతురతఁ జేసెఁగృతిని నన్యుల్ పురుషుల్
స్తుతియింపఁగలరె సీతాపతి పురుషోత్తముఁడె కవికి వరముల నిడెడున్.

శ్రీ వాల్మీకి రామాయణాది గ్రంథకర్తలు
‡ శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు

I beg to acknowledge with thanks the receipt of your

త్త్యాయత బంధగన్న కవితాద్భుతినప్పుతశేషిసింకన్
భాయికిభాయిగా నిటులఁ బల్కఁగ విస్తుకు రామకీర్తనన్॥ 78

క. పసగల కవనం బల్లెడి వసురాయఁడుచెన్నసూరివ్యాకృతినెన్నన్
రసవద్వాక్యలనంబుల నెసఁగు ప్రయోగాళిఁ గొనరొ? యెన్నో
యనేదాన్॥

క. వరశిష్టు కృష్ణమూర్తుల హరికారిక లుద్ధరింప నలబాలవ్యా,
కరణపుసుప్తార్థము కల్లూరి వేంకటరామబుధుఁడు లోకేడ్యముగాన్

చ. పలుకుచునున్నెడం గలియవచ్చిన వ్యాకృతి తొల్లికూర్పఁగాఁ
గలుగుదు నంచు సత్కవుల కావ్యముల న్వెతియించి సేకరిం
చు లలితవాక్యయంబులను జూపఁగ నాతఁడు ప్రీతిఁగాంచి, నీ
యలఘు మహాప్రబంధమునయందలి వైఖరు లద్భుతంబులౌన్॥

ఉ. కాల మధోగతిం జనఁగ గాలికిఁ దూలెడి పేలపిండి, వా
దాలకవిత్వమెల్ల ఘనతం గనఁ జొచ్చిన మెచ్చుఁ గూర్చునే ?

---

valuable books 'Adbhutottara Ramayanam' and 'Someswareeyam'. I perused various portions of both the books and found the style elegant, I believe that Adbhutottara Ramayanam is commanding the popularity which it justly deserves.

రాజమహేంద్రవరపు గవర్నమెంటు కాలేజి సంస్కృతాంధ్రపండితులు
'బాల వ్యాకరణ గుప్తార్థ ప్రకాశి'కాది గ్రంథకర్తలు

శ్రీ కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

సరసకవి చూడామణీ! తమ రచించిన యద్భుతోత్తర రామాయణం బను...గ్రంథరాజంబు...శాక్తి కొలంది పరీక్షించితిని. పావన శ్రీరామ కథా కమనీయంబును, బహుసద్వృత్త బహుమాన్యంబును, రసానుగుణ గుణ పుంజ గణనీయంబును, ధ్వన్యలంకారాది గరిష్ఠంబును నగు నీకావ్య చూడా రత్నంబు విషమదృష్టిలేని విద్వత్సార్వభౌములచేత సానందంబుగ శిరసా వహింపఁదగి యున్నదనియే నా తాత్పర్యము. ఇందలి శయ్య తియ్యని పలుకుల పెనంకువ గలిగియుంటం జేసి భవ్యంబయి యున్నయది...ఇట్టు బహుపద్య హృద్య మహాగ్రంథంబును వ్రాయుట పుణ్యాత్ములగు తమవంటి కవి పురుషోత్తములకుం గాక యన్యులకు సామాన్యంబుగ శక్యంబు నే?

మేలగు భాసము ల్గలిగి మించిన యుచిత సత్కవిత్వపుం
జాలున నాస్వాదనమ్ము లవి చాలునె చేయఁగ? నింపులారఁగన్॥

మ. కవిలోకేశ్వర మనోవిలాసములు శృంగారశ్రీ యౌద్యత్కృతి
వ్యవసాయమ్ములు నవ్యభావవిలస ద్వ్యాపారము ధౌరేయముల్
రవిచంద్రోరుసమానసుస్థిర యశస్ప్రాగల్భ్య విజ్ఞేయవై
భవయుక్తిప్రతిభాభిరామములు సంభావ్యమ్ములౌ నెయ్యెడన్॥

శా. ఆబ్రహ్మాండపదాప్తిఁ జేరఁగఁగ నద్యోమార్గము ల్ద్రొక్కి, నా
దబ్రహ్మమ్ము నుపాశ్రయింతు రలఘుల్, తద్జ్ఞల్ బుధుల్ నిత్య శ
బ్దబ్రహ్మప్రతిపాద్యవిద్యపఠనల్ తామై ప్రశంసార్హతన్
సుబ్రహ్మణ్యపథానురాగు లచ్చటల్ స్తుత్యం బిలం గాదొకో॥

మ. అనుపీ మాపితి గోష్ఠులం గరప సద్వాధ్యాయి వల్లించుచుం
డిన పుత్త్రిం డివియొల్ల వింపు నిజధాటిన్ సంస్కృతీయంబులం
దును నాంధ్రంబునఁ జూపఁగా నలరి కస్తూర్యన్వవాయుండు, గో
పన యింకెందఱొ ప్రోత్సహించి, రపుడంపంజేసె హైన్యాకలునన్॥

---

ఈ దక్షిణామూర్తికిని,

దద్గురుల కవితాగురువులు

శ్రీ కస్తూరి గోపాలరాయ కవిగారికిని

నడచుచుండిన జాబులనుండి యిది వచ్చునది; బందరు, 11-4-06.

శ్రీ వృత్తము : ఓ దొడ్డప్పా,

తే. గురులఁ గైతకుఁ దొలుదొల్తఁ గొలిపినాఁడ వౌట, నీయాన నందఁగా నగును
బోఁప! పూర్వఁ గావ్యము దీనల్ గోరువాఁడ దక్షిణామూర్తి శాస్త్రినాఁ
దనరువాఁడ॥

శ్లో॥ పరాభవ శరచ్చైత్ర మాసే శ్యామలపక్షకే
తృతీయా సౌమ్యవాసరే రచితా పత్త్రికా ముదా॥

శ్రీ కురంగేశ్వర చరిత్రాది గ్రంథకర్తలు
శ్రీ కస్తూరి గోపాలరాయ కవిగారి
ప్రత్యుత్తరములనుండి

మ. భవదీయామృతతుల్య భావయుత గీర్వాణాంధ్ర భాషాలస
త్కవితాసంశ్రిత చారువృత్తము మహాశాంత్యాన్వితాత్మీయ హా

స్త వశంబయ్యెఁ గుమారరత్నము! రమత్సంతోష సంధాయకం
బవుటం బూరుషవర్యుఁ డొంటెడిని, బూర్ణాయు కృతస్వాఖ్యముల్॥

ఆ. నీదు ముద్దుజాబు నే జేతఁ గీక్షించి
యధిక మోద మందనయ్యెఁ, బుత్రి!
ధరఁ 'బరాజయంబుఁ దనయుచేఁ బడయంగ'
వలను గనుట కంటెఁ గలదె లగ్గు?

క. స్వస్తి యటందును నీకుఁ బ్రశస్తకవిత్వంబుఁ జెప్పఁజాలెడి శక్తిం
గస్తురితిలకుఁ డొసంగెడుఁ గస్తురి గోపాలరాయ కవి వ్రాలు సుతా!

అప్పటి యీ గ్రంథకర్త చిట్టికృతులలోని 'కుంతీవిలాప' మందలివి.

తే. 'లోకమో పాడో' యనుకొంటి, నీకరణిని
మంత్ర మిదినోటఁ బల్కిన మాత్రముననె
రావలెనె? సూరుఁ డింతలోఁ ద్రోవఁదప్పి
వచ్చెఁబో! చిన్న దిది' యని వదలరాదె?

తే. మాసములు గాదు దినములుఁ బాత్రిమైనఁగాక గంటలు నిమిషాలు, క్షణములోనె
గర్భమేటిది? తేజస్వి యర్భకుండు భూ పతనమయ్యె నేవొప్పిపొందకుండ?

తే. ఇట్టిచిత్రము లోకాన నెందు వినము 'విన్న నెవరద్ది' యపకీర్తి పృథ్వినిండు
నన్న! చిన్నారి పొన్నారి కన్నవారి నేటి పాలొనరించితి, నెంతదాన!

తత్కృత కావ్యారంభ స్తోత్రాదికములు

—♦ శివస్తవము ♦—

శా. శ్రీవాణీశ శచీశ్వరాద్యమర సంసేవ్యుండు భవ్యుండు, నా
నావిశ్వావన దక్షు సూర్యశిఖిచంద్రాక్షుండు, మౌనీంద్ర బో
ధావైజ్ఞానిపుఁ డార్తరక్షకుఁడు మేధాదక్షిణామూర్తి నన్
గావంగా దరి నొప్పుచుండఁగ నెద న్గాంక్షించి ప్రార్థించెదన్.

శా. నీహారాచలరాట్సుతా విమల హృన్నీరేజ మిత్రుండు, త
త్సాహింద్రాభరణ ప్రభాయుతగళుం డస్వప్న సేవ్యుండు ని
ద్రాహారాది వికారవర్జితుఁడు మేధాదక్షిణామూర్తి సత్
సౌహార్దంబున మాకొసంగు నిల నశ్రాంతంబు నిష్టార్థముల్॥

మ. సకలార్య స్తవనీయ వైభవకళా సామ్రాజ్యలక్ష్మీపతీ
మకుటభ్రాజిత నూత్నరత్నమయ జృంభద్దివ్య కాంతిచ్ఛటా
ప్రకటాత్మీయ పదద్వయుండు, ధృతముద్రాపుస్తహస్తుండు, మా
క్తికమాలాన్విత దక్షిణాస్యు మము రక్షింప న్సదా కొల్చెదన్॥

శా. మత్తేభాసుర చర్మచేల! రఘురామస్తుత్య మృత్యుంజయా!
చిత్తేజాతహరా! అసత్ప్రముఖ సచ్చిన్మూర్తి శ్రీకంఠ భా
స్వత్తేజోంచిత దివ్యదేహ నగజేశా! వాసుదేవాప్త! యీ
వ్యత్తిష్ణాత్మము మాసి మమ్ము దయతో సాకంగ వేగాఁగదే!

శా. శ్రీల న్భక్తులకిచ్చుచుండు, సుధీయుక్ శ్రీకంఠమందుంతు వ
క్ష్వేళాహలున్ ధరియింతు విద్యాది కనం గాపాడనే మమ్ములన్
లీలామానువవిగ్రహుంపె వపుచు న్నీహారధామాద్రిజన్
మోలి న్నిల్పి యొసంగుదంచుఁ బలఁతు న్నోర్మదాబ్ధి! సంపత్కరా!

ఉ. పన్నగరాజభూషణుఁ డపారకృపారసదృష్టితోడ నా
పన్న జనాళిఁ గాచు నల భర్మమహీధర సాయకుండు దీ
వ్యన్నవ వైభవోన్నతి వియన్నది నాదలఁ దా ధరించి మిం
చెన్నుతిపాత్రుఁ డాతఁడు వసించెడుఁ గావుత మద్హృది న్సదా॥

శా. శ్రీవిశ్వేశ్వరుఁ డాదిదేవుఁడు జగత్సేవ్యుండు కాత్యాయనీ
దేవీభాసిత వామభాగుఁ డనవద్య దివ్యప్రభాఢ్యుండు వి
ద్యావారాశి కమండలుండు మునిబోధాత్మరూపుం డూర్జిత
ప్రావీణ్యాధికుఁ డిందుశేఖరుఁడు శోభ న్నిల్పు మమ్మెప్పుడున్॥

మత్త. శ్రీగళాంచితనాగభూషుఁ డశేషనిర్జరలోకసే
వ్యాగతాఖిల భక్తవంద్యుఁ డహూచి తార్థిజనేష్టదుం
డాగమార్థద దక్షిణాస్య మహోగ్రమూర్తి సదాశివున్
వేగమే మముఁ బ్రోవ రమ్మని వేడుకొందు నెద న్సదా॥

—♦ విష్ణుస్తుతి ♦—

శా. శ్రీవక్షంబున భూమి నీళయును దరి న్సేవించుచుండంగ రా
జీవాక్షుండు కృపాసముద్రుఁ డవుట న్శేషాహిశయ్యాస్థితిన్
దేవేంద్రార్జిత పాదకంజుఁ డవుచుం దేజంబుమై నొప్పటన్
భావంబం దెపుడెంచుచుండెద నిల న్భాసిల్లఁగాఁ జేయఁగాన్॥

శా. శ్రీవక్షోంచిత హేమహార రచితాశేషప్రభాయుక్త ర
త్నావిష్కృ న్నిజదేహ కాంతిజిత మేఘానీకుఁ డస్తోకర
క్షోవీరోత్తమ తూలవహ్ని వనజాక్షుం డిచ్చ న్స్రక్కాంత వి
ద్యావైశద్యము సత్కవిత్వ మిల సుద్యత్ప్రౌఢిమం బెంచఁగాన్॥

ఉ. శ్రీరమణీశ్వరుండు సురశేఖర సేవిత పాదకంజుఁ డా
కారరమణీయకీర్తి విలసద్ఘనకౌస్తుభ దివ్యహారుఁ డం
భోరుహలోచనుండు మునిముఖ్య నిరంతర సంస్తుతుండు వి
స్తారశుభోదయం బిల నొసంగ మమున్ గరుణించి ప్రోచుతన్॥

తే. వెలయ నాలవఫారము తెలుఁగునఁ జెప్పఁ
జెళ్లపిళ్ల వేంకటశాస్త్రి చేరనందుఁ
బాఠ మీయంగ వెంకయ్య వ్యాకరణముఁ
గొనమిఁ జదువంగ లేదనఁ గొను మటనుచు॥ 86

తే. వచ్చి యింటికి మద్గురువరులతోడ
మీకొమరుఁడిప్పు మాశిష్యుఁ డొకతమున
ముదమునందితి, వ్యాకృతిఁ జదువలేద
టనుడు సుతుఁబిల్చి "మాటనువినని" పెటన॥ 87

క. 'గతిబుద్ధి'సూత్రవివరణ మతిసులభముగాను గారకాంశములందున్
'హతరాజుం'డుపసర్జనగతె, నడుగఁగృదంతఫక్కిఁగపుపడినుడువన్

క. అచ్చెరువున వేంకటకవి
మెచ్చుచుఁ జిన్నయ్యసూరి మెఱుఁగు లెఱుంగన్

---

ఉ. అంతములేనివాఁడు దితిజాంతకుఁడై ప్రజఁ గాచినాఁడు శ్రీ
మంతుఁడు శేషశాయి సురమాన్యుఁడు భాస్వరకీర్తిపూరితా
శాంతుఁడు శంఖచక్రములు శార్ఙ్గగదల్ ధరియించునాతఁడ
శ్రాంతసుఖావహుండవుచు రంజిలఁజేయు ధరాస్థలి స్మముల్॥

శా. శ్రీవిశ్వంభర లొప్పిదంబెసఁగఁగై సేయంగ నీళాసఖి
సేవంబొందుచు నిర్జరేంద్ర మునిరాట్ శ్రేణీసభాధ్యక్షుఁడై
శ్రీవైకుంఠ పురోత్తమావసథ భూరిప్రాభవాఢ్యుఁడు ప్ర
జ్ఞావరిష్ఠుఁడు విష్ణుఁడొప్పెడు మమ్ముం గాపాడ వాశ్రైతగన్॥

— ♦ గురుప్రశంస ♦ —

శ్లో॥ శ్రీదక్షిణాస్య దయమాన విలోకనాత్త
విద్యాభరః కవివర స్స్వయశా మనస్వీ
నాదెళ్లవంశ్య గురు రార్యజనేడ్య చర్యో
జేజేతి బందరుపురే పురుషోత్తమాఖ్యః॥

శ్లో॥ తత్సువగ్ణోక్తిసమితి శ్చిత్రిరత్నై రలంకృత
స్సత్పదార్థ సమావిష్ట శ్శోభతే బుధసన్నిధౌ॥

జొచ్చినఁ జన్న వెవేటికి ?
మచ్చికఁ దాఁ గందునంచు మరలుచునాపైన్॥

క. శ్రీకృష్ణుఁడు దేవుండవునా? కాఁడా? వ్రాయుఁడన్న వ్యాసంబునఁదా
నా కామినుల స్వేలను సాఁకుటనే దేవుఁ డన్న సరసత మురిసెన్॥

క. వ్యాసపు రచనము ప్రౌఢంబౌ సరణినె నెసంగునంచు నాతని ప్రూఫుల్
వే సవరింప నొసంగుచుఁ దా సుతసమముగను జూడ ధారం
గనుచున్॥

ఉ. పాండవనాటకా లపుడు వ్రాయుచు నందలిపద్యపంక్తి నా
తండు పఠించువైఖరిని దన్మయత న్నహహా పాఠులంద, నీ
తండును మోదమంద నిజధారను నయ్యది ప్రోత్సహింపఁగా
మెండగునాశుపద్ధతి యమేయముగా గణబద్ధతం గనెన్॥ 92

---

చ. మనమున నెప్డు నిల్పెద సుమారమణీ ట్పదకంజయుగ్మ చిం
తనపరిలబ్ధ దివ్యకవితా వనితా మహిత ప్రభావ సం
జనిత లసద్యశఃకుసుమజాల వినిర్మిత హార ధారువై
తనరెడు పూరుషోత్తమ బుధప్రవరాంఘ్రి సరోజయుగ్మమున్॥

అప్పటి యాశు రచనములు

స్కూలులో మా తెలుఁగు మాష్టరుగారినిగూర్చి

చ. తిరుపతి వేంకటేశ కవిధీరుల మించును దేశదేశముల్
తిరిగి శతావధానము లతిప్రతిభ న్రచియించి మించి భా
సురతర సద్యశోగరిమ శోభ వహించినవారు, వేంకటే
శ్వరుఁ డతఁ డందునొక్కరుఁడు బందరునందు నివాసమేర్పడన్.

ఉ. బాలురకుం దెలుంగునను బాఠముఁ జెప్పఁగ నిడ హిందుహై
స్కూలున నొజ్జయౌచుఁ దనకుంగల యాకవితాప్రచారపున్
లీలలఁ జెల్పఁగాఁ దొడఁగి నెయ్యముతోఁ జన విచ్చి చేర్పఁగాఁ
జాల ముదమ్ముఁ గొల్ప విడఁజాలక యూఁకొన నెల్ల రియ్యెడన్॥

ఉ. ధారణకల్గియుండఁ గవితారచనంబు సుబోధమౌచు నా
నారసకల్పనోల్బణము నవ్యపథంబున నింపుఁగొల్ప, గా
ధారచనాచమత్కృతి ముదావహమై కనుపట్టుచుండ, శా
రీరపు సౌష్ఠవంబౌ తులలేదు కవీంద్రుల నంచు, జెప్పనౌన్,

ఎవరో "కట్టెఁగొట్టెఁదెచ్చె" నన్నందుకు కిది

ఉ. లచ్చిరొ సీతయాచు మిథిలానగరంబునఁ బుట్టినట్టితె
చెచ్చెర రామభూపునకుఁ జేడియయయ్యె. నరణ్యసీమకు
న్వచ్చెను భర్తతోడ, మృగవాంఛను గొల్వ విభుండు వేఁటకుఁ
జొచ్చెను, లక్ష్మణు న్ననుపఁ జూడఁగ, మోసపు వేస మూనుచుం
గ్రచ్చఱ మచ్చుఁ గొల్పి కొనఁగల్గ రయంబున నాపె లంకకుం
బొచ్చె మెఱిఁగి రాఘవుఁడు వోయి కపీంద్రుల వాలిఁ గూల్చుటన్
మెచ్చిన యంజనాసుతుఁడ మేయబలాప్తిని దూఁకి లంకలో
నచ్చపు సచ్చరిత్రఁగని యబ్ధిని గట్టఁ గపీశుమైత్రిచే
మచ్చరమూర దైత్యుఁ బరిమార్చి విభీషణు నిల్పి, లంకలో
నిచ్చ నయోధ్యకు న్మరలి యేలి రిహంబున రాము నెన్నఁగాన్॥

—♦ భోజవదాన్యత ♦—

చ. తలఁపఁగ విక్రమార్క మహిత ప్రథితిం గనినట్టివాఁడు, భూ
తలమున సార్వభౌమ బిరుదంబును గాంచినవాఁడు, దండిము
ఖ్యులు నల కాళిదాస కవికుంజరుఁ డింకను వందిమాగధుల్
వెలయు సభాస్థలంబునఁ గవీశ్వరు లెందఱొ సంస్తుతింప, ల
క్షలు మఱివేలు వారల కొసంగుచుఁ గీర్తి నెసంగువాఁడుఁ గొం
దలపడనీక భృత్యుల ముదంబిడి యాపదలందుఁ గాచి, వ
ధ్యులఁ బరిమార్చు చెంతయు నయోన్నతి సత్పరిపాలనంబు ని
య్యల నసమానపుంబటిమ నెన్నియొ చేయనము ల్పొనర్చి, వం
దల కొలఁదుల్ నుతుల్గొనుచు దార్ఢ్యతర ప్రతిభావిశేష సం
కలిత యశోవిజృంభిత జగన్నిజవాగ్విభవాభిరామ ని
త్యలలిత మోదపుం గరిమ ధాత్రిఁ జెలంగుచు సంస్కృతంబు వ
ర్ధిల నిల దివ్య మెంతయు సుధేచ్ఛ వ్యయుం బొనరించి, పాఠశా
లల నియమించి నాతఁ డకలంకుఁడు భోజకవీంద్రమౌళి కిం
దుల యెవఁడుండు భూస్థలిని? దోహలదంబగు నిప్పు డట్టిఁడే
చెలఁగిన నెల్లలోకులకుఁ జేకుఱకుండునె? చూచినంత నే
కలుష మడంగు సత్కవిత ప్రాలుట? తెచ్చఁగ భాగ్య భోగ్యముల్॥

—♦ గణపతికథ ♦—

ఉ. ఆసరసీరుహాక్షి తుహినాచల నాయక పుత్రియైన గౌ
రీసతి యొక్కనాఁడు పొనరించుచు స్నానము నల్గుఁబిండితోఁ
జేసెను విగ్రహంబొకటి చెల్వగ నయ్యది యేర్పడంగనే

క. ఆపట్టున సౌత్ వల్లుకు భూపాలుని సుతునిఁ జేర్చి పురుషోత్తములన్
డాపునఁదగ శిష్యుండయి గోపాలుఁడు కామిసెట్టికులజాతుండున్॥

క. తనతండ్రి పేరమాహ్వాయుఁడని చెన్ సంస్కరణయాదవాద్రీశంబుం
బొనరింపుఁడంచుఁ గోరఁగఁ గొని తానే వ్రాసియిచ్చె గురుతరలీలన్

క. అందుం జేర్చిన వెన్నియొ హిందూస్థానపు వితనవెయింకెవి యెవియో
సుందరమనఁ దాఁ గూరిచి యందింపఁగ ముద్రణం బదంచె న్వేగన్

క. తనశిష్యున కాశీస్సుగ నొనరింప నాప్టిక్కమారు నుత్సవవేళన్
గొని కోరిన గోపాలుఁడు వెనువెంటనె పప్రిచుర పఱచె వేడుక మీఱన్

క. ఆయుత్సవముం గనరా నాయెన్వేంకటకవియునునతిపరిచయముం
దా యానామున నందుట నీయెడ గోపాలుఁ డెచ్చు లెంచమి
నడచెన్॥ 97

## ప్రాథమిక విద్యావిధానము.

క. అదియట్టులుండ నప్పుడు చదువులలో మార్పు రాఁగ సాగించియటుల్
ముదమందఁగ నధికారులు పదుగురికి నుపన్యసింపవలె నని యడుగన్

ఆ. ఒజ్జ లెల్లఁ జేర నూరూరినుండియు విద్దెగఱప సిద్ధి వెరవుగాదు
బాల్యమందె వేని వల్లించుటే మేలుగనఁ బునాదిదానఘనతనిలుచు

---

పోసెను బ్రాణ మందుఁ దనపుత్త్రుకుఁ గా మది సెంచి పొంగుమన్
వేసము వేసి కావలికి వేశ్మము వాకిట నుంచిపోయెఁ దా
నాసమయంబునం దట మహావిభవాతిశయంబు మీఱఁ గై
లాసమహీధరంబున విలాసముగా శశిశేఖరుండు పా
కాసుర వైరిముఖ్య విబుధాగ్రణులెల్లరుఁ గొల్వఁదీర్పఁ గా
భాసుర కాంతిధిక్కృత దివాకరమండల మైవెలుంగు సిం
హాసనమందు నొప్పుచు, బృహస్పతిఁ గాంచి పరీక్ష సేయు నా
ర్యాసతి యేమి సేయుసిపు డంచడుగంగఁ దలంటుకొన్నదై
పోసికొనంగ నుష్ణజలముంగొని మజ్జన మాచరించు నా
కే సని చూతమంచరుగ వేశ్మము వాకిట నాపుగుజ్జనో
యీ! సరి! నన్ను నాప నెవఁడీ వని, పోర, శిరంబు వ్రచ్చి పోఁ
గా, సతి 'యెట్లు రానయితి? కావలిలేఁడె సుతుండు?' నావుడుం
జేసినదానికి న్వగచి జీవ మెదుత్తరదిక్కిరంబుగాన్
గోని రయంబ తేనసుపఁ గుంజరకుంభముఁ ద్రుంచి తేర న

ఆ. ఆట పాట లట్టు లంతయు బూటకమైన సులువుత్రోవ లలవఱచిన
బుద్ధి వికసనంబుఁ బొందింప సౌఁగాక గట్టితనము దేనఁ గలుగ దనియొ

తే. వంగదేశపు విభజన పరఁగ నపుడు
దాన నలజడి ప్రజలందుఁ గా, సమంద
ముం బొనర్ప 'వందేమాతరం' బనంగ
బాలు రెగఁబోయ వేయ డవాలు లందు॥ 101

తే. కట్టుఁ గట్టుచుఁ జదువులు మట్టువడఁగ
భయము భక్తియుఁ గ్రమముగాఁ బాడుగాఁగ
నల్లరులు హెచ్చి యెల్లెడ హద్దుమీఱ
మొదటికే మోసముం దెచ్చు నిది యటనుచు॥ 102

నవనాగరకతోద్రేక నిబర్హణము.

తే. స్త్రీలమీటింగు లప్పుడు చెలఁగఁ దొడఁగ
విద్దె వారలఁ గొఱనడ, రద్దిసడఁగ
నిద్ది యేటికి? దాన లాభించుకంటెఁ
గలుగు సాంసారికంబుల నలజడియని॥ 103

తే. 'స్త్రీల మీటింగు నాఁటి హరికథ' నాట
కంబు గావ్రాసె నొక నాటకంబె 'కాఁగఁ
బ్రచుర మైనంతఁ జీకాకు పఱప హ్యాదుల
నెల్ల నవనాగరకు లడ్డె గొల్లుమనఁగ॥ 104

తే. 'అగ్నిహోత్రుఁడు వచ్చె' నం చందఱొకట
నిల్లె ముట్టింప మొదలంటనే యడఁగెడు
నంచు రా, నద్ది చల్లారు నల్పశంక
నంద నని ధీరత న్నిల్చె నందఱెడల॥ 105

---

ద్దే సరిపెట్టి ప్రాణముల నిచ్చి గణంబుల నేలఁ జేయుడుఁ జా
గానిల విఘ్నకారివయి కాఁటియపెట్టుదె, యోయి దేవుఁడా!
దోసిలి, యక్షతార్పణముతో సరిపెట్టర నిన్ను గట్టఁగాఁ జ?

తే. అంత బహిరంగ సభయందు నాడిపోసి
'నవయు' గాఖ్యపుఁ బత్త్రిక నవలఁ దిట్టి
తమను కెలికిట్టి నట్టి యాతనికి బదులు
తీర్పఁ 'బ్రాహ్మ్యుఁడు' 'గర్వ్యుఁ' డం చాప్పనెంచి॥ 106

తే. వెంట వెంటనె సంతకాల్వెట్టి కొంద
ఱొక్క సభఁగూర్చి యట్లని యొక్క తీర్పు
తోఁ గలెక్టరున కవిజాతుల వటంచు
వ్రాసి యంపిన శిక్షతో మాసిపోవు॥ 107

తే. పలుపు రాడిన మాటయే పాటికెక్క
రోఁతఁ గొల్పెడి వ్రాఁతల యాతఁ డెట్టు
లొజ్జయై యుండఁ దగు నన నూడిపోవు
నున్న యుద్యోగ, మపుడైనఁ దిన్నగ విను॥ 108

తే. ఇందఱము పూనఁ గాని దిం కేది యీడఁ
జాతుకొన్నట్టి నేతలే, పాఱఁజూడ
"బాపఁ డిక్కడ నొక్కఁడే పారఁజూడ
నూరకుందుమె ?" యను చంద ఱొకటఁగూడ॥ 109

మ. ప్రమితి బ్రహ్మసమాజ మయ్యెడను గూర్ప న్మందిరం బిందెసం
గు మహోత్సాహముకూడ నాతఁడె నెసంగుంగాన, వీరేశలిం
గముఖు ల్వెక్కురు రా, న దిబ్బడిగ సాగంజూడ నుద్రేక మా
ర్గమునం ద్రొక్కుట మిక్కుటంబయిన సంరంభము నారంభమై॥

తే. ఎవని కెదితోఁప నద్ది సాగింపఁ గడఁగ
సర్వదిగ్బంధ మూపిరి సమయ నిడఁగ
దిక్కుఁగానక యల్లాడి దిగులువడఁగఁ
జేయఁగల్గుదు మంచు వంచింపఁ దొడఁగ॥ 111

తే. ఎట్టివాఁడైన నిల్వఁగా నెట్టులోపు ?
గట్టి గుండెలె యాగక పట్టిపోవ
బిట్టువగచుచు నిముసమే న్నట్టలేక

మట్టువడకున్నె? విసమేదొ మట్టి తుదకు। 112

ఆ. ఇల్లుపెద్దదయ్యెనిల్లాలుకోఅవజ్ఞ ముకలియు త్రోగమునమునిఁగెడి
సుతుఁడో బుడుతఁడిట్టి స్థితి సెసంగఁగ నిష్టదైవమొండె
తలఁపఁ దనకుఁదిక్కు॥ 113

క. అమలత "నస్త్రీస్వాతంత్ర్య మర్హతి" యన విని ధర్మతత్పరబుద్ధిన్
రమణీయంబౌ ప్రహసనమమరం గల్పితమగు సభయానిది కదవే॥

క. ఇందలిపాత్రము లెవ్వియు ముందున్నవి కావు సృష్టిమొదలిడ నేవో
కొందఱ యందలివి కలుగుఁ దొందర యెవ రందనేల? దోస
మిదెట్లౌన్? 115

తే. బుద్ధిపూర్వకముగ నొక్కపురుషునేని
బుద్ధిలే కన్యసతినేని రద్దిసేయ
నద్ది దోషావహంబవు నంతెకాని
కల్పితంబులు పాత్రముల్గద యివన్ని॥ 116

తే. దృశ్యకావ్యంబులందుఁ జత్రింప నెన్నొ
యన్ని నిజమౌనె? గమ్యమౌనట్టి నీతి
నందవ్యంగ్యము ధ్వనియందుఁ బొందుపఱుపఁ
గావ్యలక్షణ మానందుగ్రద విబుధులు॥ 117

తే. నేనుజేసిన దంతయేకాని దేన
నొరులదూషింప, నింతయుఁ బరసతులను
దల్లులఁగఁజూచుబుద్ధి నిందలకుదిగునె?
యంతరాత్మయెసాక్షి నా కన్నిటికిని॥ 118

తే. ధర్మబోధయె గమ్యమై తనరు నేని
మార్గ మేదైన నద్ది సమంజసంబ
కీర్తి దేనికి? దక్షిణామూర్తి కృపనె
కోరువాఁడను నాకద్ది కొఱవడెడినె? 119

తే. ధర్మసమరంబునందు నాదరు వతండ
యుండ భయమేమి? మున్నుల పాండవులకు

మాధవునియండ దండ నేమఱక యుండ
దండిపేరులు మెండయ్యు బెండువడరె? 120

తే. కల్మషంబింత నామదిఁ గలుగదేని
పరికై నను సేగి నేఁ గోరనేని
గురుపదం బెప్డు సాక్షినాఁ గొలుతునేని
ఇష్టదైవము తోడుగా కెట్టులుండు? 121

తే. ఐనఁ గర్మానుభవ మెప్పుడైనఁ దప్ప
దేటి కీచింత భయమేమి? యేదికలుగ
నోర్చిఁ దలయొగ్గి సాగఁ గాకుండు నెద్ది?
సుద్దులేవున్నఁ బరమెన్న సున్నకదవె॥

మ. పరమేదో? స్థిరమేదో? 'మిథ్య' యిదినాన్ బ్రాజ్ఞాళి, యేమందు? నం
బరగాము, ల్గలగాము లల్లనడలన్ బ్రహ్మాండభాండోద్భవాం
కురసందోహము కల్గి నిల్చి చనుట ల్గూర్పన్ జని రేఖలే
ర్పఱపం జూలు టబెల్లఁ గర్మగతిగా స్వప్నం బి దెట్లానొకో!

తే. తుద క దొఁగాక, యిందది యెద నదుకదు
పుణ్యపాపాలు ద్వంద్వాల పొంతనె తగు
నద్వయస్థితి కావచ్చు నంతరింప
నీశుప్రేరణ నెదితోఁప నేనొనర్తు॥ 124

క॥ అనియనుకొనుచ వ్వేళ కెచనుదెంచినమిత్రుఁడొకఁడుసాహసరీతుల్
వినియుంటను వెనువెంటనెపొనరింపన్వ లెనటంచుఁబురికొల్పెనిటుల్

క॥ ఉడుకుచున్నదిదెల్లెడనుడుకుడుకుగఁబనులునడపనుద్రేకమునన్
దుడుకులు కడఁగ న్పెడఁదలఁ గుడుపక విడువరు వెడ వెడఁగులఁ గడపవలెన్॥ 126

క॥ మీ రూరకుండరా దిఁక దూఱులకభియోగమిడఁగ దోషులుగానై
వారల సాక్ష్యము వమ్మా దారిం గనకున్న నింక దారుణమౌనూ

క॥ నేతలనే ధిక్కారము సేఁత నొనగాంచుస్త్రీ తామె సిగ్గిడులాచున్
బూతిదియని మొఱలిడుచున్బ్రీతిగసాక్ష్యులువలక్రగంథముఁ
దూల్చున్ 128

క॥ బాపం దన నాతండే, పాపము! ధర్మమ్మెపలుకఁ బాడౌబాట
స్వోపంబూనిన వారిన్మాపఁగ నొక న్యాయవాదిమార్గమిదనియెన్

క॥ అనిచెప్పఁగ దైవపేర్రణ మనితనమదికిఁదోఁప రాయిడికాంట్రన్
మునుకొనఁగా నభియోగము లను మూడిట నొంపఁగాదలంచి,
డిగంగాన్॥ 130

శా. ఈయుద్ధమ్మున వస్త్రశస్త్రములు కావే? ధర్మశాస్త్రమ్ము లిం
కేయేపూర్వకపేంద్రకర్తృకములే నింకెన్నొ, సారథ్యమా
న్యాయస్థానవివాద వేదులది, గమ్యంబో, నిజగ్రంథముల్
జేయ న్సుస్థిర మద్దినీతిదపువాసిం గాంచి దైవారఁగాన్॥ 131

—♦ అసహాయశూరత ♦—

తే. ఎంచఁ బ్రతిపక్షులం గొంద ఱెట్టులైన
నొక్క నుద్యోగమున నుని, లెక్కసేయ
కున్నయుద్యోగమప్పుడే యుడుగుదునని
రాజినామనుబంపె నాఱడినిగూర్చ॥ 132

తే॥ ఎప్పుడో కూలనుండిన హిందుబాల్రించి
నెక్కి హెడ్మాస్టరిర్వదియొక్కయేఁడు
లసమ వైభవ మందించె నంచు మెచ్చి
సబహుమానపు వీడ్కోలు సంతరింప॥ 133

---

స్వాతంత్ర్యముకొఱకు 43 వ యేటనే యప్పటి కిరువదియొక్క సంవత్స
రాలనుండి తా నందిన 'హిందూబాల్రించ్ స్కూలు హెడ్మాస్టరు పదమునకు రాజీ
నామ నంపఁగా నపుడు దానికి నూపరింటెండెంటైయుండిన

శ్రీ కుంభకోణము కృష్ణమాచార్యులుగారు వ్రాసిన చిది :

'In forwarding the accompanying letter from Nadella Purushotham garu, Head-master of the H. B. School for about twenty years, for your kind consideration and disposal,

తే॥ తనను బలుమఱు నిట్టివ్రాఁతఁ బరికొల్పఁ
గనినఘనులు వకీళ్లుండియును భయపడి
మూలదూఱినవారల మోముఁజూడ
కెట్టులైనను దనపనుల్ నెట్టుకొనఁగ॥ 134

తే. బూ తిదంచును బెక్కు రాఁబోతులట్టు
అంకె పలుచోట్లఁ గొలిపిన రాయిడిఁ గను
నంచు నరసాపురంబున నట్టిచార్జి
ముందు నెలకొల్ప నోటీసు నందుకొంచు॥ 135

తే. వెడలి యచ్చోట నొకనెల గడువునడిగి
చేరి జిల్లాకలెక్ట కేఁబారనుండఁ
దనదుదావాల నొకచోటఁ దనరఁ జేయఁ
గోర నక్కడి దీడకే కొంచు రాఁగ॥ 136

తే. అద్ది నెలకొల్పినారలే యగడువడుచు
నెత్తివేసికొనం బెక్కు లింకమూనఁ
గ్రమముగాఁ గొందఱు క్షమాపణములు గోరఁ
దానె విజయంబు సన్నిటఁ గాననయ్యె॥ 137

---

I beg to express my most sincere regret at his resolution to retire so early in life from the field of his humble and noiseless labours, where he has all along been an earnest and indefatigable worker. He has besides been as I have said recently elsewhere a popular head-master and a very capable manager. And though, his education from the narrow point of view it obtains, must be considered low, his attainments are many and varied and take him for all in all. It will be difficult to find his equal for the post he has so long held with distinction. I have no hesitation in adding that his resignation involves a distinct loss to the school.

ఆపైనఁ బాలకసభ్యుల సమావేశమైనయెడ వారి తీర్మానమున నుదాహరించిన దిది :

'The committee resolves to place on record their appreciation of his long & faithful services extending over twenty-one years, during which he has done much to bring the H. B. School, to its present state of strength and prosperity.'

తే॥ అట్టియెడ నెల్ల, గ్రంథంబునందుఁ దాన
చప్పుచప్పునఁ బ్రతిపక్షి సాక్షిచయము
నడుగఁ దగినట్టి ప్రశ్నంబు లడుగఁజొచ్చి
పండితులు గార టనిపించె వరుస నెట్టి॥ 138

తే. అప్పు డొక దాన 'ముద్దయి' యైన చెళ్ల
పిళ్ల వేంకటశాస్త్రిని బృచ్ఛసేయఁ
"బనికిరా దని స్త్రీస్వేచ్ఛఁ బలికెనిందు
భర్తృహరికూడ నట్టులేపలికియుండె 139
ధర్మశాస్త్రంబు నదియనర్థదము యనియె
వేదవాక్యందుఁ గలయది వేమనోక్తి
బూతు లేదిందు, వెదకఁగా 'ము' ట్టొకటియె
నా క దుత్తరరామాయణమ్మునందుఁ 140
గానవయ్యె నసభ్యంబుగాదు దాన
ధ్వనియు వ్యంగ్యముఁ గలదు, కావ్యముల నవ్వి
యుండవలెనని పలికిరి పండితు'లని
సాక్షిగావచ్చి పలికిన సమయమందు॥ 141

ఉ॥ పండితుఁడైనవాఁడు కవివాచ్యుఁ డెవం డిటుపల్కునందుఁ? జె
ప్పం డితఁ డందు సంతకము పొచ్చెముగా నొనరించియుండుఁ గా
కుండిన నిట్టుపల్కెడినె ? యొప్పిటులొప్పుటఁ దప్పుదిద్దికో
నిం డిదె చాలు నే విడుతు నీతనిపై నభియోగ మింతతోన్॥ 142

చ॥ అనవుడు విన్నవారలట నచ్చెరువందిరి ఖచ్చులిచ్చి మ
‡ న్నన నిడుచున్ క్షమాపణమున న్విడువుండన నూడ్వఁగొందఱున్
ఘనులగుసత్కవీంద్రులు, జగద్విదిత ప్రతిభాభిరాములౌ
ననుపమపండితాళి కొనియాడఁగ గ్రంథము నిల్వ, గెల్వఁగన్॥

---

‡ 'స్త్రీలమీటింగునాఁటి హారికథ'ను
గూర్చివచ్చిన పండితాభిప్రాయములందుఁ గొన్ని

(C. F.) Religious Book No. 43. St. George Gezette 30-6-08
**Strila Meetingunati Harikatha Natakamu gives the proceedings of an imaginary meeting of advanced women reformers in**

sarcastic language with a view to criticise unfavourably the doctrine of woman's independence.

అప్పటికే 'కవిరాజు'లనదగిన యిప్పటి 'యాస్థానకవి' 'సార్వభౌములు'

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు

మీ పుస్తకము నామూలాగ్రము సవిమర్శముగాఁ జదివితిని. అందు మీ వ్రాసినవి స్త్రీలకు నీతిని బోధించునవి యనియే నా యభిప్రాయము. ......మీరిక్కాలములో నిట్టిమంచిపుస్తకము వెల్లడించుటయే యుత్తమమార్గము. నాకు మిక్కిలి యానందముగలిగి దాని నిట్లు తెలియఁబఱచుకొంటిని.

రాజమహేంద్రవరము ఆర్ట్సుకాలేజి సీనియర్ పండితులు

శ్రీ ఆకొండి వ్యాసమూర్తి శాస్త్రిగారు

మీ ప్రహసనమును దుదవఱకుఁ జదివితిని ... స్త్రీలకు రక్షణ మావశ్యకమని మన్వాదు లుద్ఘోషించిరి. అనర్థనివారకములగు నిట్టిగ్రంథములు పుట్టుట ధర్మకాములకు నత్యంతప్రార్థనీయ మనియే తలంచెను.

'గౌతమీ మాహాత్మ్యా'ది ప్రబంధములు 'కాశీమజిలీలు' వ్రాసిన

శ్రీ మధిర సుబ్బన్నదీక్షిత కవిగారు

మీ నాటకమును సాంతముగాఁ జదివితిని. దీనికి 'వనితాజన నీతిబోధక' మని పేరు పెట్టవచ్చును. శాస్త్రోక్తములగు నాచారములు లోకమునకుఁ బరమోపకారకములని వ్యంగ్యార్థమునఁ దెలియఁబఱచుచు స్త్రీలకు హితము బోధించు మీ గ్రంథము సదాచారపరాయణులకు శ్రోతవ్యముగా నున్నదని నా యభిప్రాయము.

కడపనుండి 'భాగవత వివేక చూడామణి' ప్రముఖ గ్రంథకర్తలు.

శ్రీ కోపూరు పట్టాభిరామయ్య గారు

తమ నాటకము సావకాశముగా మున్ముందు చూచితిని. ఇందు శోచనీయమగు నీచస్థితి నొందిన సనాతనధర్మము చక్కఁగా నిరూపింపఁ బడినది. నిజముగా దేశక్షేమమును గోరువారి కిది యెంతయును సమ్మతమే... దీనిం జక్కఁగా శ్లాఘింపవలె నన్న నది మఱియెంత గ్రంథమగును.

శ్రీ కందుకూరి వీరశరభ వరాహ లక్ష్మీనృసింహ వేంకటజోగి బాలసూర్య ప్రసాదరావు పంతులుగారు—ఉర్లాం జమీన్‌దారులు

మీ నాటకమును జదివితిని. మాఱుదారిం బడినవారిని మరలించి మంచిదారిం బ్రవర్తింపఁ జేయఁగల నీతిబోధక గ్రంథము లిట్లు మీవలె రచించువారు అరుదుగ నున్నారు. ......ఇట్టిగ్రంథములు మఱికొన్నిటిం బ్రకటింతురని కోరుచున్నాఁడను.

శ్రీ ఆదిమధ్యము భావనారాయణస్వామిగారు, ప్లీడరు, పోలవరం.

క॥ మొదలిడఁగా నీగ్రంథము తుదముట్టినదనుక విడువఁ బోఁప డెవరికిన్
మదమెుప్పు స్వభావోక్తులఁ జదువం జదువంగఁ గవన చాతురివలనన్॥

క॥ హరిదాసుల యథునాతన సరసవచో రచనలన్ని సరిగానమరెన్
పరిసరి కన్నులయెదుటం జరుగుచు నున్నట్లు వ్రాయ సామాన్యంబే ?

ఆ॥ శైలి నింపెనింపు సరసమై పాత్రల కుచితమైన పల్కు లూహ లమరెఁ
జదువఁ జదువ మదికి సత్యరా యాపూర్వ దేశయాత్ర లట్లు తేటపడియె॥

రాజమహేంద్రవరము ఆర్ట్సుకాలేజి సంస్కృతాంధ్ర భాషాపండితులు.

శ్రీ కల్లూరి వేంకటరామ శాస్త్రిగారు.

ఆర్యోత్తమా! ‘స్త్రీలమిాటింగునాఁటి హరికథ’ నామూలాగ్రంబుగాఁ బఠియించినాఁడ. ప్రాచీనాచారముల సేవగించునట్టి యెలనాగల హేలాచరితంబులతోఁ బూరితంబయిన యీ నాటకంబు నవీననాగరక నటనంబులకుఁ ‘జాక్కు’రై యవతరించె నని నా యభిప్రాయంబు. విలాసచర్యలను వివరించు నవసరంబు ప్రాప్తించినచోట్ల శ్లేషధ్వని మార్గంబులతో నునుపు సేసి సరసంబుగా నీ గ్రంథంబు వ్రాయఁబడియె...... సర్వవిధంబులఁ బూర్వ స్మృత్యుక్తములకుఁ బ్రాచీ నాచారంబులకు విరుద్ధంబుగా సఱపుట తగదని తమరచించిన నాటకము భావమైనట్టుల గ్రహించి యభినందించుచున్నాఁడ.

చెన్నపట్టణమునందు మహాపండితోత్తములగు
శ్రీమాన్ తి. అ. కు. శ్రీనివాసాచార్యగారు,

‘మానవధర్మ చంద్రికా’ ‘స్త్రీ ధర్మరత్నభాండాగా’రాది గ్రంథకర్తలు
శ్రీమాన్ తెన్మఠం వేంకట నరసింహాచార్యులుగారు
శ్రీమాన్ తెన్మఠం శ్రీరంగాచార్యులుగారు

పచ్చయ్యప్పకాలేజి ప్రధానాంధ్రోపాధ్యాయులు
శ్రీమాన్ చిలకపాటి వేంకట రామానుజశర్మగారు

పచ్చయ్యప్పకాలేజీ ప్రధానసంస్కృతోపాధ్యాయులు
శ్రీ తి. నారాయణశాస్త్రిగారు

గోవిందప్పనాయని హైస్కూలు ఆంధ్రప్రధానోపాధ్యాయులు
శ్రీలంకారంగనాథ శాస్త్రిగారు

పచ్చయ్యప్పహైస్కూలు ఆంధ్రాధ్యాపకులు
శ్రీమాన్ పర్ణశాల నరసింహాచార్యులుగారు
శ్రీమాన్ తి. శ్రీనివాసాచార్యులుగారు

క॥ భాగవతుల సుబ్రహ్మణ్యగణితసుధాకరుండు జ్యౌతిషగాన
శ్రీగణనీయుం డాప్తుఁడు నాసురుఁడౌ న్యాయవాదిపదపడినడ పెన్॥

తే॥ అవిచారణకాలంబులందు నటను
నెందఱెందఱొ వినరాఁగ నెచ్చరికగ
గ్రంథకర్తను దత్పుస్తకమ్ముఁ గూర్చి
యొప్పుదువకీర్తి క్రమముగా నేనుదినము 145
లడుగఁజొచ్చిన ప్రశ్నమ్ము లన్నిటికిని
దడవుకొనకుండఁ జెప్పుచు నడుమనడుమఁ
గడుపుబసులంగ నవ్వింపఁ గలుగు చుండ
నేరుకలిసిన నిజె గోష్ఠి యింట నింట॥ 146

క. కవినోట నేదివచ్చిననవ్వనయ్యది శ్లేషయంచువ్యంగ్యమొధ్వనియో
తవులకమాన దటంచును జెవియొగ్గి వచింపవించుఁ జెప్పుకొనంగన్

---

శ్రీకాంచీపురాగత మహావిద్వాంసులు
శ్రీమాన్ తి. అ. కృష్ణమాచార్యులుగారు
'తర్కతీర్థ' బిరుదాకింతులు
శ్రీమాన్ మా. రామానుజాచార్యులుగారు
'కవివల్లభ' బిరుదాంకితులు
శ్రీమాన్ తిరుమలకాండూరి భాష్యకారాచార్యులుగారు
మున్నగు పెందఱో చేరిన సదస్సున గ్రంథము చదివించికొని విని రేక
గీవముగా వ్రాసిన యభిప్రాయమిది:

తమచే రచియింపఁబడిన 'స్త్రీలమీటింగు నాఁటి హరికథ'ను మేమంద
అము సమగ్రముగాఁ జూచితిమి. హిందూధర్మశాస్త్ర వ్యతిరిక్తముల గ్రహిం
చుట రుచితంబుగాఁ జిత్రకథాప్రతిపాద్యంబగు నాటకరూపముగాఁ దాము
రచియించినారని గ్రహించితిమి. ఇది చదివినచో స్త్రీస్వాతంత్ర్య మిహ పర
ములకు నాశకంబని సులభముగ గ్రహింపనగును........ఇందుంగూర్చి యింక
ననేక ప్రమాణములుగలవు. వానిని గ్రంథవిస్తరభయమున వ్రాయలేదు.

శ్లో॥ మన్వాద్యైః పరికీర్తితం కులవధూ స్వేచ్ఛాప్రహాణం చిరాత్
ధర్మజ్ఞైః పరిపాల్యమాన మనిశం లోకే యద స్త్యద్య తత్
కైశ్చిద్వ్యత్య విహాన్యమాన మవసా వుద్ధర్తుకా మోఽలిఖత్
గ్రంథం యః పురుషోత్తమాఖ్య సుకవి స్తం సాధు మారాధ్నుమః॥

తే. నలువు రెటఁగూడ, వాక్యసందర్భములను
నల్ల నాటకమందలి యంశములెన్నొ
సంతరింపఁగ నాపైనఁ గొంతసేపు
వివిధరీతులఁ జెప్పికో నపుచునుండె॥ 148

క. నవనాగరకులమిత్రుండవు మేజస్ట్రీటొకండు వ్యతిరేకముగా
ను విచారణకాలంబుననెవియెవొ చేయంగనప్పుడేట్రొన్నఁరుగాన్

తే. ఆతపశ్చాలి తలఁచిన నౌ నైదైన
నతని వాక్కులె శాపంబు లౌనొ యేమొ!
యంచు వెఱవఁగఁ గొందఱు మించిపొగడ
నెట్టులెనను దైవమే గట్టుఁజేర్చె॥ 150

తే. కష్టములపాలు తానౌను గాక యితఁడు
స్నేగి యేరికిఁ గోరంగఁ దాఁ గడఁగఁడె!
యాస్తితగవిది కాదని, యాస్తికతని
యెక్కుఁ బ్రతిపక్షి శకటాల నెక్కుమన్న॥ 151

తే. ఒంపుటొంపును లేనట్టి యొజ్జయాట
నిజము నిలుకడపైఁ దేల, నిందలుడుగ
నెల్లవారలగౌరవం బెనయఁ గనెను
సూ; సమానుల నుత్తమశ్లోక మంద॥ 152

పరశ్రేయస్సహనము

తే. ఎవరు వ్రాసినఁ బల్కిన నేలికలను
దూలనాడుదు రనుగోల చాలగలుగ
నట్టి యభియోగముల రహస్యపు విచార
ణములు సాగినయట్టి దినమ్ములవ్వి 153

శా. చెన్నాప్రెగ్గడ భానుమూర్తి, ప్రతిపక్షింగూర్చిట్రొన్నేటరై
యున్న న్మోసము రాజకీయమున నానో యన్నశంకం బ్రభు
త్వోన్నత్యంపు రహస్యవేదు లరయ న్వ్యాపాద మేపొంతలే
దన్నా! మిన్నగొనంబులున్న యతఁడం చగ్గించి నెగ్గించెఁదాన్॥

క. అతఁడది యెప్పటికో విని కృతజ్ఞతను వెల్వరాఁగఁ గించి త్తైన
న్నతిసైఁపను, స్ఫటికాచ్ఛత గతిమీఁదని యున్నదెన్నఁగలిగె
న టనియెన్॥ 155

ఉ త్త మ యో గి ధ ర్మ ము

ఉ. ఆయెడఁ జల్లపల్లివిభుఁ డాప్తుఁడు వల్లురివంశ్య సూర్యనా
రాయణరావుఁగూర్చి యరయంగ విశాలమనస్కతన్, గుమా
* స్తా యెదురైన పక్షమును దాను వహింప సహించునాతఁ డ
ప్రాయికసద్గుణాకరుఁడు, పట్టుదలం బనిసేయువాఁ డనెన్॥ 156

మ. తఱ చాతం డిట కేగుదెంచుటయుఁ ద త్తద్గ్రామ దేవాలయో
ద్ధరణంబుం దెటనేని కల్గనగు సందర్భంబులం దంతఁ దా
నరుగం జూచిన కుంభకోణగత యోగాభ్యాస విన్యాసవై
ఖరులంగూర్చి ప్రశంససల్పుటయుఁ గల్గ న్నైత్రి దీపింపఁగాన్॥

శా. ధీరుండై ప్రతిపక్షివర్గమున నుత్సేకించు ముట్నూరి కృ
ష్ణారావొక్కఁడ రా, సమాదరముఁ గాంచంగల్గె, నంతర్ముఖుం
డై రాజిల్లుదృఢాత్ముఁడాతఁడొకఁడేయంచెంచుటం, బల్కఁ జె
న్నారెం బుత్త్రముఖంబున న్నుగుణవిన్యాస ప్రియోల్లాసితన్.

శా. తోరంబై తగు భోగరాజకుల జాతుండైన పట్టాభి సీ
తారామాహ్వయు బుద్ధివైభవము బందర్ బ్యాంకు లిన్నూర్లకున్
దారిం జూపఁగ, నేషనల్ పతనసంస్థ న్నిల్పుతోడ్పాటునం
గోర న్మిత్రసముద్ధృతిం గలియ సంకోచింపకే చేయుటల్॥ 159

తే. ఉన్న విశ్లేష్ణ యవియన్ని యెన్నఁగలమె?
దూషణం బెంచ కాతండు భూషణంబు
యోగిమార్గ నిసర్గ పరోపకార
ధర్మనిరతినె పూరుషోత్తముఁడు నడపు॥ 160

---

* శ్రీ భాగవతుల పిచ్చయ్యగారు తమకపుడు కుడిభుజముగా నుండిరనుట.

చ. పలువురఁ 'జెళ్ళపిళ్ళ' ప్రతిపక్షులఁ జేరిన, దాతృతాదృతిం
బలుమఱు కొల్పఁగోర, సలుప న్వెనుదీయఁడు, రామకృష్ణులో
జ్జలను దిరస్కరించుతఱి సాయముఁ గోరఁగ మందలించి, బో
ధల గురుభక్తి నెంచి 'కవిత' న్గుణమెంచి యడంచె భేదముల్॥

ఉ. కేరుచు రామకృష్ణులను గేరతము న్రచియించుపట్ల నా
ధోరణి వాగ్వివాదములతోడ సతీర్థ్యులు పాఠశాలలో
నేరెదిర్వాయ దిద్దుటయు, నింట గురుం డెదిచూడఁ బ్రీతిదై
వార సుతుండు నేర్చుటయు ఫారము లెట్టులొ నెట్టనాటకా న్

సుతుని విద్యాభ్యాసంగము

తే. తాము రాఁగ నద్దేపలి సోమనాథ
బుధులు ఛాత్రులు నైషధంబును బఠింప
నొకట శబ్దవిజయంబు నొద్దఁ జేరి
యందు నిందును బోధల నంద సుతుఁడు॥ 163

ఆ. దరిని జేరఁ బరిమి నరసింహశాస్త్రియు
మంత్రివాది చంద్ర మౌళిశాస్త్రి
సారిది మక్కపాటి సూర్యనారాయణ
బుధులు పాణినీయ బోధ సేయ 164

---

శ్రీ మత్పరదేవతాయైనమః కడియం

శ్రీరస్తు చిరంజీవులైన వాదెళ్ల దక్షిణామూర్తి శాస్త్రికి 14-10-41.

ఆశీరుభయకుశలోపరి........ కీ॥ శే॥ మీ తండ్రిగారు జ్ఞాపకం వచ్చినారు. ఆయన సుమారు 30 యేళ్లనాడు మా పురోహితుని తమ్ముని వివాహ సందర్భంలో కొండజీతో చెప్పి సహాయం చేయించినట్లు, అది యొక్కటియే కాదు పలుపుర మీ తండ్రిగారివల్ల నిట్టియుపకృతులు పొందుట నేనే యెఱుగుదును... సర్వాత్మనా నీవు తండ్రికి తగిన సుపుత్రుడవు. నీయందు మీ తండ్రిగారియందు వలెనె భక్తిశ్రద్ధలు చూపు గృహస్థులు లేకపోరు... ఈ మధ్య నేరచించి ప్రచురించిన 'సుశీల' అను పుస్తకమును పంపితిని. ప్రత్యక్షర శోధగా చదివి, పిమ్మట దీనిపైని గురువుగా రొనర్చిన విమర్శనముకూడ చదువుము......

వెం. శా. శతావధాని.

ఆ. వ్రాయసప్తకాలుఁ బ్రార్థనశ్లోకాళి
ముక్తికాంత శతకము నిఁక నేవొ

---

ఈ గ్రంథకర్త యాదిమ సంస్కృతాంధ్ర రచనములం గూర్చి

బహుశాస్త్రజ్ఞులు సంస్కృతాంధ్ర గ్రంథకర్తలు, నోబుల్ కాలేజి పండితులునౌ

శ్రీ శిష్టా నరసింహశాస్త్రిగారు

శ్లో॥ శ్రీ శాండిల్య ఘనాన్వవాయ విబుధాశీర్వాద దీప్యన్మహో
కావ్యాఖ్యానసమర్థ నిర్మలగుణ శ్రీదక్షిణాస్యాభిధ !
శ్రీమన్ త్వత్కృతి కావ్యజాల మఖిలం చాద్రాక్ష మావిస్తరాత్
తత్రాస్తే రసవత్త్వ మాశుకవితా నైపుణ్య మూర్జస్వలమ్॥

శ్లో॥ కవీనాం కీర్తిర్యా సురవచసి చాంధ్ర్యే మధిగతా
నతే వాచాం భూమ ర్భవ సరస వాచాంచ సుధియామ్
మహచ్ఛ్లాఘాపాత్రం తవ కవన మాంధ్ర్యాం పరిగతమ్
గుణై స్తైస్తై ర్యుక్తం మృదుమధుర శయ్యా సులలితమ్ ॥

అవధాని శిరోమణి మహోపాధ్యాయ

శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

...చిరంజీవి శ్రీమేధా దక్షిణామూర్తిశాస్త్రి యొక్క ధారాశుద్ధి నాదు హృదయమును సంతసపెట్టినది. చిరంజీవుల గీర్వాణ వాగ్ధోరణి యత్యంత మనోహరమని యెంచుచున్నాను.

బహుశాస్త్రజ్ఞులు నాశుకవులు శతావధానులునౌ

శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

శ్రీ మేధా దక్షిణామూర్తిశాస్త్రిగారి నిరర్గళోభయభాషా వాగ్ఝరి నోలలాడి యెంతయు నానందించితిని 'పుత్త్రాదిచ్ఛేత్పరాజయ' మ్మన్నది సార్థకనాముతో శ్రీ పురుషోత్తమ కవీంద్రులకే దక్కిన దనుకొనుచున్నాను.

ప్రబంధ నాటక కృతికర్తలు పిఠాపురం హైస్కూలు హెడ్మాస్టరులునౌ

శ్రీ కూచి నరసింహము పంతులుగారు

తాము దయాపూర్వకముగాఁ బంపిన శ్రీముక్తికాంతామణీ శతకమును జదివి మిక్కిలి యానందించినాను. ఇది భక్తిరసపూరితమై ధారాళకవితాశోభితమై నీతిదాయకమై మిగుల మనోహరముగా నున్నది. అందలి తొలుతటి ప్రార్థనా శ్లోకావళి మీ సంస్కృతవాగ్ఝరి నిరర్గళమని యత్యంతము చాటుచున్నది.

యప్పుడప్పు డెన్నో యవధానపద్ధతు
లందు నేర్పుగదుర నలవడుటయు॥ 165

---

బోర్డుహైస్కూలు పండితులు యోగానంద రామాయణాది గ్రంథకర్తలు

శ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులుకవిగారు

'శ్రీ ముక్తికాంతామణీశతక' మంతయు శ్రద్ధాభక్తియుక్తితో నడపదడప చదివి ముగించి మఱొక్క చదువరిమిన్న కిచ్చితి. మృదుమధుర సరళశయ్యాపాక సుధారస మరంద బిందువు లాని యానంద సింధువున దోలలాడి తృప్తిం జెంది నాఁడను. ఉభయభాషలయందు నసమాన ధారాళ హేరాళ సమాస తుంగో త్తుంగ శబ్దవేగాయత్త వృత్తితోడ భవదీయ బాల్యదశయందే మీ లేఖిని కేళీ హేళాహేళిని జూపినయది. రాజులకేమి కవిరాజులకేమి, స్వవిక్రమంబునకుఁ దోడై వన్నెఁదెచ్చు పుత్త్రరత్నంబు పూర్వ భాగ్యవిశేషంబునంగాని లభింపఁ గాదుగదా. 'పుత్త్రా దిచ్ఛేత్పరాజయ' మ్మన్న మహాభాగ్యము కవిపురుషోత్త ముల కబ్బినందులకు సంతసించి 'శ్రీ పురుషోత్తములే మీ పురోభివృద్ధికి వరం బిచ్చి బహుగ్రంథ కర్తృత్వభాగ్యం బొదవించుఁ గాత!' మని కోరుచున్నాను.

ఉ. శ్రీవిలసత్ప్రబంధ కృతిశేఖర సత్పురుషోత్తమాత్మజా !
యీవిధి నేఁడుశక్తుఁడు రచింప సురాంధ్రకలావిశాలమే
ధావివి కావుట న్సుకవితా వనితా కలితా చ్ఛకీర్తివై
యోవిమలాత్మ! శిష్ట సుజనోత్తమమిత్రమ! మెచ్చఁజెప్పితే॥

శ్రీ పిరాట్ల మృత్యుంజయ శాస్త్రిగారు, జగ్గయ్యపేట

శ్రీమేధా దక్షిణామూర్తిశాస్త్రి విరచితమైన ముక్తికాంతామణీ శతక మును సందర్భప్రార్థన శ్లోకావళియును శ్రీ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారును నేనును నా మిత్రులును సాకల్యముగాఁ జదివితిమి. అత్యంతము సంస్కృత రచనాసామర్థ్యము మంచిది యలవడినందులకు మాకందఱకుఁ జాలసంతోష మైనది.

మద్రాసు క్రిష్టియను కాలేజి పండితులు, శతావధానులు

శ్రీ సోమా వేంకటస్వామి గుప్తగారు

మ. తతమై నీతిదమై యమోఘవచ నాత్యంతప్రమోదాత్మతాం
చితమై భూమిని బర్వినట్టి దగు మీ శ్రీ ముక్తికాంతామణీ
శతకంబుం బఠియించినాఁడ. నిఁక నా సంతోష మింతంతనన్
వితమే లేదు. జగమ్మునందు నిటు లుద్వేలప్రబంధాళి స॥

శతము స్వాత్రియుఁడు రీయగాత మని మేధాదక్షిణామూర్తి శా
స్త్రి! తదీయాత్మక సమ్ముదాప్తిని 'నమస్తే' యంచు వాంఛించెదన్॥

చ. అమృతసమాన పేశల పదావళిఁ దండులముం బొనర్చి, యం
దు మహితభావ శైఖరులనున్ ఘృతముం బొనరించి, యందునన్
సమధిక రుచ్యమై వెలయు సారసుధారస ధార, మాధురీ
క్రమమున ముక్తికాంతఁ బటుకావ్య రసోరువిధాన పాకము
న్నమకృత పూర్వపుణ్య కలనం జవిచూడఁగ నయ్యె, ధీమణీ!

నాటకకర్తలు, తహసీల్దారులునౌ
శ్రీ మాదిరెడ్డి గంగారావు నాయఁడుగారు

అనేక వందనములు, శ్రీ ముక్తికాంతామణీ శతకము చాలబాగుగా నున్న
యది. శైలి మాధుర్యమునుబట్టి యనుదినమును దానిని నేఁజదువుచుఁ గంఠ
పాఠము చేయ నిశ్చయించికొన్నాను. దైవకృపవల్ల నింక నిట్టిగ్రంథము లనేక
ములు మీరు రచియింతురు గాక.

— గ్రంథకర్తృవిరచిత ఖండకావ్యాంతర్గతములు —

మ. ప్రకటంబై తగు మేషచర్మమున సంభ్రాంతంబుగా మేషశా
బకముల్లంబుక మధ్యమం దనుపసంప్రాప్తంబులౌ మాయల
న్వికలత్వం బెటులందకుం డెడిని? దప్పింబోవిధుల్మన్న బ్ర
హ్మకు నైననఁ గుత్సి తత్వ మొకట స్వాశ్రయాతి నూకింపఁగాన్॥

చ. కలఁడొకఁడ చ్యుతుం డతని కామినియొర్తుక లచ్చమాంబ నాఁ
జెలఁగెదు సుందరాంగి, యల చేడియ మెట్టిన నాఁటినుండియే
కలుములుగల్గుటంబతియు గౌరవమెచ్చఁగ మెచ్చునచ్చమౌ
చెలువము నచ్చఁ దద్హృదయ సీమ వసింపఁగఁ జొచ్చె నిచ్చమైన్॥

ఉ. వారికి జ్యేష్ఠనందనుఁడు బ్రహ్మయ, భార్య సరస్వతమ్మ, వా
చారుచిరత్వముం గనినచాన, వరించిన యంత వేద వి
ద్యారమణీయతామహిమ మందఁగ దారముఖస్థమైన వీ
ణారవగౌరవంబున, వినన్మన మింపుదలిర్ప నేర్పడెన్॥

ఉ. తంద్రికుమారునందును బితస్సుతుఁడా ప్తతఁగాంచ నత్త కో
దండ్రకనెయ్య మొప్పమిఁ జెడందగు వారల యైకమత్యము
నీవింద్రదకుఁగయ్యమట్టులె జనించి క్రమక్రమ వృద్ధినందఁగాఁ
గంద్రదే? సహింపొకల్లోకతఁజూచినఁ గాంతులు గౌరవింపఁగన్॥

క. ఆకాలమందు సంస్కృత
మే కాదు తెలుంగు కృతులు సెన్నో నిఘంటుల్
చేకొని సుతునకు నేర్పుచు
నాకలనమొనర్చి కూర్ప నాయూహాపాల్। 166

తే. 'ప్రకృతిరూపప్రకాశిక' 'వికృతిరూప
చంద్రిక'యు 'రూపదీపిక' సంతరింప
వెలసెఁ 'బురుషోత్తమ కవీయ' మిల నదనఁగ
నర్థరూప నిఘంటుత్రయాత్మకమయి॥ 167

తే. పరమమిత్రుఁడయిన రాయవరపు పూర్ణ
యాహ్వయుఁడు వేమనోక్తుల నాడనాడ
సేకరించి పరిష్కృతిఁ జేయఁగోర
నోపికను దిద్ది ముద్రణం బొనరుపంగ॥ 168

తే. సుతుఁడు వేమన చరితంబుఁ జూచి దిద్ది
వ్రాయ నయ్యెను 'వేమయోగీయ' మనఁగఁ
గూర్ప నప్పుడ కస్తూరి గోపసుకవి
యితఁడు సవరించెఁ దాఁ "గురంగేశచరిత." 169

---

ఉ॥ లచ్చికిలోఁగవా చదువులం బెడఁగొప్పవలఁ ద్రొక్కఁజేసి, క
మ్మెచ్చునఁదీసినట్లు బలిమిన్బడలాగుట సన్నగిల్లనొ
మచ్చునఁబొచ్చె మన్సలుపమత్సరియై, యలతుత్పితత్వపు
న్మచ్చును శార్వతీపతియె మాన్పఁగఁ జెంపలు రాలఁ గొట్టఁడే ?

శ్రీ పురుషోత్తమ పండితుల బాల్య కవితాగురువులు
శ్రీ కస్తూరి గోపాలరాయ కవిగారు

తమగురంగేశ్వర చరిత్రను బరిష్కరింపుమని యర్థించినప్పటిది: తణుకు 7-7-08

ఉ॥ శ్రీగురువర్య ! నీదుకృపఁ బోత్తమానం దుదిదైన పంచమా
శ్వాసము గూడఁ బూర్ణముగ వ్రాసి ముగించితి, గ్రంథమెల్ల నా
ద్యాసము దాక, మీరు కని యందలి తప్పుల నొప్పులొంగతిం
జేసి సుకీర్తిగా వ్యము ప్రసిద్ధముఁ జేసి నన్నుగా తృప్తిం ప్రఁ జేయుఁడీ

తే॥ కాశికృష్ణుల యవధాన కాలమునను
* వేణుగానమ్ము సల్పెడు వేళయందు
నుండి యానందముం దెల్ప 'నోరిజినాలి
టీ' యదన్నట నాతండు మీయ దనెడు॥ 170

---

వారే, యీ దక్షిణామూర్తిపేర వ్రాసినది.

క. పురుషోత్తము దేహస్థితి మఱకమ్మం దెలుపుమయ్య మద్గ్రంథంబున్
ద్వర నారయఁగాఁ జేయుము పరమేశుఁ డొసంగు నీకు భద్రాయువులన్.

అందులకు బదులుగా నీ గ్రంథకర్త వ్రాసినదిది:

శ్లో॥ అలసత్వం మ మాశంక్య ప్రేషితాం పత్త్రికా మిమాం
దృష్ట్వా సంకోచవా నస్మి క్షమ్యతాం మందబుద్ధితాం॥

తే. గురుల కారోగ్యముఖమాటఁ గూర్చి మీకు
వ్రాయఁబోవుచు నుండఁగా వచ్చె లేఖ
యోయి దొడ్డప్ప! ప్రాల్మాల కుందు నింక
నెచ్చరింపఁగఁ గృతిపరిష్కృతిని గూర్చి॥

శ్లో॥ ప్రేషణీయా బహువారం పత్త్రికా ప్రేమబోధినీ
చిత్రవార్తా విశేషాశ్చ జ్ఞాపనీయా ముహుర్ముహుః॥

పరిష్కరణము పూర్తిచేసి యంపుఁడని మరల నెచ్చరిక:

ధృవకోకిల: వినుము, 'బ్రాహ్మణ కర్షకక్రియ వేవిధంబుల నష్టియే'
యనెడు నీతి నెఱింగియుం దుద కజ్ఞత న్బటల న్భవిం
దవరఁ బీజములెల్లఁ బోసితిఁ దత్ఫలం బొడఁగూడదిం
కను, ద్వదీయ దయానువృష్టి సఖా! లభింపమిచేఁ, గటా!

—ఇట్లు సోదరుఁడు, కస్తూరిగోపాలరావు,

* బందరు శతావధానానంతరమునఁ జెప్పినవి:

నాదెళ్ల పురుషోత్తమ కవిగారు

సీ॥ మల్లెపూవున కొండు మంచివాసన మెందునిక్కుచు మెడమీఁది కెక్కుచుండు
చక్కర నెన్నండు చక్కనిచవియుండు నే టనఁబడుచుండు నోటనుండు
నెమలిపించెమునుండు నిరుకువన్నెలనిండు నన్నిటిపైఁ దల నమరియుండు
పొంటిఁగఁడుఁగొనుండు చొక్కపుగుణముండునన్నిమందులలోనమున్నెయుండు

తే. తా నల చిలకమర్తి లక్ష్మీనృసింహుఁ
డిట నుపన్యాస మిచ్చుచో నెవరో కోర
నంది యధ్యక్షపదము నమందముగను
దనిపె నెల్లర నందు నాదరముగదుర॥ 171

---

ఒక్కశ్లోకి కలపేర్మి లెక్కయిద్ది పెక్కులాక్కడ నున్నదేచిక్కడుగద
యిక్కరణిఁ గృష్ణయాచార్య పెక్కువలను జక్కఁగాఁ గాంచి లెక్కింప
నెక్కలఁడియొ!

నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి

సీ॥ ఆంగ్లేయపారసీ కాంధ్ర గీర్వాణ హిందూస్థాన భాషల నాస్థ నేర్చి
వరచతుర్విధ కవిత్వోన్నత్యమున గ్రంథముల వ్రాసి యవధానములను దవిలి
యొన్న ముప్పదిరెండు హిందిభాషా నాటకమ్ముల రచియించి ఘనతఁ గాంచి
గణనీయు మాగతి గణితశాస్త్రమునందుఁ బాండిత్యగరిమంబుఁ బడసి మించి
యలరు నాదెళ్ల పురుషోత్తమార్యవరు నితనయుఁడు విధేయుఁ డైయుటఁదనరుచుండు
దక్షిణామూర్తి శాస్త్రి వందనముఁగొనుము కృష్ణయాచార్య కవిచంద్ర! కీర్తి
సాంద్ర!

సీ॥ సంస్కృతాంధ్రకవిత్వ సంపద్విశేషోన్నతిని గాంచి యెంతయు ఘనత మించి
ధారణాశక్తి యవ్వారిగాఁ గల్గి శతావధానంబు సేయంగ నేర్చి
సంగీతసాహిత్య శబ్దశాస్త్రములందు నిస్తులంబైన పాండితి గడించి
తర్కశాస్త్రమునందు ధాటిగా వాదము ల్సొనరించు నన్న ఖ్యాతిని వహించి
హూణభాష నొకింత ప్రవీణతఁగని యార్యసంస్తుతిఁ గాంచు కృష్ణార్య! నీవు
మా సుకృత విశేషమునను జేసి యిటకు వచ్చి మమ్ముల సంతోష వార్ధినిడితి॥

చ॥ లలిత కవిత్వనైపుణి పురాకృత పుణ్యవిశేషలబ్ధమై
కలిగెడి మానవావళికి గానము నట్టులె దుర్లభంబదై
యలరెడిఁ గొంతమందికిని యట్టివిరెండును నొక్కచోటనే
వెలయుట పైన ధారణయు విశ్రుతపాండితి యబ్బుటబ్రమా॥

మ. కవితాధోరణి గాననైపుణియుఁ దర్కంబందుఁ బాండిత్యము
స్తవనీయంబగు ధారణాపటిమము సాహిత్యముం గల్గి, శాం
తి వహింపం గడుదుస్తరంబగును గాదే, యిట్టి శ్రీకృష్ణయా
ర్య వరేణ్యాద్భుతశాంత మెన్నఁగను శక్యంబౌనె యెవ్వారికిన్?

మ. వినుఁడీ సభ్యులు, మీరలెల్లరు గన న్విఖ్యాత విద్వన్నికే
తన బృందావన పత్తనంబునను మోదం బుప్పతిల్లంగఁ జే

తే. మున్నె కూర్పఁగ ధర్మసముచ్చయములు
వ్రాయఁగా 'గురుభక్తిప్రభావ' మపుడు
భద్రగిరి రాము దర్శించి వచ్చుచుండ
* నితఁడు వినఁగల్గెఁ 'గృష్ణభారతము' కొంత॥ 172

తే॥ క్లేశ ముద్యోగనాశము సేకని రవి
కష్టనష్టాలు శశి, కూడ నష్టమపతి
వ్యాకులభయాలు తాను నిజాంతరమునఁ
గాఁగ రాహ్వంతరము ముందు రాఁగడంగు. 173

---

సెను దా, గానవధానము ల్వినుత కాశీకృష్ణయాచార్య వ
ర్యుని నిమ్మాన్యుని నర్హమాగతి నిఁకెట్లో చేయ సమ్మానముల్॥

ఉ॥ కావున నోయి పండిత శిఖామణి! ధీయుత కృష్ణయాగ్రణీ!
ధీవరవర్ణ్యసచ్చరిత దివ్యయశః ప్రతిభాన్వితా! హాయ
గ్రీవ పదారవింద యుగళీ విలసన్మధుపాచ్ఛమానసా
పావనమూర్తి కైకొను కృపామతి, మత్కృత వందనమ్ములన్॥

సీ॥ శ్రీభవాంశోద్భవ! శ్రితసుర భూభవ నిరుపమ ప్రాభవ నిత్యవిభవ!
భూరిభూధర గాత్ర సూరిసంస్తుతిపాత్ర వనజాప్తసుతమిత్ర వాయుపుత్ర!
'భక్తామరేడ్గేయ పటువిబుధజ్ఞేయ హరివరేణ్యాగ్రీయ యాంజనేయ
గంధమాదనధామ గళలసన్మణిదామ వదనవిజితసోమ కదనభీమ
పరభయంకరవైదుష్య భానుశిష్య భక్తసముదాయసంత్రాత భావిధాత
నిజకరాంచితగురుపాద! నిరతమోద! సతత మాకాశి కృష్ణయ్యసాకుమయ్య.

* 'శ్రీకృష్ణభారత' కృత్యభినందన సందర్భమందలివి.

శా॥ శ్రీపాదాన్వయ కృష్ణమూర్తి కవిరాట్సింహా! యశోదార! నా
నా పూర్వాంధ్ర కవిప్రణీత కృతిసంతానోక్తిసంధాన ధా
రాపుష్టిం దలఁగించి భారత మిలం బ్రాగల్భ్యముం జూపి తే
రా! పారీణత సత్కవిత్వమున వర్ణ్యంబొఁగదా యోకికిన్॥

ఉ॥ రాజమహేంద్రపట్టణ విరాజ దనూన యశస్సనాథ నా
నాజన రాజరాజ నృపనందిత నన్నకవీంద్ర కర్తృకం
బోజఁ దెనుంగున న్భరత మానితి వీ విటుషల్క శారదన్
[illegible] నేఁడు సార్థక [illegible]॥

### ఆశ్వాసాంతము.

### గోమూత్రికాబంధ కందము.

వినయమునను వినిపింతున్
గొనములుగొని జనులువొగడఁ గొలుపసధారన్
ఘన! మముఁ గనుమని యెంతున్
మనములుగని తనుపవొ! కడమలు వెస జారన్॥ 174

### విద్యున్మాలాద్యనేక వృత్తకంద రగడ గర్భిత మత్తాక్రీడ.

ధీరత్వంబున్ దేఱన్ దీరన్ దెరువును గనుఁగొనఁ దిరముగఁ బరఁగన్
శూరత్వంబున్ జాఱన్ జారన్ సురుచిర కరుణను జొరనగు సరగన్
క్రూరత్వంబున్ గూరన్ గోరన్ గురుతర మనమిని గొఱఁతగు మరగన్
జారుత్వంబున్ సాఱెన్ జాఱన్ సరవిని మనవిని జరనగు నెరఁగన్. 175

### గర్భితవిద్యున్మాలావృత్తములు.

1. ధీరత్వంబున్ దేఱన్ దీరన్ శూరత్వంబున్ జాఱన్ జారన్
క్రూరత్వంబున్ గూరన్ గోరన్ జారుత్వంబున్ సాఱెన్ జారన్॥
2. ధీరత్వంబున్ దీరన్ దేఱన్ శూరత్వంబున్ జారన్ జాఱన్
క్రూరత్వంబున్ గోరన్ గూరన్ జారుత్వంబున్ జాఱన్ సాఱెన్॥

### గర్భితేతర వృత్తములు

3. ధీరత్వంబుం దేఱన్ శూరత్వంబుం జాఱన్
క్రూరత్వంబుం గూరన్ జారుత్వంబు స్సాఱెన్॥
4. ధీరత్వంబుం దీరన్ శూరత్వంబుం జారన్
క్రూరత్వంబుం గోరన్ జారుత్వంబుఞ్జారన్॥
5. తెరువును గనుఁగొనఁ దిరముగఁ బరఁగన్ సురుచిరకరుణను జొరనగు సరగన్
గురుతరమనమిని గొఱఁతగు మరగన్ సరవిని మనవిని జరనగు నెరఁగన్॥
6. ధీరత్వంబుం దిరమా, శూరత్వంబుం జొరనాఁ
క్రూరత్వంబుం గొఱఁతాఁ జారుత్వంబున్ జరనా॥

---

మ॥ కవిరాట్ శ్రీపద కృష్ణమూర్తి యిటు రాకేం బౌరు లశ్వారి గో
రథ భావమ్మున నగ్రపీఠమునఁ జేర్చ న్సత్సభా మధ్యమం
దు, వచోధోరణిఁ జూపి యందఱను సంతుష్టాత్ములం జేసెఁ గీ
ర్తివిశేష మ్మిటఁ బెంపుమీఱ గుణపూర్తిన్మూర్తి దైవారఁగా॥
— నాదెళ్ల [illegible] దక్షిణామూర్తి శాస్త్రి.

7. ధీరత్వంబున్ దిరముగఁ బరఁగన్ శూరత్వంబుం జొరనగు సరగన్
గ్రూరత్వంబుం గొఱఁతగు మరగన్ జారుత్వంబున్ జరనగు నెరఁగన్॥

8. తిరముగఁ బరఁగన్ ధీరత్వంబున్ జొరనగు సరగన్ శూరత్వంబున్
గొఱఁతగు మరగన్ గ్రూరత్వంబున్ జరనగు నెరఁగన్ జారుత్వంబున్

(ఇట్లింకెన్నేని ప్రస్తరింపనగును.)

కందప్రస్తార ప్రక్రియ.

ధీరత్వంబుం దేజన్ దీరన్ జెరువున గనుఁగొనఁ దిరముగఁ బరఁగన్
శూరత్వంబుం జాలన్ జారన్ సురుచిరకరుణను జొరనగు సరగన్॥

(ఇట్లు పంద్రెండు కాన్పింపఁగలవు.)

ఇందలి రగడల ప్రస్తారక్రమము.

ధీరత్వంబుం జెరువునఁ గనుఁగొన శూరత్వంబున్ సురుచిరకరుణను
గ్రూరత్వంబున్ గురుతరమనమిని జారుత్వంబున్ సరవిని మనవిని॥
తిరముగఁ బరఁగన్ జెరువున గనుఁగొన
జొరనగు సరగన్ సురుచిరకరుణను
గొఱఁతగు మరగను గురుతరమనమిని
జరనగు నెరఁగను సరవిని మనవిని॥

(ఇట్లెన్నేని బయలుదేఱును.)

వరకవి నాదెళ్లన్వయ। పురుషోత్తమ
జీవయాత్ర, పుత్త్రికకృతత ద్గురుచరిత
దక్షిణామూర్తి రచిత
మాశ్వాసమందిదియె
పంచమమౌ॥



# ఉత్తమ జీవయాత్ర



## షష్ఠాశ్వాసము

క॥ ఇఁక నవధరింపు మీశా! సుకవీశ శరణ్య సద్యశో వ్యాప్తాశా!
సకలాఘౌఘ వినాశా! యకలంక వ్యోమకేశ! హత భవపాశా!

### స్వాతంత్ర్యోద్యమము

ఉ॥ శ్రీలకు నాలవాలమయి చెన్ను వహించిన భారతంబు గ
గ్గోలు వడంగ నెయ్యెడలఁ గూటికి గుడ్డకె లోటు గల్గు దు
ష్కాల మిదిప్పు డేర్పడిన కారణమేమన, ధర్మలోపమే
పాలనమందు నారయఁగఁ బ్రాప్తము కావుటఁగాక, యేమగున్

మ. అని గీతోద్ధరణైక దీక్షితుఁ డనన్యప్రాప్త తేజుం డధీ
త నితాంతాగమ సార సంకలిత విద్యా ద్బాలగంగాధ రా
ఖ్య నుతశ్రీక తిలక్ మహాశయుఁ డెసంగం గర్మవీరుండుగాఁ
గన్న, 'కాంగ్రెస్' రథ మట్టునిట్టు నడపంగా లోక మల్లాడఁగాన్

మ. అతివాదు ల్మితవాది శేఖరుల నూటాడించి యోడించి, సూ
రతు రంగస్థలమందు గోఖలె ముఖప్రారూఢి గూఢం బొన
ర్చు తఱిన్ 'ముంటిని ముంటఁ దీయవలె'నంచు న్సాధనోద్యుక్తతన్
ధృతిమీఱన్ మితిమీఱి వర్తిలుచు సంధింపం బ్రసంగోద్ధృతిన్॥

మ. అరయం బెన్కూరు పట్టభద్రులు సముద్యద్దీపితోద్రేక సం
భరితస్వాంతులు చింతితార్థ బహుళ ప్రారంభ సంరంభమం
దరవిందాదులు కొంద ఱుద్ధతులు నయ్యో దేశదేశాలలోఁ
జెఱులం జేర నుపన్యసించుటను గాసిం జెందులే వాసిగాన్॥

మ. పలుదేశమ్ముల నాఫ్రికా వలసపోవం గన్నవారెల్ల నీ
చులుగా హింసలపాలు గాఁదొడఁగ, నచ్చో నప్డు బ్యారిష్టరౌ
నలఘుప్రజ్ఞుఁ డనన్యసాహసుఁడు మోహన్ దాస్ కరంచంద్ గాం
ధి, లవం బద్ది సహింపఁజాలమిని సాధింప న్సమప్రాంశుతన్॥ 6

శా. ఏవ్యూహమ్ము లడంచి జ్ఞాన మెటులేన్ వృద్ధిం గనంజేయ, మా
లవ్యాపండితుఁ డూర్జితమ్ముగను నిల్వన్ విశ్వవిద్యాలయం
బవ్యాఘాత మొనర్ప వారణాసిలోఁ, నాంధ్రీయ జాతీయతా,
భావ్యంబైన కలానివేశన మిటన్ బ్రారంభమై యుండఁగాన్॥

## దేశీయ విద్యా ప్రోత్సాహము

మ. గణనీయత్వ మదెందు నెందుఁ గలుగంగా, దేశసేవాపరా
యణతం బూనిక నందనెంచుమతజి, లోకారాధ్యమై యొప్పు స
ద్గుణజాతమ్ము కలాదికమ్ము చితకీతు ల్నితులు న్బ్రీతిగా
గణనం జేయఁ దలంపుమాని యిట సాగ న్బాఠశాలామిషన్॥ 8

శా. ఈప్రాంతంబులలోఁ బ్రసక్తి యొదవ న్వారాశి దేశీయ వి
ద్యాప్రాశస్త్యముఁ గూర్చిపల్కుటయుబోధల్సల్పుటల్సాగ, సూ
త్రప్రాయంబుగ ధర్మమర్మముల నాధారంబులం జేర్చి లో
కప్రోత్సాహకరంబుగా విహిత మార్గవ్యాప్తి పెంపారఁగా॥

క. స్థాపించి పాఠశాలను బ్రా పేరిడి కోరికుండ, బాలు రనేకుల్
దాపునకుఁ జేరుకొలఁది న దేపారఁ గఁ జేర్చెఁ బ్రీదలీయమి నెదియున్॥

మ. ఎవఁ డద్దేపలి వంశ్యశిష్యులకుఁ గావింప న్సహాయమ్ములన్
శివరాము న్నిజపుత్రతుల్యు నిఁగఁ గాంచెం, దండ్రి తా నెద్దియే
ని 'వచింప న్వెఱఁగందుదు న్నృపుని పై నేరంబటం చెంత్రో!' నా
'నవ్వు, మా కుద్ధృతి వానివల్ల నెసుమీ' యం చాగురుం డంచిటుల్॥

క. చేరిచి కొని నమదృష్టియె యారఁగ
నాంగ్లంబు సంస్కృతాంధ్రిగ్రంథాల్
నేరుప సలక్షణముగాఁ
గూరుపగణితమ్ము నందుఁ గొన్నిటఁ దెలివిన్. 12

క. వారలలో నష్టకమెయిఁ గెరిచి దిగ్గంగఁ దగిన తేఁకువ కలిమిన్
గోరిన కవనవిధానము సేయఁగ గణితాగమమ్ము నియమా
దికముల్॥ **13**

ఆ. చేయఁ దాను సుతుఁడు చేయింప నవధాన
‡ ముల నటాశుకవనములను జెప్ప
జాతకాంశములను నాతనయుఁడుఁ దా, ను
పూర్త భాగ మట్లు మొనర నేర్చె. **14**

---

‡ శ్రీ పురుషోత్తమకవీంద్రులు
నిజశిష్య వితతికిఁగ జపుకొలకు

వారి 48 వ యేటఁ జేసిచూపిన యష్టావధానములందలివి :

శా॥ శ్రీరాజిల్లెడి మోముగల్గు వరదా! శ్రీ వారిరుడ్భాస్కరా!
సారాధ్యారి వశాగ్ని! సత్త్వ గుణ భాస్వద్రూప పుష్పంబకా
కారా! విశ్వ విరాజమానయశముం గైకొందు నీ వెల్లెడన్
రారా నన్నిటఁ దేర్చ, రక్షితమరుద్రాజా! జగన్నాయకా!

తే॥ చేయునష్టావధానంబు చెప్పగొప్ప
యంతకును మీ యశావయసలరు గొప్ప
మీకు నలవడఁజేయుఁ బౌమిగుల గొప్ప
గెలిలేకుండఁబనిలోనఁ దేలుటొప్ప॥

శ్రీ మేధాదక్షిణామూర్త్యవతారము

సీ॥ దక్షునియాగంబు దర్శింప సతి యేగఁ దా వటవృక్షంబు దరి వసించి
దేవమునీంద్రులు తేజరిల్లుచుఁ జుట్టు చేరంగ వారితోఁ గూరిమిఁ దగ
నటు సతిమృతవార్త నాలకించుచు జట నద్రుని బుట్టించి పగయడంచి
కేవలసత్త్వంపు భావంబు నందుండి యావిధం బెల్లర కపుడు తెలుపు॥
నట్టి యవతారమే దక్షిణాంగుఁ డనఁగ నొప్పు నాతండె జ్ఞానంబు నుద్ధరించె
మాను అది నేర్చి జగములందానియతినెజనులు వర్తిల్లఁ జేయుటల్పానరఁగాదె॥

పరశక్తి—కవిరాజవిరాజితము

గలగలలాడెడి క్రమపుగజ్జె లఖండ నినాదమునం జెలఁగన్
బలుపురుభక్తులు ప్రార్థనసేయఁగ బాగుగ వారల కోరికలన్
లలి సమకూర్చెడి లాగది మా కమలంబుగఁ దేలెడి శాస్త్రములన్
లలితవు నిస్పద నమ్మి భజింతు ఘనంబు యశంబును నాకిడఁగన్॥

## శ్రీరంగనాయకస్వామి

సీ. రాముని నింటఁ జేర్పఁగ విభీషణుఁ డేగి సాకేతపురమునఁ జక్క నున్న
రాజ్యమ్ముఁ జేయఁ జేరఁగ వేగుమన్న నాతఁడు రామదేవుని విడువనన్న
రంగనాథా ! నీవు రహిఁ వెడలితి వైన, నాంజనేయునికృప నాగి లేడ
మమ్ము రక్షింపఁగా నిమ్ముగా నెలకొన్న యట్టి దేవుండవ నట్టితలఁపు॥

కలిగి భజియింతు పెల్లఫు కలుషహరణ !
కలుము లొసఁగెదు బాధ్యతకలదునీక
యనుచు నెందఱొ నిన్నెంచి యనుసరింత్రు
కలియుగంబున రక్షించు ఘనుఁడవంచు॥

## శ్రీ జగద్గురు శఙ్కరాచార్యస్వాములు

సీ. ధర్మసంస్థాపనఁ దాఁ జేయుటకుఁగాను యుగయుగంబులఁ బుట్టుజగమునందు
నీశ్వరుం డంచు రాయొన్నికచూప్వన శఙ్కరుం డిట్టి నశంకరుండు
తాఁ బరివ్రాజకత్వంబుఁ దాలిచి శిష్యు లెల్లరు కొఁగఁ దా నుల్లసిల్లి
సద్ధర్మములు వారి కుదతి నేర్పుచుఁ జరియింపఁజేయుచు సాక్షి యగుచు॥
సకల పరమతముల మాన్పి వన్మతముల నిలిపి వానికిఁ దగునట్టి నిర్ణయములఁ
జేసి యీభూమికై పాటుఁజెందెఁ గాదె స్థిరయశుఁ డాతనిం గొల్తుఁ జిత్తమందు॥

## సుత రచి తావధా నాశుకవితా వితాన గతములు

### శ్రీ హరిహరస్తుతిః

శ్లో॥ కమలాస నాదిమూలం కలశ పయోరాశి కన్యకాలోలం
శ్రిత పోషణైకశీలం కలయే హృది వై జయంతికా మాలం॥

శ్లో॥ అంబి కాలింగి తార్ధాంగ రమ్య స్సోమేశ్వర శ్శివః
అయు రారోగ్య మైశ్వర్యమ్ దత్వా పాయా న్మహేశ్వరః॥

### మాతృవందనము.

శ్లో॥ శ్రీరమా రూపిణీం భాగ్యసంధాయినీం
భారతీభావినీం సద్యశస్సాధనీం
పార్వతీ రూపిణీం సంపదుద్ధారిణీ
మాశ్రయేమాతరం ముక్తికాంతామణీం॥

ఉ. పూతచరిత్రయు య్యురగభూషణు రాణి హిమాచలేంద్ర సం
జాత, త్రిలోకమాత, తత సారసపత్రనిభాక్షి, నిర్జర

వ్రాతకిరీట కాంతి యుత పాదసరోజగ నొప్పు గౌరి, సం
ప్రీతి దలిర్పఁ దోడగు నభీప్సితసిద్ధికి మూర్తికాంత గాక॥

గురు నమస్కారము.

శ్లో॥ ఆంధ్రాంగ్లామర పారసీకయవనప్రఖ్యాత వాగ్వైఖరీం
విద్వద్భిస్తుత బంధగర్భకవితా యోషావిశేషాదృతిం
పూర్వాచారవిశిష్టధర్మపరతాం వైదజ్ఞతామార్యతాం
త్వత్తశ్శ్రీపురుషోత్తమాహ్వయగురో! నాన్యత్రవీక్షామహే॥

ఉ॥ సత్కులమందుఁబుట్టి విలసద్గుణసాంద్రతనందినట్టి వి
ద్వత్కవివర్య వర్ణితుఁడు, తండ్రికి నాదెళ్ల పురుషోత్తమా
ఖ్యోత్కల బంధ గర్భ కవి తోన్నతికి న్నిరమూర్చి మ్రొక్కి యా
ద్యత్కవితాపరిచార మవధానము సెగ్గఁగఁ గాంతు దీవెనల్॥

సభాభినందనము

మ॥ కన దంచత్ప్రతిభావిభాసిత సభాగ్రాసీనుఁ డద్దేవలి
ప్రిణుతానన్య తపఃప్రభావయుత విద్వత్సోమనాథుండు, పా
వనచారిత్రుఁడు నాయదృష్టమున సంప్రాప్తంబు కానోట, వం
దన మందింతును దత్పదాబ్జముల సంధానించి శీర్షంబిదే॥

చ॥ తొలియవధాన మిందుఁ గృతిపూర్వహులైన బుధేంద్రచంద్రు లు
జ్జ్వల కవితాపరిభావ విలసత్కమనీయ యశోవిశాలులుం
గలుగు సభాస్థలంబున నపూర్వ మదీయ కవిత్వవైఖరు
ల్వెలువడ ధారణాబలము విశ్రుతమై తన రారుఁగావుత॥

చ॥ రసమెటులుండుఁగాక, ప్రమదంబగు రమ్యకవిత్వధారతోఁ
బసగలవారియట్టులను బద్యము లల్లఁగ లేకయున్న సా
హస మెటో చేయువాఁడ, నిట నష్టవధాన మొనర్పఁ గాంచి సం
తసమును జెంది మీరు ననుధన్యునిఁ జేయ ననుగ్రహింపుఁడీ॥

పార్వతీపరిణయము.

ఉ॥ పర్వతరాజపుత్రియయి పార్వతినా జనియించినట్టి యా
సర్వచరాచరాత్మిక నపారగృహస్థదశావిరక్తిమై
సర్వితపంబొనర్చుచు నయోన్నతిఁ గాలముఁ బుచ్చుచున్న యా
శర్వుఁడు పెండ్లియాడె, స్మరశస్త్రవికంపిత మానసాబ్జుఁడై॥

ప్రహ్లాదుఁడు.

శా॥ ఆరక్షోధిపుఁడై యొసంగిన హిరణ్యాక్షుండె కన్నట్టిఁడై
యారా! రొంతటి మేటి భక్తుఁ డవుచు న్ప్రాపించన్మహానిష్ఠతో

ధీరుం డాహాదిఁ బుట్టఁజేసె నఁట కౌఁడే ? కంబమం దద్దిరే !
యేరాజర్షుల కింక నెట్టిరుల కి ట్లేర్పాటు కాఁజెల్లునే ?

సూర్యాస్తమయవర్ణనము.

ఉ॥ చేరెను భానుఁ డస్తగిరి చీఁకటిపర్వెను దార లేర్పడెం
బాఱెనుబక్కి లిక్కలకుఁ బాఱులుతీర్చిరి సంజె లంత నం
భోరుహపాళి ముడ్చుకొనిపోవఁగ నందులఁ జిక్కిఁ దుమ్మెదల్
జారులఁ జోరు లందఱును సందుల గొందుల కేఁగ సాఁగఁగన్॥

చంద్రోదయము.

శా. ఆసోముండు నిశాకరుండు కమనీయస్వచ్ఛకాంతిచ్ఛటా
వాస క్షీరమహోధినందనుఁడు, దీవ్యద్వైభవాఢ్యుండు. ధా
రాసారాభసుధామయూఖుఁ డవనీవ్యాకీర్ణ సమ్యగ్ద్యుతి
శ్రీసామ్రాజ్య విశేష శోభితుఁడు చేరెం బూర్వ దిక్శైలమున్॥

పెద్దనగారి కవిత్వము.

చ. నవరసకల్పనంబులను నవ్య మనోహరవర్ణనంబులం
గవిజనహృద్యపద్యములఁ గల్పిత చారు కథాచమత్కృతుల్
చవిఁగొను కృష్ణరాయల ప్రశంసకు నెక్కఁగ 'నల్లసాని' నే
భువి నసమానతం గని కవు ల్తలలూఁపరె ? వాఁడు నేఁటికిన్ ?

బందరునందలి సనాయిపాట.

ఉ. బందరుపత్తనంబున సెబాసనుచుం దలలూఁచి మెచ్చ నే
సంయనఁజూచినం గడుఘనంబుగ మంగళతూర్యనాద మ
స్పందము గా నెసంగెడిని జంగమకోటియు శిష్యకోటియై
యొందఱొ వాద్యకుద్మవుల నెన్నికఁ గాంచుట గానసంపదన్॥

ఫిడేలుతీఁగలు తెగిన గాయకుమనస్థితి.

చ. సరసతమీఱ గాయకుఁడు జంత్రము సుశ్రుతి మేళవించి, గా
నరసముఁ జిల్కుచున్న తరుణంబునఁ దంతులుసాగి వీడెనే ?
పరసతి యక్కు నందవులఁ బాన్పునఁ జేర భుజంగుఁ డంతలో
విరస మెదో పొసంగఁ గడుభీతిలి కాలికి బుద్ధిచెప్పెనాన్॥

భోజరాజు.

చ. అదిసఱ కెందఱే సదయులుండియు, క్షాత్త్రికులంబునందు సం
పదలకు నాటపట్టయిన భారతభూమిని రాజ్యమేలియున్
బుధజనవంద్యులౌచు నల భోజమహీధవునట్లు సత్కవి
ట్పదమును జెందిరే ? బుధవదాన్యత నింతగఁ బేర్మి నందిరే ?

'ద్రౌపద్యాః పాండుతనయాః' అన్నశ్లోకమునకు.

తే. ధర్మభీమార్జును ల్మాద్రితనయు లైదు
గురును ద్రోవది భర్త లౌదురు యుధిష్ఠి
రుండు మాత్రము మఱఁదిగా నుండెఁ జూ సహ
దేవుఁ డట్టులె కాఁడెప్డు బావ సతికి॥

'పొగరు, నగరు, వగరు, తగరు'లఁగూర్చుట.

క. పొగ రుండనట్టితగరును నగరును రాజ్యంబు లేని నరపాలుండౌ
వగరుచునున్నట్టి భటుఁడు తగరుసుమీ గోపసుకవి తతనుతపదవీ!

సమస్యాపూర్తుల మాదిరికి.

క. సంయమన మడుప మేనక సంయోగముఁ గోరి దృష్టి సారింపఁగనే
సంయత గాధేయాఖ్యా (సంయమివరుఁడూఁగెనంట సంసారమునన్.)

ఉ. అంగనఁ బాసి రాముఁ డసహాయుఁడుగాఁ జరియింప వాయుపు
త్త్రుంగని సూర్యనందనునితోఁ జటుసఖ్యము చిక్కె మేలు సే
యం గని వానియాలిఁ గొనినట్టి యధర్ము నెంచి యన్న వా
(లిం గడుబెట్టిదంబగు శిలీముఖ మొక్కటఁ గూల్చెఁబెల్చనన్)॥

క. పతియెదుటఁ దానునిలువం బతకము నవరత్నఖచిత భాస్వరమలర
న్నతి కింపు విధికిఁ గా, భా(రతి యురమున ముప్పదాఱు రంజిలె మోముల్)॥

అవధానాంతము.

క. వినుఁ డార్యుల్ దౌర్భాగ్యనివృత్తికి నే నొనర్చిన వధానమునం
దును లోపము లుండిన నుండనౌను, క్షమియింపుఁడయ్యా నతు లర్పింతున్॥

—♦ తత్కృతాకాశపురాణకథన సందర్భమందలివి ♦—

క. కర మర్థించెద నీశ్వరుఁ గరుణామయు దేవదేవు ఘనశశిమౌళిన్
దరహాసి శాసను శంకరుఁ బరమపదావాప్తిఁ గూర్ప భావ మెలర్పన్॥

చ. ఇపు డొకకబ్బ మేను రచియింపఁగఁ బూనితి శైవసత్కథా
విపులతరప్రభావమును వీనులకింపు దలిర్చు నట్టుగా
నపరిమితాశుధారఁ గవితాదృతిమై, బుధవర్యులార! య
చ్చపుఁ గరుణార్ద్రదృష్టుల ప్రసార మొకింత తనర్చ వేఁడెదన్॥

అందలి పురవర్ణనము.

ఉ. కల దోకపట్టణం బచటఁ గ్రాలెడి సౌధము లేరనూచినం
దుల యిఁక నెచ్చటం గనఁగ దుస్తర మంచు జను ల్వచింపఁగా
నలరెడి, నందు నొప్పెడి ధరామరవర్యులు స్తోత్రపాత్ర ని

మ. అరయ న్నాధుతఁ జేరఁ గాటురికులుం డౌ వేంకటేశుండు, వి
ద్వరసాన్నిధ్యమున న్వధానముల, నభ్యస్తంబుగాఁ జించినా
డ రమద్వేంకటరత్న ముఖ్యులను గొంట న్దా ర్వధానంబు లిం
క రచింపంగను జూపఁ జిల్లరిగెయోగానందు వాగ్ధారయుక్॥ 15

శా. జ్ఞానం బన్నిట వృద్ధిఁ జేసికొను కాంక్షం దాఁ గలాశాల, దు
ర్గానాగేశ్వరధీమణి న్మహితుఁ గోరాడాన్వవాయుం గనం
గానౌసూనుఁ డధీతశాస్త్రచయుఁడై గ్రంథంబు సంధింప ని
ద్దానిం బూని రచింపనయ్యెను బరీధావి న్గురుస్తావముల్॥ 16

నాటక కళావిమర్శనము,

తే. పద్య గద్యాత్మకమ్ములై ప్రబలినట్టి
నాటకాలందు నాట నానాఁట దృష్టి
యూరనూరను సంఘాలు సేరి నేర్చి
యాడఁ దొడఁగంగఁ బెక్కుల నాడనాడ॥ 17

తే. కొంతకాలము జరుగంగ వింతయేదొ
వెడల "స్వర్ధయా వర్ధతే విద్య" యనుచుఁ
బోటికాండ్రయి వెలయింప నాటకాలు
గోరఁ దానందు న్యాయాధికారియౌచు॥ 18

---

స్తుతి ఘనపాండితీగరిమతో విలసిల్లుచు శిష్యకోటికి
న్సలలిత ఋగ్యజుస్సులను సామ మథర్వము బోధసేసి, ని
శ్చలమతి శాస్త్రచర్చలను స్నాన జపాదిక నిత్యనిష్ఠలం
గలుషవిహీనమార్గములఁ గాలముఁ బుచ్చుచు నుందు రంగుఁ, బ్రో
జ్జ్వల దురుధైర్యసాహస లసత్కృతిపూరిత భూరి భూమిమం
డలు లగుక్షత్రవంశజులు నైజపరాక్రమ మెన్న నెల్లదు
ష్టులఁ బరిమార్చి శిష్టుల విశుద్ధత నిల్పఁగఁ జోడు గాఁగ, వై
శ్యులు క్రయవిక్రయంబులను జొప్పడ సెప్పుడు, నోర్మి హైఁ జతు
ర్థులు వ్యవసాయకర్మమున దోహల మందుచు నుందురయ్యెడన్॥

ముగింపు.

క. ఏదత్తదాస్య కృపచే మీదరి వాక్సిద్ధిఁ గొలిపె మేధాన్వితుఁడా
సాదరమతి దయఁగూర్చిన శాదరి పురుషోత్తమార్య! నతులివె, జనకా.

తే॥ పెక్కు రందలి రాగాల వెక్కసంబు
హావభావాల మఱపింప నైన తెఱఁగుఁ
బద్య మాదాఁకఁ దా నన్యపాత్ర మపుడు
తనది కాదని మిన్నకుండను నడియును॥ 19

తే॥ కూడని వవందుఁ గవిలోటు కొంతయుండ
దర్శకులయేని దాని దిద్దం గనమియు
నట్టు లుండఁగఁ బాత్రంబు లర్థ మెఱిఁగి
నిర్వహింపమి రసమిందు నిలువదెందు॥ 20

తే॥ ఇద్ది యిటులుండఁ గొందఱు ప్రేక్షకులట
'వన్సుమో' రని యేదేదొ పాడఁగోరి
యంతరాయాలఁ గల్పించు నట్టి తెఱఁగు
నాటకోద్దేశ మున్మూలనం బొనర్చు॥ 21

ఆ॥ పల్కునెడి రచయిత పాత్రంబుతోనయి
భూమికను ధరింప నామెయి నయి
మఱవి పాత్రధరుల నెఱిఁగిన ప్రేక్షకు
లొప్పినపుడె రసము లుప్పతిల్లు॥ 22

క॥ అనిమొదలిడి తన యనుభవ
ము నుపన్యాసాలఁ బల్కి ముందివి సవరిం
చిన నాటకకళ యింపవు
నని బోధలసల్పె నాతఁ డాయాచోట్లన్॥ 23

రచనలందలి క్రొత్తబాటలు

తే. 'వేద' చోదిత పాత్రమై పేరిగాఁడు
దేశదేశాల వెలయ 'గిరీశ' ముఖులు
క్రాల 'సాక్షి'గఁబుట్టి జంఘాలశాస్త్రి
కాకలా లింక గ్రామ్యాల కాకరాలు. 24

తే. కాఁగ స్వాతంత్ర్యపథ పురోగాములైన
వంగదేశ 'రవీంద్రు'ల వంకఁ గాంచి
పూర్వరవివర్మ చిత్రితంబులను డించి
భావవీథుల కెగుర నుపక్రమించి॥ 25

తే. రాచబాటల వీడి యథ్వాడఁ గడఁగ
నేకలమ్ముగఁ గొంద ఱథ్వాఁక లుఱుగ
నిర్యతిప్రాస రచనైక నిరతికలుగ
ఖండకావ్యాల 'సాహితు' ల్గడలఁదొడఁగ॥ 26

మ. విపరీతంబుల బాటలం జనుటనే ప్రీతు ల్విసాళింపఁ బీ
ఠపురాధీశుల సన్నిధిం గవులజంట న్రామకృష్ణాఖ్యులం
దపు డుత్పన్నములైన భావములు పద్యావ్రితమై 'యాంధ్రిక
వ్యపరాధంబులు'నా బయల్వెడలఁ గోపావేశదం బద్ది కా॥ 27

మ. తనకుం దోఁచినమై విమర్శనము మేధాదక్షిణామూర్తి శా
స్త్రి, నయోద్బోధక శక్తి నెక్కొన నొనర్చెం బాడితాసీకముల్
‡ కని, య 'య్యాంధ్రికవిప్రశంస' యుచితజ్ఞత్వంబును న్యుక్తియు
క్తిని గొండాడుట సంఘటింప ముదమొందె న్బుత్రిద్వారంబునన్

---

‡ 'ఆంధ్రకవిప్రశంస'ం గూర్చినవి కొన్ని.

'ప్రథమాస్థానకవులు' 'శతావధానులు'

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కడియం

...ప్రత్యక్షరమును జదివితిని. ధార సర్వాత్మనా మీ తండ్రిగారి యందలి భక్తిని స్ఫురింపఁజేయుచు హృద్యముగా నున్నయది ఖండన విషయకమగు సూక్తులు యుక్తియుక్తములై కడుఁ జక్కఁగానున్నవి. తత్పోషకవిషయకమగు పద్యముకూడఁ జాల సరసముగ నున్నది. ఆ పద్యమున వాడినసామెతయేమి యితరస్థలముల వాడినసామెతలేమి మనోహరములుగా నున్నవి. కవిత్వము నిర్దుష్టమై సంస్కృతాంధ్రవ్యాకరణముల హద్దుల మీఱకయే యున్నది...

శ్రీ వడ్డాది సుబ్బారాయఁడుగారు, రాజమహేంద్రవరము.

సర్వసామాన్యముగాని కవనసామర్థ్యమును భగవంతుఁడు తమకుఁ బ్రసాదించినందులకు దానిని దుర్వినియోగము చేయక కృతజ్ఞతా ప్రకటనార్థ ముప

యుక్తము గావించి సార్థక్యము నందించినందులకయి మిమ్ముఁ గొనియాడు చున్నాను.

'అవధాని శిరోమణి' శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు, గుంటూరు

మీ పొత్తమును బూర్తిగఁ జదివితిని. 'కవిబ్రహ్మ' యనఁదగు మహామహులయెడ నొరు లొనర్చిన యపరాధము చక్కఁగ నిర్మూలింపం బడియె. కడు సంతసించితిని.

శ్రీ భమిడిపాటి సూర్యనారాయణ శాస్త్రిగారు, తుని.

తావకీనంబగు 'ఆంధ్ర కవిప్రశంస' నామూలాగ్రముగ శ్రద్ధతోఁ జదివితి. అయ్యది యనర్గళధార కలిగి యతిమనోహరంబై తత్కర్త మేధాదక్షిణా మూర్తియే యగునని వేనోళ్లఁ జాటుచున్నది...

శ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు, అనంతపురం.

మీ విమర్శమయిన 'యాంధ్రకవిప్రశంస'ను జదివి మిక్కిలి యానందించితిని. అందును బోతరాజునుగూర్చి వ్రాసినపద్యములు మఱి హృద్యములై యున్నవి. మొత్తముమీఁదఁ గవితాశైలియుఁ జాతురియు మీ భావికవిత్వ విభవమునకు సూచకములై నాయుల్లమలంకరించినవి...

శ్రీ జనమంచి శేషాద్రి శర్మగారు, మహాకవులు, కడప

తమరు కరుణాపరతంత్రమతులరై పంపిన 'ఆంధ్ర కవిప్రశంస' యను పొత్తము నంతయుఁ జదివితి. తమపద్యములు సత్కవిమణి-మనోహృద్యములు.

పూర్వకవులయందుఁ దమభక్తి ప్రశంసనీయము. తమప్రయత్నము శాశ్వత యశోదాయకము. పరులదూషించుటకుం గాక, ప్రాచీనకవులయందు ద్వేషముగల వారి వాక్యములు నిస్సారములని లోకులకుం దెల్పుటకుఁ గాఁ దమ రారంభించిన యీ గ్రంథము సన్మనోహృద్యము కాదని యెరనఁగలరు? తమరు 'చిన్నవాఁడ'నని చెప్పుకొంటిరి గాని పాండిత్యమునఁ గడుం బెద్దవారలే. మన పెద్దలఁ బోలిన వారలే. తమ యీ ప్రయత్నము తము కనంతశ్రేయస్సు నొదఁగూర్చుఁ గాక.

కావ్యతీర్థులు 'పురాణతీర్థులు,' కళ్ళికోట కాలేజిపండితులు.

శ్రీ నేమాని వేంకటనరసింహ శాస్త్రిగారు, బురంపురము

తమరు దయతోఁ బంపిన 'ఆంధ్రకవిప్రశంస' అను గ్రంథరాజ మందినది. సాంతముగాఁ దిలకించితిని, మీకవితాశైలి మిక్కిలిమనోహరముగా నున్నది. అందలి యభిప్రాయములు పండితాదరణీయములు, 'కవులయపరాధము'లని పేరిడి హాస్యరసావిర్భావమునకుఁ బాటుపడిరి. కాని హాస్యరసాభాసము కలుగుచున్నది, కవులు విశాయకునిఁ జేయఁబోయి వానరమును సృజించిరి.

## శ్రీ కేతవరపు వేంకటశాస్త్రిగారు విశాఖపట్టణము.

తమ రంపిన 'ఆంధ్రకవిప్రశంస' అను పుస్తకముఁ జదివితిని. శైలి మిగుల బాగుగానున్నది. విషయము శ్లాఘాపాత్రము. గురుతుల్యులును మహానుభావులు నగు పూర్వకవీంద్రులను ధిక్కరించిన జంటకవుల తుంటరితనమును లోకమునకు వెల్లడించి తత్కవిచంద్రుల గౌరవము కాపాడిన మీయుద్యమమువందనీయమైనది.

## శ్రీ జి. రామశాస్త్రిగారు, హైస్కూలు ప్రధానపండితులు, చిత్తూరు

తమరు పంపిన 'ఆంధ్రకవిప్రశంస' అను గ్రంథమును నే సామూలాగ్రముగాఁ జదివి యానందించితిని. అందలి శైలి ధారాళమై యతికఠినంబును పేలవంబును గాక, మృదుమధుర పదభూయిష్ఠమై పండితపామర హృదయంగమముగ నున్నయది. సమయోచితంబుగ లోకోక్తులఁ బ్రయోగించుట యెంతయు శ్లాఘ్యము. ఇత్యాది పూర్వాంధ్ర కవిపుంగవుల నిజస్వరూపమును బ్రకటించుటయె కాక, వారియెడఁ దమకుఁ గలపక్షపాతమునుగూడ స్పష్టపఱచుచున్నది.

## శ్రీ చింతలపల్లి నరసింహశాస్త్రిగారు, హైస్కూలుపండితులు, బళ్లారి

నా మిత్రులును నేనును సాంతముగాఁ జదివి కడు సంతసించితిమి. తామొనర్చిన యీ కవిప్రశంస యెంతయు సముచిత భంగి నున్నదని భావించుచున్నారము... ఎల్లప్పటికిని దమకు దైవ మిట్టి నిష్పాక్షికబుద్ధిని బ్రసాదించుఁగాత మని ప్రార్థించుచున్నాఁడను.

## శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు 'అభినవసరస్వతీ' పతులు

మీరు చేసిన విమర్శమును సమగ్రముగా రెండుపర్యాయములు చదివితిని. ...తుంటరి పద్దెముల కన్నింటికిని మీ పద్యములు కంటకములయియే కానవచ్చెడిని. శైలి నాతికఠినమయి... చక్కని రసపుష్టియు శబ్దాలంకారములును శ్లేషలును గలిగి కవికర్ణరసాయనంబై యలరారెడిని, తలచు ప్రాచీనుల పోకడలు కానవచ్చెడిని... ప్రౌఢములగు రసవత్ప్రబంధముల మీరు వ్రాయఁగలరని నా యభిప్రాయము.

## శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు, విద్వద్విమర్శకులు, తిరుపతి

భవజ్జనకుల చతుర్విధ కవితా ప్రావీణ్యము గణపవరపు వేంకటకవిప్రౌఢిమతోఁ దులఁదూఁగుచు నెంతయుఁ బ్రమోదావహంబైతనరారెడు. ఇక్కాలంబున నేతాదృశ ప్రౌఢకవిత్వ రచనా ధౌరేయులగు కవినాథు లున్నారని మనంబున నిబ్బరంపు టబ్బురంబు గదిరెడు.

మీ కవిత్వ మన్ననో, సరసమనోహరంబై యొప్పారెడు. మీ 'యాంధ్ర

క. వారు నిరుత్తరు లౌటయుఁ దీఱుట
నా కృష్ణకవియు ద్వేషం బెందే
నారయఁగ లేనిదాట, వి
చారముఁ దన్మూర్తికి నందు సమయమునందుఁ॥ 29

క. ఆ 'శంస' గని 'ముహూర్త
§ ప్రాశస్త్య విచారచర్చ' పట్టునఁ గనరా
నా 'శతవధాని' 'రామ' మ
హాశయు నత్యంతమైత్రి నారయ సుతుఁడుఁ॥ 30

ఉ. శ్రీయుత కృష్ణమూర్తి కవిశేఖరుఁడయ్యెడ గ్రామ్యవైరి 'వ
* జ్రాయుధ' పత్రికా ప్రకటనార్థ మెదే న్నుతకర్తృకంబుగాఁ

---

కవిప్రశంస'యుక్తియుక్తమైయత్యంత పండితలోక ప్రశంసార్హమైయున్నది మీ 'ముక్తికాంతామణి'భక్తిరసభరితము మనోజ్ఞమునై యలరారెడు. శ్రీశంకరవిజయమునకు మీరు వ్రాసిన పీఠిక మీ పాండిత్యవిశేషమునకుం దార్కాణమై నిష్పక్షపాతముగాను సమంజసముగాను విలసిల్లుచున్నది...

§ గ్రంథకర్తృ విరచిత జ్యోతిష విషయ విమర్శన సందర్భ మందని

* "కవిసార్వభౌమ" శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి
'ఆస్థానకవి' పదప్రాప్తిసందర్భపువి.

మ. ప్రకటానర్గళ వాక్ప్రచారముల నాంధ్రఖ్యాతలంబంబుఁ గౌ
శిక గోత్రుం డెవఁ డెన్నిక న్బడసె నాశ్రీప్రాద వంశ్యుండు, కృ
ష్ణ కవీంద్రుం డిల మన్కి నందుకతి, 'నాస్థానంబునం దెక్కె నే
డ్తోకఁ ద్వాఁదవు నెట్టు? అన్న, నగునే! యాఁబ్రాఁకే యాఁగించిరా॥

మ. ఇతిహాసంబు లవెన్ని యన్నియును దానే పల్కె వేవృద్ధు, త
న్మతిమన్ముఖ్యునిఁ గాక యాంధ్రమున సమ్మాన్యుండుగా నెంచ, నం
చిత వాక్ప్రౌఢిమ లెన్నియున్నఁ గవితా శ్రీపాదులే యైనఁ, గీ
రితి కెక్కన్, స్మృతి కెక్కనౌనె? చరితార్థీభూత మిట్లౌటకున్॥

మ. ప్రతిభాదృష్టుల రెందు లేనిలఁ గవుల్ భాషాంగనా సేవకుల్
వెలకం గృష్ణునికెక్క ఁజతోశని నే విశ్వంభరం బందునే?

జేయు మటన్న ప్రేరణను జెందిన తత్సుతుఁ డంపె నింపు సొం
‡ పై యలర స్వీయనూత్నముల నన్నిటి నెంచు 'యశో విహారముల్'

క. అవరుసనె సాంఘికముల
నేవే వ్రచియింప సుతుని నెపరో కోరఁగా
‡ భావిత 'దశమగ్రహ తా
రావళి'ము వ్రాసియుంటఁ బ్రకటన కోసఁగెన్ ॥ 32

---

శత శాస్త్రైకవిధాత, యాంధ్రకవితా సామ్రాజ్య పట్టాభి షి
క్తతనుం బద్యసహస్ర షష్టిక మహాగ్రంథంబు సంధింపఁగన్ ॥

మ. పటు వాక్ప్రౌఢిమ మింపుఁ జెంపెసఁగ, విద్యద్వర్ణ్య వాగ్దేవతా
నట నోద్దీపిత సత్ప్రబంధ రచనానందంబు నందించు ను
ద్భట సత్కీర్తిసుధా నిధానమగు నా ధన్యుం గవీడ్గణ్యు వేం
కటయ జ్యాగ్రతనూభవు న్నిలుపుట న్గణ్యంబు పేరంబగున్ ॥

మ. 'వికృతి' న్నేఁడిటు లగ్రపీఠమున నీ విద్యావయోవృద్ధునిన్
సుకృతి న్నిల్పుట వైకృతంబునఁ గృతు ల్సొంపారఁగాఁ బల్కునో!
ప్రకృతం బేమవుఁగాక, యీతనికి దీర్ఘాయుస్సు నారోగ్యమి
చ్చి, కృపాళుండు పరాత్పరుండు మనుచు న్సిద్ధింప నిష్టార్థముల్ ॥

నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రి

‡ —♦ 'తారావళీ యశోవిహారము' లను గూర్చి మాదిరికి ♦—

శ్రీ శ్రీ జయపుర సంస్థానాధీశులు నాంధ్రోత్కల గ్రంథనిర్మాతలు,
శ్రీ విక్రమదేవవర్మ మహారాజేంద్రులు.

పండితకవి మహాశయా! తారనుగ్రహించి యంచిన 'యశోవిహారము' ను 'దశమగ్రహ తారావళి'ని సంపూర్ణముగాఁ బఠించి పరమప్రీతుండనైతిని. అవి యతిసమంజసముగ రచింపంబడియున్నవని వ్రాయుట బాహుళ్యమాత్రంబు. అందును 'దశమగ్రహ తారావళి' నామనమును హెచ్చుగా నాకర్షించెను.

శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు, విద్వద్విమర్శకులు, మైసూరు.

మీ 'దశమగ్రహ తారావళి' యేకకాలమందు నవ్వును విషాదమును గలిగించుచున్నది. 'యశోవిహారము' కవితా మాధుర్య పూరితము. ప్రాచీనుల శక్యమైన పరిశుద్ధమైన శైలి. ఇవి చాల సంతోషమును గలిగించుచున్నవి.

ఆంధ్రభాషాయోషా భూషణములు

సీ. నన్నయ్య మల్లికా నవపుష్ప దామంబు
　　　　నెగడింప సోమాసి పొగడదండ
యెఱ్ఱన్న నడుమను హేమపుష్ప మమర్ప
　　　　నాచనసోమన్న నాగమల్లె
శ్రీనాథ కవిరాజు చేమంతి బంతులు
　　　　పోతన్న మాలతీ పుష్పచయము
నలసాని పెద్దన్న చెలువమైన గులాబి
　　　　కృష్ణరాజేంద్రుఁ డాక్షేటమాల॥
　　　　తే. తాను దిమ్మన పారిజాతముల గములు
　　　　　సూరకవిమాళి పున్నాగ సూనతతులు
　　　　　తనరఁ గూర్పఁగ మూర్తి దొంతరహసంతు
　　　　　లలరుజొంపాల నింప నీయాంధ్రజనని॥　　　33

సీ. కంజాత కుముదాచ్ఛ కైరవ కల్హార
　　　　కుటజ కురంటక కురవకములో!
మందార కరవీర సందోహ కేతకీ
　　　　పూతి కాష్ఠాకర వ్రాతములో కో!
హాటక శివమల్లి కాంగారవల్లికా
　　　　పల్లవ ప్రోల్లస ద్వల్లరులో కో!
వంజుల మంజరీ కింజల్క సంజాత
　　　　పుంజీభవ ద్రమ్య పుష్పచయమొ!
　　　　తే॥ పాదపూజల నర్పింప వారువీరు
　　　　　గుప్ప నిర్గంధ కుసుమాళి కుప్పలువడి
　　　　　నందు నైట్క్వీన్లు డేక్వీన్లు నందములన
　　　　　గుడ్డపూవులు కాగితా ల్డొడ్డవనఁగ
　　　　　మునుఁగఁ జొచ్చిన వీనిలోఁ దెనుఁగుతల్లి॥　34

బంధ గర్భ కవితాసంధిత్స.

సీ. సుకర లబ్ధంబులౌ వకుళంపు నికరముల్
దండలుగాఁ గట్టుచుండు నింకఁ
జిత్రవర్ణానేక శృంగారగుచ్ఛంబు
లోపిక దీపింప నొప్పఁజేయు
నెవ్వనికందని వెవ్వేని తానంది
కొని పుష్పమాలిక ల్గూర్పఁదొడఁగు
మాకంద మిదియన నాకంద మందందు
‡ సంధించు 'చారామ సరణి' నింపు॥

తే. నింపు సొంపులఁ దొలికింప నివతళింప
* సంపదలఁ బెంప నెనయు కృష్ణాస్రవంతి
తుంపురులఁ గప్పి యర్పింప జొంపములుగ
నుత్తముల కాస్క భవుఁ జేర్పనందుఁగేల॥ 35

సీ. సాధిత షట్క్రియా సహిత ప్రాణాయామ
కలిత యోగాభ్యాస విలసనములు
ఘనపాతితను-జెందఁ గనుపాటును విలోమ
పఠ నాతురజ్ఞాన పాటవములు
పల్లవి నటునిటు పాడుట ల్గాటల
తరబడిఁ గావించు తానగతులు
గంతలపందెము లరిడీల చందముల్
త్రాటిపై నడకల వాటములును॥

---

‡ (అకు + అందము) అనువర్థమున 'ఆరామ'మై, కందపద్యార్థమందు 'రామ సరణి' గాఁగా గ్రంథమంతయుఁజతుర్ముఖి కందములతోనే శ్రీరాముంగూర్చిన షట్కాండములకథ నీ శ్రీ పురుషోత్తమ కవీంద్రులే వ్రాసిరని.

* తత్కృత 'కృష్ణానదీ మాహాత్మ్య' స్ఫురణము.

బంధగర్భ కవిత్వవిలసితములం గూర్చి

శ్రీ శ్రీ విక్రమ దేవవర్మ మహారాజేంద్రులు, విశాఖపట్టణము.

కవివర్యులారా! మీరనుగ్రహపూర్వకముగాఁ బంపించిన 'చతుర్ముఖి

తే॥ నెట్లొ బంధగర్భ కవిత్వ మట్టె యొరుల
కబ్బురం బిడునంతగా హర్ష మిడమిఁ
దా నెఱింగియుఁ 'జిత్రరత్నాకరము'ల
'మల్లికార్జున సంస్తుతు'లల్లఁ గనెడు. 36

---

కందపద్య రామాయణము' 'చిత్రకంద రత్నాకరము' 'శ్రీ మల్లికార్జున శతకము'ను బఠించి కడు ముద మొందితిని. అవి చిత్ర కవిత్వ భరితములై యాంతరికరసపూర్ణములై పాఠకచిత్తముల నాకర్షించుచు నాంధ్రసాహిత్య సరస్వతీ కంఠమందలి ముత్యాలసరములు వోలె నొప్పుచున్నవి. వాని రచనకై తా మొందిన శ్రమమునకుం దగుఫల మీలోకమునం దమరు కోరకున్నను బరలోకమున లభించుట నిక్కువము.

శ్రీ రాళ్లపల్లి అనంత కృష్ణశర్మగారు, మైసూరు

శ్రీ పురుషోత్తమ శాస్త్రిగారి గ్రంథములు వారి యపూర్వ మేధాశక్తిని జాటుచున్నవి. ఈ కాలమం దింతపరిశ్రమ కోర్చి చిత్ర కవిత్వరచనకుఁ బూనుకొను వారును, పూని నిర్వహింపఁగల వారును అరుదు.

శ్రీ కాశీభట్ట బ్రహ్మయ్యశాస్త్రిగారు 'విమర్శకాగ్రేసరులు' కాకినాడ

ఆర్యవర్యా! మీరు దయతోఁ బంపిన రెండు పుస్తకము లందినవి. చూచి యానందించితిని. 'మల్లికార్జున శతకము' మృదుమధుర శైలితోడను సద్భావములతోడను బ్రస్తుతకాల స్థితిగతులఁ దెల్పుచుఁ జాలహృద్యముగా నున్నది. 'చతుర్ముఖి కందపద్య రామాయణము' చిత్రగతుల వలరారి మనోహరముగనున్నది.

శ్రీ కూచి నరసింహం పంతులుగారు, పిఠాపురము

కవిపుంగవా! తాము దయతోఁ బంపిన చిత్రకంద పద్య రత్నాకర' మందినది. ...శిరోభ్రమణ రోగపీడితుఁడనై యున్నప్పటికిని వచ్చిన వెంటనే పుస్తకముఁజదువ నారంభించితిని. ద్విత్రి చతుష్పంచప్రాస పద్యములు మిగుల మనోహరములుగా నున్నవి. సుప్రసిద్ధాధునిక మహాకవి వర్యులరగు మీ గర్భబంధకవిత్వ మద్భుతావహము.

శ్రీ కొత్తూరి వేంకటశాస్త్రిగారు. కాపవరం

గురు వర్యా, తమరు దయతోఁ బంపిన 'మల్లికార్జున శతకము'ను జతుర్ముఖి కందపద్య రామాయణమును వందన పూర్వకముగాఁ గైకొని చదివితిని. సుధీహృదయంగమములౌ, వానియందలి గర్భకవితా నిర్మాణప్రౌఢియు, మల్లికార్జున శతకములోని ప్రస్తుత కాలస్థితిని దెల్పు వివిధాంశ వర్ణనములును స్తోత్రపాత్రములై

క॥ ఆమ్రేడిత సత్కీర్తిని ధూమ్రితఁ గనమిని 'సరస చతుర్విధ కవితా
సామ్రాజ్య ధురంధరు'లని కమ్రిత యందెంచు విబుధగణ్యులు
వాగడ॥ 37

మ. ధర విద్వన్మణు లీషణత్రితయ జేత ల్మోక్షమార్గైక సు
స్థిరు లయ్యు న్భవదీయ సత్కృపను సాధింపం బ్రయత్నింప మా
నరు లే, మానరు లేసమర్థతల నెన్న న్లేమ, లేమా! భవ
త్కరుణాదృగ్భవ మోహపాశముల లోఁగంగా, యశఃకామినీ!

---

యున్నవి. 'గిట్టుబాటుం' గోరని తమఘనకృతు లీశ్వరానుగ్రహంబున సమ్య
తోత్పాదకంబులగుఁగాత.

శ్రీ కలువలపల్లి రంగనాథశాస్త్రిగారు, ఏలూరు

కందగీతగర్భిత చంపకములు

వినుపురుషోత్తమా! కవనవిద్వర నీశతకంబుఁ గంటిఁ బా
వనచరితా! సుధీకవి! భవా దృశు లేయెడఁ గానఁ జూవె, యీ
పని ధర నిట్టులం దివిరి బాపురె! యన్యులకు దీర్పలేఁడు, బు
ద్ధిని దలఁప న్మహాచతురధీనిధి! దిట్టవు జాణ వీవెగా॥

గీ. చిఱుత ప్రాయము నుండియుఁ జిత్ర బంధ గర్భ కవితా వినిర్మితిఁ గోశలంబు
బుద్ధి బల్మి గడించిన ప్రోఁడ వీవు పూరుషోత్తమకవి నీకుఁ బోల్కి యెవరు?

మ॥ కవి యొకొక్కఁడు తారచించెడు మహాకావ్యంబునం గోవిద
స్తవనీయంబుగ బంధ ముఖ్య కవితా చాతుర్యముం జూపున
ప్పు విచిత్రార్థము వ్రాయుఁబద్యములు రెండో మూడొ, యీవారయుణ్ణ
లవలేశంబు శ్రమంబు లేక కృతి యెల్లన్సల్పు దోసత్కృతీ!

హిందూ సుందరీ పత్త్రిక, కాకినాడ

1 చతుష్కఖి కందపద్య రామాయణ 2 మల్లికార్జున శతకములను కృత
జ్ఞతా పూర్వకముగా నందుకొని సాంతముగా వీక్షించినారము.

అభూతపూర్వములు అసాధారణములు నగు నిట్టి గ్రంథములఁ గాంచుట
దియే ప్రప్రథమము... ఆరచనానైపుణ్యమా కవిగారికిని, వారి కట్టి మేధాశక్తి
నొసంగిన పరమేశ్వరునకును దక్క నితరులకు బోధపడదు... అది యసమాన

మ. స్థిరలో నన్యము సర్వ మస్థిరము, సాధింపంగ నీ పొత్తు సు
స్థిరతం గాంచఁగనౌ నటంచు, మది నాసింప న్నినుం జేరఁజూ
తురు మిన్న, ల్జను లెన్నఁగా గరిమ మొందుం దారు గన్నార్తలై
న, రమ ద్వైభవ మొంచ, నీయది యనన్యంబౌ, యశఃకామినీ!

ఉ. స్వైర విహార ధీర, వయశం బిలఁదేజము నంధ మట్టులే
సారెకు వెంట నంటఁ గొనఁజాలుకు వర్థుల నెం, దనర్థ లే
సారఁగ, నంధతాప్తి నయశః పరికల్పిత కిల్బిషోద్ధృతిన్
జారుత నెందుఁ గందువౌ, యశంబ! నిజం బదనన్య వేద్యమా.

ఉ॥ ఏయెడఁ దేటతెల్లులనె యింపులుగుల్కఁ లగించుకూర్పు సొం
పై యలర న్వచోనిచయ మందపుఁబొందిక నందుచందముం
బాయమినొప్పు నొప్పయిన వర్ణనము ల్రసముప్పతిల్ల, జా
తీయము లెన్నొ సామెతలుఁ దియ్యఁదనంబును బెంపు సేయఁగన్॥

మ॥ పదపద్యమ్ముల గద్యసంతతులఁ జెప్పన్నేర్చియు న్హాస్యసం
పద పెంపైతగఁ భారకావళిని దన్పంజాలి తత్తద్రసా
స్పద భావోదయ వీచికానిచయ సంచారంబునం దద్భుత
ప్రద బంధంబులు గర్భసంధు లన్యగ్రావంబు ల్సృజింపంగనే॥

ఉ॥ ధారకుబంధకమ్ము కవితారుచిరత్వపుఁ గుందకమ్ము, నా
నారస భావ బంధుర కనత్కమనీయత కంధకమ్ము, వి
స్తారనిబంధకమ్ము, కృతితంత్రి గుణార్పితవందకమ్ము, వి
స్ఫారవిహారనందకము, బంధము భాషకుఁ దుందకూపినాన్॥ 43

---

పాండిత్య సమర్థిత మనియు నద్భుత పరిశ్రమ ఫలిత మనియుం జెప్పక తప్పదు. శైలి సరళముగాఁ బ్రౌఢముగా నున్నది. ఇది యమానుష పరిశ్రమ యనక తప్పదు. అసూయా ద్వేషపూరితులు శాస్త్రాభిమానులు నగు వారెవరైనం దక్కఁ గడమ పండితులైనవారెవరైనను దీనినిగూర్చి సంతసించి ప్రశంసింప కుండరని మా యభిప్రాయము... ఇది నేఁటి కవులకు మార్గదర్శకము. ఇంతకంటె నీ కవిగారిని గూర్చి ప్రశంసించుటకు మాకు శక్తిచాలదు.

చ. ఎఱింగియుఁ గీర్తికాములయి యొందఱు సంధితశేముషీ విస్ఫు
త్వర నిజవైదుషీ ప్రకట బాధుల, భారవి మాఘ ముఖ్య భా
సుర కవితాధురంధరులఁ జూడము ? కుందనమందు నందు శి
ల్పరుచిరత్వం బరఁగు వైఖరు లింపవునట్లు వారికో॥ 44

భక్తిజ్ఞాన మార్గ ప్రతిపాదకత.

చ॥ మతమున బ్రాహ్మమై సమతమానని వేమురి రామకృష్ణరా
డ్విరతగుణోదయుం డొకట వేడఁగ నెల్లరుఁ బాడ నెయ్యెడ
హితమవునట్లు ధ్యేయ మెదియే న్సరిపోవ ననామకంబుగాఁ
గృతిశతకంబుఁ బల్కెఁ, దులకింప లగింపఁగ గానసంగతుల్॥ 45

క॥ పరమశివేంద్రసరస్వతు లరుదా సద్భక్తినెంచి, యష్టావక్ర
స్థిరబోధలఁ దెలిఁగింపంబురికొల్పటనట్లోనర్చె బుధహిత గతిగా

క॥ తానెప్డు ధర్మచింతన మే నెఱపి శివాలయంబు నేర్పడఁజేయం
గానాటను ధార్మికు లా పూనికవర్తిల్ల నెందుఁబ్రోత్సాహకుఁడై॥

క॥ తనరం దమ్మనపిచ్చయ యనుధార్మికుఁ డిచ్చిపోవ నాస్తియదెల్ల
న్వినియోగము ధర్మార్థమునను బరదత్తానుపాలనంబితఁడొప్పె

క॥ కట్టించెను దేవళములఁ బెట్టించెను బాఠశాల వెలయ న్సత్రీ
బట్టులె గోగ్రాసమిడ న్నెట్టించెఁ దదిచ్ఛ మెయి నెనిర్ణీతముగా.

క॥ ఆగుళ్లలోఁ బ్రతిష్ఠలు వేగం గావింపఁజేసి విధివిహితముగా
సాగింప నుత్సవంబుల నేగెం బలుసారు లూళ్ల నెందెం దవికా॥

ఉ॥ ఆసమయంబులం గొన నిజాశ్రవవర్గమునందుఁ జేరి వి
శ్వాస మెలర్పఁగా మెలఁగు సద్గుణుఁ దమ్మనరామకృష్ణయా
ఖ్యాసముదంచితుం గనిన గాసిని దోడయి యొప్ప "ధార్మికో
ల్లాసిని" నెంచెఁ దాఁ బ్రతిఫలంబు రవంతయుఁ గోరకుండఁగ॥

చ॥ అకలుషవృత్తి నాశ్రియము నార్తుల కీయఁగఁబోయి వ్యావహా
రికములఁ దాను జిక్కికొన కెక్కొను సప్పుప్రపక్కి వారిదై
తికమక లందఁజేయ వెలితి న్నురుఁ డంటకయుండ, సండ కో
రక యగు రామకృష్ణునిఁ గనంబుఁ గృతజ్ఞత తోఁప నెంచెదుః॥

**పరోపకార పారీణత.**

ఉ॥ ఈపుడమి న్జనిం గనిన యేతఁడుగాని పరోపకారచిం
తాపరుఁడై మెలంగెడుఁ గృతజ్ఞుఁడు తానవు నందు నాతఁ డా
యాపురుషు ల్ప్రశంసలకు నర్హులుగా నిటువెల్లడించి తా
నాపదలందు నెందయిన నాదరు వయ్యెడు నేరికేనియుః॥ 53

మ॥ ఇఁక శిష్యాదుల మిత్రసంతతులఁ దా నెంచెంచుఁ దోడైన పూ
నిక యున్నంతకె కా కనంతరము సంధింపం దదీ యాత్మజా
ళికి సంబంధిను లేరికైన నిల నిల్పె న్దీపము ల్పెక్కునా
నకలంకంబగు తద్హృదంతరము వేద్యంబౌ జనాదర్శమై॥ 54

మత్త॥ వావిలాల శివావధానుల భ్రాతృవత్సల తాప్తిమై
నే విశేషపదస్థితు ల్గనకెట్టు లోడ్పడఁ జూచినన్
జీవితాంతము నన్వహంబును జేరఁగోరఁ డెదేనియున్
భావితాద్వయభావ సంప దుపార్జితోర్జిత సన్మతిన్॥ 55

**పారతంత్ర్య నిరసనము**

క॥ తనసుతునకు నుద్యోగము లనువుపడంగా శ్వవృత్తి నందందగదం
చనిశంబును బోధించుచుఁ దనియంగలయదియుచాలు ధనివో
దనియెన్॥ 56

క॥ తనజాతకమున భూఫల మనుభూతికిఁ దావులేమినా బాల్యముగా
మనుగడ కాయాదేశము లను బాళ్లేవేవా పడినలాగేయయిన్నన్

క॥ ఒకరికి లోఁగనికరణి మ నికిఁగంపెస్వతంత్రశక్తి నెగడినదనుకన్
బ్రకృతుల వికృతులు పొసఁగం బ్రకటం బదికాకమున్న
వదలితిఁ గదవే॥ 58

క॥ నలుగురి కాదరువై తగఁ బలువురకు న్విద్యఁగఱపబాగా బాటన్
సులపతులని జను లెన్నఁగ నిలిపితి నీ పాఠశాల నీకొఱకెసుమీ॥
క॥ సాగించికొందుగా కిది యాగిన భూలబ్ధఫలము వ్యాపారగతిన్
రాఁగలయది నీకోటిని బాగుగఁ గాన్పించుఁగాన వల దొరుఁ
గొలువన్॥ 60

క॥ అని మానిపించినప్పుడు తన కెట్టులఁదోఁచుఁగాక తనయుఁడు పిత్రా
జ్ఞనెనెఱపనిశ్చయంబుంగననాటయె మేలటంచుఁగడకవియుడిగెన్

ఉత్తమగురుత్వము.

క॥ గురుపదములనుగురుపదములవఱలంగాశిష్యతతులు ప్రాప్తానుస్మృతిన్
దరిఁజేరఁకు ప్రీతిఫలమును సరవిం జేకొనుతలం పెసంగదొకింతేన్.

క. ఎందఱో వకీళ్ళు శిష్యులుకొందఱుమునిసిబులు జడ్జిమాడంగాఁగా
నం దలనిడుమోలు 'కనకసుందరము'క లెక్చర య్యె సుగుణాకరుఁడై॥
క॥ ఎందుఁ గృతజ్ఞుండౌచు నమందపు గురుభక్తిమెఱయ మానితగీతా
* సుందరకాం డాంధ్రీకృతులం దనరిచిభక్తిసూత్రలాలసుఁడయ్యెన్

* (శ్రీ) నిడుమోలు కనకసుందరకృత గీతారంభ గురుపూజ.

క॥ పదియేండ్లపు డే వాంగ్లము చదువఁగ నాసించిపోయి జన్మాంతరసం
పద నాదెళ పురుషోత్తము పదసన్నిధిఁ జేరి సత్యపథమును గంటిన్
గీ॥ కవివరుఁడు, బోధకుఁడు దీనకల్పకంబుజ్ఞాని,వ్యవహారదక్షుఁడు,జ్యౌతిషికుఁడు
ధర్మశాస్త్రజ్ఞుఁ డుత్తమోత్తముఁడు వైద్యుఁ డర్చనీయుఁడు సర్వభూ
తైకహితుఁడు॥

॥ భోజునిఁగనఁగను కవితా భాజనమగు వాక్కుటంచుఁ బలుకుట కథయౌ
నేఁజదువ గురునిఁజేరఁగఁదాఁ జెచ్చెర కవితయబ్బెఁ దథ్యం బిదియౌ॥
క॥ కవితాశిల్పప్రతిభయు శివపూజానియతి ధర్మశిక్షితమగు సం
స్తవనీయ సత్యమార్గ ప్రవర్తనము గురునియందుఁ బ్రత్యక్షము గాన్॥

గీ॥ డెబ్బదైదేండ్లు కీర్తిగడించి ప్రథమ నూటి కెక్కు సుకృతుల నీవాఁటికొకఁగి,
కోటికి న్నిర్మించిన సునీతి గుచ్ఛములిడి రెక్క గాలి దివ్యజ్యోతి [illegible]॥

క॥ ఆసుకృతిని, పురుషోత్తమ భూసురమణి నెదను భక్తిఁ బూజ [illegible], [illegible]
ర్మ్యాసనుఁ, దలంతు. నాతని లో సంగతిఁగన్న గురుఁడు లోకించునొకో!

గీ॥ గురుఁడుచనినను సుతుని సన్మార్గియోగ వరమతిహితమ్ము చెప్పుత [illegible]
శాకృతులఁ దప్పులనుదిద్ది నన్ను దిద్దు దక్షిణామూర్తికవికి వందనము లివియె

క॥ ఈ పాత్రముఁ గడు నోపిక దీపింపఁ బరిష్కరించి, ధీమణి హితుఁడై
రూపింప వ్రాయుభూమిక నాపై దయఁగాదె దక్షిణామూర్తిబుధుల్.

గుంటూరు జిల్లాకలెక్టరుగానుండి ది 13-7-1950 న నస్తమించినప్పుడు
గ్రంథకర్త వ్రాసిన "సుందరోపరాగము"

క॥ గురులకుఁ బురుషోత్తములకు గరువంబుగనూర్చు శిష్యగణమున మణియై
పరఁగు నినుమోల్ కనకసుందర మనెడు కలెక్టరయ్యో! తరలెనె దివికిన్?

క. కనకమె సుందర మగునే? కనకము లేకున్న నగును గద సుందరముల్
గనకము సుందరము న్మెచ్చున కిటుక గనుమయ్య కనకసుందర మనగన్॥

క. అనుపమ గుణాఢ్యుని యొంటను గనకం బన పార్థకంబు కాఁగల్గెఁగదా
మనుపరిగా మననీయక కనకము దిగమ్రింగినావె? గర్తపురంబా!

చ. విను మెవరేదిపల్కిన, వివేచనముం బొనరించి యంతరం
గ్మనమున కేదియోగ్యమగు మార్గముగాఁ బొడకట్టు, దాని నే
యనుసరణం బొనర్చెదు, రవంతయు గర్వమెఱుంగఁ వయ్యయో!
గొనముల ప్రోవు పీవలము కోల్పడి మేమిటు సుందరాహ్వయా॥

మ. సిర నెవ్వైనను నసీరంబ యని తా దేవాలయం బందెనో
పరమాత్మప్రష్ట గుణాప్తి మెచ్చి వారుఁడీభాగ్యంబుఁ గల్పించెనో!
సురలే యెన్నుకొనంగ మాకనకము న్మ్రుత్యుం గొనం గల్గెనో!
గురుపూజ ల్పచరింపఁ దత్పదము దక్కంగాన నిట్లయ్యెనో!

ఆ. వికృతిగాక 'వికృతి' సుకృతులు దక్కనే? ప్రకృతిధర్మమైన వికృతిమాకు
మాత్రిపంక్తి, గీత సుందర కాండముఁ గనులఁ దుడువఁ జదువుకొనఁగనిడితె!

ఆ. ఘనయశుండు మించి జనమంచి శేషాద్రి యరుగుచుండ నుత్తరాయణంబు
నాగనొల్ల కిందు నధికమౌ శివరాత్రి యందు దివికి సాగె సుందరకవి

ఆ. వారి నేలుమయ్య వైకుంఠపురవాస! సత్త్వమూర్తులైన సత్పురుషుల
నీదులీల లోకఁడు నీగీత లొక్కండుఁ బలుక నాత్మశాంతిఁ గొలుపవొక్కొ!

నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి.

మ. హరివంశీయుఁడు నాగభూషణుఁడు ప్రఖ్యాతైకవాగ్గేయకా
ర రమద్రత్నము జంత్రి గాత్రి విభవ ప్రాగ్భారుఁ డధ్యాత్మత
త్త్వ రహస్యాగమవేది శాఙ్కరగురు త్యాగార్య తత్త్వకథా
చర ణోద్దీర్ణ యశోంబు కొల్చెడిని శిష్యవ్రాత గణ్యుండుగాన్ ॥165

---

ది 22-10-32 తత్సమ్మానసమయ గురునమస్కారము

మ॥ తెలుఁగు స్సంస్కృత మాంగ్లవాఙ్మయము హిందీభాష సాధించి, యిం
పులు గుల్కంగఁ దెనుంగు కబ్బములు క్రొంబూఁదేనియ ల్రాలుకై
తలు హిందిన్ విరచించు సర్వసుకళాతంత్రాత్ము నాదెళ్లకం
శ్యలలాముం బుధసత్తము న్గురువరు న్సచ్ఛీలుఁ గీర్తించెదన్॥

శ్రీ గురువరాశీస్సు.

ఉ॥ శ్రీహరి సోమభక్తుఁడు కళీకృతశక్తుఁడు. పిన్ననాఁడె వి
ద్యాహకుఁ జేసి తండ్రి కన, భావిఫలానుగుణైక సాధనో
త్సాహము తోడ్పడం, దెలుఁగు సంస్కృత మింగ్లిషు, గానవిద్యతో
స్నేహమునంది వర్ధిలుచు శ్రేష్ఠతఁ గూర్పఁ గవీశ్వరుండునై
యైహికకీర్తి కిన్నిధగ, నప్పరతత్త్వ రసానుభూతికా
మోహను, మూడుభాష్యముల నోరిమిఁ గూరిమిమీఱ నేరిచెన్
మా హరి నాగభూషణుఁడు మాన్యతఁ దుల్యజవాళి నందు, సం
దేహము లేదు, కాదనఁగఁ దెంపరి యేఁ డొనగూడు యోగ్యతా
వాహులికంబుఁ గన్నపుడుఁ బైఁగను బ్లీడరునైన నప్పు, నా
వాహితుడై సభం దనరు ప్రాజ్ఞులు మేటులు మాదృశాప్తసం
దోహముఁ గూడి, తృప్తిపడి దోహలి యాతఁడు, చెల్లని ద్దటం
చీహ ముఁ ల్కి, దీవెనల నిచ్చెద మెచ్చఁగ మెచ్చె నిచ్చలున్॥

తద్గురుపుత్రికృతాభినందనము

ఉ. ఉర్వి సుఖానుభూతి కగు నొజ్జగ నాతత నాదరూపమై
పర్వ నకారదియై వెలయు బ్రహ్మము పొంగ్య మజాండదృశ్యముల్
సర్వచరాచరంబుల నెసంగుట, రాగమువృద్ధియయ్యె, గాం
ధర్వము పేర్మిఁ గాంచెఁ బ్రథితం బిది కాద జగద్ధితంబులన్?

మ. హరి, వంశంబున, నాగభూషణుఁడు, నృత్యంబందొగిన్ జంత్రగా
త్రిరమ్యద్వైభవమందనై, యుభయ సందర్భంబుఁ జేకూరమిన్॥

శా. ఏ ప్రాక్సత్కృతివల్లనో దరిసి తా నెంచెందు సత్యస్తవి
ద్యాప్రావీణ్యులు వేనవేలపుడు నెన్నై యుంటఁ దా నేకల
వ్యాపారాయు ల్మెచ్చికొంద ఱన్న గురువర్యత్వంబు సద్వర్తనా
దిప్రామాణికతాప్తి రూఢముగ సంచె న్సూరిబృందంబులన్॥ 66

నిష్కామ సంఘ సేవనము

సీ. వేదవేదాంగాబ్ధి వీచీనటద్ధీవ
రాగ్రేసరు ల్పెక్కు రర్థవాంఛఁ
బనపద్యగద్య సంపద్వైదుషీశిల్ప
కీర్తితు లకృతిపరిష్కృతుల నంద
న్యాయవాద్యధికారి తాదిఘనోద్యోగి
తతులు జాతకముహూర్తముల నరయ
ఘనవణి గ్భూప బంధునికాయ మవిగాక
క్రమముగా ధర్మమర్మములఁ దెలియ॥

---

హరివంశంబున నాగభూషణుఁడు, స్తుత్యప్రక్రియ న్యంత్రగా
త్ర రసజ్ఞత్వ మెలర్ప నేర్పడె నహో! ధాత్రీస్థలి న్స్ఫురిమిన్॥

మ. స్తుతిపాత్రుండయి గాత్రపాటవమునందు న్నా ఫిడేల్పల్కునం
గృతహస్తుండు 'తిరుక్కొడి క్కావలపూర్ కృష్ణయ్యరుం' పేర్కొనన్.
జత. సాంగ్లంబునఁ బట్టభద్రుఁడయి ప్రస్థానత్రయంబందుఁ బాం
డితిఁ గాంచెం గవియయ్యె నీతని కిల న్దీటెవ్వరిం జెప్పఁగన్?

శా. గానానందరసంబుఁ గ్రోలి తనియంగా గాయకానీకముల్
తానంబం దను రామనామమునఁ దాదాత్మ్యంబుఁ గూర్చు 'స్వామా
నానా ముత్తమకీర్తిర' స్తన, ననసాధ్య దృక్కులాభిజ్ఞతన్
దా నాంధ్రావని 'భూషణం' బవుటఁ గాదా! కల్గు సమ్మానముల్॥

శా. ఏరాము న్హృది వాక్కునం గృతుల ధ్యానించు నుతించు న్సతం
బారాధించునొ నాగభూషణుఁడు ప్రత్యక్షం బతండౌచు 'శ్రీ
* తారామాకృతి' నీయలంకృతిని సంధానించె, నా త్యాగరా
జారాధ్యుండు తను న్ధరించు కృతి కిష్టార్థంబులం గూర్చుతన్॥

* వరా (తత్సమ్మానము శ్రీ రాళ్లభండి వేంకట సీతారామశాస్త్రి గార్కు
దర్శిత్వ శోభిత మనీషా స్ఫురణము )

తే. నెవరు దరిఁజేర నాదరం బెనయ నిడుచు
* నోర్పుమీఱంగఁ దప్పెల్ల నోర్పెనరుచుఁ
దమలమే న్గొనక గ్రహచారములఁ దెలుపు
నమలబుద్ధిని శాస్త్రదృష్టములఁగొలుపు 67

చ॥ వయసునఁ బెద్దలేయయిన వచ్చినవారలు పిన్నలైన, నెం
తయు ధనసంపద న్గనినఁ దారు దరిద్రతఁ గందుగాక వి
ద్దెయు నధికారము న్గనిన, దేనినిఁ గాంచని హీనులైనఁ దా
నయము నయంబుఁ గొల్ప నరయందు మది న్లవమేని భేదముల్

సీ. అవధానములయందు నాయాయిసభలందు
నగ్రాసనాధిపత్యము వహింప
నఖిలసాంఘికములం దాయాకళలయందు
భక్త్యాదులందు నుపన్యసింప
నాగమోదితములౌ దాయావిధులయందు
రీతు లారయుచుఁ బరిష్కరింప
నభియోగములయందు నాయాతగవులందు
హితపడ మధ్యవర్తిత నెఱప॥

తే॥ నాడిచూచి రుజాది నిర్ణయ మొనర్చ
నురుత రాపదలం దెందు నుద్ధరింపఁ

---

* శతావధాని శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, ది 11-9-37 కృష్ణా పత్రికలోఁ బ్రచురించిన 'శిష్టావారి విశిష్టత్వము' అను వ్యాసమందు గుణగణములఁ దారతమ్య వివేచనముగాఁ దమ పదుమూఁడేండ్ల యనుభూతి నిట్లు దావాహరించియుండిరి:

'బందరువారలు వీరిని శ్రీమంతులు నాదెళ్ల పురుషోత్తమ కవిశతంతునితో పాటు తమవారినిగా పేర్కొని గర్వపడుటకు శంకింప నక్కఱలేదు. పురుషోత్తమకవిగారు గురుశుశ్రూష వినాగా, అనేకవిద్యలలో నాఁటితీరిన ప్రజ్ఞావిశేషము సంపాదించుటయే కాక, దానినంతటిని పట్టణవాసులకొఱకు నిర్వ్యాజముగా నుపయోగించిన విద్యావయోవృద్ధులు. 'ప్రిన్సిపల్టుమేన్' అనే యింగ్లీషు భాషావాగుల పైటిలుక్క వీరు పరిశుమోదాహరణము కాదగ్గవారు.'

దన సెవరుకోరఁ గాదన కనయ మెవ్వఁ
డరిగి తా సమర్థింపఁ జీఁదఱ పడంజె॥ 69

తే. దేవళమ్ముల భజనమందిరములందుఁ
దాళముం గొని కీర్తన ల్తాన పాడ
దేవయతివాహనమ్ముల సేవగింప
కెపుడు ముందంజ వేయఁగా నెంచుచుండు॥ 70

ఆ. కవచధారణంబు గాదని యుడిగెను నలువదేండ్లు పీల్చునశ్యమట్టె
యభినివేశ ముడుగ నభినివేశముదేన నైన నిచ్చగింపఁగానెపోక॥

తీర్థాటనము.

క. సేవింప బయలువెడలఁ 'గతా వేంకటనాయక' యనలాలసుఁడై త
ద్దేవాంఘ్రిపూజ సలుపఁగ నావైపునఁదీర్థజాలమందుమునుంగన్॥

చ. అరిగెను ముద్విదంబర రహస్య మెఱుంగఁగ రామలింగముం
గరమనురక్తిమైఁ గొలువఁగా నట సేతువునందు మున్గఁగా
జరుప విధు ల్పితౄణమును జంపఁగ నంపఁ గృతాఘు మెద్దియే
న్వరమధురాండజాక్షిఁ గన వచ్చుచు రంగనిఁ గుంభకోణపున్॥

తే॥ కంచికామాక్షి వరదునిఁ గాంచి వెడలి
కాళహస్తీశు దర్శించి కని తిరుమల
నేడుకొండల వేలుపే యేడుగడగ సిగయుఁ
గలయది యర్పించి చేరఁబురికి॥ 74

బాహ్యాడంబరరహిత వైరాగ్యమార్గానుసరణము.

శా. నానాభాష్యసమర్పితాంతరుఁ డనంత ధ్యానసంధాన వి
జ్ఞానానందుఁడు తాను గాఁదొడఁగ బ్రిజ్ఞావైదుషీ శేముషీ
జ్ఞానానందులు సద్యతీంద్రు లిడు త త్సన్న్యాసముం గైకొనం
గానో నర్హత యన్నిటంగనుదు నాఁగాఁ జేర్మికై పోకటుల్॥

ఆ. కాస యంకురించి గాసి నొందింపఁగా నల్ల మందె తప్ప నల్లమందు
లేవి పట్టకుంట నిట్టిదేహస్థితి కలుగు తనకుఁ దగదుకైకొన నని॥

సీ. 'ఆశ్రమ' స్వీకార మంతనుఁ గుతూహల
    మున్నదా యని సుతుం డొకట నడుగ
వా 'శ్రమ' మేటి కనాశ్రమస్థితి పుత్రి
    వంతున కొంచెఁగా వలనుపడమి
నీయండనే యుండనై యిట్టు నెట్టఁగాఁ
    దివురుదుఁ దుదిదాఁక దేహయాత్ర
నిం వెఱింగిరొ కాక యెఱుఁగమి నేలోటు
    కల్గఁ బ్రాయశ్చిత్తము ల్గననగుఁ॥

తే॥ బ్రేష పెదవులఁ బల్కి యావేష మూన
దానఁ బ్రాప్తించునట్టి దధఃపతనమొ
నేల నిల్చినఁ దూలము, గాలికైన
రాల సన్న్యాసుల దసిధారావ్రతమ్ము॥

తే. ఈషణాత్రయ ముడుఁగుచు నెపుడు పరము
నందె లక్ష్యముగా మనం బంటకేది
నెగడ నెప్పుడు ప్రణవమే యగును బలుక
నింద్రియంబు లలర బాహ్య వృత్తి వీడి॥

తే. మమత యుడుగుచు నంతట సమత తోఁప
రాల భుక్తి నిద్రాభయ గ్రామ్యగతుల
యందు వాంఛలు నదితీర మంటి చనుచు
నంద విశ్రాంతి తరుమూల మంద దెటనో॥

తే. బొంది నిలువఁగఁ బరిసరంబున నెగడెడు
పల్లెటూళ్లను మూడిండ్ల వరుస నడుగ
దొరకు మెదుకులఁ గడిగి క్షుత్తు సడఁచికొను
కంటె గేస్తులపొత్తును గనఁగఁ దగదు.

తే. ఏకభుక్తమె నెఱపి యాసింపకెద్ది
శాలినడకనె తీర్థముల్గన నరుగుచు

సంచయముఁ గోర కాప్తుల స్మరణ ముడిగి
వ్యాధివాయఁ బ్రాణాయామమంద తగిలి॥ 81

తే॥ క్రిమముగా ద్వంద్వము లడంగఁగలుగు దనుకఁ
బర్ణవాతాశనత్వ మేర్పడెడు దనుక
మానఁగూడదు దండ కమండలముల
హంస లాపమినె పరమహంస కాఁడు॥ 82

తే. పీఠసన్యాసమన్ననో పీఁడ యద్ది
గడవ కెట్టులో గంటకొట్టెడి నవుకరి
నిఱుకుచందాన బంధాన నిందనౌ కె
దన్కు నిక్కడి పూజలే తక్కఁ బరము॥ 83

తే. దేనికైనను నర్హత లేనివాఁడు
లోకవంచన మొనరింప లోలతఁ గని
తగని వేషాలు వేయఁ జూడఁగ నదెప్పు
డాత్మవంచనముఁకొ నిహమ్ము నందు॥ 84

ఉ. ఎన్నఁగ ధారుణి న్మనికి యెందును నస్థిర మన్నవైఖరి
న్నిన్నటికంటె నంతమవు నేఁటికి సన్నిహితం బటన్న చిం
త న్నెగడందగుఁ జనుఁడు తాను బరంబునఁ జేరు సాధనం
బు న్నయవర్తనంబునను బొందిన మేలపుఁ బుట్టి గిట్టుటఁ॥ 85

అనుసరణీయమార్గావబోధనము.

సీ॥ ప్రత్యేకతత్త్వ జీవబ్రహ్మ భావిత
ముక్తతం బరతత్త్వమునె కొలిచినఁ
జిదచిదీశ్వరతత్త్వ శేషశేషిత్వ చిం
తన దివ్య పరమపదస్థితిఁ గన
జీవేశ్వరాభేద సిద్ధాంత వేత్త్రుత
నిర్గుణబ్రహ్మత్వనిష్ఠ నెనయ

నిది మతత్రితయమై యేదారి నడచిన
గమ్య మేదోకతిఁ గాంచనౌను॥

తే॥ గాని చిత్తశుద్ధికిఁ గర్మ మూనవలయు
జ్ఞాని యయ్యును లోకసంగ్రహము కొఱకు
భక్తి జ్ఞానమ్ము నవి రాచబాటలైనఁ
బూర్వసుకృతమునను కాని పొందరావు॥ 86

తే॥ తాను భక్తుఁడ ననుకొన్నఁ గానెకాఁడు
జ్ఞాని ననుకొంట యదియె యజ్ఞానమౌను
గస్తి నెంచక త్రొక్కినఁ గర్మపథముఁ
గ్రమముగా దాన నబ్బు గమ్యము నిజమ్ము॥ 87

తే॥ రాజయోగము నిలువీఁత రాదు మనకు
నేర్చికో, హఠయోగమ్ము నేర్వ వలయు
మంత్రయోగమ్మువలనఁ బ్రమాద మున్నె ?
రామనామమె సర్వతారకము గదవె॥ 88

తే॥ శ్రవణ మనన నిదిధ్యాసన విధులొప్పఁ
జిత్తమాలిన్య ముడిగింపఁ జేసికొనమి
నే మొనర్చిన లాభ మెందేని లేదు
ము న్దయాసత్యశౌచము లొనయఁ జనమి॥ 89

తే॥ కర్మఫలముల నుడిగిన ధర్మనిరతిఁ
దోఁప జీవస్వరూప నిరూపణంబు
'త్వ' మ్మదిగను, నానందరూపమ్మె 'త' త్ప
దార్థ, మైక్యమే 'యసి' గ గీతలను దెలియు॥ 90

క॥ అది తెలియని పారాయణమెద నంటఁగరానినోటికన్నేండ్లటులే
నదియిదిరుబ్బినజోటికిఁదుద కెంచసమానమంచుఁదోఁపకయున్నే?

క॥ గీతోపనిషత్సూత్ర వ్రాతోదితభావమెల్ల భాష్యగ్రథితం
బై తగుఁగా కది చదివిన నే తగుసాధనమొ లేమి నెదఁదిరమౌనే?

క॥ దైవము సర్వవ్యాపకమై వెలయుట నేరికైన నాదరువెటులే
న్గావలెనను పూనికమై జీవుఁడు వర్తిల్ల మమతఁ జెందమిఁ జేయున్

**ఉత్తమసంఘ సంస్కారణోద్యమావలంబనము.**

సీ॥ అకలంకతను గాంచి సకలమ్మును ద్యజించి
ముకుమూసి తాదాత్మ్యమును గనమిని
సన్యాసి తాఁగాక యన్యచింతలఁ బోక
మానవసేవనం బూననెంచి
యిద్ధమై సాంగవేదోద్ధారక బ్రాహ్మ
ణమహాసభాభిఖ్య నమరఁజేసి
* "బాపన్న" లంగూర్చి ప్రాపుతానై కర్మ
పరతంత్రబుద్ధిని బరఁగఁజేయ॥
తే॥ మెదడు పెడత్రోవ లుడుగుచుఁ గుదుటఁ బడిన
నవయవము లెల్ల ఋజుపంథ నందఁ గనెడు
చందమున నిల్చు వర్ణ మాశ్రమ నియమము
లవ్వి సాధింపఁ జూచులే యర్హ మనుచు॥ 94

క॥ ఊహూరఁ దిరుగ మొదలిడి పాటులు మెలఁగంగఁ దగిన బాటల విపులం
బౌరీతి బోధ సలుపుచుఁ జేర సదస్యాళి హితముఁ జెప్పఁ దొడంగన్

క॥ ఎందెందు గుణవిశేషముఁ
గంటిమొ యది కొంత మేలె, కాని యవగుణం
బెందుం దొలఁగం ద్రోయుటె
ముందౌఁ గర్తవ్య మంచు మునుపడఁ బలికెన్॥ 96

మ॥ క్షణమే జ్ఞాలము లేనికట్టడిని బాశ్చాత్యుల్పనుల్నిర్వహిం
త్రనయం బెందు నయంబుఁ గందురనఁగా వ్యాపాదితుల్గాకయుం
ద్రినిశంబుం గలహింప కన్నిట యథాప్రాప్తంబులై వేచియుం
ద్రిను నేర్పందక, కొప్పు బూట్లు సిగరెట్లందే కడాదీటగున్॥ 97

---

* శ్రీ వెంపటి బాపయ్యగారివంటి నిజసంఘోద్ధరణోద్రేకులనని.

మ॥ అమలంబై తగు బ్రహ్మచర్యమున మాహాత్మ్యంబు నయ్యగ్నికా
ర్యమునం గల్గెడి తేజ మాగమరహస్యంబు న్గ్రహింపంగ లే
క, మృషా ప్రేషదవేషభాషలను లోఁగంజూచుట న్బ్రాహ్మణ
త్వము నానాఁటికిఁ దీసికట్టగుటఁ బ్రస్తావించె శోధించి కోన్ ॥98

మ॥ శ్రుతులందు న్స్మృతుల న్నితంబు వెతక న్విద్ధంబు గానా పురో
హితవృత్తి న్మలఁగ న్బ్రతిగ్రహమునం దెందెం వెటుల్నాయు దు
ష్టత నాఁ బక్కురో యట్లొనర్చినన్ బాటందప్పిన న్మప్పగున్
గతియేడించెడు ధర్మలోపములు గల్గం జెప్ప దుర్మంత్రముల్.

శా. ఏతద్దోషము ముం దడంపఁదగున ట్లేర్పాట్లు గావించుచున్
శౌత్రిస్మార్తవిధిప్రవర్తన మిల స్సాగింపఁగానైన, స
ర్వాతంకంబు లడంగ, దానికదియే వర్ణాశ్రమాచారధ
ర్మాతిక్రాంతి తొలంగనయ్యెడునటం చాసించి బోధించె దాన్ ॥

క. అందాదు నెందతెందఱో సందేహము లడిగి తెలియు సందర్భముల
న్మం దప్పు పోసఁగనాచుం గ్రందుకొనం జాలు స్థితులఁగడపుట
లెటో నాన్ ।

మ॥ కలిలో నాపదల న్నదస్సులను మార్గంబందు నాచారమె
ట్టుల నుండందగు ధర్మశాస్త్రముల విట్టు ల్వాల్కి రాయాతెఱం
గుల గుర్తించి చరింపఁగానగు, నసక్తుండైన ఫలావాప్తి, వ
ర్తిలు నయ్యోగిపథానుయాయి కిలలో దీ కెందునుంగా దనున్ ॥

క. ఎడపక విధికి హితంబులఁదడయక నిజధర్మనిరతిఁదాఁదగు నెడలన్
మడికెప్డు బన్న మొదవక బడుగై యస్పృశ్యతానివారణము దుగున్.

మ॥ జని శూద్రత్వమె, కర్మమే ద్విజతఁ గాంచం జేయు, భ్రష్టత్వముం
గని యస్పృశ్యత నెంచనేమిటికి? సౌకర్యంబు లాసించి తా
మనిశంబుం జెడబాటలందవిలి యవ్రాత్యంబుఁ గోల్పోయియు
న్నను, లోకోద్ధరణంబు నా నరుమనుట ల్నా డెం బెటు ల్గానగున్ ।

క॥ దేవళముల నర్చనమం దే వఱలెడి లోట్లనెన్న కెవరో దూఱం
గా వాసి తఱుఁగునందు ర దేవారికి నచ్చుఁజెప్ప నె ట్లగునో ।

క. దేవుఁడె లేఁడం దనుచుఁ దేవళములఁ ద్రొక్కునట్టి దేవయ్యలు తా
మే వెంట నేరిసైనం గావలె ననకున్నఁ గొంచుఁగా లిడ నేలో 106

చ. ఎవరికి దేన గోటవునో, యెంచి గడించినదానినుండి యీ
యవలె యథోచితక్రియగ, నంతియె కాని చొరంగరాదు, దా
తృవరుల యాశయంబులకుఁ దెంపరులై విపరీత రీతులం
దవులుచు, నుద్ధతి న్మెలఁగఁ దథ్య మధోగతి, కల్గవుద్ధృతుల్ ।

క। వైవాహిక సంస్కార ప్రావీణ్య మెఱుంగలేక పాశ్చాత్యగతిం
బోవలెనని శాసనముల నేవారెటు సేయనైన నెనయవు శుభముల్

మ। అరుదైనట్టి యనాథజన్మ శరణీయ స్థాన నిర్మాణము
ల్పరఁగ, న్నాగ విడాకుచట్టములు, నబ్బ న్సర్వదుర్నీతిమా
ర్గ రతు, ల్సంఘము హీనదుస్స్థితికి లోఁగం జేయనే కాక, సు
స్థిరధర్మంబుల భగ్నముం బొనరుప న్దేశోద్ధృతు ల్గల్గునే? 109

మ। అనసూయ న్దమయంతిఁ జంద్రమతిని న్జ్యాజాత సావిత్రి భ
క్తి, నితాంతస్మరణం బొనర్పనగు పాతివ్రత్యమాహాత్మ్యము
లకనియున్నట్టి పవిత్రదేశమున నిక్కాలంపు దుస్సంస్కృతి
న్వినియోగం బిసుమంత లేక చెడిపో వీళ్లెన్నో కల్పించెడిన్॥

మ. ధరలోఁ గొందఱు సంస్కృతి న్యశము నందం గోరి యందం బొస
ర్తురు యత్నమ్ముల నాత్రివృత్తిఁ బ్రజలందు న్దానఁ గల్లోలము
ల్పరఁగం జేయ నశాంతి యేర్పడెడిఁ గొంపల్దియు దౌర్మార్గ్యపుం
జొరవం గందురె? దూరదృష్టి కలిమి న్బుద్ధాంబె చేతంబు గాన్.

చ॥ కలుష మెఱుంగనట్టి మునిగణ్యు లగణ్యపు దివ్యదృష్టి ని
శ్చలమతిఁ బలుక ధర్మముల సార మెఱుంగక మీఱిఁ జాతు, రో
జ్జలుగద పృష్టము ల్గడుగఁ జాలని తెల్లమొగాలె నేఁడు, వా
రలమెయి సంచరించుటను రాయిడిఁ గూర్పదె? నీతినార్పదే?

చ॥ పెరటిది ముందుగా'దనుచు వెంగలులై 'పరువెత్తఁ బాలకై'
దొరలిట గుంగఁ దామ్రమును దొడ్డవి నాఁగొనఁ దామ్రపాత్ర లా

వరుసనె, వారో వారిఁ గనివచ్చినవారలో, దేనిఁ బల్కినన్
శిరమునఁ దాల్ప నిష్టమును జెందుచునుందురు నూతనప్రియుల్ ।

మ॥ మునువిక్టోరియయేల్బడింగనుట, హోమ్రూల్స్థాపనోద్యోగముం
గనినా నానిబిసెంట్ 'థియోసఫి' నెసంగంజేయుటల్గా, సరో
* జిని కాంగ్రెస్ప్రెసిడెంట్పదం బెనయ వాసింగాంచుటల్భారతా
వని శక్తిస్ఫురణాత్మకత్వముగ సంభాషింపఁగా నయ్యెడున్॥

శా॥ ఏ వ్యాసంగ మనుష్ఠితింగన కిటల్హిందూమతోక్తంబుల
న్నవ్యంబం చెదిచూడ మోహ మెనయంగానాటనే కాకెటన్
'దివ్యజ్ఞానసమాజ'బోధనల నంధీభూతులై కాంచుచు
స్వభ్యంబైన సమత్వముం గని నటుల్భావింత్రు నూత్నంబెదో ।

ఉ॥ జీవ మదృష్టిగమ్యము వచింపఁగలేమె "దహింస" యానా కా
దో వివరింప వేదముల నొక్కఁడుఁగానఁడు తన్మహత్త్వ, మే
దోవిధమైన గొప్పఁదన మొప్పుచు నిప్పుడు చెప్పుకోరె? నా
నావిషయావబోధముల నవ్యపథంబులఁ గాంచినట్టుగాన్. 116

---

## సరోజినీ తిరోధానము

శా. తంత్రీనాదము లాగెనే మిది? నిరస్తంబయ్యె విద్యుల్లతా
* యంత్రోద్దీపిత కాంతిజాల మిటు లార్యావర్తమే కాదు, సా
యంత్రం బంతట నొక్కటం గలిగినట్లై, పద్మజార్తధ్వనిన్
గాంత్రావర్తితమా 'సరోజిని' యశఃకాయమ్ము రూపొందుటన్॥

చ. కవనము లింపుఁగొల్ప నుడికారము సొంపు దలిర్పఁజేయఁగా
నవు ననిమించు కన్న సతి యాదిని రాష్ట్రపతిత్వమందు గా
రవమున నాయకుల్పొగడ రంజిలఁజేసి 'మహాత్ము' నెమ్మదిం
బ్రవిమల తత్పదాబ్జముల రాజిల నేగితె? యో సరోజినీ!

ఉ. సాంద్రమనోవికాసమున సాహసమార స్వతంత్రలీల, ని
స్తంద్రత భారతావనిని దాల్మి విశృంఖలఁ జేసి నంతతే
యింద్రపదాప్తి నించెనని యాద్యపదంబున కేగు నీయశ
శ్చంద్రిక లల్లిబిల్లిగను సర్వదిగంతములందు నల్లెడున్॥

నాదెళ్ల మేధా దక్షిణామూర్తిశాస్త్రి.

ఉ॥ మొండికి తేనిదైన బలము న్వెనుదీయుచు మొక్కవోవ నె
వ్వం డెఱుఁగం? డెఱింగియును వాసిగ నెంచునె మొండికావుటన్?
దండిమగం డొకం డిపుడు తద్దయు నద్దియె బుద్దినావుడు
న్మొండుగ వెంటనంటె యన మే లను 'జై' లను జైలెయంబినన్॥

మ. ఎటులే న్బట్టినపట్టు వీడమి ఘనుండే యాఁ గదా 'గాంధి' ప
ల్కుట నుద్రేకము విజ్ఞతాప్తియు నెసంగు న్నేటి 'నెహ్రూ'లలోఁ
గటకోద్ధార 'సుభాసుబోసు' పటుసంకల్పుం డటు ల్వల్లభయ్
* పటేలుం' గొల్వఁగభీతి, నాంగ్లు లిఁక నిల్వంబోవ రేనాఁటికేన్

---

* 'సర్దారు' మత్తేభస్మృతి.

మ॥ ఇలలో భారతజాతపత్యకగు నాయీరాష్ట్రసంతానపు
న్వలిపంపు న్వలిభంపుఁ గత్యయయి యొవ్వఁడొప్పె నా 'వల్లభుం'
డలఘుప్రజ్ఞుఁడు సారకార్యాయుఁ డనన్యప్రాప్త ధీపాటవుం
డులివారంగఁ 'బటేల్' లన న్వడిసె నయ్యో! యేమి కానున్నదో!

మ. ప్రపదం బుద్యమ నిష్ఠితం బగుతటి 'న్బార్డోలి సత్యాగ్రహా'
న్యుపదిష్టుం డయి, తెల్లు తెల్లముగ మెప్పర్వంగ 'సర్దారు' గా
నుపదేష్ట న్మదిఁ దృప్తిఁ గొల్పె నెతఁ 'డోహో!' నాఁగ నా 'వల్లభా
యి పటేల్' లిప్పు డుపప్రధాని యనఁగా నేఁ డుండ? నెప్రాణకన్॥

మ. ధృతిమీఱంగను దాత్తరాష్ట్రతతి న్మందింప న్గదాధారి, నా
యుతనూజుం 'డతఁడేఁడి? కాఁగిటికి?' నా నుక్కైన దొక్కం డిడన్
ధృతరాష్ట్ర ప్రతికూలకర్మమును బొందింపంగ నట్టె యిటన్
మతి నూహింపరె? కాలకర్మమునకు న్మారేదొ కల్పింపఁ గాన్॥

మ. అతిలోకుం డు పరోక్షగామియని యే యంతర్ముఖుం గొల్తు రా
మతిమంతుం డరవిందఘోషు తనదౌమార్గం బెదో త్రొక్కఁ ద
ద్వ్యతిరిక్తం బగు కర్మవీర పథము న్ద్రాఁ ద్రొక్కి నిస్స్వార్థ సా
ధితమౌత్కుండు సమైక్యభారత విధాతృత్వంబుచే మించఁడే?

మ. అనవద్యుం బవు దేశసేవనము నే యక్రాంతము న్సల్పి, మో
హనదాముం డరుగ న్దివంబున కనన్యాదృ గ్యశోభాగియై
వినుతాత్మీయ పటిష్ఠతా గరిమతో విక్రాంతుఁడై నేఁడిటుల్
జన నరదింతము వల్లభాయి కిటులీ సర్దారు మత్తేభముల్॥

— నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రి.

ఉ. నిగ్రహ మోర్వఁజాలు మదినిబ్బర మబ్బఁగ నుబ్బతిల్లు 'స
త్యాగ్రహ' మన్న వక్రగతి యాచరణీయముగా నదింక స
మ్యగ్రచనం బొనర్చుట సమార్జితరాజ్యులమైన, నార్జవ
వ్యగ్రత కుంగకున్న? భయభక్తు లడంగ కెసంగు టెట్లగున్?.

ఉ. ఏ రెదిసంస్కరింప మొదలిడ్డను సాధకబాధకంబు ల
న్నారెకు నెంచుచు న్వినుతసచ్చరితంబునఁ దా రెసంగుచున్
దూరపుఁజింతతో నరసి తొందర యింతయు లేని చిత్తసం
స్కారముతో మెలంగు చెటుసాగిన నాగక వీఁగఁ జొచ్చెడున్॥

చ. కలికలుషాకరంబవుటఁ గాల మటీడ్వఁగ వక్రపంథ వ
ర్తిలఁదగు బోధలేర్పడు నరిష్టదమైన ననిష్టమొందుఁగా
కలవడుచుందు రయ్యదె మహత్తరమౌనని నూతనప్రియుల్
పలువురుపోవ నా తెరువె బాగనిఁ దోఁగుచు సాగనయ్యెడున్॥

ఉ. ఏ తెఱఁగైన యేలుబడి యెయ్యెడ నెవ్వరొనర్చ నెవ్విధి
న్నేతురొ తద్వివేకమె యొకింతయు లేనటువంటి యెల్లరుం
జేతులనెత్తుట న్గెలుపుఁ జెందెడికీతుల యుద్ధృతు ల్గనం
జేతుల నెత్తుటే ఫలము చీఁదఱఁగూర్పఁగ శాంతినార్పఁగన్.

చ. పరిమళ మందు నాసికకె వర్ణము లక్షికిఁ దీపి జిహ్వకే
యొఱు కవునట్టు సృష్టి నెవఁ డెందుల కేర్పడె నద్దె నేర్పఁగాఁ
జాఱుపఁదనంబు మీఱఁ గనుచుం బను లాయవి నిర్వహింపఁ జా
తురి వెలయ న్సమర్థముగఁ దోఁచును బాలన మట్లు సాగఁగన్॥

మ॥ ఒరు మేల్తైఁపమి పెచ్చు పెర్గుటను శస్త్రోద్వృత్తి మీఱ న్బర
స్పరవైరమ్ములు పెంచికొంచు జగతి న్సంగ్రామరంగంబులం
గరముం బోరుట కష్టనష్టములఁ జిక్కన్హేతువై, దాన, దు
ర్భరదౌర్భాగ్యమె కాక నాగరికత న్వర్ణింప నెట్లయ్యెడున్ ?

సుగమ పరమార్థావబోధము

క. తనవారని తనయూరని తనదేశము ఖండమన్న దంధనముడుగన్
దనసర్వవ్యాపకతం గన దాన సమత్వబుద్ధి గలుగ సుఖించున్.

తే. మమత యుడిగిననే యభిమాన ముడుగు
నద్ది యుడిగిన సాక్షియై యన్నిటికిని
నెగడనౌ బుద్ధియం దింక నిలుకడఁ గని
ద్వంద్వముల కెందు లోఁగని పద్ధతిఁ గను॥ 126

ఉ. విద్దె యె దబ్బ నుబ్బెడు వివేక మదే కళాపంగ మేలవుం
దద్దయుఁ బొట్టకూటి కెడి తగ్గదొ యేరి క దభ్యసింపనౌ
నిద్దముగా నిబు ల్పలుప నీతి మెలంగెడు భాతి కల్గఁగా
బుద్ధు లనన్యసత్యపథముం గని పేర్మి నెసంగనయ్యెడున్॥ 127

ఆ. వేద మానుగాన విజ్ఞానపేటిక
యద్ది నేర్పవలయు సార్థకముగ
నంచు బోధసేసి యదియాడ సాగించె
సాంగ వేదపాఠశాల యనఁగ॥ 128

క. వేదార్థ మెల్లఁ దెలుపంగాఁ దనరుచు నుప్పులూరి గణపతిబుధుచే
* బోధింప వడలి లచ్చన యేదే న్మల్లాది రామకృష్ణులు నితరుల్॥

---

* శ్రీ గణపతి ప్రశంస.

శ్రీ నాదెళ్ల పురుషోత్తమ కవికృత మందలిది

చ. పరమ పవిత్ర మంత్రము సభాస్థలి నెల్ల రతీతభక్తితోఁ
గరమనురక్తితో వినుచు జ్ఞానము నొందఁగఁబట్టి వైఖరి
స్వరమతి యుప్పులూరి కులవార్ధి సుధాంశుఁడు శాకినాడను
నిరుఁడు, తపస్వి, శ్రీగణపతిప్రథితాహ్వయుఁ డార్యవర్యుఁడే
తెరబడిబోధ చేయఁగను ధన్యత మా కొనగూడనై నిరం
తరము నుతింపనౌటను గృతజ్ఞత కి మ్మహిమాఢ్యపండితుం
జిరసుఖ మాయువు న్ధనము చేకుఱ హార్దముతోడ నొప్ప. సా
దరముగఁ జేయుమీ యని సదాశివుఁ గోరుదు మాస్థఁ గొల్చుచున్॥

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి వ్రాసినదిది 17-11-29

శ్లో॥ శ్రీగంగాధర పుత్త్రవర్య! భవతా మేషానతి ర్దక్షిణా
మూర్త్యంకేన మయా సభక్తిహృదయే నానందతో దీయతే

పరోపకార పరత్వరూప దైవసేవనము.

శా. సాగు స్విప్రపద కృష్ణమూర్తి కవికి స్వర్ణాభిషేకంబు చేటో
* నాఁగా నాతఁడు, తానపిల్వ సుతునిం దానంప నంగీకృతి
న్వేగంజూపుచుఁ బాలకొల్లు పురికొల్పెం బోవఁగా వాని వి
ద్యాగోష్ఠుల్ సహియించి పాల్గొను టెఱుఁగ్ం బంచుబోధించుచున్

యుష్మచ్ఛ్యాత్రవశేషు యాదృశమతి స్తాదృజ్మతి ర్మయ్యపి
ప్రీత్యా నిత్యదయామయేన భవతా కార్యా బుధ ! శ్రేయసే॥

శ్లో॥ సందర్భ గర్భిత మురారి ముఖోక్తియుక్త్యా
హ్యా ద్యానవద్య మృదువాక్య సమర్థితార్థః
సంస్తూయమాన బహుశాగమ సారవేత్తా
జేగీయతే గణపతి ర్గుణినాం యశస్వీ॥

ఉ॥ శ్రీధరనూనులం దొకనిఁ జేయరు పూజలు లోకు లందు నా
వేధయుఁ దాతగా నతనివీడి సరస్వతి తావరించె, గం
గాధరనూనులందఱను గౌరవపాత్రుల నగ్రపూజ్యు. నా
రాధితభీము, సత్త్వగుణరాజితు నీతని భవ్యతేజునిన్॥

చ॥ ప్రణతు లొనర్చు కన్నఁ బ్రతిశాద్రపదంబున మంటిబొమ్మకు
న్గణపతి యంచు, వేఁడు రసనా ! గను భద్రపదాప్తి నియ్యెడ
న్గుణనిధి సుశ్వలూరికుల కోవిదు, పార్థక వేదమూర్తి నీ
గణపతిశాస్త్రి, సాధుజన గణ్యు నగణ్యునిఁ బ్రస్తుతించుటన్॥

మ. ఒక వేదం బొక శాస్త్రమో సదురనే యొప్పుంగదా గర్వ మ
న్ని కళల్ నిండుసుధాంశుమూర్తి వన కాంతి న్దాంతి శోభింతు, వ
ర్ణ్యకళాపూర్తి నుపక్రమంబు నుపసంహారం బుపన్యాస భ
క్కిక, మేల్మిందగు గాత్రసౌష్ఠవము నీకేదక్క విద్వన్మణీ !

చ. అనితరసాధ్య మిట్లు నిగమార్థము నెల్లను బోధసేయనా
ఘనమలని కోరినందుల కఖండ భవ న్నయవాక్యవర్ష నే
చనమున సద్ధృదంతర అసత్తర భవ్య నవాంకురోదయం
బున కిరవొందఁ జేసితి నమోనమః చంద్రిమా సూలుపోఁగిరే॥

*స్వర్ణాభిషేకము

శా॥ శ్రీరామామణి విష్ణుమూర్తి కరము౦ జేపట్టినా శట్టిరా
క్షీరాంభోనిధిఁ గీర్తిగాంచె వినుతు శ్రీపాదవంశ్యు న్సశ్రీ

మ. అనఘుం డీతఁ డుమామహేశుల యుపన్యాసాళిఁ గల్పించి మె
చ్చెను దా నిచ్చె వదాన్యశేఖరులతోఁ జెప్పించి యిప్పించెఁ, జే
† సిన నిచ్చోటన, 'చెళ్లపిళ్ల' కవి కాశీస్నిచ్చుచు షష్టిపూ
ర్తి, నిఁకేగౌరవ మేరుకాంచ ముదమందె నోత్సహింపంగ నెన్.

---

శ్రీరామామణి కృష్ణమూర్తి కరముం జేపట్ట నోప టిదె
శ్రీరారామము సార్థకాఖ్య మన వాసిన్మించు సాంధ్రావనిన్॥

మ. మమనస్స్వవ్యము స్వర్ణసేచన మొనర్చె న్ప్రౌఢరాయండె, ము
న్న మహాకావ్యవిధాతయై పొలుచు ధన్యుం డాన్యు శ్రీనాథు, ని
ప్డు మహాభారతకర్తవర్యు, నటులే పూజించు నీపాలకో
ల్లు మహావాతల సద్యశోలతిక లల్లున్ దేశ మెల్లం గనన్॥

ఉ॥ శ్రీయుతు లైనయాకవివిరించులు ముప్పది మూడువందలేం
డ్లీయిలఁ గస్తి నంది రచియించిన కబ్బము నొక్కచేత, ను
శ్రీయుతమూర్తి నీ వల రచింపఁగ దక్కు నిరంతరాయ భ
ద్రాయుత సద్యశోగరిమ మందుమయా కవిరాజసత్తమా!

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి.

† షష్టిపూర్తిలో.

శ్రీ నాదెళ్ల పురుషోత్తమ కవివతంసుల యాశీస్సు.

తే. శ్రీ విలసిలంగ షష్టిపూర్తిని బలికెడిఁ
జెళ్లపిళ్ల వేంకటకవి శ్రీపతికృపఁ
గలిమి బలిమిని నూరేఁడు లిలను మనుత'
మనుచు నాదెళ్ల పురుషోత్తమాహ్వయకవి.

నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రి సమర్పితము

శ్లో॥ శ్రీమద్వేంకట సత్కవి స్తిరుపతి ప్రఖ్యాత ధీమద్యశ
స్సత్కీర్తిం సముజీజన ద్బుధమతం కృత్వా వధానాదికం
తస్మై ప్రాపిత షష్టివర్ష కృతినే నానాకృతిబ్రహ్మణే
భూయా చ్ఛ్రీగురుదత్త భూరికృపయా అత్యుత్కటాత్మచ్ఛటా॥

ఉ॥ 'ధారణ నిల్చునా? నిలువదా?' యను సందియ మెందులేని గం
భీర వచోవిశేష బుధవీరుఁడు శ్రీపతి నీకుఁ దోడు గాఁ
గా, రచితావధానశతకంబున నాంధ్రధరాతలంబునం
దారయశోవిశాలత యెసంగెఁ గవీశ్వర! వేంకటేశ్వరా!

ఉ. ఏతటి నేరకోర నెటు లెన్నటి కెవ్విధి నెద్ది కల్గునో
జాతకము ల్గన న్ఫలము చక్కఁగఁ జెప్పఁగ యుక్తియుక్తపుం
జాతురిమీఱఁ బల్కుట నజస్ర మనేకులు కోరవ్రాసెఁ దా
"జాతక దర్పణం"బనఁగ జ్యౌతిషికు ల్పరనాప్తి గాఁగనన్

---

మ. మును నిర్గాంచి వఠించు రమ్యకవితాభోగాంగన న్నీరతా
ర్చిన నీకూర్చసతీత్వనిం దిరుపతి న్శృంగార మింపార, న
వ్వనితారత్నము కూర్మిఁ బెంప నిపుడీ వార్ధక్యపుంగన్నె నిం
గనుసన్న ల్పచరించుపట్టునఁ దొలంగం ద్రోసినట్లాయెనే॥

ఉ. భోజులులేని కాలమునఁ బుట్టియు నాంధ్రకవిత్వకన్యకం
దేజ వహింప దేశములఁ ద్రిప్పి యశంబు గడింపఁజేసి నా
రాజనపాలమైత్రిని గనంగలుగ న్బహుకావ్య పుత్రికా
రాజిని గాంచి యెల్లరను రంజిలఁ జేయరె ? సుస్థిరంబుగాన్॥

చ. అరుదవుజంటగా నమరి యద్భుతకీర్తి గడించినట్టి యీ
తిరుపతివేంకటేశులకు దీటుగఁ బల్కు నుసుళ్లు లేఁగుమా
దిరి మిథునంబు లేర్పడి యదేపనిగా గణబద్ధవాక్కులం
దిరిపెము లెత్తసైన, జగతి న్సుగతి న్నిగడింప నేర్తురే ?

చ. వర కవితావితానముల వాసికి నెక్కిన యాంధ్రభూమిలో
సురుచిర వాక్స్రవంతులను సొంపుగ మల్చి నవీనవాగ్ఝరీ
పరిణత వాక్ప్రచారముల వంతెన వేసిన యంజినీరులా
తిరుపతి వేంకటేశులగతిం జన నిట్టుల బాటమేటిదోన్॥

సీ॥ బహుళదేశాట నోపార్జితోర్జితవచః ప్రాచుర్య మందందు వ్యక్తము కద
పండితమిత్రతోపాత్త గీర్వాణాంధ్ర భాషామనీషిత ప్రకటము కద
వారాంగనాపాంగ చోరతాపర్యాప్త రసికత్వ మెందైన నెసకొనుఁ గద
వితత రాజసభాప్రవేశోద్ధతోదారవాగ్మిత్వరీతియుం బ్రథితముకద॥
చెళ్లపిళ్లాన్వయాంభోధి శీతకిరణ వేంకటేశ్వర వాగ్ధాటి వెలయునాటి
నింకనీమేటి శారీర మెన్న సాటిలేని దిది నేఁటి మన గ్రామఫోను పేటి॥

మ. అసమప్రాభవమార బందరుపురి న్మైనూల్లున న్దేశక
త్వ సమాసంజన మందు నీ కవిని మేధాదక్షిణామూర్తి నా
స్త్రీ సమాఖ్యాతుఁడు నాదశాన్వయ కళారిత్వం బిట న్సంఘటిం
ప సుమాశంబుగ నీకుమార్పణ మొనర్పంగర్గె పట్టభద్రికాన్.

మ. అలకబ్బంబునజాతకాంశములమోహన్‌దాస్‌కరంచందుగాం
ధి లలాటంబున నద్భుతంబయిన కీర్తిం గాంచఁగా వేధ, యి
క్కలికాలంబున వ్రాసియుంప నవు యోగంబెంచి సూచించె, ని
* ర్మలచిత్తంబునఁ దాఁ దలంచి, తుదకున్మందుండు ప్రమందించుటన్॥

---

ది 30-1-48 "శ్రీ గాంధిజ్" మారణము వలని

భారతమాతృ విలాపము

ఆ. లోకవంద్యు జ్యేష్ఠు నీకనిష్ఠుఁడు త్రుంప నవ్వు బాట్లబ్రిదుకు నాకుఁ గలిగె
నంచుఁ గుందవలసె హైందవావని యిప్పుడే 'వినాయకుఁడో' గ్రసింప 'గాంధి'॥

శా. ఓరి! నాతనయా! యిదేమిపనిరా? యోగ్యు న్యశోభాగ్యు, లో
కారాధ్యు, న్విబుధానవద్యుఁ, గరుణాయత్తైకచిత్తు, న్మహా
ధీరు, న్వీరుని, సత్త్వమూర్తి, నుతకీర్తి, న్మా దయానిత్యు బో
ధారంభు, న్నపథావలంబు, నిటు మ్రిందంజేసితే? నిందితా!

క. నీ మొగ మెవ్వఁ డెఱుంగును? రాముని గరించి నట్టి రావణు నట్టుల్
ధీమణి నగ్రజుఁ దు్రించుట భూమిని నీ వట్టికీర్తిఁ బొందఁ దలఁచితో!

శా. నాకర్మంబున లోకనింద్యముగ నేనాఁడో పరాధీననై
శోకం బందఁగఁ గోట్ల నొక్కరుఁడు పూజ్యుం డయ్యెఁగా, నేఁడు ని
ర్భీకుండై, జగమెల్ల నివ్వెఱఁగొన స్వక్రాంతి నద్దేర్పనా
వీఁకన్ శోకను గూర్ప నిట్టితడె నాబిడ్డన్ దిగన్ మ్రింగితే

క. ఏడ నొచ్రిడ న్దేవుని పోడిమిగాఁ జూడనొప్పు పుత్త్రినిఁ గోల్పోకా
వ్రీడారహితుండై మను వీఁడా నాకొడుకు కేఁకెల? వృథరా బ్రిదుకన్

ఆ. దయ యొకంట, రెంటఁ దా నహింసయు నూఁత గాఁగ బైపడింతఁగదలువాని
హింస యెదురుకొంట యేమందుఁ? జిత్రమాఁ గాలమహిమ యిద్ది కొకయున్నె!

ఆ. అస్తమించు నిప్పుడా మహాత్ముం డని యలవిధాత తొలఁత నట్లువ్రాసె
* శనిని శనిదశాప్తి జరిగెడు నిట్లని పూరుషోత్తముండు మున్న వ్రాసె॥

క. భారత రవ్యుదయం బది చేరంగా వచ్చె సర్వజిద్వాచ్రివణమై
భారతరవి యస్తాద్రిని జేరె నిటు ల్నేఁడు సర్వజిత్పుష్యముగాన్॥

ఉ. ఆహవమందుఁ బ్రాణముల నారయ నొక్కటికోలు పోకవై
దేహినిఁ గొంచుఁ దెచ్చు పగిదిన్నద, మామకపారతంత్ర్య మె
ట్లో హరియింపనయ్యె, నిఁక నున్నదె యగ్నిపరీక్ష ముందు, సం
దేహము లేదు. దీన నదె నెగ్గి బయల్పడ నౌదుఁ గావుత॥

నాదెళ్ల మేధాదక్షిణామూర్తిశాస్త్రి

మ. స్వకుమారుండు నిరూపణంబటులఁ జూపం బెక్కాలం దానువ్రా
యక వీడె న్నిదప న్నుతుం డొకట, బ్రహ్మానందయోగీంద్రు జా
తకయోగంబుల నెంచి మారకపు సందర్భంబు, లిట్లెన్నొ చె
ప్ప కలాభిజ్ఞత కాకరంబయిన నేర్పుం గూర్పఁ జర్చించుచోన్॥

మ. ఒకట న్గొత్తురి వేఙ్కటాహ్వాయబుధుం డొజ్జన్ లిఖింపంగ నే
టికి మీర్పాత్త్రిలజాతకా, 'లసలుకంటె స్వడ్డి ముద్దానో' నాన్
బ్రికటంబా సుతు జ్యోతిషజ్ఞతయె మాన్పన్ప్రియము, న్నిష్ఠా, బ
ద్ధకమై వ్రాయుమివాఁడు, తాననునుదాత న్ప్రియఁ బాత్త్రార్థమే॥

మ. అలఘుప్రజ్ఞ ననన్యముల్ 'సులభవైద్యప్రక్రియ' ల్గాంచి, బో
ధల మీ ర్ప్రకటింతురే! మొఱకులంద న్నార్పు లేదందు నాన్
ములు సూపందఁ మానె మాన్ప? వినమే "మూర్ఖస్య నాస్త్యౌషధ"
మ్మిల నంచెంచఁ బయోముఖంబగు విషంబిం కెచ్చునున్మ్రిచ్చిలన్

విద్యాగోష్ఠి

మ. అనునీమాదిరి గోష్ఠు లొప్పఁ గవితావ్యాసంగముం దొల్లిట
న్హనుమత్స్తోత్త్రముతోఁ దొడంగి, తొఱఁగ న్దద్ధ్యానమే కాఁగ, నా
హనుమద్గాథల నేరికూర్చి శతకం బౌనట్లుగాఁ బల్కుచు
న్వినుతం బాత్మచరిత్రపు న్వివరము ల్విశ్రాంతిగా వ్రాయుచున్.

చ. పరకృతులం బరిష్కృతులఁ బల్వురకోర్కెని దా నొనర్ప, వి
ద్వరగణనీయుఁడౌ భమిడిపాటికులీనుఁడు సుబ్బరాయు శం
కరవిజయంబు సూరిజనగణ్యము గాఁగ మెఱుంగు వెట్టి, సుం
దరమగు పీఠిక న్నిలుపు తాల్మెయిం దనయుం డెసంగఁగాన్॥

శా. కానంగల్గిన పండితోత్తము లుపోద్ఘాతంబు మెచ్చంగ, బ్ర
హ్మానందుల్గని వారణాసి నది యయ్యోజాతకాంశంబులం
దా నెప్డొ ప్రచురింప ఖండనమిటు ల్తత్త్రస్థ సిద్ధాంతులం
దానందప్రదమయ్యె నంచు 'గురుద' త్తాంధ్రీకృతిం గోరఁగన్॥

ఉ. చేకొని వాసుదేవకృతి "శ్రీ గురుదత్త సరస్వతీయము"
న్నాకొన సూనుఁ డంత నది పట్టపరీక్షకుఁ బాఠ్యమాటయుం

ప్రాకటమౌళ్కృప స్వరికి వచ్చి యతీంద్రులు దత్తభావపున్
* శ్రీకర సత్సుధారసము చేతనిడం గొని తెల్గొనర్చుటల్॥ 140

మ. ఘనవిద్వాంసులు సంస్కృతాంధ్ర కవితా గంభీరధారా సమా
ర్జన మల్లంపలి మల్లికార్జున బుధారాధ్యు ల్ప్రబంధోక్తులం
$ గనంగాం గొత్తురి వేఙ్కటాహ్వాయ సుధీడ్యుల్ని జగ్రంథముల్
దనసర్థించుడు, సోదరాదృతిని దిద్ద న్దక్షిణామూర్తియే॥ 141

---

* —♦ శ్రీ దత్తభావసుధారసమునుగూర్చి ♦—

'సౌందర్యలహరీ వివేక చూడామణి' ప్రభృతి గ్రంథాంధ్రీకర్తలు

సాహిత్య స్థాపకాచార్యులు

శ్రీ దుర్భా సుబ్రహ్మణ్య శర్మగారు, నెల్లూరు

విద్వద్వతంసులకు మీ కనేకనమస్కృతులు. 'శ్రీదత్తభావ సుధారస' మును మరల మరలం జదివితిని. అందలి ధారాశుద్ధికి, ఆంధ్రీకరణ నైపుణికిని సంతోషపడితిని. మీ పద్యము లందలి యిమిడికకు నే నచ్చెరువందుచున్నాను. మీ విశేషజ్ఞత స్ఫురించుచునే యున్నది. జ్యోతిషమున మీ ప్రజ్ఞయు గ్రంథముం బట్టి కనుంగొంటిని. తమరు జ్ఞానవృద్ధులు, నన్నుం దమవానింగా భావించిదీవింపుండు.

రిటైర్డు గవర్నమెంటు హైస్కూలు పండితులు,

శ్రీ కొత్తూరి వేంకటశాస్త్రిగారు, కాపవరం

'ఏక స్స్వాదునభుఞ్జీత' యనునట్లు దుర్లభంబగు 'శ్రీదత్తభావ సుధారసము' నస్మదాదుల కాస్వాదనసులభముం గావించిన మీ మహానుగ్రహమునకుం గృతజ్ఞుండ. సన్మైత్రికి లాభ మిట్టిదేకదా. మీ తోడిగోష్ఠి యేండ్లతరబడిగా ననుభవించి, యిపుడు దూరముండనైన నా కీమీవాక్సుధాపూరము పునరుజ్జీవితు నొనర్పంజాలెడునని ముదమందుచున్నాండ.

మిత్రి గ్రంథపరిష్కరణాదిక సందర్భములవి.

$ 'భోగేశ్వర మాహాత్మ్య' 'సత్యవ త్యుపాఖ్యానా' ద్యనేక రమ్య ప్రబంధ నిర్మాణదక్షులు. శ్రీ మల్లంపల్లి మల్లికార్జు నారాధ్యుల వారు, యులకుఋ. శే. పరిభితులౌ పురుషోత్తమ ల్ప్రపుగాంగ దక్షిణామూర్తి కృపంజాడం దప్పాలుసెన్నె.

వేంకట కవీంద్రి ఆమ్యకవి. రచితప్రబంధ మందును నున్నవ కార్యకు నణితము

ఉ. కీరితిఁగన్న యాభువనగిర్యుపనాముఁడు సత్కవిత్వధా
‡ రారమణీయత న్విజయరామకవీంద్రుఁ డనేక కావ్యముల్
భారవి ముఖ్యము ల్వెలుఁగ, వానిపరిష్కరణంపుఁ బక్కినిం
కే రెదిసంస్కరింపుమన నిచ్చమెయి న్నుతుఁ డట్లొనర్చుటల్॥

---

తే. గురులు తిరుపతి వేంకటేశ్వరకవులను మహిత నాదెళ్ల పురుషోత్తమకవివరులు
దక్షిణామూర్తి శాస్త్రియుఁదగినయండ ఏమిలోపంబుమనకుఁ? భోగేశ్వరంబ !

సంస్కృతాంధ్ర కవితా విచక్షణులు,
శ్రీ కొత్తూరి వేంకటశాస్త్రి గారు, కాపవరం

పండిత ప్రకాండులగు బ్రహ్మశ్రీ నాదెళ్ళ మేధా దక్షిణామూర్తిశాస్త్రి గారి చరణసన్నిధికి— కొత్తూరి వేంకటశాస్త్రి నమస్కృతి పూర్వక విజ్ఞప్తి:

...'బృందావనపుర గురుపీఠ' మనఁదగు మీ సాన్నిధ్యమునఁ బండ్రెండేండ్లు కడపఁగలుగుటచే ధన్యుఁడనై, మీయుభయభాషా కవితాప్రావీణ్యము, బహుళ గ్రంథవిమర్శకతా నైపుణ్యము, నన్నిటిని మించిన పరశ్రేయస్సహాన ప్రాధాన్యమును గుర్తించినవాఁడ నౌటచే నారచించిన 'ఆతిథ్యమహిమ' మను పద్యకావ్యమును 'శ్రీ సూక్తిరత్నమాల' యనుసంస్కృత శ్లోకావళియు మీ దరికిఁ జేర్చి మీ కెంతేని శ్రమ కల్పింప సాహసించుచున్నాను.

గురుపాదభక్తుఁడనౌ నాపట్ల తమరు సర్వవిధముల స్వాతంత్ర్యము నవలంబించి, యవసరమైనచెల్లఁ గూర్చుటయు దిద్దుటయు మొదలగు సహాయముల నొనరించుచుఁ బ్రాజ్ఞానుగ్రహపాత్రముల నొనర్పఁ బ్రార్థించుచున్నాఁడను.

ఇందు సంస్కృతమునఁ గొన్ని కొన్ని శ్లోకములలో మూడేసిచరణము లనే వ్రాసియుంటిని. వాని చతుర్థచరణములను బూరించుటలో, నున్నవాని లోని కొన్ని చరణములనుగాని యన్నిచరణములనుగాని మార్చినను దీసివేసినను నా కట్టిసందేహమును గలుగదని గురుభావముతో నమ్మఁ బలుకుచున్నాను.

మీపీఠికలు మా బోంట్లకృతులకు వన్నెఁదెచ్చున వౌనుగాన మీ తొలి పలుకులను గూడ వీని కనుసంధించి సర్వాంగసుందరములుగా నొనర్చి నన్నుఁ గృతార్థునిం జేయవలయునని మీకివె వందనశతము లర్పించుచున్నాను.

‡ 'భారవి' 'మురారి' 'కాళిదాస' ప్రముఖమహాగ్రంథాంధ్రీకర్తలు,
'ఉభయ కవిమిత్ర'ఁ 'ప్రతిభారవి' కవితా కళానిధి' ప్రభృతిబిరుదాభిరామ
శ్రీ భువనగిరి విజయరామకవిగారు, గుంటూరు

శా. నాదెళ్లాన్వయ దుగ్ధవారినిధిచంద్రా ! దక్షిణామూర్తి నా
మా ! దివ్యత్కవి తాభిశోభిత పదా ! మాధుర్య సుస్నేహ ది

శా. ప్రాచీనోత్తమకావ్యపాఠముల విద్వద్గోష్ఠుల న్నిర్గతా
ర్యాచీ నోక్తిపరీక్షఁ జల్లపలి యప్పారా ణ్మరంగంటి శే
షాచార్యప్రభృతి ప్రణీత కృతిసంస్కారక్రియా నైపుణిం
జూచు న్బుత్త్రినిఁ గావ్యనిర్వహణ దక్షుం గాఁగ సంతుష్టిమైన్॥

---

స్తా! ధీస్ఫురస్మిత చిహ్నితాస్య! వరమేధాయుక్త! సద్గ్రంథక
ర్తా! దాక్షిణ్యవిలాసభా గురుకృపా ధారాధ రాసేవితా!

ఉ. పేరిన మంచుకొండల గభీరత తళ్కు ద్రవద్రసప్రవా
హారభటుల్ శిరంబులు, హిమాచలమందు, భవత్కవిత్వ వి
స్తారము నందునింపును బ్రసాదము సద్రస పోషణంబు జా
ల్వారు నదీవిధంబుగ భళా! తొలిజన్మపుఁ బెంపుపోడుముల్॥

మ. కడు సౌశ్నారికళ స్సువర్ణమతుల న్నైవేయ రూపాదుల
న్నడియించు న్జనతాతిగౌరవ మెటు ల్గాంచ న్మెలుంగట్టులే
గడును న్నిసుసమీక్ష సూరికృతుల న్గణ్యత్వముం గూర్పఁ గాఁ
దడవం గ్రొత్తలెనీ సమర్థతలు? మేధా దక్షిణామూర్తికో!

ఉ॥ అచ్చునకిచ్చు మేలుప్రతియా లిఖిత మ్మది యేడుసర్గ లి
మ్మచ్చునఁ బంపికొంటి ననుమానము లుండనియట్లు మార్చి, క
న్మెచ్చున మేల్మితీర జగిమించునటు ల్సవరించి పంపుఁ డో
సచ్చరితా! శ్రమమ్ము క్షమగ సత్పురుషు ల్గణియింతురే కదా.

‘మాండవి’ ‘విద్యా విలాసాది’ బహు గ్రంథకర్తలు

శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులుగారు, ముక్తిపల్లి.

శా. శ్రీజానూనకటాక్ష లబ్ధ కవితారీతీ కృతార్థీ కృతా
త్మా! జాదెళ్లమహాన్వయాభరణ! మేధాదక్షిణామూర్తి శా
స్త్రీ! నిర్వ్యాజ మృదూ స్వభావ ముదితాంతే వాసిలోకా! కులా
ధీ జాచార పరాయణా! పరిణతోద్దేశా! నమస్తే నమః॥

ఉ. జ్యోతిషమందు, శాస్త్రముల, సత్కవితావిధి. సంస్కృతాంధ్ర శా
సాతతగంప్రదాయముల, శ్రోతకళా పరిశీలనక్రియా
రీతిని, సూత్రభాష్య విపులీకృతి దీక్ష, నఖండ పాండితీ
ఖ్యాతి వహించినట్టి కవిపాంసుడ! నీకివిగో నమస్కృతుల్॥

సీ. ముక్తికాన్తాపతీ పూరుషోత్తమకవి శ్రీ పుణ్యదాంపత్య సేవకాయ
వారణాసీపుర ప్రభృతి రామేశ్వర క్షేత్రయాత్రా శుభశ్రీధరాయ
'గురుదత్త భారతీ' వరకావ్య విరచనా సంతోషి తాశేష సజ్జనాయ
'ఉత్తమ యోగీంద్ర వృత్త' గంభీరార్థ భావనా పరిపూత జీవితాయ॥
ప్రథిత బృందావనపురస్థ వరకవీంద్ర ధీర గణనా కనిష్ఠికాధిష్ఠితాయ
చారు 'దశమగ్రిహా' 'యశోవిహార' రచన నిర్జితారాతికులశాస్త్రిణే నమోస్తు॥

మ. కవితం జెప్పెడువారు వేలు గలరీ కాలాన, సద్గానికే
మి ? విశేషం బది యేమనంగ నిట, రామేశాదియాత్రాప్తి, స
త్కవితాపద్ధతి, శాస్త్రలబ్ధి, పితృపాదస్వాయదాశాప్తి, సం
స్తవనీయప్రథ నొందఁగల్గుటకు మేధాదక్షిణామూర్తి శా
స్త్రి రథాసీందుగ్రిఁడె చెల్లుఁగాని యొరు లేరీ ? నేఁటి బృందాపురిన్॥

చ. కనులకు జోడు పెట్టుకొని కావ్యముఁ జేతధరించి, వక్త్రసీ
మను జిఱునవ్వు గుల్కు, రస మంజువచోవిధి, బోధ సేయు నీ
తిఁ గనుఁగొన్నవారికి ఫలించును జీవిత మన్నికోర్కు, లే
ననుపమభక్తి నెంచెదఁ దదాశిష మందుట లెంతవారికో !

గీతగోవిందాది గ్రంథాంధ్రీకర్తలు, శతావధానులు.

శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రిగారు, ఇంటూరు.

శా॥ మే॥ ద॥ శా॥ సారస్వత ప్రభావప్రశంస

సీ. శ్రీపాదుకాంత దీక్షాపరాసక్త్యాప్తి యోగానుభూతి మహోవిభూతి
ప్రతిభావిశేషసంపత్తి, ధారణ, శక్తి, సాహిత్య సౌహిత్య సారయుక్తి
తర్కశాసంసక్తి, చిత్కళావిస్ఫూర్తి, వివిధభాషా సుప్రవేశయుక్తి
ఆ ఖ్యాత వ్యాస జిహ్వాలేఖినీవ్యక్తి, కావ్యనిర్మితి చమత్కారరక్తి॥
పరికట మొనరింప నాదోత్థ వంశమందు హరిహరాత్మక పురుషోత్తమాత్మరూప
దక్షిణామూర్తి'రూపమై ధరణిఁ జెలఁగెఁ బ్రథితిఁ గాంచినబందరుపట్టణమున॥

తర్కవేదాంతశాస్త్ర పారంగతులు

శ్రీ కురుగంటి శ్రీరామశాస్త్రిగారు

ఆర్యాః, ప్రియసుహృదః శ్రీయుత శాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి మహాశయాః, సముల్లసంతు మామకీనాః పరస్సహస్రాః ప్రణామాః ఆయుష్మ చ్చరణసరసిజయోః- బ్రహ్మశ్రీ మద్భిర్వేదవేదాన్తమూర్తిభిః (బులుసు) అప్పన్న శాస్త్రి మహాభాగైరస్మిన్నహాని ప్రదర్శితా భవదస్త్రాత్త రాంకితా పత్రికా మయా సాకల్యమవలోకితా. భాషాతోపిచ భవతా మతీవ రమణీయా శ్యైల

# షష్ఠాశ్వాసము

## పరమార్థ విచారణము

మ. శివగంగాధిపు లిచ్చోటన్నిలువఁ దత్సేవాపరత్వంబు భా
ష్యవిశేషస్ఫురణంబుఁ గూర్పఁగ విశిష్టాద్వైతము న్ద్వైతముం
దవులంజూచిన బాటలం గనుచు నద్వైతంబె సిద్ధాంతమా
స్తవనీ యాత్మపథానుయాయితను గాంచన్బుత్త్రుఁడిబ్భంగుఁడై

శా. నానా భాష్యవిశేష సంగ్రహముఁ గాంచంజూచు చధ్యాత్మవి
ద్యా నవ్యోక్తుల రామకృష్ణులు వివేకానందులున్ రామతీ
ర్థానూనోత్తమబోధకు ల్వ్యాలుకు నయ్యైకీతిఁ జర్చింప ని
త్యానందంబును జర్వ్వవంశజుఁడు వొందన్ రామకృష్ణాఖ్యుఁడున్

మ. అరయ న్నాస్తికులంచు వేఱె కలరే వ్యాపాద మేపార నే
నరుఁడే దంభము దర్ప మేవొ యభిమానంబింకఁ గ్రోధంబు వి
స్ఫురతాజ్ఞానము లాభిజాత్యమును గాంచుం దా నెవం డాత్మనా
సురతం జెందినయట్లకాకగునె? యెచ్చోఁ గాంచ వైరూప్యమౌల్

---

యనయో ర్మనస శ్చ మహాంతమానందం జనయాంబభూవ, రచనాసరణిశ్చ
యూపాత్మకీ ఆత్యావశ్యక విషయవిభూషితా అనావశ్యక విషయవివర్జితా చ
పదాన్యమూర్ధన్యాసా మలంభవతి మనాంసి హర్తు మిత్యత్ర నాస్తి విశయగంధః,
యేచ విషయాశ్శ్రిమద్భి స్తత్రప్రతిపాదితా స్తేసర్వేఽపూర్వవర్తిన ఏవ ఖల్వ
సామ్రాజ్యస్య.........

ఏనుగు తమ్మరాజుగారు, తాపేశ్వరం

శా. ఆధివ్యాధి శతాన్వితం బయిన దేహంబందు నిర్మోహము
న్సాధింప న్సమకట్టి యోగిజన విద్యాళి ప్రభావంబుచే
రాధామాధవపాదభక్తిరతులై రాజిల్ల, మీ తండ్రిగా
రీధాత్రి న్భవదీయభాగ్యమును వర్ణింపంగశక్యంబె? యా
గాధ ల్విన్న కొలంది జిత్తమున వేడ్కల్మీఱు వేదోక్తవి
ద్యాధారంబుగఁ బూరుషోత్తముఁడు, ప్రత్యక్షంబ జన్మించిన
ట్లాధీరప్రతిభావిశేషములు, విద్యాదక్షత ల్యాసడ, న్న
మేధాశక్తి నుతింపశక్యమవునే? మీ రామహాత్ము న్సగ
ద్బోధానందరసప్రపూర్ణుల సదా పూజించువారైరి, శ్రీ
సాధాధార పవిత్రచిత్తనిలయా! సాదెశ్య వంశోద్భవా!
మేధాదక్షిణమూర్తికాత్త్రి కవితామేయ ప్రభావోదయా!

సీ. అభయంబుఁ జిత్తశుద్ధిభరిత జ్ఞానయో
గవ్యవస్థితి దానగరిమ దమము
దర్శప్రభృతి యజ్ఞ తత్పరత్వము బ్రహ్మ
యజ్ఞంబుఁ దపమును నార్జవమ్ము
నటు లహింసయు సత్య మక్రోధముం ద్యాగ
శాం త్యపైశున భూతసంతతి దయ
లింక నలోభత్వ మృదుతాప్తులు జగమ్ము
వలనిలజ్జ హాతిచపలత గాఁగఁ॥

తే. తేజ మోరిమి ధృతి శౌచ మిాజగతిని
ద్రోహ మెంచమి యతిమాని తాహతిఁగన
దైవసంపద లివియంచుఁ దనయున కెట
జ్ఞాపకముగాఁగ సత్పంథ నడుపుచుండ॥ 147

సీ. పతికన్న మున్న ప్రభాతమందే లేచి
గృహకృత్యముల దిద్ద నహరహమ్ము
పరిశుభ్రతయదెందుఁ బరఁగి యింపొందఁగాఁ
బాకశుద్ధిదలిర్చ పీఁకదనర
నతిథిపూజనమంద యత్యంతమాశ్రద్ధ
పంక్తిభేదముగాని పద్ధతిఁదగ
ధర్మవివేచనం బోర్మి కూర్మియుఁ బర
శ్రేయస్సహనయుక్త రీతులెనయ॥

తే ముపురు సుతులను గాంచి నలువుర సుతల
సిరియు సంపద పెంపంద ధరిణిఁ గీర్తి
కిరపుగా నమాయకవృత్తి నే మెలంగఁ
బార్వతీనామక స్నుష పతిహితగతి॥ 148

మ. పదుగుం డుద్భవమంద మూఁగు రడఁగ వర్ధిల్లఁగాఁ బుత్రసం
పద కృష్ణాహ్వయ పూరుషోత్తముల సుబ్రహ్మణ్యు, రాజ్యల
క్ష్మి దుహితృగ్రజగా, సరస్వతిని గాంచెంబుత్రి సావిత్రి, శా
రద గర్భస్థిత, ముక్తికాంత దివిఁ జేరన్గర్త దా నొక్కటన్॥ 149

ద్వైత విశిష్టాద్వైత పరిణామ విచారము

సీ. ఏమత మెది తెల్పునో మదికెక్కుఁ-ంప
నయ్యయి సాంప్రదాయములఁ దెలియఁ
బ్రత్యేక తత్త్వ జీవబ్రహ్మ భావన
నగుపరతత్త్వంబు సగుణవిష్ణు
వన ముక్తతావస్థ నందఱుజీవు లీ
లోకమందలి రూపమే కనంగ
న్యూనాధికము యథాయోగ్యమానానంద
మందుటే ద్వైతమై యలరుసాట॥

తే. జగతిఁ బుట్టుచు గిట్టుచు యుగయుగముల
దివికిఁ గోటానఁ గోట్లై యొసఁగిరిగిన
వార లెల్లరు స్వర్లోకవాసులౌచుఁ
జనినవారికి నిచ్చుటల్ స్వాగతముఁగ॥ 150

సీ. శ్రీ సూక్ష్మ చిదచిద్విశిష్ట చైతన్యరూ
పమె స్థూల తత్పర బ్రహ్మము యగు
నారాయణుని సృష్టిచే రచింప నచిత్త
శశ్వర ప్రకృతి జీవేశ్వరులయి
శేషశేషిత్వముల్ చెలఁగఁ బ్రపత్తిచే
స్థిరదివ్యదేహానఁ బరమపదము
సాలోక్య సామీప్య సారూప్యముగ విశి
ష్టాద్వైత ముక్తిగా నవఁ గనుటను॥

తే. జ్ఞానమార్గ జగన్నాటకం బెకైన
స్వర్గసీమకు నిజపుత్రి సనెనుగాన
మనమునం దదిచింత చేసినవిధానఁ
గనఁగ నమ్యోను స్వప్నవీధి నిటు తోఁన॥ 151

శా. శ్రీ కైవల్యపదంబుఁ జేరుటకు నిశ్చింతం జన న్ముక్తికాం
తాకాన్తామణి యీశ్వరాబ్దమున నానానిర్జరానీకముల్

వైకుంఠంబున దర్శనార్థ మరుగ న్ద్వారప్రవేశంబు గా
నౌ కాలంబని పుష్యశుద్ధమున గణ్యంబైన యేకాదశిన్॥ 152

శా. భూమి న్వీడుచు స్వర్గసీమ కెపుడే నోబ్బనైన నానాజన
స్తోమం బయ్యెడఁ గానరా నొకట సంతోషంబుగాఁ గాంచి, శ్రీ
రాము "న్భావ! నవాబ్దము ల్గడవఁ బర్వంబయ్యెఁగా నేఁడు, ని
న్నీ మూర్తంబునఁ జూడఁగల్గ* ననఁదా నే మీపు రానం చనన్॥

శా. వ్రాఁత ల్మానునె? భూతలంబున జనవ్రాతంబు ప్రాక్కర్మని
ర్ణీతం బైతగు నంతవట్టె నిలువ న్నేర్చుం గదా సిపిటుల్
మా తోఁబుట్టువు, రాజ్యలక్ష్మి, గుణసంభావ్య న్ధరన్వీడిరాన్
ధాతృప్రేరిత మయ్యెఁగా కెటు శరద్ద్వావింశతిం గానగున్?॥

క. మనకేమికాని నాకయి కనిపెంచిన వార లడలఁ గలనగ లెల్లం
గొనిపోయి మీసహోదరుఁ డనువా నొండొకరితలకు నవియిడి
మురియున్॥ 155

క. మొదలిది వోఁగానెందఱ మొదలిదికాఁగూడదిట్టు మదితలకగునే
పదిమందిలోన లొచ్చయి కదల న్మదలంగ వీలు కలుగదు గదవే॥

క. కలకాల మార్తినొందుచుఁ గలికాలము నెంచుకొంచుఁ గడగండ్లు
వడన్। వలసిన దుర్గతిఁ గాంచుచుఁ దలిదండ్రులు సూడలేక
తలడిల్లవలెన్॥ 157

క. తానెంత చేతఁజేసిన నానందము నందరెవ్వ రవియివి యొంచం
గానగు వారున్వీరును జేసెడు పొట్టకుఁగొఱంత చెందకయున్నన్

క. అత్తల కోడండ్రింబును నార్తిను లింకెవరివైన నొందక యిటులే
నిత్తఱి ముత్తైదువుగాఁ జిత్తము శాంతింప వచ్చి చేరితి నిటకున్॥

మ. అనుచుంబల్కెడు నంతలో, సుకృతు లయ్యుద్దేశము న్వీడి వ
చ్చినవారెల్లరు తండతండములుగాఁ జేరన్ రమానాథ ద
ర్శనముం జేయ సరోవరంబుదరి నిచ్ఛావర్తులై వీరలుం
జని యాచ్చోవసియించి యొండొరులతో సంభాషణల్సేయుచోన్

అద్వైతపరిబోధము

మ. ఇహమం దద్వయముక్తి సాధనపునై యెంతెంతొ చింతించుచుఁ
బృహదారణ్యక వీథులం దడవువానిం బుత్త్రినిం గాంచి, య
ద్వహ మాపర్య నిజప్రవర్తనముగా వర్తిల్ల బోధించుచుఁ
బహుధాన్యాబ్దపు మార్గశీర్ష సిత సంభావ్యాంకపంచమిఁ
మ. మతిమంతు న్నియమైక బద్ధ చరితు న్మాన్యు న్గుణావాలు, న
ర్చితమేధా నయ పాదపద్మయుగళి న్శిష్టాగ్య్రు, లఘ్వాశి, న
య్యతవాక్కాయమనస్కు వీతబలదర్పాహంకృతి న్నిర్మముఁ
హతకాము న్విగతగ్రహుఁ బరమశాంతాకారయుక్తిం గనఁ
ఆ. కర్మసహిత జీవగణ మవిద్యన్సృష్టిమున్న బ్రహ్మమందయున్న కతన
శబల మదిగ భూతచయపుఁ బంచీకృతి నీవపంచమిట్టులేరుపడుట
ఉ. భాసుర నాట్యరంగముగ భాసిలు దేహమునం దగుం జిదా
భాసుఁడు ఱేఁడు, మానసము వర్తిలు మంత్రిగ, బుద్ధి నాయికా
న్యాసము నందఁగా, నసువులై భటు, లింద్రియపాళివాద్యముల్
గా, సభ శబ్దముఖ్యములు కాలమె జాగ్రదవస్థ స్వప్నముఁ॥
తే. సారిది నటనమె లేమి సుషుప్తి యందు
సాక్షి తానాట ననుభూతి సరవిఁ బలుకు-
స్వప్న మంతఃకరణయుక్తి జాగ్రత నది
యింద్రియంబులుఁ దోడుగా నెసఁగు నెఱుఁగ 165

జీవన్ముక్తావస్థ.

సీ॥ చిత్తవృత్తి నిరోధ సిద్ధి గురూపదే
శము నామరూపాత్మక మిల నుడుప
ఖేచరీముద్రతో నేచింతవిడి నాద
బిందుకళాతీత మంద నిలిపి
కన నవిద్యానివృత్తి నగు శుద్ధాంతఃక
రణము విజ్ఞానాప్తి బ్రహ్మమయము
గా నఖండానంద మాను దానను ధ్యాన
పు సమాధి మించిన పూజ లేమి॥

తే॥ సర్వ పాపనివర్తక మూర్తి నదయి
జగ మిదెల్ల మిథ్యాప్రహాతముగనె త్రోప
బ్రహ్మ మంతగ నజహత్తి వఱల నబ్బు
నదియె యాడుప్రి జీవన్ముక్తి యంచుఁ బలికి॥ 166

ఉత్తమ యోగీంద్రాద్వైత ముక్తిప్రాప్తి.

సీ. సదస ద్వివేచ నాశక్య మాయ నెసంగ
బ్రహ్మచైతన్య మీశ్వరుఁడనంగ
స్వాధీన మాయకుండై; —యవిద్యా ప్రతి
బింబ చైతన్య జీవితను లోఁగ
వినుత సత్కర్మాచరణలబ్ధ చిత్తశు
ద్ధిని ముముక్షుత బ్రహ్మమ నని తెలిసి
లోకసంగ్రహముకై యే కర్మముగ నిర్వి
కార జీవన్ముక్తుఁ డై రహించి॥

తే॥ జగ మసత్యముగ నమనస్కత కిరనయి
సాక్షిభూత మానంద రస ప్రపూర్ణ
సత్యవస్తువునంద నిశ్చలత నిలిచి
యందెఁ బురుషోత్తమాప్తి న య్యసమ యోగి॥ 167

---

## ఉత్తమగురుస్మృతి

శ్లో॥ యేషాం వాగభిషేచనేన విదుషాం బృందావనే పత్తనే
సంవృద్ధా స్సుగుణాంకురాః జడధియో ప్యుత్ఫుల్ల చేతోంబుజాః
యే గేయాచరణ ప్రబోధిత పథా స్సత్త్వప్రధానోదయాః
తే శ్రీ సాదెళ పూరుషోత్తమబుధా స్సత్కీర్తిమాత్రోజ్ఝితాః॥

మ. ఇలలో మాతకు నీకు లేరు, పిత, కొందేఁ బూత మామాత వో
దలియాం దండ్రియుఁ దానయై మనిచె నే దాక్షిణ్యభావం బితం
డలఘుప్రజ్ఞుఁడు సార్థకాహ్వయుఁ డనన్యాదృగ్యశోభాగి, ని
ర్మల సద్యోగి, విరాగి, యోగిఁ గద స్వార్థత్యాగి, యీ ట్లౌనుమా ?

సీ॥ యవనాంగ్ల పారసీ కాంధ్రగీర్వాణ భాషావైదుషీ శేముషీ విభవుఁడు
బహు చిత్ర బంధ-గర్భకవిత్వ మహితసామ్రాజ్య సర్వస్వ ధురంధరుండు
ద్వాత్రింశ దీద్యకథాపార రుచిర హిందూస్థాన రూపక స్తోమక ర
ణాలక దర్పణ ద్యోతిత ఖ్యాతి సాగమసార కృత్ప్రతా కలితసుమతి॥

ఫలశ్రుతి.

క. ఈవిధమునభావించిననావిష్కృతతత్త్వయుక్తిననయంబెనయన్
జీవబ్రహ్మైక్యంబున జీవింపం డెవఁడు సద్వివేకమయుండై ?

ఉ. ఎత్తి భవంబు లి య్యలల నెన్నిటఁ దేలెనో! నేఁటి కివ్విధిన్
దత్తరణంపు టద్వయపుఁ దత్త్వ మెఱుఁగుచుఁ దా నెసంగ నా
చిత్తవిశుద్ధితో మెలఁగి, చిన్మయమం దిటు లైక్యమందఁగాన్
'ఉత్తమ జీవయాత్ర' యన నొప్పు ధరాస్థలి సుస్థిరం బిదై ॥169

మ. కవనార్థంబె జనింపలే దితఁడు లోకంబం దనుష్ఠేయధ
ర్మ విధానైక నిధానమై వెలసె శర్మంబొప్పు సత్కృన్మర

---

సర్వధర్మజ్ఞుఁ డుత్తమాచారపరుఁడు సాధుసత్తముఁ డనుపమ బోధకుండు
దక్షిణామూర్తి భక్తుఁ డుద్యద్యశుండు హారితగోత్రుండు నాదెళ్ల పురుషవరుఁడు॥

మ. అమలోద్యద్ద్యుతి యస్తమించె బహుధాన్యాబ్దంబున న్మార్గశీ
ర్షమునందు, న్సితపంచమిన్, రవిని, బూజ్య ప్రాజ్య సద్వర్తన
ప్రముఖ జ్యోతిషధర్మశాస్త్రనిధి, విద్వద్వర్ణ్య వాగ్వైఖరీ
రమణీ యోత్తమయోగి, భౌతికశరీరత్యాగి కా, నీగతిన్॥

సీ. కవితావిలాసిని నవిరళబంధంబులం దింకఁ జొక్కించు టరుదవుఁగద
కృతిసతీమణి గర్భవతియైన పోడిమితో నెప్పు డొప్పారఁ గానముగద
యవనాంధ్రజాతియు నవచఃప్రబోధమ్ము రూపకాంగన కపురూపము కద
తల్లియుం జెల్లియుం దనయుమైనయబోధ. 'బుధవిధేయను' లెందుఁ బొదలవుగద॥
భావిఫలములు యుక్తిగోఁ బలుకుటరుదు ప్రతిఫలము లేని యుపకారపరత సున్న
శాంతి దాంతి యాస్తిక్య మార్జవముఁ గనము పూరుషోత్తమకవి నేఁడు వోవుకతన॥

మ. కవితామానిని! షష్టిపూర్తియవుటం గావ్యక్రియానల్ప శి
ల్పవివేకంబునఁ బూరుషోత్తమ బుధాలంబంబున, న్నవ్యబం
ధవిశేషోల్బణ గర్భ నిర్భర వచో నైపుణ్యముం గాంచి, మిం
చి, విరాజిల్లితి, వీడు నీ కిలఁ బ్రశంసింపఁగ లే రెయ్యోకన్॥

శా. స్వస్థానంబును వీడి సంచితమునం బ్రారబ్ధమే 'కృష్ణజ
న్మస్థానం' బన నిట్టిదేహమును సంపాదింపఁగా, యోగమా
ర్గస్థంబై కలకాలము న్గడపి మోక్షప్రాప్తిచే నిష్ఠితుల్
స్వస్థం బైతగు సత్తమాత్మయె ప్రశంసాపాత్రమా సేయెడన్॥

తే॥ కాముగవ్యల కట్నాల కాసఁ గొనక ప్రౌఢలైనను దుదకు గర్భవతులైనఁ
గృతికుమారికలను గొంటికత మధికము దక్షిణామూర్తి! శ్వశురులఁ దాల్మిఁ గనవె

క్తి, వెసం గొల్పఁగమార్గదర్శియయిధాత్రిన్ సార్థకాఖ్యాసుఁడై
యవతారం బిటు లంచె నంచు ననసా నాదర్శమై వెల్గఁగాన్॥

ఉ. ఇట్టిచరిత్రము ల్చదువ, నెవ్వరు విన్న మనంబులందు, ము
న్నెట్టితలంపులున్న, నవియెల్ల నడంగి, నిరస్త దుష్కృతిం
జెట్టతనంబు వాయనగు చెద్దయములే పొడకట్ట నెట్టనన్
మెట్టఁగఁజూతు రుత్తమసమీహిత సత్పథమందె యెయ్యెడన్॥

కృతిసమర్పణము.

ఉ॥ భూతలమందు నాంధ్రకవి పుంగవుల న్గణనీయులైన వి
ఖ్యాతుల కావ్యకన్యకల కాంతుఁడవై తగు దక్షిణాస్య ! యిం
పై తగు వన్నెచిన్నెలకు నాకరమైనను గాకయున్న నీ
ప్రీతి దలిర్పఁ జేయనగు పేర్మి నిఁ దండదె ? భక్తగాథయై॥ 172

శా. ఏనా వ్రాసినదిద్ది ? యెన్నఁటికి గానేకాదు, నీవే యిటుల్
పూన న్నేఁటికిఁ బూర్తికాఁగలిగె, నింపుం బాలకానీకముం
గాన న్దద్ధృదయైకవర్తి వవుచుం గల్గింతు, సర్వంబు నీ
వైనం గాని దిఁకేది ? చిన్మయ మహాత్మా ! దక్షిణాస్య ప్రభూ ॥

ఆశ్వాసాంతము

కందద్వయ గర్భిత నాగబంధ చంపకమాల.

శివ ! భవనాశ! కావఁ గరిచీరి ! వెతన్గన నీవ, నీసరిన్
నవమవు నాఁగ, దేవకలనాలవ మిందె శమావపాత ! లా
వవియవ నా, నభావమునన్నా నవనందిఁగఁ బోవనీమి, నా
నవ నవ మీనఁ దావిఁగొను జానువెసన్ గన నీవు తా ననున్॥174

గర్భిత కందములు.

1. భవనాశ ! కావఁ గరిచీరి వెత న్గన నీవ, నీసరి న్నవమవు నా
నవు నాఁగ, దేవకలనాలవమిందె, శమావపాతలా వవియవనాన్

---

శా. ఏ మేథామయు పాదపద్మములయందే చిత్త మాయత్తమౌ
నేమంబారఁగ బూరుషోత్తముఁ డెసంగె న్ధాత్రి నామూర్తి ప్ర
జ్ఞామూలస్థిత దక్షిణాస్యుఁ డిడ మోక్షప్రాప్తిఁ దత్కీర్తి యీ
భూమి న్స్థిరమౌచు, యోగి పథము న్బోధించుట న్మించుత॥

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రి.

కంద ద్వయగర్భిత నాగబంధ చంపకము.

2. అవనానభావమున నౌ నవకందిఁగఁ బోవనీమి, నానవ నవమీ
నవమీనఁ దావిఁ గొను జాను వెనగ్గన నీవు తానను న్నవభవనా!

—♦ అనేకవిధ పదపద్యసహస్ర గర్భితము ♦—

సీ॥ వరనర వరదాత! పరగతిఁ గననౌను
బరుఁడవు వాకొనఁ బఱప శక్తి
స్మరపర మరుధారి! చరమతి చననౌను
గురుఁడవు కైకొనఁ, గఱప వ్యక్తి

గరహర గరిహర ! కరుణను మననౌను
స్థిరుఁడవు సాకఁగ, జరప భుక్తి
ఖరశర కరిహరి ! గరిమను విననౌను
హరుఁడవు నీకిఁగ నెఱప భక్తి॥
తే॥ కామ షడ్వర్గ నిర్గతి, గర్భితముక్తి !
వామ కాయార్ధ పార్వతి ప్రథితయుక్తి !
వ్యోమ గంగాజటాయుత, యుదితరక్తి !
భీమ సంగ్రామ దర్పిత, విదితసూక్తి॥ 175

గర్భితముల మాదిరికి

చ. పలుపను శక్తినౌ పరుఁడ ! వాణినౌ వరదా వరానరా !
కలుపను వ్యక్తినౌ గురుఁడ ! కైణినౌ మరుధా స్మరా పరా !
జరపను భుక్తినౌ స్థిరుఁడ! సాకఁగనౌ గరిహా గరా హరా !
నెఱపను భక్తినౌ హరుఁడ ! నీకిఁగనౌ కరిహా ఖరాశరా !
క. వరనర పరగతి గననౌ పలుప న్శక్తి, వరదాత ! వాణినఁ బరుఁడౌ
స్మరపర ! చరమతి చననౌఁ గలుప న్వ్యక్తి, మరుధారి ! కైణిన గురుఁడౌ
ఆ. వరనరవరదాత ! పరగతిఁగననౌను పరుఁడ ! వాణినంగఁ బలుపశక్తి
స్మరపర మరుధారి ! చరమతిచననౌను గురుఁడ ! కైణినంగఁ గలుపవ్యక్తి॥
తే. పరుఁడ ! వాణిన, వరనర ! పలుప శక్తిగురుఁడ కైణిన,స్మరపర ! కలుపవ్యక్తి
స్థిరుఁడ ! సాకఁగ గరహర! జరపభుక్తి హరుఁడ! నీకిఁగ, ఖరశర! నెఱపభక్తి

ద్విపదలు

వరనరవరదాత పరగతిగననౌ। స్మరపరమరుధారి చరమతిచననౌ
గరహరగరిహర కరుణనుమననౌ। ఖరశరకరిహరి గరిమనువిననౌ॥

మధురగతి రగడ

గరహర గరిహా కరుణను మననౌ ఖరశర కరిహా గరిమను విననౌ॥
సీ. పరగతిగననౌను వరనరవరదాత పరుఁడవు వాణినఁ బలుప శక్తి

[ఇట్లు వేల లెక్క కేవే వెన్నెన్ని తేలినానో తెలియఁదగు ప్రస్తారక్రమము విస్తారముగా వ్రాయఁబడిన శ్రీ పురుషోత్తమ కవీంద్ర కర్తృకములౌ శ్రీమదద్భుతోత్తర రామాయణ శ్రీ కృష్ణానదీమాహాత్మ్యములం జిత్తగించునది.]

క. వరకవి సాదెళ్లాన్వయ పురుషోత్తమ జీవయాత్ర, పుత్త్రికకృతక
ద్గురుచరిత దక్షిణామూర్తిరచితమాశ్వాసమిందిదియొమంగ్ధబో॥

శ్రీ మేధా దక్షిణామూర్తీశ్వరార్పణమస్తు.

మిత్రచ్ఛాత్రాద్యనుతాపములు

అవధాని శిరోమణి 'మహోపాధ్యాయ'

శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు, గుంటూరు

'శోకరీత్యా దుర్వార్తాశ్రవణ మయినను మీబోంటి సుపుత్త్రుల చేతుల మీదుగా శ్రీ శ్రీ మీ నాయనగారి దీక్షాతిక దేహత్యాగ మొనర్చినా రనెడు వార్త సువార్త అనియే నా అభిప్రాయము. మాబోంట్లకు మిత్రరత్నములలో నొకరత్న మంతరించినందులకు విచారమే. మీకో, పితృవియోగముకూడ దుస్సహమే. 'తాం స్తితిక్షస్వ భారత' అని కదా శ్రీ కృష్ణోపదేశము. ధైర్యన శోకశక్తి తగ్గిన దని చెప్పనగు. శేషా స్సర్వే సుఖితో భవంతు. ఇత్యాశిషః.

సుప్రసిద్ధులైన 'తిరుపతి వేంకటకవుల'లోని 'కళాప్రపూర్ణ' శతావధాని

శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు, కడియం

(ఛాయాచిత్రావిష్కరణ సమయమున కందింపఁబడినది.)

ఉ. నాదెళ్ల పురుషోత్తముఁ డనంత మహాసుగుణుండు కైతకే
కాదు మహోన్నవిద్యలకొ గడిమట్టము, దాత, శ్రౌతస
ద్వైదికకర్మదీక్షితుఁ డవంధ్యము తత్కవిజీవితంబు, వి
ద్యాదయితుల్ నుతించుటకు సర్వము, నిక్కము నే నెఱుంగుదున్॥

'వైయాకరణ కేసరి' 'విద్వత్కవి సార్వభౌమ'

శ్రీ పుల్య ఉమామహేశ్వర శాస్త్రిగారు, ముంగండ.

శ్లో॥ శ్రీ నాదెళ్ల కులార్ణవామృతకరో వాణీవధూ వల్లభో
గణ్య శ్రీపురుషోత్తమ స్సుకవితా సారస్య లక్ష్మీపతిః
దాతా, ధార్మికపుంగవోఽవనిసుర వ్రాతాగ్రణీ; ర్దుష్కలౌ
కాలే యాహిత ధర్మవిప్లవభయా ద్బృందావనేఽస్తంగతః॥ ౧

శ్లో॥ ధర్మో యత్ర గృహాశ్రమోచితవపుః ప్రానూత దివ్యంసుఖం
జ్ఞానంచ ద్వివిధం ధృతో విధివృతౌ తం త్వర్థకామావిహ
తజ్జ్ఞానం భవబంధముక్తి మధునా మూర్తి ర్యథాపార్థివీ
కీర్త్యాత్మా న మిహ ప్రబద్ధమధురం రస్యాం రసజ్ఞై ర్బుధైః॥ ౨

శ్లో॥ ధన్యోఽయం పురుషోత్తమః క్షితికవి ర్ధర్మ్యైః వృత్తిం పథా
ఘోరే యాపితవా న్కలావిహ మహా నన్వర్థనామా నిజాం
వాణీయం తు చతుర్విధా సుకవితా రూపేణ లక్ష్మీర్ధనా
కృత్వా భూ ర్నిజరూపతోఽసకృదపి ప్రేమ్ణాఽభజన్త స్స్వయమ్!

శ్లో॥ శ్రీవిద్వత్కవిరత్నేన పుల్య కుల్యేన ధీమతా
ఉమామహేశ్వరవిదా చిన్త్యతే పురుషోత్తమః॥

వ్యాకరణ వేదాన్తశాస్త్ర పారంగతులు శతావధానులు

శ్రీ వేమూరి నరసింహశాస్త్రిగారు, బాపట్ల

శ్లో॥ రూపేణ సామ్నా యశసాచ విద్యయా కవిత్వ పాండిత్య తపోమహత్త్వతః
చరిత్ర సత్పుత్రి పవిత్రతాదిభి ర్నాదెళ్లవంశ్యః పురుషోత్తమో ధృతః॥ 1

శ్లో॥ సహస్రశ స్సన్తి కవీశ్వరాః కలావితం విచిత్రా కవితా క్వ దృశ్యతే
య ద్గర్భపద్యేషు రసోఽధికః స్ఫుర త్యైనస్యల భోఽస్య, కవే రనుత్తమః॥
చతుర్విధ విచిత్రి సత్కవితయా ప్రతీతోఽధికం
సభాసు మధురం మృదుస్వరచతస్సు సంభాషణే
క్షమోఽత్ర నహిదృశ్యతే బుధవరః కవి ర్ధీదృశః
య తోఽత్యజ దిలాం కవి ర్దివ మలంకరోతి స్వయమ్॥ 3

శ్లో॥ పురుషోత్తమపండితస్య నూనం త్రిదివా వాసవశేన భూతలేఽస్మిన్
సుజనత్వ కవిత్వ యో ర్గరీయా నభవ ల్లోప ఇతి ప్రబోధయామి॥

శ్లో॥ శ్రీమ ద్వేధాదక్షిణామూర్తిశాస్త్రి భావత్కృ శ్రీతాతపాదః కవీంద్రః
లబ్ధ్వా కీర్తిం త్వత్కృతే ఽనన్యలభ్యాం లబ్ధుం కీర్తిం స్వర్గతో మాశుచ స్త్వమ్॥

వైయాకరణులు, సూక్తిరత్నమాలాతిథ్యమహిమాది గ్రంథకర్తలు,

శ్రీ కొత్తూరి వేంకటశాస్త్రిగారు, కాపవరం, అమలాపురం తా॥

శ్లో॥ శ్రీదక్షిణాస్య చరణాబ్జ సమర్చనాత్త విద్యావివేక విధివాది విరాజితస్య
నాదెళ్లవంశ్యపురుషోత్తమ సత్కవిందో ర్జీయతాంభువి సనామలకీర్తిమూర్తిః॥

తే॥ ఉభయలోక సుఖంబుల నొందఁగోరు సజ్జనావళి కెఘను సాధుచరిత
సదము లాదర్శమౌచును జానుమీఱు నట్టి యుత్తమ గురుఁడయ్యె నష్టమూర్తి॥

మ॥ గురుఁ డస్తంగతుఁ డంచు మాఘమతి లోఁ గుందఁగా కుత్తుల్ దెల్పె, భా
స్కర బింబాంతర భేదకోత్తమ తపశ్చర్యం దతండంచు, సు
స్థిరమై తద్గుణకీర్తికాయము ప్రకాశించెం గడు నిత్యమై
పర విద్వత్కవి మండలీ వ్యాదనులా వాసంబుల న్నిచ్చలున్॥ 4

సీ॥ సద్వంశసంభూతి సకలవిద్యాధృతి బహుళభాషాజ్ఞాన పాటవంబు
సుకవిత్వచాతురి, సుభగవాగ్వైఖరి, రసికవిద్వన్మనో రంజనంబు
ధర్మానుసరణం, బుదారవితరణంబు, సాధూపకార విచారపరత
సంతతసంతుష్టి, సాధువిద్వద్గోష్ఠి, నిరతప్రతిగ్రహ నిశ్చయంబు॥
సత్య సంరక్ష, నైతికాచారదీక్ష, యార్యజనరక్తి హారచర ణాబ్జభక్తి
ప్రకృతిసిద్ధ విభూషలై పరఁగు 'గాన' నర్థవంతంబు పురుషోత్తమాహ్వయంబు॥

ఆ॥ పురుష రత్నమైన, పుత్త్రినీ పౌత్త్రిలఁ బౌత్రికలను భోగ, భాగ్యములను
బడసి డెబ్బదేడు, వత్సరంబులు సనఁబరమపదము నంచె, గురువరుండు॥ 5

క॥ క్షరమున కక్షరమునకుం బరమగు పరమాత్మ పదము (గ్రాహించుటచేఁ
బురుషోత్తమాభిధానము పరఁగెను సన్మార్గమా దు భగవతున్తి కీర్తి॥ 6

ఆ॥ కడఁక ముక్తి కాంతఁ గైవసమొనరించు కొన్న (ప్రోక్త గురుఁడు పిన్న వాఁడె
యపుడు ముక్తిఁ గాంచు, తేరీతిఁబోఁగఁగును శిజ్ఞానిగుట్టుఁ దెలియఁగల రెపరులు?

క॥ జనకుఁడె పుత్త్రిం డనుపాత్రి మినుకులఁ గని తత్తనూజు, మేధానిధి స
ద్గుణశాలి దక్షిణామూర్తిని బోల్చఁగ భక్తి దేవ, దేవు నుతింతున్॥ 8

భోగేశ్వరమాహాత్మ్య 'సత్యవత్యుపాఖ్యా' నాది ప్రబంధకర్తలు

శ్రీ మల్లంపల్లి మల్లికార్జునారాధ్యులవారు యలకుఱ్ఱు.

శ్లో॥ వాదశ్లాన్వయ సింధో రిందు స్సర్వజ్ఞ శేఖర స్స్వాత్మాత్
పురుషోత్తమ ఆఖ్యాతో యాతర్జ్యోతిః ప్రవర్తకో వాకం॥ ౧

శ్లో॥ బహుధాన్య! త్వయి బహు ధా న్యత్వం న విలోక్యతే య దన్యత్వం
బహుధా బహుధాన్య స్త్వం సద్విజరా డ్విప్రియోగ హేతు ర్న॥ ౨

శ్లో॥ భోమార్గ శుక్లపంచమి తే మార్గో నహి సమంజసో యస్మాత్
సత్పురుషోత్తమ విరహో హేతు స్త్వం భవసి పాషాణ్న॥ ౩

శ్లో॥ భోపురుషోత్తమ దేశిక! భువి కృతకృత్యః కృతీ పరంధామ
ప్రవిశ్య స్వస్థో నివససి శాంతి ర్విశ్రాంతిరస్తు తే సతతం॥ ౪

శ్లో॥ అస్తు స్వస్తి బ్రహ్మణ కృతిసంతానాయచ తవ సంతత్యై
కల్యాణా మస్మాకం తత్యై జగత స్తతోఽస్తు సంభద్రం॥ ౫

వ. మిమ్ము నేను బరమేశ్వరునిచే లోకమునకుఁ దండ్రికొడుకుల నడవడికను
బోధింపఁ గలందులకు సృష్టింపఁబడిన వారినిఁ గాఁ దలంచుచున్నాను.

శ్రీ శబ్దార త్యాగరా జాదిహరికథా నేక నిర్మాతలు, 'వాగ్గేయకారరత్న'

శ్రీ హరి నాగభూషణంగారు బి, ఎ, వకీలు, బందరు.

శా॥ శ్రీ వాజశ్ల కులాబ్ధిసోముఁడు కళా, శేషాహి భూషుండు, స్వా
రాధీనుం డలపూరుషోత్తమ బుధుం డామ్నాయవిజ్ఞుండు, స్వీ
యానుష్ఠాన పరార్థమాన చరితుం, డవ్యాజచారిత్ర వి
జ్ఞానానందవిభూతి విస్తృతి విరాజన్మానికల్పుం డహా!

సీ॥ ఇంద్రియనిగ్రహ ప్రశమితైనమణశీలసుఁ డేకపత్నీ తా
పాందర్యయశఃప్రమాత మనసా వచసా తను సాధుశీల ని
స్తంద్ర వచోవిలాస కవితా వనితా వినతాధిసేత, భూ
మీంద్ర సమర్చనార్య మహితేడ్యపదుండయి రాజిలె న్మహిన్॥

చ॥ తెనుఁగున హిందిలోన గణుతింప శతాధిక కావ్యరాజముల్
జనునుతిపాత్రముల్ రచన సల్పిన మేటి కవీశ్వరుండు, స
న్మునివలె జీవయాత్ర యఘముల్ దరిఁజేరకయుండఁ గడ్పె ని
య్యనఘుఁడు మద్గురుండు పరమాద్భుతముల్గద తచ్చరిత్రముల్॥ 3

సీ॥ ఎవఁడు గీర్వాణాంధ్ర హిందీభాష్యద్యనేకభాషాకోవిదుండు విజ్ఞానమూర్తి
ఎవఁడు చతుర్విధకవితల నాటకాదులు రచించి యశంబు నిలుపఁగలిగె
ఎవఁడు జ్యోతిషవిద్య నెనలేని పాండితిన్ గ్రంథంబు లనుజేసి గణుతికెక్కె
ఎవఁడు శాబ్దికమైన సువిబోధనంబుకై పలునిఘంటువులను వాసెఁగూర్చి॥
దక్షిణామూర్తి మంత్ర విద్యాప్రభావ సిద్ధసంకల్ప నిస్స్పృహాశేషవిజ్ఞ
తా నిధి బ్రహ్మకైవల్య దర్శనుండు పూరుషోత్తముఁ డల పురవైరి సముఁడు॥

మ. బృహదారణ్యము వేదమస్తకము సద్వృత్తుండె 'సద్బ్రాహ్మణః'
ఆహాహా! ఔ ననుమానముం దెలిసి నిత్యబ్రహ్మచర్యాప్తిమా
నహృదాకృష్టిఁ బరార్థ సేవనమునన్ బ్రహ్మణ్యమూర్ధన్యుఁడై
యిహముంబాసిన పూరుషోత్తముని నే నెంతు స్గురు న్భక్తిమైన్॥

శ్రీ శఙ్కరవిజయకూర్మ పురాణాద్యనేక గ్రంథ కర్త,
శ్రీ భమిడిపాటి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారు, మోపిదేవి

శా॥ అన్వర్థాభిధుఁడై వినిర్మల యశోవ్యాప్తాఖిలాశాంతుఁడౌ
మహాభుస్గురుఁ బూరుషోత్తముఁ గవిణ్మాన్యు వ్వదాన్యు న్సుధీ
ధన్యున్ సాంద్రకృపారసాంతరు భవ ద్గర్భంబునం బెట్టుచున్
బెన్వంతం గలిగించితే జగతికో, పింజారి కాలాహ్వయా!

మ॥ స్మిత మాస్యంబునరాజిల న్మితముగా మృద్వంచితోక్తి న్శ్రుతి
స్మృతిమూర్తి ప్రకరంబులం దెలిపి సచ్ఛీలాఢ్యులన్గా నిజా
శ్రితులన్ జేసెడు పూరుషోత్తము విపశ్చిద్వర్యు సద్వర్తనుం
గృతకుం డెవ్వఁడోతక్క నేబుధుఁడు సంకీర్తింపకుండు న్ధరన్॥ 2

చ॥ ఎనుబదివత్సరంబులు నహీనమనోద్రఢిమం బెసంగఁ దీ
యని రసమొల్కఁగా నమలమౌ కవిత న్వెలయించి భవ్యకీ
ర్తి నెగడు పూరుషోత్తము, సుధీమణి మౌళివతంసు, సత్కవీం
ద్రుని, బహుధాన్య వత్సరమ! దుష్టమనస్కత మ్రింగివైచితే! 8

మ. తనకున్ముక్తికి వధూటి జోటియయి, మేధాదక్షిణామూర్తి, జ్ఞా
ననిధి న్మానుఁగఁ గూర్చి యాత్మ్యమగు సానందంబు నందించి భూ
తనయం బోలెను మున్నుగా దనువు నంతర్ధాన మందింప నా
పె నదృశ్యం, న్స్వార్థత న్సతిం గవయ నీ, విజ్ఞుండు మేని న్విడన్. 4

ఉ॥ పజ్జకుఁ జేరువానిఁ దనపట్టిగఁ జూచు ననూనవత్సలా
వజ్జయ దీక్షణంబుల శివంకర మార్గమునందు దిద్ది, వి
ద్వజ్జనమాన్యుఁ జేయుఁ గవితావనితా హృదయంగముండు మా
యొజ్జ పవిత్రవృత్తి. పురుషోత్తమసత్కవి మమ్ముఁ బ్రోవఁగా॥ 5

మ॥ జననం బందినదాది యెందునుక దోసంబద్ది యం చొడ్డు ప్రే
లిని జూపింపఁగరాని వాఁడవయి నిర్లిప్తుండవై, శక్తి మిం
చని యీవిందగి చేయిచాపక బుధశ్లాఘ్యుండవై పుత్త్రపౌ
త్త్రి నయార్థ్యంబును బూరుషోత్తమకవీంద్రా! కంటివి పుణ్యరతా॥ 6

సీ॥ క్రమమాకైతఁ జక్కఁగ నాల్గుతెలుఁగుల బాసల నాలింటఁ బలికెనెవరు
దినచర్య యందు సందియము రానట్లు జాతకభాగ మెవరు వింతగ వచించి
రామ్నాయపథమునం దడుగుతప్పక పాల్చి యాస్తికతం గరం బలరె నెవరు
తగ నాయురుంపునిదానంబు గుర్తించి సులభవైద్యంబును దెలిపి రెవరు॥
శమము, దమము, తితిక్షయు సత్యసూక్తి దేవభక్తి పరోపకృతి, సుజనరతి
మున్నగాఁగలగొనములఁ జెన్నమీఱునట్టి పురుషోత్తముండు దవ్వయ్యెమాకు॥

ఉ॥ నీ కవపాన మెక్కడిది? నీరజబాంధవ కైరవాప్త లెం
దాక రహింతు రందనుకఁ దావక భవ్యయశశ్శరీర మీ
లోకమున నహింపు, హరిలోకమునం బురుషోత్తమ ప్రశ
స్తైకతఁ జేసి పొందితివి శాశ్వతమా నమృతత్వ మెప్పగన్॥

క॥ పరతత్త్వనిరతుఁడై యం తరమును విషయములనుండి తరలించిన భా
స్వరయోగిని ముక్తి, వధూవరునిం బురుషోత్తముని శివత్వ మెనయుతన్॥

ఉభయకవితా దక్షులైన బహుగ్రంథకర్తలు రిటైర్డు రిజిష్ట్రారులు

శ్రీ భువనగిరి కోదండపాణిగారు బి. ఎ. గుంటూరు.

తే॥ కవికి యోగికిఁ బండిత ప్రవరునకును ద్రష్టకును భేదమింతైన రాదు, లేదు
ప్రథమకవిధాటి యిది స్పష్టపఱచె నాటివరమహాకవి యోగిసంస్తుతుల కెక్కె॥
కవికులేంద్రులఁ దలపించు కవిత మెఱసి యోగివరులెన్న నుత్తమయోగ మరసి
యాంధ్ర వేదంబుఁగూర్చిన యతఁడు గాక ఓగుబాగుల దెలిపినయోగియెవరు?
ఏఁబదేండ్లకుఁ బైఁగ గారాబుపట్టి
నాంధ్రి సత్కవితాన్వితఁ జేసి యశముఁ గనెడు
బ్రాహ్మణుఁడె బ్రాహ్మణుఁడు సుమ్మి పరులు కవులె?
ఒకఁడె నాదెండ్ల పురుషోత్తమకవి సుకవి॥
విహితాముష్మికగతులనోన్యమైత్రిచెలఁగఁగవితయు మతియోగితలకమతోడ్య
నిత్య ధర్మానుసంధాన నియతినిలచి మహిత నాదెండ్ల పురుషోత్తమ ప్రవరుఁడు॥

సత్త్వసౌభాగ్యమో రాజసంబొ కాక
జనన వేళావిశేషమో చారువృత్తి
రుచియొ ప్రతిభయో వ్యక్తి సద్వచనయోమొ!
యొకఁడె నాదెండ్ల పురుషోత్తమకవి, విజయి॥ 5

కవికిఁ గవితకుఁ గవివృత్తగతికి మైత్రి సన్మహాకవి లక్షణ సరణి యనెడు
సూక్తివైచిత్రి తత్త్వంబు వ్యక్తమయ్యె సుకవి నాదెండ్లపురుషోత్తమకవి యందు
వేద వేదాంగ వేత్తలు పితరులెల్లఁ గొడుకు తనుమించు దిట్ట మే ల్గోరువార
లాప్త హితబాంధవులు శిష్యు లయుతులిలను మహిత నాదెండ్లపురుషోత్తమ
కవిమణికి॥

పండిత కవీశ్వరుల పాలి పట్టుఁగొమ్మ దీనజనులకు గతిఁజూపు దేవతరువు।
రాజశేఖర పూజా ధురంధరుండు మాన్య నాదెండ్ల పురుషోత్తమకవి సుకృతి॥
శ్రీమదుభయ కవిమిత్ర 'ప్రతిభారవి' 'కవితా కళానిధి' ప్రముఖ బిరుదాభిరామ
భారవిమురారి కాళిదాసాది కృతిస్తోమాంధ్రీకరణ సముపార్జిత యశోధామ

శ్రీ భువనగిరి విజయరామకవిగారు బి. ఎ. గుంటూరు

శ్రీమన్నాదెళ్లాన్వయజా! మేధాదక్షిణాఖ్య సత్కవివర్యా!
ధీమత్పురుషోత్తమగురుఁ డీమహి విడి యజుఁడయ్యె నే భువనాళిన్॥ 1

ఉ॥ చింతయొ సంతసంబొ వివశీకృతుఁగా నొనరించె నన్ను నా
కెంతటిసానుభూతి, దయ, యెంతటి ప్రేమ ముదారసంస్కృత
స్వాంతముతోడఁ దొల్తటి ప్రసంగము నాఁడు మొదల్ ప్రవృద్ధిభా
స్వంతము గాఁగఁ జూపె నిరపాయత మత్కృతులందు సంధిలన్॥ 2

మ॥ చెలువ న్వాననసీమఁ బ్రేమ దొనుకుం జిందు న్కనుందోయి సం
బరముం జెందు శరీరమందుఁ దులకింపన్ సత్కృతుల్వించు నా
క్సరణి న్మెచ్చుచు దిద్దుచున్ వరతరోత్సాహంబుఁ జేకూర్చు స
ద్గురు నాకారము తిన్నపై నిఁకఁ గనుంగో రాదుగా! సోదరా! 3

మ॥ మదిమిం జిక్కనదేది? మేనె సుమి, పెంపుం దెంపు మేధన్ దురా
సద తీక్ష్ణత్వముఁ జూపు నీముసలియన్ జ్ఞానంబు నమ్మింప, సం
పదలం దాపదల న్సయోగమరయంగం జేరపెక్కండ్ర స
మ్మదముం గూరుచు సాత్త్వికోత్తముని సంబంధం బిఁకె న్వచ్చునే? 4

సీ॥ పండితులఁగఁ బెక్కు బాలురకు న్విద్యఁ
గూర్చినాఁడసమునఁ దార్చినాఁడు
పత్త్రికాధిపతియై వ్యాసము ల్దిక్కుల
కనిచినాఁ డభివృద్ధి కొనసినాఁడు

నాటకాభినివేశనమున రంగశ్రీలఁ
బెంచినాఁడు సుకీర్తి మించినాఁడు
శతకావ్యసృష్టి నాసాదించి సుకవిత
మందినాఁ డతులత నొందినాఁడు॥

వైద్యమా, జోస్యమా, మతవ్యాపనంబ
సంఘసంస్కారమా యొందు జంకుఁ గొంకు
నంతయును లేని పటిమ భాసురముగాఁగఁ
జాలి నాఁ డధిసత్త్వంబు చేలినాఁడు॥ 5

మ॥ గురుదత్తం బతిమాత్రమే నృపుచు నొక్కం డొక్కఁ డద్దాని నే
మఱఁడిం కొక్కఁడు దాని నె కృషిని బెంపంజూచుఁ బెన్నత్తియు
ట్లరయన్ శ్రీ పురుషోత్తమార్యుఁడో స్వయంవ్యక్తిత్వ విఖ్యాతి, బం
ధురకీర్తి న్గడియించెఁ దద్గురువు లెందు న్మేలుమేలంచసన్॥ 6

చ॥ అనుభవపాండితీగరిమ మట్టుల స్వాస్థ్యము వృద్ధినొంద మే
ల్తనయునిఁ గాంచి యాతని విలక్షణవృత్తి సలక్షణోక్తి పా
రణమునఁ దృప్తినొంది మది రంజిలఁగా మనుమండ్రఁ డిద్ది, శాం
తిని వరియించె, లోటుగలదే? యొకలేని, తదీయజీవికన్॥ 7

మ॥ అదియే శక్తియొ! చూచుచే తడవుగా నాశాంతునం దాప్తసం
పదయో మైత్రియొ గౌరవంబొ దరసింప న్వచ్ఛపాత్రాత్మలం
బొదల న్మిక్కిలి తుష్టినొందెద రితఃపూర్వంబు ముం దిట్టిగా
నిది సద్విగ్రహుఁ డున్నె? వీరలకు కాదె లోటు నేఁ దెల్పెడన్॥ 8

శా॥ ఓహో సోదర! కీర్తిశాశ్వతపదార్థుండై గురుం డుండ, లో
టౌ? హేయంబగుమాట! మేల్కృతిఁ దదీయ స్వైరచారిత్రము
త్స్వానేకగుణప్రదర్శిత భవత్కావ్యంబుపై రక్తిసం
దేహం బేటి కతండు నిక డనె కాదే యుండు శ్రేయంబిడన్॥ 9

మ॥ గుణివై తండ్రిని గొల్చి మెప్పుఁగను నీకుం 'బుత్రసంతేవక
ర్మణి' యంట ల్పునరుక్తగాదె యటఁ జేరన్ రాఁ దలంపున్న నీ
క్షణముం దీరక నీవు, వృత్తిగతు లన్నా! వచ్చినల్లెంచు మీ!
క్షణమాత్రార్చన మాన్యసన్నిధి నెసంగ న్నిల్పు నామాటగన్॥ 10

బందరు హిందూకళాశాలా ధ్యాయాచిత్రావిష్కరణతతి కావ్యరచయితలు

శ్రీ చల్లపల్లి అప్పారావుగారు బి ఎ బి యల్

ఉ॥ శ్రీతతిఁ 'బూరుషోత్తమ కవీశ్వరు నాదెళవంశజాతు, వి
ఖ్యాత విచిత్ర బంధ విధ గర్భిత పద్యకవిత్వ నైపుణీ

సేత సమస్తవి ద్విపదు నిర్ణయదక్ష కళాప్రవీణు, మ
ద్ద్యోతక వత్సలత్వ గురుతుల్యుని భీష్మసమానుఁ గొల్చెదన్॥ 1

మ॥ ఒక శాస్త్రంబునఁ గాదు ప్రజ్ఞ యది మేధోపాసనాశక్తిచే
వికసించె న్బహుశాస్త్ర లాఘవముగా వేదాన్త సాహిత్య నా
టక సంగీత కవిత్వ వైద్యముల బాటల్ గాక శాబ్దజ్ఞతా
ధిక లౌకిక్యవ్యవహార చిత్రపట హిందీ పత్రికా వృత్తులన్॥ 2

సీ॥ సహజమేధా స్వయంసముపార్జితానేక
శాస్త్రార్థ పేటికా సంగతుండు
ప్రతిపదస్ఫురదుక్తి చతురసౌమ్య విలాస
హాస్యానులాప జిహ్వాంచలుండు
నియమబద్ధ క్రమాన్విత నయోద్వర్తన
జితకృతఘ్ని సమ్మాన్య జీవితుండు
బహుజనాదరపాత్ర సుహృదయాంతరంశీల
నిరతాశ్రితాశ్రవ పరివృతుండు॥

కక్ష వెఱవని ధర్మదీక్షాపరుండు బ్రహ్మకైనను లొంగని ప్రాజ్ఞతముఁడు
శమదమాదుల నసమ యశంబుఁగాంచెఁ బూరుషోత్తముఁడనునట్టి పేరెతగును॥

తే॥ వాక్యజ్యేముల్ నడిపెను శుద్ధవైదికుండె
మైత్రి నెఱపెను దురకల శ్రోత్రియుండె
యొందఱకో చేర్చెఁ దనచుట్టు చాందసుండె
పూరుషోత్తముఁ డుత్తమ పురుషుఁ డౌర! 4

తే॥ ఇట్టి మహనీయు గుణగణం బెంచి చూడఁగ
శిష్యులకు నాంధ్రజాతికి చెల్లుఁగాని
'పెరటిచెట్టు మందున' కని యెఱుఁగఁ డెవఁడు
చందురున కొక నూలుపోగు వందనముది. 5

'యోగానంద రామాయణ'ాది బహు గ్రంథకర్తలు

మధ్వశ్రీ చిల్లరిగె యోగానందయ్య పంతులుగారు, రాజోలు

ఆ॥ దుస్తరార్థ్య వరచతుర్విధాచ్ఛకవిత్వ బంధురుం డురుగుణ సింధురుండు
నయచరిత్రుఁ డెంచ నాదెళ్ల పురుషోత్తమాఖ్యకవి సురేంద్రుఁ డస్తమించె॥

క॥ పురుషోత్తమకవి! నీతో నురు బంధకవిత్వలతిక యొను బోయె నహా!
నీర వరభరత నీరనని గురుకవిబుధు లార్తిఁ జెందిఁ కుందక యుంద్రే? 2

ఆ॥ జ్యోతిషమున యందు ఖ్యాతగణితమందు
హూణ సంస్కృతాంధ్ర వాణిబోధ
కత్వమందు నసమ ఘన యశస్వివి పురు
షోత్తమార్యవర్య! సూత్త్యశౌర్య! 3

క. హిందీ భాషాభిజ్ఞా! పొందుగ దృశ్యప్రబంధములు చిత్రముగా
నందఱ కాత్మామోదా నందకరమ్ముగను గూర్చి నాఁడవు ముందే. 4

ఆ. ఏక పుత్త్రికమణి శ్రీకరమేధావి నిన్నుఁ బోని సుగుణ సన్నుతాత్మ
విడియఁజేసి తింట విద్దెలఁ గఱపించి నిన్ను మించనైన మిన్నయనఁగ॥ 5

ఆంధ్రీకృత కుమారసంభవ వివేక చూడామణి ప్రభృతి గ్రంథకర్త
చరువు యజ్ఞనారాయణ శాస్త్రిగారు

తే. వన్నె బృందావనంబింకఁ జిన్నవోవ
దైవవశమునఁ బూరుషోత్తముఁడు సనియె
కొఱఁత మాకౌనుగాక తాఁ గొఱఁత పడునె ?
యనుభవింపఁడె యింక నందనవనంబు ?

శా॥ బ్రాహ్మీదత్త వరప్రసాదమున బాల్యంబాదిగా నక్షర
బ్రహ్మోపాసనముం బొనర్చి పరమ ప్రజ్ఞాధురీణుండవై
బ్రాహ్మణ్యంబున కెల్ల మానికముగాఁ బ్రఖ్యాతి నార్జించియున్
బ్రహ్మానందపదంబు తుట్టతుదకుం బ్రాపించితే సత్కవీ! 2

ఉ॥ బంధురభావభాగ్యచన పద్యమనోజ్ఞములౌ శతాధిక
గ్రంథములన్ రచించి బహుళ ప్రథితాంధ్ర వచస్సముద్ర ని
ర్మంథన దక్షమైనమతి మందరమీయఁగఁ బూవుఁదేనెఁ బు
ష్పంధయమట్టులానితివి సంతతహర్ష రసామృతం బహో!

మ॥ కలయర్థంబును జక్కఁగా నెఱిఁగి యుక్తంబౌ ప్రయోగంబునన్
వెలయంజేసిన శబ్దమొక్కఁడె దివిన్ వేకోర్కు లీడేర్చునన్
పలుకొప్పారెడి పట్టున న్నిఖిల శబ్దప్రక్రియావేత్తవై
యొలమిం గైతలఁ గూర్చు నిన్గుఱిచి మాకింకేల శంకిల్లఁగన్. 4

శా॥ ఏదేశంబునఁ గన్న వీనివలె నింకెవ్వాఁడు నుజ్జ్వాకుఁ బ్రా
పై దీపించెడివాఁడు లేఁడితని విద్యామూర్తి గొంపోవఁగా
రాదంచుం బతిచెంత వాణియెటు లబ్రహ్మణ్యమం బెట్టునో! 5
నాదెళ్లాన్వయ పూరుషోత్తమకవీ! నానార్థ భాస్వద్గణీ!

సీ॥ తొలుదొల్త భువిని నిస్తులమైన బ్రహ్మన్వ
యంబునందలి యుద్భవంబుఁ దలఁచి
యంత, రమావిభ్రమాపాదకంబైన
పురుషోత్త మాహ్వయంబునకు వలచి
యామీఁదఁ దనుఁగన్న యాతని యొఱుకలో
మెలఁగుచుండుటకుఁ గూర్మినివహించి
యాపైన సౌవర్ణమా నలంకరణంబుఁ
గూర్చునాఁ డౌట కెక్కుడుగవలచి॥

గీ॥ తనయుంతఁ దాన చేకొన్న నిన్నుఁ గోలుపోయిన కతనగ్గోలు వడుదు [illegible]
గంటి నీరొదకొన్న యాకైత కన్నె? కలయఁ కాప్యాంధ్ర! [illegible]

మ॥ పరమార్థంబుఁ బురాణగుప్తమునఘ ప్రధ్వంసకం బౌకథం
బరఁగం జేయుట నద్భుతంబనెడి యుత్పల్కుట్లయుండ న్మహో
త్తర రసోదంచిత బంధగర్భకవి తాఖ్యంబయ్యె నీయద్భుతో
త్తరరామాయణ మద్భుతంబనఁగ సార్థక్యంబుఁ గాంచెం గదా॥

మ॥ తనయుం డెంతయు బుద్ధిమంతుఁడగు మేధాదక్షిణామూర్తి పా
వన విద్యోదయ సంప్రవృత్త కవితైశ్వర్యాంచితుం డౌటఁజే
పెనుచుం గావుత నీదుకీర్తి లతికం బెంపార నీయుర్విపై
ననయంబున్ భవదంతరాత్మ కుచితంబౌ శాంతి చేకూరుతన్॥ 8

'ఆంధ్రవిద్యా వాచస్పతి, కావ్యనిధి, సాహిత్యసరస్వతి, ఆంధ్రవాఙ్మయ మహోదధి'—

శ్రీ కొత్రశ్యామల కామశాస్త్రిగారు, కడప

శ్రీ గురుపాదులు భౌతికదేహమువీడిన దుర్వార్త చదివి దుఃఖసముద్రమున మునిఁగితిని. ఆంధ్రమాతకు అహోరాత్రముగాఁ దమ జీవితమునంతను ధారవోసి మహత్తరమగు సేవఁజేసిన యీ పుత్త్రరత్నమును గోల్పోవుటకన్న ఆంధ్రభూమికి లోటు వేఱొకటి లేదుకదా. ఇట్టి పుత్త్రరత్నమును ఆంధ్రమాత యింకముం దెన్నటికైన సంపాదించుకొనఁ గలదా?......అహా! ఆంధ్రమండల మంధకార మయమయ్యె......శ్రీ మన గురుపాదుల యాత్మకు శాంతి కలుగుఁగాక!

శ్రీ జిడ్డు లింగయ్యగారు
డిస్ట్రిక్టు మున్సిఫ్, శ్రీకాకుళం.

పరమపూజ్యులౌ మా గురుపాదులు గతించిరని వినుటకు జింతిల్లితిని. వారి ఆశీర్వచన మహిమవలననేకదా వారి శిష్యులమౌ మాదృశు లౌన్నత్యమునందుట! అట్టి గురూత్తముల నీకాలమునందు జూచుటలేదు. అట్టి శిష్యు లిప్పుడు మృగ్యము. భయము భక్తి రెండును కావిటికుండలవలె వారి యందు మా కుండెడివి. వారు సిద్ధపురుషులలో నొక్కరు, సందియములేదు, నీవు ధన్యతముడవు. గురుశుశ్రూషవల్ల ఉత్తమోత్తముడ వైతివి.

శ్రీ గోవిందరాజు వేంకట శ్రీనివాసరావుగారు
అడ్వొకేటు, గుంటూరు.

తమ తండ్రిగారు స్వర్గస్థులైనట్లు వింటిని. ఆయనగారు మహనీయులు, పూజ్యులు, లోకములో సాధారణముగా అట్టివారిఖ్యాతి వారితోనే అంతరించుచుండును. కాని, మీబోటి యోగ్యత, పాండిత్యము, కవితాధోరణి, శిష్టాచారసంపత్తి, భక్తిశ్రద్ధలు గల కుమారులుండి వారి పేరుప్రతిష్ఠలకు వన్నె పెట్టినట్లుండుట చాల సంతోషదాయకము.........

శ్రీ వావిలాల (చిన) వేంకట శివావధానిగారు, బెజవాడ.

మన గురుమూర్తులవంటి నిష్కల్మష పరోపకార పారీణులు సర్వవిధ ప్రజ్ఞాపాండితీ ధురంధరులు కొలది లేరని చెప్పఁగలను. శ్రీ మేధా దక్షిణామూర్తి

శ్వరోపాసనవల్లనే కవిత్వము, సిద్ధాంతము, ధర్మశాస్త్రము, మంత్రశాస్త్రము, వేదాంతము, సంగీతము, భరతశాస్త్రము, వైద్యము—ఇవి యవి యని యేల? సకలశాస్త్రపారంగతులై 'విద్యయొసగును వినయంబు' అన్న దానికి లక్ష్యభూతులైన శాంతమూర్తులు— వారు జీవించిన 76సం॥లలో మీ మాతృదేవియా శ్రీ ముక్తికాంతామతల్లితోడి కాపురము పదియాఱేండ్లు మాత్రమే. వారి యేకపత్నీవ్రతత్వముగల శాంతిసంపద శాబాల్య మెఱిగిన యస్మదాదుల మెందఱమో సాక్షులము......మా అన్నగారు శ్రీ సబుజడ్జి శివావధానిగారు శ్రీ గురుపాదుల కళేబరము చూచుటకు ది 27-11-1938 ఉదయమువచ్చి దర్శించి 'ఆంధ్రపత్రిక'లో శ్రీవారి చరిత్రాంశములను ప్రకటించుటవల్ల ధన్యులమైతిమనిరి. తుది దర్శనభాగ్యము నాకు గలుగదయ్యెనే యని వగచుచున్నాను, కాని 'ఆత్మావై పుత్రనామాఽసి' యన్న యార్యోక్తి ననుసరించి నీ యందు శ్రీగురుపాదుల సర్వ సద్గుణ పుంజములు సంపూర్తిగానే మూర్తీభవించి యుండగా, సద్గురుసేవనమువల్ల నీవు సముపార్జించిన విద్యావివేకములవల్ల 'పుత్రాదిచ్ఛేత్ పరాజయ' మ్మన్న మహానందము లభింపజేసితివి. ఇంక వారి యాత్మశాంతికి లోటున్నదా?

తూములూరి బుచ్చయ్యగారు బి. ఎ. యల్. టి.,
హైస్కూలు టీచరు, జగ్త్యాల, నైజాం

శ్రీ గురుమూర్తులు పరమపదమునొందినారని విని చాల విచారించినాము. ఆంధ్ర పండిత లోకమునకు తీఱని లోటు ఏర్పడినది. ఏ మహామహుడు ఆదర్శప్రాయముగు జీవితము చేతను, పాండిత్య ప్రౌఢిమ చేతను వైదికకర్మానుష్ఠానము చేతను సార్థకనాములై వెలసిరో అట్టివారి యాత్మకు శ్రీ పరమేశ్వరుడు జన్మరాహిత్య మొసంగుగాక !

## సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 21 | డిడింగ | డిడంగ |
| 7 | 2 | ద్రివ్వించె | ద్రవ్వించె |
| 8 | 26 | రూపిణులు | రూపిణులు। |
| 9 | 8 | మహిరం | మిహిరం |
| ” | 28 | ఎనఁగు | ఎసఁగు |
| 12 | 22 | విష్ఠా | నిష్ఠా |
| 14 | 27 | ఆ॥ | ఈ॥ |
| 17 | 27 | నిక | నిఁక |
| 22 | 17 | బిడ్డ | బిట్ట |
| 29 | 2 | నతతవా | నతనవా |
| ” | 15 | కెదారముల్ | కేదారముల్ |
| 86 | 27 | నియంబు | నియమంబు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 39 | 22 | యదుగన్ | యూకుగన్ |
| 44 | 12 | గళి | గళ |
| 45 | 15 | సూక్తిం | సూక్తికిం |
| 50 | 6 | జెప్పుట | ప్పుట |
| 56 | 13 | ఉదదధి | ఉదధి |
| 61 | 9 | సింపదగు | సింపందగు |
| 70 | 4 | నట్లురి | సట్లులరి |
| ,, | 6 | లొప్ప, నీ | లొప్ప, ని |
| 74 | 14 | జేఁరగ | జేరఁగ |
| ,, | 24 | ధార్యుఁ | ధార్యుఁడా చార్యుఁ |
| 85 | 21 | జెయ్యి | జెయ్య |
| 86 | 11 | దేహః | దేహా |
| 94 | 27 | గాఁగఁ | గాఁగ |
| 96 | 22 | మథిక | మధిక |
| 98 | 13 | పొవు | పోవు |
| 104 | 13 | బడఁయ | బడయఁ |
| 106 | 23 | తే | అ |
| ,, | 24 | గూర్పఁకుం | గన |
| 112 | 17 | న్నెఅపెడ | న్నెఅపెడు |
| 115 | 8 | వ్యస్వయ | వ్యయస్వ |
| 128 | 2 | చెప్పుచున్నఁ | చెప్పుచున్న |
| 129 | 26 | యామళు | యమాళు |
| 137 | 30 | దసీతి | దళితి |
| 142 | 24 | జాడ | జూడ |
| 153 | 27 | సన్నిథా | సన్నిధా |
| 158 | 9 | పలుపు | పలుపు |
| 161 | 9 | వస్త్రు | నస్త్రు |
| 174 | 13 | ప్రాల్మ్యల | ప్రాల్మ్యల |
| ,, | 20 | దనరఁ | దనర |
| 178 | 13 | తరమగు | తిరమగు |
| 183 | 9 | కాదళ్ల | కాదళ |
| 184 | 22 | ద్మవుల | ల్మవుల |
| 194 | 13 | నందుం. | నొందు |
| 232 | 12 | టీఁకేగా | టీకేఁగా |
| ,, | 25 | మేథా | మేధా |
| 234 | 30 | మంద్వగా | వద్వంగా |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ii | 19 | క్షేత్రేప | మున్స్వర |
| 8 | 5 | వీడ్వ్రి | వీట్ర్వ |
| 3 | 12 | శాఖీ | శాఖా |
| 11 | 18 | సితియూ | సితియూను |
| 25 | 5 | యల్ల | స్ల |
| 28 | 15 | అశ్వత్రు | లాత్రు |
| 32 | 18 | రుట్వ | రుట్వ |
| 41 | 11 | బైరడికో | బమ్యోకీత |
| 41 | 19 | శీలం | శ్రీలం |
| 59 | 23 | జారి | రాతి |
| 60 | 8 | జారి | రాతి |
| 78 | 11 | ఆసేక్వ | ఆసేక్వ |
| 101 | 28 | మూడు | మూఢు |
| 120 | 27 | ప్రమష్టాన్న | మృష్టాన్న |
| 133 | 3 | సంగడె | సంగతి |
| 140 | 24 | యాక్షిష్ఠా | యాధిష్ఠా |
| 151 | 28 | పతీ | సతీ |
| 152 | 5 | పతియుంక్ | మతియూక్ |
| 152 | 27 | విషక్ప్రన్న | వస్థ్యుదత |
| 159 | 14 | జత్రింప | జీత్రింపు |
| 164 | 13 | తలంచె | తలంచెద |
| 164 | 14 | శ్యాది | శ్యాధి |
| 165 | 19 | చార్య | చార్యము |
| 170 | 8 | మూఖిలం | మఖిలం |
| 177 | 28 | ధోరణి | ధోరణి |
| 198 | 4 | బరగు | గృతింబరగు |
| 208 | 18 | జనమి | జనమి |
| 229 | 18 | తనది | దాప్తి |
| 236 | 11 | షోతము | ష్టోత్రము |
| 237 | 10 | జ్యోతిః | జ్యోతిః |
| 241 | 10 | దానిని | [illegible] |

## క్రింది చిరునామకు వ్రాసినఁ బడయఁదగినవి.

| | |
|---|---|
| పురుషోత్తమ కవీయము (ప్రకృతి, వికృతి, రూపాంతర నిఘంటువు) | 3-0-0 |
| ఉత్తమ జీవయాత్ర (పురుషోత్తమ కవీంద్రచరిత్ర) | 3-0-0 |
| వేమనసూక్తి రత్నాకరము (4035 వేమన పద్యాలు-సచరిత్రము) | 3-0-0 |
| జాతకదర్పణము (చదివినవారు జాతకాలు వ్రాసికోవచ్చు. తేటతెల్గు) | 2-0-0 |
| శ్రీ గురుదత్త సరస్వతీయము (గురుచరిత్ర-తెల్గువచనము-అట్టబైండు) | 2-0-0 |
| శ్రీ శంకరవిజయము (శ. వేం. సు. కృతము. 10 ఆ. ప్రబంధము) | 2-0-0 |
| అద్భుతోత్తర రామాయణము 7 ఆ. ,,) | 1-8-0 |
| శ్రీ గురుభక్తి ప్రభావము (6 ఆ. ,,) | 1-0-0 |
| శ్రీ సౌందర్యలహరి (సమూలము) | 1-0-0 |
| కృష్ణానదీ మాహాత్మ్యము (4 ఆ. మంచికథలు ,,) | 0-12-0 |
| చంద్రహాస చరిత్ర (గద్యపద్యాత్మక నాటకము) | 0-12-0 |
| హరిశ్చంద్ర నాటకము (సులభవచనము) | 0-12-0 |
| శ్రీ శివానందలహరి (స్తోత్రాంధ్రీకరణసహితము) | 0-12-0 |
| రామదాసచరిత్రము (హిందూస్థానీ నాటకము. తెల్గులిపి భాష సుల | 0-12-0 |
| అహల్యా సంక్రందనీయము ,, ,, వుగా నలవసుసు) | 0-8-0 |
| సీమంతినీ చరిత్రము ,, ,, ,, | 0-8-0 |
| భద్రాయురభ్యుదయము ,, ,, ,, | 0-8-0 |
| కీర్తిమాలినీపరిణయము ,, ,, ,, | 0-8-0 |
| అపూర్వదాంపత్యము ,, ,, ,, | 0-8-0 |
| స్త్రీల మీటింగువంటి హరికథ (సుప్రసిద్ధము) | 0-8-0 |
| సులభ వైద్యబోధిని (గోసాయి చట్కాలవంటిది) | 0-8-0 |
| చిత్రకంద రత్నాకరము (బంధాలబొమ్మలు గలది) | 0-8-0 |
| వేమనయోగీంద్ర చరిత్రము ( ,, ) | 0-8-0 |
| అంకజ్యోత్స్న (750 యుక్తిలెక్కలు గలది) | 0-6-0 |
| ప్రైమరీ పరీక్ష లెక్కల పుస్తకము (52 పేపర్లు) | 0-6-0 |
| చతుర్ముఖి కందపద్య రామాయణము | 0-4-0 |
| హిందీ రామాయణ కీర్తనలు | 0-4-0 |
| మల్లికార్జున శతకము (కందగీతగర్భితము) | 0-4-0 |
| అజ్ఞానధ్వంసిని | 0-3-0 |
| అక్షరాభ్యాసము | 0-2-0 |
| ముక్తికాంతామణీ శతకము | 0-2-0 |
| పురుషోత్తమకృతి శతకము | 0-2-0 |
| పూర్వకర్మశతకము | 0-1-0 |
| హనుమత్ తారకము | 0-1-0 |
| సోమేశ్వర శతకము | 0-1-0 |
| ఉషాహారతి కీర్తనలు | 0-1-0 |

నాదెళ్ల మేధాదక్షిణామూర్తి శాస్త్రిగారు, బందరు.

కృ. స్వ. ప్రెస్, బందరు.